TELUGU

# FIRST READER

FOR

II CLASS



NEW AND REVISED EDITION

## మొదటి వాచక పుస్తకము

(రెండవ తరగతికి)



MACMILLAN & CO., LIMITED
MADRAS, BOMBAY, CALCUTTA AND LONDON
1920

Price, 2¼ Annas.]  [వె. ౨¼ అణాలు

# విషయసూచిక.

పాఠము — పుట

# మొదటి వాచక పుస్తకము.



## 1. అచ్చులు ఆదియందు వచ్చు పదములు.

1. అగ్గిపుల్ల.
2. ఆకుతోట.
3. ఇసుకదిబ్బ.
4. ఈడువాడు.
5. ఉక్కు ముక్క.
6. ఊదువత్తి.
7. ఎదురుకోలు.
8. ఏడాదిపండుగ.
9. ఐరావతము.
10. ఒడుకుదోడుకు.
11. ఓలపాట.
12. ఔరసపుత్రుడు.



## 2. హల్లులు ఆదియందుగల నీతివాక్యములు.

1. కల్లనైన బొంకవద్దు.
2. గురుభక్తి చాల వుంచు.
3. చెడుపని చేయవలదు.
4. జీవహింస చేయవలదు.
5. తల్లిదండ్రిమాట వినుము.
6. తంటమాట చెప్పవలదు.
7. దేవుని నిందించవలదు.
8. నమ్మినవాని చెరుపరాదు.

9. పరనింద చేయరాదు.
10. పేదలయందు దయవుంచు.
11. మంచిగుణము విడువవద్దు.
12. రుచియని యెక్కువ తినవలదు.
13. విద్యచెప్పినవారిని మరువవలదు.
14. సత్యము తప్పరాదు.
15. స్వామియందు భక్తివుంచు.



# 3. జంతువుల అరపులు.

1. కాకి కా, కా, యని యఱచును.
2. కోడి కొక్కొరోకో అని కూయును.
3. చిలుక పలుకును.
4. నెమిలి కేక వేయును.
5. పిల్లి మ్యావు అని అఱచును.
6. ఎలుక కిచకిచ యనును.
7. కుక్క మొఱుగును.
8. నక్క ఊళ పెట్టును.
9. గుఱ్ఱము సకిలించును.
10. గాడిద ఓండ్ర పెట్టును.
11. సింహము గర్జించును.
12. పులి గాండ్రుమని అఱచును.



# 4. మా గ్రామములో.

1. ఈ యేడు వాన జోరున కురిసెను;
2. పైరుపచ్చలు చక్కగా పండెను;
3. రైతులు మిద్దెలు మేడలు కట్టిరి;
4. బీదసాదలకు అన్నము పెట్టిరి;
5. ఇరుగుపొరుగువారికి దానధర్మములు చేసిరి.
6. తల్లిదండ్రులు అత్తమామల పిలిపించి తమ కొడుకులను చదువవేయించిరి.
7. ఇండ్లలో పెండ్లిపేరంటములు జరిపిరి.

## పెండ్లికి

1. కంసాలవానిని పిలిపించి వెండిపాత్రలు బంగారునగలు చేయించిరి;
2. వడ్రంగిని పిలిపించి కుర్చీలు బల్లలు కఱ్ఱతో చేయించిరి;
3. కుమ్మరవానిని పిలిపించి మట్టితో కుండలు బానలు చేయించిరి;
4. కమ్మరవానిని పిలిపించి యినుముతో కత్తులు కత్తిపీటలు చేయించిరి;
5. సాలెవానిచే గుడ్డలు నేయించిరి,
6. చాకలవానిచే గుడ్డలు చలువ చేయించిరి;
7. దర్జివానిచే చొక్కాలు పావడలు కుట్టించిరి.





# 5. ఆవు.

1. నీవు ఆవును చూచినావు కదా. ఇచ్చట దాని బొమ్మ ఉన్నది చూడు. గొల్లవాఁడు దానిని త్రాటితో చెట్టునకు కట్టివేసి ఉంచినాఁడు. ఇది మిక్కిలి మంచి ఆవు. ఎంత అందముగా ఉన్నదో చూడు. దీని దేహము చాల పెద్దది.

2. ఆవునకు ఎన్ని కాళ్లు? లెక్కపెట్టి చూడు. ఒకటి, రెండు, మూఁడు, నాలుగు. నాలుగు కాళ్లు. మనకు కాళ్లు రెండే. ఆవు నాలుగుకాళ్ల జంతువులలో చేరినది. ఆవు కాలిలో ఉండు గిట్ట (డెక్క) ను చూచినావా? దాని గిట్ట ఎట్లు ఉన్నది? అది రెండుగా చీలి ఉన్నది.



ఆవునకు, తోఁక కలదు. తోఁక కొనను వెండ్రుకలు కుచ్చుగా ఉన్నవి. ఈ తోఁకవలన ఆవునకు ఏమి ఉపయోగము? తనమీఁద ఈఁగ, దోమ మొదలయినవి వాలెనా, తోఁకతో

వాసిని తోలుకొనును. ఆవు తోఁకను గొల్లవాఁడు త్రాటితో కట్టియున్నాఁడు.

3. ఆవునకు తలమీఁద రెండు కొమ్ములు ఉన్నవి. వాని మొనలు సన్ననై వాఁడిగా ఉండును. కొన్ని ఆవులకు కొమ్ములు కుఱుచగా ఉండును. ఆవునకు చెవి నిడుపు. మనకున్నట్టె ఆవునకు కండ్లు, ముక్కు, నోరు, పండ్లు, నాలుక ఇవి ఉన్నవి. ఆవు నాలుక పొడవయినది. దాని మెడయు నిడుపయినదే.

4. ఆవు లేఁత పచ్చిగడ్డిని మిక్కిలి మక్కువతో తినును. మేయునప్పుడు అది నిలుచుకొనియుండును. ఆవుమెడ పొడవుగా ఉండకపోయిన అది నేలమీఁద ఉండు గడ్డిని మేయ లేదు. అది ఎండుగడ్డి, చొప్ప మొదలయినవానిని తినును. తవుడు, ప్రత్తిగింజలు, దానికి మిక్కిలి ఇష్టమయినవి. అది మాంసమును తినదు.

5. ఆవునకు మనము చక్కగా మేఁతవేసిన అది మనకు మంచి పాలు ఇచ్చును. పాలు తెల్లగా నుండును; చాల రుచిగా నుండును. అది శరీరమునకు (ఒడలికి) బలము ఇచ్చును. కనుకనే మనము పాలు త్రాగుదుము. మఱి యే ఆహారము లేకున్నను ఆవు పాలుత్రాగి మనము బ్రతికి ఉండవచ్చును.

6. అదిగో పటములో గొల్లవాఁడు పాలు పితుకుచున్నాఁడు చూడు. ఆవు కడుపుక్రింద పొదుగు ఎట్లు ఉన్నదో బాగుగా చూడుము. వాఁడు పాలు చిన్న చెంబులో పితికి పెద్ద చెంబులో పోయుచున్నాఁడు. ఆవు మనకు చాల ఉపయోగకరమగు జంతువు. కనుకనే ఆవును చాలమంది పెంచుదురు. ఆవుమీఁద మనము ప్రేమ గలిగి ఉండవలెను.

ప్రశ్నలు —1. ఆవువలె కొమ్ములుగల జంతువులను కొన్నిటిని చెప్పుము! 2. ఆవునకు కొమ్ము ఉండుటవలన ఏమి ఉపయోగము? 3. ఆవు ఎఱ్ఱనిదిగా ఉన్నచో, పాలు ఏ రంగుగలిగి ఉండును? 4. పెరుగు అనగా ఏమి? దానిని ఎట్లు చేయుదురు? 5. వెన్న ఎట్లు తీయుదురు? 6. వెన్న కరగించిన యెడల ఏమి అగును? 7. నాలుగు కాళ్ల జంతువులను కొన్నిటిని చెప్పుము.

**చిత్రలేఖనము (డ్రాయింగ్).**—ఆవు తల.

**బంకమట్టి లేక లప్పపని.**—ఆవు గిట్ట.

పదములు —ఆవు—గోవు—ధేనువు—పాలు—క్షీరము—ఒడలు—శరీరము—దేహము—త్రాటితో—గిట్టలు—నిలుచుండి—ఉపయోగము—అక్కఱ—ప్రేమ—ఇష్టము.

ఒరవడి (కాపీ మాను).—ఆవు అంబా అని అఱచును.



# 6. ఆవును గుఱించిన కథ.

1. ఒక కాఁపువానియొద్ద ఒక ఆవు ఉండెను. అది మిక్కిలి సాధువైనది. ఆ కాఁపు దానిమీఁద దయగలిగి, దానికి బాగుగా మేతవేయుచు వచ్చెను. ఆ ఆవు వానియింటికి కావలసినన్ని పాలు ఇచ్చుచుండెను. అది ఎవరిని పొడువదు. పిల్లలు దాని దగ్గఱకు పోయినను, వారిని క్రుమ్మక, మోర పయికి ఎత్తి గోకుమని సంజ్ఞచేయును.

2. ఆ కాఁపు ఒకనాఁడు దానిని పొలమున మేపుచుండగా, ఒక రాజు ఆ పొలమునకు వచ్చెను. దాని మంచితనమును చూచి, రాజు కాఁపుదగ్గఱకు వెళ్లి ఆ ఆవును తనకు ఇమ్మనెను. కాఁపు దానికి ఒప్పుకోలేదు. రాజు కాఁపువానిని చూచి "నీకు ఇట్టివి వేయి ఆవులను ఇచ్చెదను. దీనిని నాకు ఇమ్ము" అని అడిగెను. అందులకు కాఁపు "ఓ రాజా, నీవు వేయి ఆవులను ఇచ్చినను దీనిని ఇయ్యను. తుదకు లక్ష వరహాలు ఇచ్చినను ఇయ్యను" అనెను.

౩. రాజు కోపపడి, "నీవు ఇచ్చునది ఏమి? నేనే దీనిని తోలుకొని పోయెదను" అని చెప్పి, తన నౌకరును పిలిచి, "ఓరీ! ఈ ఆవును తోలుకొని పోయి మన కొట్టములో కట్టివేసి మేఁత వేయుము" అనెను. పనివాఁడు "చిత్తము! అట్లే తోలుకొని పోయెదను" అని ఆవు మెడకు త్రాడు కట్టబోయెను. ఆవు వెంటనె తన కాఁపుదగ్గఱకు పరుగెత్తెను. అయినను రాజుగారి సేవకుఁడు కాఁపువానిని బెదరించి ఆవును పట్టబోయెను. ఆవు కాఁపువంక చూచెను. కాఁపు "ఆవూ, నిన్ను తప్పించు శక్తి నాకు లేదు. నీకు శక్తి ఉండెనా, నీవే తప్పించుకొనుము" అని ఆవుతో మిక్కిలి జాలిపుట్టునట్లు చెప్పెను.

4. అంతట ఆవు కాఁపుయొక్క అభిప్రాయమును తెలిసికొని ఆ రాజుగారి సేవకుని తన కొమ్ములతో పొడిచెను. వెంటనే వాఁడు క్రిందపడగా వానికి దెబ్బ తగిలెను. అంత ఆ రాజు తానే దానిని పట్టి లాగెను. అపుడు ఆవు తన కొమ్ములతో రాజును క్రుమ్మబోయెను. దానిపై రాజు ఆ ఆవును బలవంతముగా కట్టి లాగుకొని పోయి, తన కొట్టము (సాల) లో కట్టించి మేఁత వేయించెను. ఆవు మేఁత మేయక విచారపడుచు ఉండెను. ఆ రాత్రి అందఱు నిద్రపోవుచు ఉండఁగా, ఆవు త్రాళ్లు త్రెంచుకొని తాను ముందున్న కాఁపువాని ఇల్లు చేరెను. కాఁపు దానిని చూచి మిక్కిలి సంతోషించెను.

**ఆవులు తాము మచ్చికపడిన తావును విడువజాలవు.**

**ప్రశ్నలు:—1. రాజు ఆ కాఁపువాని ఆవును ఎందుకు కోరెను? 2. కాఁపు ఎందుకు దానిని ఇయ్యకపోయెను? 3. రాజు ఎట్లు దానిని తోలుకొని పోయెను? 4. ఈ పాఠములో నీతి ఏమి?**

చిత్రలేఖనము.—ఆవు బొమ్మను వ్రాయుము.

ఆవు—ఇది జంతువు పేరు. గోపు రాజు—ఇవి మనుష్యుల పేర్లు. పాలు—ఇది వస్తువు పేరు.

ఇట్టి పేర్లు కొన్ని చెప్పుము.

**పదములు.**—సాధువు—మంచిది—దయ—ప్రేమ—కనికరము—క్రుమ్మర—మోర—ముఖము—రాజు—ప్రభువు—సేవకుఁడు—పనివాఁడు—భృత్యుఁడు—శక్తి—బలము—సామర్థ్యము—నేర్పు—కట్టించి—సంతోషించెను.

**ఒరవడి.**—ఆవు పాలు ఇచ్చును.





# 7. గుఱ్ఱము.

1. ఇదిగో గుఱ్ఱము నిలచి ఉన్నది చూడు. ఇది ఆవు కంటె పెద్ద జంతువు. దీనికి ఎన్ని కాళ్లు ఉన్నవి? ఇదియును

నాలుగుకాళ్ల జంతువే. దీని కాళ్లు ఆవు కాళ్లకంటె నిడుపుగాను, సన్నగాను ఉండును. దీని కాళ్లకు ఎక్కువ బలముకూడ కలదు. కావుననే గుఱ్ఱము మిక్కిలి వడిగా పరుగెత్తును. దీని గిట్ట (డెక్క) ను చూడుము. ఆవు గిట్టవలెనే ఉన్నదా? లేదు. ఆవునకున్నట్టు గుఱ్ఱమునకు కొమ్ములుగలవా? లేవు. నీవు ఆవును కొట్టితివా, అది నిన్ను కొమ్ములతో క్రుమ్మును. గుఱ్ఱమును కొట్టితివేని, అది వెనుకటి కాళ్లతో తన్నును.



2. గుఱ్ఱమునకు మెడ నిడుపు. అది ఎంత వంపు తిరిగి ఉన్నది చూడుము! దాని మెడమీఁది వెండ్రుకలకు "జూలు" అని పేరు. దాని చెవులు చిన్నవి. రెండు చెవుల నడుమ వెండ్రుకలు కుచ్చువలె వ్రేలాడుచున్నవి. దాని కన్నులు చాల పెద్దవి. అది తల త్రిప్పకయె తనకు ఎదుట ఉన్నవానిని, ప్రక్కల ఉన్నవానినికూడ చూడఁగలదు. గుఱ్ఱమునకు ముక్కు సన్నము. ముక్కు రంధ్రములు పెద్దవి. ఆవు తలకంటె గుఱ్ఱము తల నిడుపు. దాని వీపు ఎంత వెడల్పో చూడుము. దానికి వీపున బలము ఎక్కువ. దాని తోఁక ఆవు తోఁకవంటిదికాదు. ఆ తోఁక పొడుగునను నిడుపాటి వెండ్రుకలు కుచ్చుగా ఉండును. ఈఁగలు దోమలు దానిని కుట్టినపుడు, వానిని అది తోఁకతో తోలివేయును.

3. గుఱ్ఱమునకు మేఁత ఏమి? అది పచ్చిగడ్డిని, ఉలవలను, సెనగలను తినును. నీవు ఉలవలు చూచినావా? మనము బియ్యము వండినగాని భోజనము చేయము గదా. అట్లే గుఱ్ఱము

నకు ఉలవలను, సెనగలను ఉడకవేసిగాని పెట్టగూడదు. ఉడికిన ఉలవలకును, సెనగలకును గుగ్గిళ్లు అని పేరు. ఆవువలెనే గుఱ్ఱము కూడ మాంసము తినదు.

4. మనుజుఁడు గుఱ్ఱమును సవారిచేయును; బండ్లకు కట్టును. దాని గిట్టలు అరిగి పోకుండుటకై, దాని కాళ్లకు లాడములు (నాళములు) కొట్టును. గుఱ్ఱము మిగుల ఉపయోగమైన జంతువు. దానిమీఁద మనము ప్రేమగలిగి ఉండవలెను. మనము మన పిల్లలను కాపాడునట్లు దానిని కాపాడవలెను.

5. గుఱ్ఱపువాఁడు గుఱ్ఱమును చూచుకొనును. దానికి దాహము ఎత్తినప్పుడు తేటనీళ్లను తాగించును; పచ్చికసవు వేయును; చల్లని నీటితో కడిగి ఒడలుపట్టి తోమును.

6. గుఱ్ఱము సకిలించును. గాడిద ఓండ్రపెట్టును.

ప్రశ్నలు.— 1. గుఱ్ఱమువలె ఒంటి గిట్టగల మఱియొక జంతువు పేరు చెప్పుము? 2. ఆవునకును గుఱ్ఱమునకును గల ముఖ్యమైన భేదము ఏమి? 3. లాడమును దేనితో చేయుదురు? 4. అది దేనివలె నుండును? 5. కళ్లెము అనఁగా ఏమి? 6. దానిని ఎక్కడ తగిలింతురు? 7. దానివలన ఏమి ఉపయోగము?

చిత్రలేఖనము.—గుఱ్ఱపు లాడము

బంకమట్టి పని.—గుఱ్ఱపు గిట్ట.

పదములు.—గుఱ్ఱము—అశ్వము—కొమ్ములు—జూలు—త్రిప్పక—మనుష్యుడు—మానవుడు—నరుడు—దప్పి—దాహము—సాఁకు—రక్షించు—కాపాడు—చన్నీళ్లు.

ఒరవడి.—గుఱ్ఱపు చదువు—ఎద్దు చదువు.



# 8. గుఱ్ఱమును గుఱించిన కథ.

1. విజయనగరము అను ఒక పట్టణము కలదు. ఆ పట్టణమును రామరాజు ఏలుచుండెను. ఆ రాజునకు తన శత్రువులతో యుద్ధము కలిగెను. అప్పుడు రాజు తన సేనను నడిపించుచు పగవానిని చంపబోయెను.

2. ఆ రాజు సేనలో ఒక గుఱ్ఱపురౌతు ఉండెను. అతడు తన గుఱ్ఱమును ఎక్కి, పగవాని సేనలను చంపుచు వచ్చెను. ఆ గుఱ్ఱము ఏమాత్రము భయపడక విరోధులమీఁదికి దుముకుచుండెను. ఆ గుఱ్ఱపురౌతు తన గుఱ్ఱముయొక్క నేర్పునకు మెచ్చి యుద్ధము ముగియువఱకు దానికి విశేషముగా మంచి దాణా పెట్టుచు కడుప్రేమతో కాపాడెను. కొంతకాలములో యుద్ధము ముగిసెను; విరోధులు ఓడిపోయిరి.

3. ఇట్లు యుద్ధము ముగిసి తన ఊరికి మఱలివచ్చినది మొదలు ఆ గుఱ్ఱపురౌతు గుఱ్ఱము మీఁద ప్రేమవిడిచెను. దానికి తిండిపెట్టుట మానెను. దానిమీఁద మోయరాని బరువులు వేసి దానిచే మోయించి పలువిధముల చాల కష్టపెట్టెను. అందువలన గుఱ్ఱము చిక్కిపోయి తన యజమానుఁడు తనకు తిండిపెట్టక, తన్ను విడిచినందులకై మిక్కిలి విచారపడెను.

4. ఇట్లు కొంతకాలము గడచినవెనుక ఆ రాజుమీఁదికి మరల శత్రువులు దాడివెడలిరి. అప్పుడు రాజు తన సేనతో శత్రువులను ఎదిరింపఁబోయెను. వానితోకూడ పోవఁగోరి, ఈ గుఱ్ఱపురౌతు తన గుఱ్ఱము నోటికి కళ్లెము తగిలించి దాని మీఁద జీనువేసి ఎక్కబోయెను. అప్పుడు ఆ గుఱ్ఱము చదికిలఁబడి "ఓరీ, నీవు నన్ను ఇన్ని దినములు గాడిదయని తలచితివి.

నేను ఇంతలో మరల గుఱ్ఱము కాలేను" అని చెప్పెను. రాజు ఆ మాట విని సిగ్గుపడి తాను చేసిన తెలివితక్కువ పనికై మిక్కిలి విచారపడెను.

5. కనుక మనము గుఱ్ఱముమీఁద మిక్కుటమైన బరువు **వేయరాదు.** దానికి కడుపునిండ మేఁతపెట్టి బాగుగా పోషింపవలెను. దానితో పనికాగానే దానిని అలక్ష్యము చేయరాదు.

ప్రశ్నలు:— 1. గుఱ్ఱపురౌతు చేసిన తప్పు ఏమి? 2. ఇందు మాయా జంతువు ఏది? 3. గుఱ్ఱము చెప్పిన మాటలు ఏవి? 4. ఈ కథలో నీతి ఏమి?

**విజయనగరము.** — ఇది ఊరి పేరు. రామరాజు — ఇది మనుష్యునిపేరు. ఇటువంటి నామములు కొన్నిటిని చెప్పు.

**పదములు.**— శత్రువులు — పగతురు — పగవారు — రాజు — ప్రభువు — పరిపాలకుడు — పోరాటము — యుద్ధము — కలహము — పోరు — జగడము — కష్టపెట్టుట — చదికిలబడి — సేన — దండు — సైన్యము.

**ఒరవడి** — అక్కఱ తీఱినపిదప అశ్రద్ధ చేయరాదు.

# 9. కుక్క.

1. ఇదిగో ఈ పటమునందు ఏమి ఉన్నది చూడు. అది ఒక కుక్క పటము. ఇది చూచుటకు ఎంత సొగసుగా **ఉన్నది!** మన ఇంటి వాకిట తిరుగు కుక్కలు దీనియంత అందముగా ఉండునా? ఉండవు.

2. గుఱ్ఱము, ఆవు, వీనివలె కుక్క అంత పెద్దజంతువా? కాదు. దీనికిని కాళ్లు నాలుగే. గుఱ్ఱమునకువలెనే దీనికిని కాళ్లు కొంచెము పొడవు; కనుక, ఇదియును మిక్కిలి వడిగా పరుగెత్తగలదు.



నొక్కును. దీని కాలిలో గిట్టలు లేవు. కాలి కొనలందు గోళ్లు ఉన్నవి చక్కగా చూడుము. అవి మిక్కిలి గట్టివి. కుక్క తోక వంకరగా ఉండును. పటములో ఉండు కుక్కకు రోమములు మెండు. కుక్కలకు అన్నిటికి రోమములు పై బొమ్మలో ఉన్నంత దట్టముగా ఉండవు. ఈ కుక్కయొక్క తల గుండ్రనిది. కొన్ని కుక్కలకు తల నిడుపుగాను ఉండును. పటముననుండు కుక్క చెవులు ఎట్లు వ్రేలాడుచున్నవి చూడుము. దీని ముక్కునుగూడ బాగుగా గమనింపుము. అది చివరను సోగగా ఉన్నది. కుక్క బాగుగా పసిపట్టగలదు. అట్లు పసిపట్టుటచే ఎక్కడ ఉండు వస్తువులను అది తేలికగానే తెలిసికొనును.

3. కుక్క నోరు తెఱచినపుడు దాని పండ్లను చూడుము. అవి మన పండ్లవలె ఉండవు. అవి వాడిమిగలవి; పదార్థములను ముక్కలు చేయగలవు. కుక్క తన పదునైన పండ్లతో మాంసమును కొఱికి ముక్కలు ముక్కలుగా చేసి తినును. అది అన్నముగూడ తినును. గడ్డి మేయదు.

4. కుక్క విశ్వాసముగల జంతువు. దానిని పెంచిన యెడల, సమయము వచ్చినప్పుడు అది మనకై తన ప్రాణములను సయితము ఇచ్చును. అది ఆపదలనుండి మనలను తప్పించును. దొంగను దగ్గఱకు రానీయదు. రాత్రి అంతయు ఇంటిని కాచును. దొంగను చూచినవెంటనే, అది బిగ్గఱగా మొఱుగును. దానిని వినినతోడనే దొంగ పాఱిపోవును.

ప్రశ్నలు.—1. కుక్క కాలికిని (నీవు చదివిన) గుఱ్ఱపు కాలికిని భేదమేమి? 2. కుక్కయొక్క స్వభావము ఏమి? 3. అది ఏమి తినును? 4 కుక్కను పెంచుటవలన ప్రయోజనము ఏమి?

**చిత్రలేఖనము** —కుక్క చెవులు.

**బంకమట్టి పని.** —కుక్క తల

**పదములు** —కుక్క— శునకము — శ్వానము—గోళ్లు—నఖములు —దట్టము — విశ్వాసము — నమ్మకము — తరుణము — పదార్థము — వస్తువు — మొఱుగు — దొంగ — చోరుఁడు — తస్కరుఁడు.

**ఒరవడి.**—కుక్క మొఱుగును—నక్క ఊళపెట్టును.



# 10. కుక్కను గుఱించిన కథ.

1. గొల్లపిల్లవాఁడు ఒకఁడు ఒక కుక్కను పెంచుచుండెను. వాఁడు అన్నము తినునప్పుడెల్ల దానికిని అన్నము పెట్టును. ఆ కుక్క వానియెడ ఎక్కువ ప్రేమను చూపెను. వానిని ఎప్పుడును విడిచిపోదు. వాఁడు ఎచ్చటికి పోయినను వెంబడి పోవును. వాఁడు గొఱ్ఱెల మందను తోలుకొని పోవునపుడు వానికంటె ముందుగా పోవును. గొఱ్ఱెలు మందనుండి తప్పించుకొని పోకుండ చూచుకొనును.

2. ఒకనాఁడు ఆ గొల్లవాఁడు ఆ గ్రామమునకు చేరువ నుండు తిప్పయందు గొఱ్ఱెలను మేపుచుండగా, ఒక ఱాతి బండ మీఁదినుండి క్రిందపడెను. అందుచే వానికి గొప్ప గాయము తగిలెను. వాఁడు పడినచోటు తిప్ప అడుగుభాగము, వాని యింటికి అది చాల దూరము. అచ్చట దగ్గఱ ఒక మనుష్యుఁడును లేఁడు.

3. అప్పుడు వాఁడు తన కుక్క ఉన్నచోటికి మెల్లగా నడచి వచ్చెను. ఆవల తన చొక్కాను కుక్క మెడకు చుట్టి ఇంటికి పొమ్మని సైగచేసెను. వెంటనే అది వడిగా ఇంటికి పరుగెత్తెను. అయితే అది వచ్చునప్పటికి ఇంటి తలుపు మూసి ఉండెను. అందుచే అది వాకిటచేరి మొఱిగెను. తలుపును గోళ్లతో గీకెను. ఆ పిల్లవాని తండ్రి తలుపు తెఱచుకొని బయటికి వచ్చి కుక్క మెడకుచుట్టియుండు కొడుకు చొక్కాను చూచెను. ఆ చొక్కాలో నెత్తుటి మఱకలు ఉండెను. కుక్క ఏడ్చుచు వానిచుట్టు తిరిగెను. అంతట ఏమో ఆపద వచ్చినది అని తండ్రి అనుమానించెను.

4. వెంటనే అతఁడు కుక్కను వెంబడించిపోయెను. ఆ కుక్క అతివేగముగా పిల్లవాఁడు పడియుండు తావునకు పరుగెత్తివచ్చెను. తండ్రి పిల్లవానిని చూచి, మిక్కిలి విచారపడి, వానిని ఇంటికి తోడుకొని పోయి గాయమును మాన్పెను. చూచితివా కుక్క యొక్క బుద్ధి! ఆపద వచ్చినప్పుడు అది ప్రాణస్నేహితుని వంటిది.

పదములు.—ఎక్కువ—అధికము—గ్రామము — గొఱ్ఱెలు — తప్పిపోకుండ—సైగచేసెను—గీకెను.

ఒరవడి.—కుక్క యజమానుని కాపాడును.





# 11. పిల్లి.

1. ఇదిగో పిల్లి! ఇది మన ఇండ్లయందు తిరుగును. పటములో ఒక పెద్ద పిల్లియు మూఁడు చిన్న పిల్లులును ఉన్నవి చూడు! చిన్న పిల్లికి కూన అని పేరు. పిల్లిని తాకిచూడుము. దాని దేహమంతయు మెత్తగా ఉండును.

2. కుక్కకంటె పిల్లి చిన్నది. దాని తల గుండ్రముగా ఉండును. ముఖము వెడల్పు. దాని మీసములు మూతి మీఁద ఎట్లు నిక్కపొడుచుకొని ఉన్నవో చూడు! పిల్లి చీఁకటిలో తిరుగునప్పుడు త్రోవలో ఏదైన అడ్డము ఉన్నదా అని మీసములతో తడవుకొనును. పిల్లి కండ్లు గుండ్రనివి. అవి మన కండ్లవలె ఉండవు. రాత్రివేళ చీకటిలో మనకు ఏదియు కానరాదు. పిల్లి రాత్రిపూఁట మన యిండ్లలో తిరుగు ఎలుకలను బాగుగ చూడఁగలదు. పగటిపూఁట అది

కండ్లు పూర్తిగా తెఱవఁజాలదు. రాత్రివూట కొద్దిపాటి వెలుతురు ఉన్నను, దానికి కండ్లు చక్కగా అగపడును.

3. పిల్లి పాదములను బాగుగా చూడుము. వాని వ్రేళ్ల క్రింద మాంసపుకండలు ఉన్నవి. అవి దిండువలె మెత్తగా ఉండును. కనుక అది నడచునప్పుడు పరుగెత్తునప్పుడు చప్పుడు కలుగదు. కాబట్టి ఎలుకలను, ఉడుతలను అది సులువుగా పట్టుకొనగలదు. దాని కాలి వ్రేళ్ల కొనలయందు ఉండు గోళ్లు ఎంత వంపు తిరిగి ఉన్నవో చూడు. ఈ గోళ్లు చాల గట్టివి; వాడిమిగలవి.



4. పిల్లి పాలు త్రాగును; వెన్న తినును; నేయిగాని పెరుఁగుగాని కలిపిన అన్నము తినును. ఎలుకలను, పిచ్చుకలను పొంచి ఉండి పట్టుకొని చంపి వాని మాంసమును తినును.

5. పిల్లికూనలకు చెరలాటమందు మిక్కిలి ప్రీతి. అవి ఇక్కడికి అక్కడికి దుముకులాడును. ఒడలిమీఁది మురికి పోవుటకై పిల్లి తన కూనలను నాకును. "మ్యావు" అని అఱచి తన దగ్గఱకు చేరబిలుచును. పిల్లి తన కూనలను గొంతుదగ్గఱ మెల్లగా నోట కఱచుకొని తీసికొనిపోవును.

ప్రశ్నలు. — 1. పిల్లికి మీసములవలన ఏమి ఉపయోగము? 2. పిల్లి నడచునప్పుడు ఏల సద్దు కాదు? 3. పిల్లికి ఎప్పుడు కండ్లు బాగుగా కనఁబడును? 4. పిల్లిని పెంచుటవలన లాభము ఏమి?

వ్రాత కేఖనము.—పిల్లితోఁక.

**బొంకముట్టే పని.—పిల్లి బొం**

**పదములు.**—కూన — శిశువు—పిల్లి — మార్జాలము — బిడాలము — వాడిమి—పదును.

ఒరవడి.—పిల్లి మ్యావు అని అఱచును, ఎలుక కిచకిచలాడును.

సామెతలు.—పిల్లికి ఎలుక సాక్షి—పిల్లికి చెరలాటము; ఎలుకకు ప్రాణసంకటము.



## 12. పిల్లిని గుఱించిన కథ.

1. రాయలవారి సంస్థానమునందు తెనాలిరామలింగఁడు అను హాస్యగాఁడు ఒకఁడు ఉండెను. రాయలవారు కొన్ని పిల్లి కూనలను పెంచవలెనని తలఁచి తమ సంస్థానమందలి ఉద్యోగస్థులలో ఒక్కొక్కనికి ఒక పిల్లికూనను ఇచ్చి, దాని పోషణము నిమిత్తము పాలకై ఒక్కొక్క ఆవునుకూడ ఇచ్చెను. తక్కిన వారితోపాటుగ తెనాలిరామునికిఁగూడ ఒక పిల్లిని ఒక ఆవును యిచ్చెను.

2. ఉద్యోగస్థులందఱు ఆవుపాలను పిల్లులకు పోసి, బాగుగా పెంచిరి. తెనాలిరాముఁడు మాత్రము ఆవు పాలను మొదటి దినమున కళకళ కాచి, పిల్లిముందట పెట్టెను. పాలు ఉడుకుచుండినందున పిల్లి మూతి పెట్టగానే చుఱ్ఱున కాలి బొబ్బలెక్కెను. అప్పటినుండి ఆ పిల్లి పాలను చూడగానే, పరుగెత్తి పోవుచుండెను. **తెనాలిరాముడు ఆ పాలను తానే ప్రతిదినము** త్రాగుచుండెను.

3. ఆఱు నెలలయిన తరువాత రాయలవారు తాను ఇచ్చిన పిల్లికూనలు ఎట్లు ఉన్నవో చూతమని అందఱిని వానిని తెమ్మని ఉత్తరువు చేసిరి. అందఱివలెనే రామలింగఁడును తన పిల్లిని ఎత్తుకొని వచ్చెను. వాని పిల్లి తప్ప, తక్కినవి అన్నియు బలిసి బాగుగా పెరిగి ఉండినవి. రాయలవారు, "నీ పిల్లి ఏల పెరుగలేదు" అని రామలింగని అడిగిరి. "మహా ప్రభూ! నేను ఏమి చేయుదును? ఇది పాలు త్రాగుటలేదు" అని అతఁడు బదులు చెప్పెను.

4. రాయలవారు ఆశ్చర్యపడి పాలు తెప్పించి తన ముందటనే ఆ పిల్లికి పెట్టఁగా అది దానిని చూచి పరుగెత్త మొదలిడెను. పిమ్మట నిదానముగ రాయలవారికి నిజము తెలిసెను. అప్పటికి ఆ బక్కపిల్లిని చూచి అందఱును నవ్విరి. రామలింగని యుక్తికి అందఱును మెచ్చుకొనిరి.

పదములు.—సంస్థానము — జమీను — హాస్యగాఁడు — ఉద్యోగస్థులు — నౌకరి — ఉత్తరువు—ఆజ్ఞ—ఆన—ఆనతి.

ఒరవడి.—చుట్టము మీఁద ఆశ — బియ్యము మీఁద ఆశ.



# 13. బడిలోని తోఁట.

## మొదటి భాగము

[రాముఁడు, రంగఁడు, బడి పిల్లవాండ్రు.]

రంగఁడు—రామా! అయ్యవారు (పంతులవారు) ఇంకను రాలేదు. మనము ఈ తోఁటకు వెళ్లి చూచి వత్తము రా.

రాముఁడు—అదిగో! తోఁటవాఁడు, సుబ్బఁడు నీళ్లు తెచ్చుటకు పోయియున్నాఁడు. తోఁట తలుపు తెఱచియున్నది. పోదము రా. (లోపల ప్రవేశించుచున్నారు.) ఇవిగో పూలచెట్లు.

రంగఁడు—రామా! ఈ మల్లెచెట్టు ఎంత అందముగా ఉన్నదో చూడు. పువ్వు తెల్లగా ఉన్నది. అది మంచి వాసన గలది. ఇదిగో ఇవి మొగ్గలు. సాయంకాలమునకుఁగాని ఇవి పూయవు. అప్పుడు చూచుటకు ఇవి మఱింత సొంపుగా ఉండును. వీనిని గ్రుచ్చి దండను తలలో పెట్టుకొందురు.

రాముఁడు - - సాతాని రామానుజయ్య మా యింటిలో పెండ్లి జరిగినపుడు మల్లెపూల దండలను చెండ్ల (బంతుల) ను తెచ్చినాఁడు.

రంగఁడు — ఇది గుండు (బొండు) మల్లె. అది జాజి పొద. మల్లెపూవులలో ఎన్ని తెగలు ఉన్నవి తెలియునా? ఇక ఒక నెల వెళ్లినా, ఈ చెట్లలో పువ్వులుండవు. వేసవి కాలమునందు మాత్రమే ఇవి పూచును. నిన్నటి దినము మూడవ తరగతి పిల్లవాఁడు ఒకఁడు చేమంతిచెట్టు ఒకటి అచ్చట నాటినాఁడు. దానిని చూతము రా.

రాముఁడు—ఇది చేమంతిచెట్టా?

రంగఁడు—చేమంతి పువ్వులను నీవు చూచితివా?

రాముఁడు—నేను ఎన్నడు చూచి యెఱుఁగను.

రంగఁడు—నీవు మఱచినావు. నిన్న చదువు వేసిననాఁడు నీవు చేమంతి పూలదండను మెడలో వేసికొని బడికి వచ్చినావు కావూ! అవి బంగారువలె వన్నెవన్నె గలిగి గుండ్రముగా ఉండును. ఇఁక రెండు మూఁడు నెలలు తాళి (ఆగి), వాన కురిసిన వెంటనే ఆ చెట్లు పూచుటకు ఆరంభించును. చేమంతి

పూవులలో రెండు జాతులు కలవు. ఒకటి పచ్చ చేమంతి, మఱియొకటి తెల్ల చేమంతి.

రాముఁడు—ఇవి ఏమి పూవులు? నేల అంతయు రాలి ఉన్నవి.

రంగఁడు—ఇది సంపంగి (సంపెంగ). దీని తొడిమ మిక్కిలి పొడవు. చెట్టునిండ పూవులు ఉన్నవి. పైన చూడు.

రాముఁడు—అదిగో పందిటిమీద అల్లుకొని ఉన్నదే; అది ఏమి పూవు?

రంగఁడు—అదికూడ సంపంగిపూవే. అది తీఁగసంపంగి, తీఁగసంపంగి పువ్వు అడుగుప్రక్కను పచ్చగాను, మీఁదిప్రక్కను పసుపుగాను ఉండును చూడు. అది మంచి వాసనగలది.

రాముఁడు—ఇది ఏమి పూవు? చెట్టునిండ ముండ్లు ఉన్నవే.

రంగఁడు—ఇది రోజాపువ్వు. దీనినే గులాబిపుష్పమని యుఁ జెప్పుదురు. ఎంత అందము! పువ్వులలో అన్నిటిలోను ఇదే అందమయినది. మంచి వాసనగలది. రోజా రంగు అనునది ఇట్టి రంగే. ఈ పువ్వులలో పసుపువి, తెల్లనివి, ఎఱ్ఱనివి అని అనేక రకములు గలవు.

రాముఁడు — మన తోఁటలో తామరపువ్వులు లేవా? తామరాకు లమ్మువాఁడు నేఁటి ఉదయమున తామరపూవులు తెచ్చినాఁడు. ఆహా! అవి ఎంత సొంపుగా ఉన్నవి! మా అమ్మ అర్ధణా పెట్టి నాలుగుపువ్వులు కొన్నది.

రంగఁడు—ఆ తామరపువ్వులు మన తోఁటలో పెరుగవు అవి నీటిలోనే పెరుగును. తోఁటలలో పెరుగు తామరకు మెట్ట తామరగ అని పేరు. అదిగో చెఱువు చూచితివా? దానిలో

తామరకాండ అల్లుకొని ఉన్నది. అదిగో అచ్చట చూడు. సుబ్బఁడు కావడితో నీళ్లు తెచ్చుచున్నాఁడు.

రాముఁడు—కావడి ఎందుకు?

రంగఁడు — కావడిలో ఏమి పెట్టియున్నాఁడో కనుగొన్నావా?



రాముఁడు—బానలు. అవి ఎందుకు?

రంగఁడు—వానిలో నీళ్లుముంచి తెచ్చి ప్రతిదినమును చెట్లకు నీళ్లు పోయును. లేకపోయెనా, చెట్లు వాడి (ఎండి) పోవును.

రాముఁడు—అదిగో అయ్యవారు వచ్చుచున్నారు; గంట వాగుచున్నది

రంగఁడు—అట్లయిన, మనము మన తెరగితికి వెళ్లుదము రా.

ప్రశ్నలు —1. మల్లెపూవులు ఏ రంగుగలవి? 2. మల్లెపూవులలో ఎన్ని జాతులు గలవు? 3. తామరలు ఎక్కడెక్కడ పెరుగును? వాని పేర్లేమి? 4. కావడి అనఁగా ఏమి?

చిత్రలేఖనము —మల్లెపువ్వు, కావడి.

బంకమట్టి పని —కడవ.

పదములు.—పూలచెట్లు — తోట — ఉద్యానము — వంటి — ఘటము — కుండ — పెండ్లి — వివాహము — పరిణయము—పూవు—పుష్పము.

ఒరవడి.—తోట పచ్చాకునకు పరాక్రమము తెక్కువ.



# 14. బడిలోని తోఁట.

## రెండవ భాగము

రాముఁడు—రంగా, నేఁడుకూడ త్వరగా వెళ్లి బడితోఁట చూతము రా.

రంగఁడు—రామా, ఇదిగో వచ్చితిని.

(ఇద్దఱు పుస్తకములను తీసికొని బడి తోఁటకు వెళ్లుచున్నారు.)

రాముఁడు—రంగా, ఇది నిమ్మచెట్టు కాదూ!

రంగఁడు—అవును. ఇది నిమ్మచెట్టే. ఇది అంతగా ఎత్తు లేదు. దీనికి నలువైపులందును కొమ్మలు గుబురుగా ఉండును. దీని ఆకులు గుడారము (డేరా) వలె దట్టముగా చెట్టును క్రమ్ముకొని ఉండును. ఆకును నలిపి వాసనచూడుము. కమ్మని వాసన కొట్టును. నిమ్మపువ్వులు తెల్లనివి. కాయ ఆకుపచ్చరంగు,

కాయ ముదిరి పండఁబారిన, పసుపురంగుగా మారును. పండు ఎంత గుండ్రముగా ఉన్నదో చూడు.

రాముఁడు — మనము నిమ్మపండ్లను తినవచ్చునా? అవి మామిడిపండ్లవలె తియ్యగా ఉండునా?

రంగఁడు — అబ్బే! నిమ్మపండు పులుసు అని నీకు తెలియదా? ఈ పండ్లను నలిపి కోసి దాని రసమును మజ్జిగలో పిండుదురు. అందుచేత మజ్జిగ (చల్ల) మిక్కిలి రుచి గలిగి ఉండును.

రాముఁడు—మా యింటిలో నిమ్మకాయల ఊరుగాయ వేసియున్నారు. నేను ఆ ఊరుగాయ నంజుకొని రుచిచూచియున్నాను. ఆ నిమ్మకాయ ముక్కలు ఉప్పగా ఉన్నవి. పుల్లనివి అని నీవు చెప్పితివే.

రంగఁడు—వాస్తవమే. నిమ్మకాయ ఊఱుగాయలో ఉప్పు కూడ వేసినందున నీకు అది ఉప్పనగా ఉన్నదిగాని కాయ రుచి నైజముగా పులుపే. మామిడిపండ్లలో కొన్ని పుల్లగా ఉండును. ఊరగాయకాయ పుల్లనిది. నీవు చింతపండు తిని చూచితివి కదా! దాని రుచి పుల్లన. నిమ్మపండును దానివలెనే పుల్లనిదే. అది చింతపండుకంటె ఒడలికి మంచిది.

రాముఁడు—అయితే, పండ్లలో రెండు విధములా? కొన్ని తియ్యనివి. కొన్ని పుల్లనివా?

రంగఁడు—ఇంకను అనేకవిధములైనవి కలవు.

రాముఁడు—సరే, ఇది ఏమి చెట్టు?

రంగఁడు—ఇది మిరప (మొక్క) చెట్టు. ఇదే పచ్చిమిరపకాయ.

రాముడు — కాయ పసరువన్నెకలిగి ఉన్నది. ఎండుమిరపకాయ ఎఱ్ఱగా ఉన్నదే? అదేల?

రంగడు — తఱచుగా కాయలు అన్ని ఆకుపచ్చరంగు కలవిగా ఉండును. పండినట్లయిన, సాధారణముగా కొన్ని పసుపురంగుగాను, కొన్ని ఎఱ్ఱరంగుగాను మాఱును. మిరపకాయ తినినచో కారము ఎత్తును. ఇదిగో చూడు కాకరపాదు.

రాముడు—దీనికి ఎందుకు పందిలివేసి ఉన్నారు?

రంగడు—కాకరకాయలు తీగెలలో కాచును. తీగెలు అల్లుకొనుటకే పందిలివేసి ఉన్నారు. దాని పువ్వు పసుపువన్నెగా ఉండును. ఇదిగో చూడు కాకరపిందె. ఇది పొడుగు కాకరకాయ. ఇదిగో పొట్టికాకర ఉన్నది చూడు. కాయ చిన్నదిగా ఉండును. అది నేలపైనే కాపు కాచును. కాకరకాయ చేదు. ఇదో గంటచప్పుడు వినవచ్చుచున్నది. బడికి పోదము రా!

(ఇద్దఱు తరగతిలోనికి వెళ్లిరి.)

ప్రశ్నలు:—1. నిమ్మపండ్లవలన మనకు ఏమి ఉపయోగము? 2. పండ్లు సాధారణముగ ఏ ఏ రంగులు కలిగి ఉండును? 3 కాకర ఎన్ని విధములు? 4 కాకరకాయ మాచుటకు దాని రుచి ఎట్టిది? ఎట్లు ఉండును?

**చిత్రలేఖనము.**—నిమ్మపండు, మిరపపండు.

**బంకమట్టి పని.**—పచ్చిమిరపకాయ.

పదములు.—క్రమ్ముకొని — వ్యాపించి — నిమ్మపండు — జంబీరఫలము — మామిడి — మావి — చూతము — చల్ల — మజ్జిగ — గుడారము — అల్లుకొనుటకే—పుల్లన — పొట్టికాకర.

సామెత—ఉప్పులేని కూర, పప్పులేని పెండ్లి

# 15. పెంపుడుకోళ్లు.

1. పుంజు సొగసైన పక్షి. అది ఎంత నిలువుగా నిలువఁబడి ఉన్నదో చూడు! దాని ఱెక్కలు మిక్కిలి అందమయినవి. మగకోడికి పుంజు అనియు, ఆఁడుకోడికి పెట్ట అనియు పేర్లు. పుంజుకు తలమీఁద జుట్టు ఉండును. అది ఎఱుపు. దాని ఈఁకలు తెల్లగాను, ఎఱ్ఱగాను, నల్లగాను, పచ్చగాను ఉండును. దాని తల చిన్నది. దాని ముక్కును చూడు. అదే దాని నోరు. దానికి పండ్లు లేవు. దానికి చెవి ఉన్నదా? ఉన్నది. కాని దానిని ఈఁకలు కప్పుకొని ఉండుటవల్ల అది పైకి కనఁబడదు.



2. పుంజుతోడ పెట్టయు, పిల్లలును ఉన్నవి. పెట్ట పుంజువలె అంత అందముగా ఉండదు. అంత పెద్దదియు కాదు. ఈఁకలును అంత మెఱుఁగుగలవి కావు. పెట్ట గ్రుడ్లు పెట్టును. గ్రుడ్డుమీఁద కూర్చుండి పొదుగును. ఆవల గ్రుడ్లు పగిలి పిల్లలు బయటికి వచ్చును.

3. పిల్లలు పెద్దవగునంతవఱకు పెట్ట తానే మేఁత తెచ్చి పెట్టును. పిల్లియైనను, గ్రద్దయైనను పెట్టకంటికి కగపడెనేని, అది కూఁతలు పెట్టి పిల్లలను చేరఁ బిలుచును. వెంటనే పిల్లలు తల్లిదగ్గఱకు పరుగెత్తును. అది తన ఱెక్కలతో వానిని కప్పియుంచును.

4. కోడిపుంజు వేకువ లేచి అందఱికి వినఁబడునట్లు "కొక్కొరోకో" అని బిగ్గరగా కూయును. పుంజు ఏమి అనుకొని కూయునో నీకు తెలియునా? "మేలుకో; మేలుకో. తెల్లవారవచ్చినది లేలే! నీ పనికి బయలుదేఱు" అని దాని కూతకు భావము. కాఁపు కోడికూఁతను విని నిద్రలేచి పొలమునకు బయలుదేఱిపోవును.

ప్రశ్నలు — 1. పుంజాల యీఁకలు ఏ వన్నెకలవి? 2. పుంజు తల మీఁద ఉండునది ఏది? 3. పొదుగఁబడినపుడు గ్రుడ్డులోనుండి ఏది బయట వచ్చును? 4. మఱి కొన్ని పక్షుల పేర్లు చెప్పుము? 5. గ్రద్దవచ్చినప్పుడు పెట్ట ఏమి చేయును? 6. పుంజు వేకువజామున ఏమని కూయును? 7. అది విని కాఁపు ఏమి చేయును?

**చిత్రలేఖనము.**—కోడి కాళ్లు.

**పదములు.**— పుంజు — కుక్కుటము — గ్రుడ్లు — బయలుదేఱును — గ్రద్ద — ఎత్తుగాను — కాపు.

**జరవడి.**—కోడి కొక్కొరోకో అని కూయును.

# 16. పక్షి తన్ను గూర్చి చెప్పిన కథ.

1. మేము ఒక చెట్టుమీఁద వ్రాలి (వాలి) ఉన్నాము. అదిగో కూటిలో ఒక ఆఁడుపిచ్చుక ఉన్నది చూడు. అది గ్రుడ్లు పెట్టి ఉన్నది. గ్రుడ్లమీఁద కూర్చుండి ఉన్నది. అట్లు కూర్చుండిననే గ్రుడ్లు వెచ్చగా ఉండును. కొన్నాళ్లకు ఆ గ్రుడ్లు చితికి పిల్లలు

బయటికి వచ్చును. కాని ఆ పిల్లలకు అప్పుడు రెక్కలు ఉండవు. కనుక అవి ఎగురలేవు.



2. మా గూండ్లను మేము పుడకలతోను, ఆకులతోను కట్టుకొందుము. అవే మాకు యిల్లు. దూదిని బొచ్చును తెచ్చి, లోపలి (తట్టు) వైపు పఱచి, అవి మెత్తగాను, వెచ్చగాను ఉండునట్లు చేసికొందుము. చిన్న పిల్లలు ఎగుర నేర్చుకొనునంత వరకు ఉండుటకే మేము గూండ్లు కట్టుచున్నాము. కొన్నాళ్లకు మా పిల్లలకు రెక్కలు మొలచును. అప్పుడు మేము వానికి ఎగురుటకు నేర్పుదుము.

3. కొమ్మమీఁద కూర్చున్న నేను మగపక్షిని, మేము పాడునట్టి పక్షులము. మేము మనోహరముగా పాడి అందఱకు ఆనందము కలిగించెదము. ఎంత అందముగా ఉన్నామో చూడు. కొందఱు తుంటరిపిల్లవాండ్రు మామీఁద రాళ్లు ఱువ్వుదురు. అందువలన మాకు కష్టము కలుగుచున్నది

మాపై అట్లు ఉవ్వవచ్చునా? మేము ఎవరికి ఏమి చెఱుపు చేయుచున్నాము? ఎంత ఇంపుగా పాడుదుమో విను!

**చిలుక పెండ్లి**

(మా-రా-రా-శ్రీ జి. వెంకటసీతాపతిగారు రచించినది.)

చిలుకమ్మ పెండ్లికి
సింగార ముంచిరి;
చెలికత్తె లందఱిని
పిలుచుకొని వచ్చిరి.
పాలపురుగులు—చాపులు తెచ్చె.
సీతాకోకలు—చీరెలు కట్టె.
కప్పలు బెకబెక—డప్పులు కొట్టె.
కాకుల మూఁకలు—కేకలు వేసె.
వాకిట కోళ్లు—బూకా లూఁదె.
పందిట పిచుకలు—సందడి చేసె.
కోవెల లోకచో—కూర్చుండి పాడె.
నెమిలి సానులు—నృత్యము చే
చిలుకమ మగఁడంత
చిలుకత్తు కట్టి
చిఱునవ్వు నవ్వుచు
చెంత కూర్చుండె.

మా పాట ఎంత మనోహరముగా ఉన్నదో వింటిరా? కాఁబట్టి మాయందు దయకలిగి ఉండవలెను. మాకు ఏపాటి చెఱుపును చేయరాదు.

4. మేము ఆకాశమునఁ దిరుగుచుందుము. అప్పుడు మా ఱెక్కలు విస్తరించి ఉండును. తక్కిన వేళలందు ఱెక్కలు

ముడుచుకొని ఒడలితో చేరి ఉండును. మా రెక్కలు మా ఒడలికి చొక్కాయివలె ఉపయోగపడుచున్నవి.

ప్రశ్నలు — 1. గ్రుడ్లు ఏల పొదుగవలెను? 2 పక్షులకు రెక్కల వలన ఏమి ఉపయోగము? 3 పక్షులు ఎట్లు గూండ్లు కట్టుకొనును? 4 పక్షుల వలన మనకు ఏమి ఉపయోగము?

**చిత్రలేఖనము** — పక్షుల కాళ్లు

**బంకమట్టి పని** — పక్షి గ్రుడ్లు

**పదములు** — కొన్నాళ్లు — గూండ్లు — కులాయములు — చెలికత్తెలు — మనోహరము — పిచుకలు — నృత్యము.

**ఒరవడి** — పాతెడు పక్షిని పట్టవలెను

# 17. నెమిలి.

1. పక్షులలో మిక్కిలి అందమయినది నెమిలి. దాని తోఁకను చూడు! ఎంత వెడలుపుగా విప్పుకొని ఉన్నది! ఎంత సొగసుగా ఉన్నది! దానిలో కన్నులవంటి కొన్ని చుక్కలు ఉన్నవి చూచితివా? ఆ కన్నులు బంగారువలె తళతళమెఱయును. నెమిలిపురియందు ఆకుపచ్చ, నలుపు, పసుపు ఈ మూడు వన్నెలు కలిసి ఉండును.

2. నెమిలిపురి పటమునందు కనఁబడునట్లు ఎల్లప్పుడు విచ్చుకొని ఉండదు. నెమిలిపురి తఱచుగా ముడుచుకొని ఉండును. అప్పుడు అది ఒక పెద్ద కోడియంత ఎత్తే ఉండును. మగనెమిలికి మాత్రమె పింఛము ఉండును; ఆఁడునెమిలికి ఉండదు. మగనెమిలి తోఁక విచ్చుకొని ఆడును. ఆఁడునెమిలి ఆడదు. పటమందు ఉండు నెమిలి ఆఁడుదా? మగదా? దాని

నెత్తిని జుట్టు ఉన్నది. నెమిలికి తల చిన్నది. దాని మెడ పొడవుగాను, నీలవర్ణము గలదిగాను ఉండును.



3. నెమిలి అడవులందు వసించును. పెద్ద పురుగులను, లద్ది పురుగులను ఏఱుకొని తినును. ధాన్యపు గింజలనుకూడ తినుట కలదు. తఱచుగా నెమిళ్లు కూనలుగా ఉండునప్పుడే పట్టి తెచ్చి పెంచుట వాడుక. ధనవంతులు నెమిళ్లను తెచ్చి తమ తోఁటలందు ఉంచి, వేడుకకయి పెంచుదురు. గుళ్లయందును నెమిళ్లను పెంచుట కలదు.

4. నెమిలి పింఛముతో విసనకఱ్ఱలు కట్టుదురు. నెమిలి ఈఁకలను మందులకును ఉపయోగింతురు.

5. నెమిలి కూఁత వినుటకు అంత ఇంపయినది కాదు. నెమిలి కూఁతకు కేక అని పేరు. అది చాలదూరము వినఁబడును. కాఁబట్టి దానిని కేకి అనియు అందురు.

ప్రశ్నలు:-1. నెమిలి తోఁకయందు ఏవి ఉన్నవి? 2. అవి ఎట్లు ఉండును? 3. దాని మెడ ఎట్లు ఉండును? 4. ఏ నెమిలికి తోఁక లేదు? 5. తోఁక విప్పుకొన్నపుడు దేనివలె ఉండును? 6. నెమిలికి ఏమి ఆహారము? 7. అది ఎక్కడ ఉండును? 8. నెమిలి ఈఁక ఎంగులకు ఉపయోగించును? 9. నెమిలి జుట్టునకును పుంజు జుట్టునకును భేదమేమి?

**చిత్రలేఖనము.**—నెమిలి తల

**బంకమట్టి పని.**—నెమిలి ముక్కు

**పదములు** — నెమిలి — మయూరము — పురి — పింఛము — బర్హము — కన్నులు — విచ్చుకొని — ముడుచుకొని — అడవులలో — అరణ్యమందు — జుట్టు — విసనకఱ్ఱ.

**ఒరవడి.**—నెమిలిని చూచి సీమకోడి ఆడును.



# 18. గర్వము—ఒక కథ.

1. ఒక కుమరి చట్లు, కుండలు, కడవలు, బానలు, మూఁకుళ్లు, ప్రమిదలు, జాడీలు మొదలగునవి చేసి. అంగడి

వీథికి (బజారుకు) వానిని అమ్ముటకు కొనిపోయెను. అక్కడికి కొనిపోయి వానిని వరుసవరుసగా ఉంచెను.

2. అప్పుడు జాడి చట్టిని చూచి, 'ఓ చట్టీ, నీవు ఎందుకు ఉపయోగపడుదువు? నిన్ను జనులు మర్యాదతో చూడరు. దరిద్రులు నిన్ను కొనిపోయి, పొయిమీఁద పెట్టి మసిచేసి నీ అందమును పోఁగొట్టుదురు. నన్ను ధనికులు కొని నెయ్యి మొదలగునవి పోసి నా మెఱుఁగు చెడకుండునట్లు ప్రతిదినము తుడిచి గారాబముతో కాపాడుదురు. నేను ఎంత సొంపుగా ఉన్నానో చూడు' అని డచ్చీలు (బడాయి) కొట్టెను.

3 అందుకు చట్టి, "నీవు గర్వపడకు. నన్ను చేసిన మట్టితోనే నిన్ను చేసినారు. ఇద్దఱము ఒక గుంటలోని మట్టితోనే చేయఁబడితిమి. ఒక సారెమీఁదనే చుట్టితిమి. కుమరియే మన యిద్దరిని చేసినది. ఒకే ఆవమునందు కాలితిమి. ఇప్పుడును ఒక తావునందే ఉన్నాము. పగిలిపోతిమేని, నిన్నును పాఱవేతురు. నన్నును పాఱవేతురు. నీకును నాకును రూపమునందు మాత్రమె భేదము. రూపముచే గర్వపడకు" అని జాడీతో బదులు చెప్పినది.

4. అప్పుడే ఒక ఆఁడుది అంగడికి వచ్చి ఆ జాడిని యెత్తి వాయించి చూచినది. అది బరువయినందున చేయిజాఱి క్రింద పడినది. అందుచే పగిలిపోయినది ఆ ఆఁడుది దానిని పాఱవేసి సొమ్ము ఇచ్చి ఊరక మరలి పోయినది. కనుక మనము గర్వపడరాదు.

**ప్రశ్నలు:**–1 కుమ్మరి అంగడికి ఏమి ఏమి తీసుకొని పోయెను? 2. జాడి చట్టిని చూచి ఏమి చెప్పినది? 3. చట్టి దానికి బదులు ఏమి చెప్పినది?

**పదములు** —వరుస—క్రమము—కుండ—ఘటము — ధనవంతులు —ధనికులు గారాబము -గర్వపడకు — భేదము— పాఱవేసి

ఒరవడి —ఎప్పటికిని గర్వపడరాదు

బంకమట్టి పని -మూఁకుడు. చిత్రలేఖనము మూఁకుడు.



# 19. చుట్టఱికము.

గోపాలుఁడు. అదిగో అచ్చట ఉన్న ముసలాయన ఎవరో తెలియునా?

నారాయణుఁడు. నాకు తెలియలేదే? ఆయన ఎవరు?

గో. ఆయన రామయ్య ఆయన ప్రక్కన ఉన్న ఆబిడ కామమ్మ.

నా. ఆమె ఆయనకు ఏమి కావలెను?

గో. ఇది తెలియదా! ఆమె ఆయన (భార్య) పెండ్లాము.

నా. అదిగో ఒక పిల్లవాఁడు నిలువఁబడి ఉన్నాఁడే. వాఁడు ఎవఁడు?

గో. ఆ పిల్లవాఁడు వారి కొడుకు, కృష్ణుఁడు. వారు వానికి తల్లిదండ్రులు. తల్లిదండ్రులను కన్నవారు అనియు చెప్పుట కలదు.

నా. వారికి ఈ ఒక పిల్లవాఁడనా?

గో. కాదు. వారికి ఇద్దఱు కొమార్తెలును, ముగ్గురు కొడుకులును కలరు. వారిలో కృష్ణుఁడు నడిమివాఁడు. వాని అన్న రంగఁడు చెన్నపట్టణమున ఉద్యోగములో ఉన్నాఁడు. వానికి పెండ్లికూడ అయినది. వాని భార్యపేరు రుక్మిణి. ఆమె అచట ఆయనకు వంటచేసి పెట్టుచున్నది. ఈ ముసలివారికి ఆమె కోడలు. వీరు ఇద్దఱు ఆబిడకు అత్తయు మామయు అగుదురు. కృష్ణుని తమ్ముఁడు కేశవుఁడు బయట ఆడుకొనుటకు పోయి ఉన్నాఁడు. కృష్ణుని అక్క (అప్ప) పేరు పార్వతమ్మ. ఆమె పెనిమిటి కాకినాడలో ఉన్నాఁడు. ఆయన పేరు రంగరావు. ఆతఁడు ఈ ముసలివాండ్రకు అల్లుఁడు. కృష్ణుని చెల్లెలు జానకికి ఇంకను పెండ్లికాలేదు. ఆబిడ వీరి మేనత్త అగు కామమ్మ ఇంటియందు ఉన్నది.

నా. మేనత్త అనఁగా ఎవరు?

గో. తండ్రి తోడ పుట్టిన ఆమె (తోడపుట్టువు)

నా తండ్రియొక్క తమ్ముడు మనకేమి కావలయును?

గో. ఆయననే చిన్నాయన అని పిలుచునది. ఇది తెలియదా? చిన్నాయనను కొందఱు బాబాయి అందురు. ఎవరితోనైన చెప్పునప్పుడు 'మా కక్క' అనిగాని 'మా పిన్నతండ్రి' అని గాని చెప్పుదురు.

నా. తల్లితో పుట్టినవారిని ఏమందురు?

గో. మగవారిని మామ అనియు, ఆడువారిలో తల్లి కంటె పెద్దవారిని పెద్దమ్మ లేక అమ్మ అనియు, చిన్నవారిని పిన్నమ్మ లేక పిన్ని అనియు పిలుతురు.

నా. తల్లిదండ్రులను కన్నవాడు తాతగదా!

గో. అవును. తల్లిదండ్రులను కన్నవారు తాత అవ్వ అగుదురు.

నా. ఇప్పుడు నాకు చుట్టఱికము అంతయు బాగుగా తెలిసినది. ఒక కుటుంబములో తాత, అవ్వ, తల్లి, తండ్రి, కొడుకు, కూఁతురు, అప్ప, చెల్లెలు, అన్న, తమ్ముఁడు, అత్త, మామ, అల్లుడు, కోడలు, చిన్నాయన, పెద్దనాయన, పిన్నమ్మ, పెద్దమ్మ మొదలగువారు ఉన్నారు.

పదములు కన్నవారు—తల్లిదండ్రులు — మాతాపితలు—అన్న —అగ్రజుఁడు—తమ్ముఁడు—అనుజుఁడు — కోడలు— భార్య—ఆలు—పెండ్లాము.

ఉప వ: తల్లిదండ్రులకు మ్రొక్కుము



# 20. రామాయణము.

1. అయోధ్య అను ఒక పట్టణము కలదు. ఆ పట్టణమును దశరథుఁడు అను రాజు ఏలుచుండెను. ఆయన చాల

మంచివాఁడు. ఆయనకు ముగ్గురు భార్యలు. పెద్దభార్య కౌసల్య రెండవది సుమిత్ర. మూడవది కైకేయి. ఆ దశరథునికి ఈ భార్యలందు నలువురు కొడుకులు పుట్టిరి వారిలో పెద్దవాఁడు శ్రీరాముఁడు. అతఁడు ఎక్కువ ధైర్యశాలి. తల్లిదండ్రులకు అణఁగి మణఁగి ఉండువాఁడు. అతఁడు కౌసల్య కొడుకు. భరతుఁడు కైకేయియొక్క కుమారుఁడు. లక్ష్మణ శత్రుఘ్నులు సుమిత్రాదేవి బిడ్డలు.

2. కైకేయి తన కొమారునికి పట్టము కట్టుము అనియు, రాముని పదునాలుగేండ్లు అడవికి పంపుము అనియు మగనిని రెండు వరములు అడిగెను. దశరథుఁడు ఆడిన మాట తప్పలేక అందుకు సమ్మతించెను. సవతి తల్లి యిష్టప్రకారము రాముఁడు అడవికి పోయెను. అటుపైన తాను కొడుకును విడిచి ఉండలేక దుఃఖముచేత దశరథుఁడు చనిపోయెను.

3. రాముఁడు తన భార్య సీతతోను, తమ్ముడు లక్ష్మణునితోను అడవికి పోయెను. అచ్చట వారు ముగ్గురును చెట్లను, తీఁగలను, మృగములను చూచి ఆనందము పొందుచు, అడవులలో ఉండిరి. వారు అచ్చట ఉండుటకై ఆకులతో ఒక పాక వేసికొనిరి. ఆ పాకను పర్ణశాలయందురు. కాయలు, దుంపలు, పండ్లు తినుచు కాలము గడపిరి.

4. ఒకనాఁడు రాముఁడును లక్ష్మణుఁడును లేనప్పుడు ఒక దుష్ట రాక్షసుఁడు వచ్చి సీతను ఎత్తుకొని పోయెను. వాని పేరు రావణుఁడు. వాని దేశము లంక. అది సముద్రము నడుమ ఉన్నది. వాఁడు ఆ దేశమునకు రాజు సీతను వాఁడు లంకకు బలవంతముగ ఎత్తుకొనిపోయెను.

5. రాముఁడు ఇంటికి వచ్చి సీతను కానక మిక్కిలి

చింతించెను. తర్వాత అతఁడు తమ్మునితోడ అడవులలో సీతను వెదకుచు హనుమంతుఁడు అను వానరుని సహాయమువలన సీత లంకయందు ఉన్నది అని తెలిసికొనెను. పిదప రాముఁడు వానరులతోడు చేసికొని సముద్రమును దాటుటకు కట్టకట్టెను. ఆవల లంకలో ప్రవేశించి రావణుని జంపి సీతాదేవిని విడిపించుకొని వచ్చెను. ఇంతలో పదునాలుగు ఏండ్లును నిండెను. కాబట్టి అందఱును అయోధ్యకు పోయిరి. అచ్చట రామునికి పట్టాభిషేక మహోత్సవము జరిగెను. రాముఁడు అది మొదలు రాజ్యమును పాలించెను. అతనికి జనులయందు ప్రీతి మెండు. ప్రజలు సుఖముగానుండు రాజ్యమును నేటికిని రామరాజ్యము అని చెప్పుదుము.

ప్రశ్నలు —1. దశరథునికి ఎందఱు భార్యలు? వారి పేర్లు చెప్పు? 2. కైక ఏమి కోరినది? 3 రావణుఁడు ఎవఁడు? ఎట్టివాఁడు! ఏమి చేసెను? 4 హనుమంతుఁడు రామునికి ఏమి సహాయము చేసెను?

పదములు - లక్ష్మణుఁడు — రావణుఁడు — లంక — భరతుఁడు —హనుమంతుఁడు—పట్టాభిషేకము—రాక్షసుఁడు.

ఒరవడి. -1. తండ్రి యాజ్ఞ మీఱరాదు. 2. కట్ట, కొట్ట, తెచ్చె



# 21. అవయవములు తమ్ముగూర్చి చెప్పిన కథ

## మొదటి భాగము

1. పిల్లలారా నేనెంత తళతళమని మెఱయుచున్నానో చూడుఁడు నేను ఎవరు? నా పేరు ఏమి తెలియునా? నన్నే 'కన్ను' అందురు నేను గాజు గోలీవలె ఉన్నాను నేను ఒక

పల్లమయిన ఇంటియందు ఉన్నాను. నాకు ఇద్దఱు సేవకులు కలరు. వారు నాకు కీడు కలుగనీయక కాపాడుదురు. వారిలో ఒకఁడు నాకు మీఁదివైపునను, మఱి ఒకఁడు క్రిందివైపునను ఉండును. క్రిందివైపు ఉండువాఁడు కదలక మెదలక ఒకచోటనే ఉండి నన్ను కాపాడుచున్నాఁడు. పైన ఉండువాఁడు అప్పుడప్పుడు కదలుచు, క్రింది



తట్టు వానిని తాఁకి హెచ్చరించుచున్నాఁడు వారు ఎవరు అని నీవు తలంతువు? ఱెప్పలు, ఱెప్పవెండ్రుకలు నామీఁద దుమ్ము పడకుండులాగున కాపాడును. నీవు నన్ను బాగుగా చూడు. నీ రూపము నాలోపల కనఁబడును. నేను అన్ని అవయవములలోపల ముఖ్యమైనదానను. కన్ను లేనివాఁడు గ్రుడ్డి.

2. సెబాస్! సెబాస్! బాగున్నది. నా చక్కదనము నకు ఈ కంటి చక్కఁదనము సాటి అగునా? నేను లేకుంటినా మొగమునకు అందము ఎక్కడిది? నా ఇంటికి రెండు దారులు కలవు. వాని మూలమున జనులు గాలిని లోపలికి పీల్చుచు వెలుపలికి విడుచుచు ఉందురు నేనే మంచి గాలిని లోపలికిపీల్చి, చెడ్డగాలిని బయటికి విడిచి జనుల ప్రాణము లను కాపాడుచున్నాను. నా ఇంటి లోపల ఉండు రెండు దారులు ఏవో



తెలియునా? అవె ముక్కు తొఱ్ఱలు. నేను నోటికిపైగా కూర్చుండి ఉండుట దేనికి అని ఎంచెదవు? నోట వేసికొను వస్తు

వులు మంచివా లేక చెడ్డవా అని తెలియచెప్పుటకే. కాబట్టి నేనే అందరికంటె ప్రధానమయినదానను. నా పేరు ముక్కు. ముక్కు లేనివాడు ముక్కిడి.

ప్రశ్నలు.—1. కన్ను దేనివలె ఉన్నది? 2 కంటిని కాపాడునవి ఏవి? 3. కన్ను లేనివానిని ఏమందురు? 4. ముక్కు ఏల నోటికి పైన ఉన్నది? 5. ముక్కు లేనివానిని ఏమందురు?

పదములు—తళతళ—సేవకులు—పనివారు — కదలక మెదలక—హెచ్చరించుచు — ముఖ్యమైన — ప్రాణము — ప్రధానము.

ఒరవడి—కంటికి రెప్ప కాచునట్లు కాచవలెను



# 22. అవయవములు తమ్ముగూర్చి చెప్పిన కథ.

## రెండవ భాగము.

1. ఓహోహో! నేను ఒకడను ఉన్నాను అని జ్ఞప్తిలేదు కాబోలు. నేను రూపమునందు వారికంటె పెద్దను. నేను ఎక్కువ బలశాలిని. నావలె బలముకల అవయవము ఏది? నేను లేకుంటెనా తక్కిన వారివలన ఏమి అగును? ప్రతి అవయవమునకు నేను సహాయము చేయుదును. ఆహారమును ఎత్తి



నోటిలో వేయుదును. వస్తువులను వాసనచూచుటకు ముక్కు దగ్గఱకు కొనిపోదును. కంటిలో నలుసుపడెనా తీసి వైచెదను.

చెవిలో దురద పెట్టిన గోకెదను. అవయవములలో మురికి చేర కుండునట్లు తోమి శుభ్రముగా ఉంచువాఁడను నేనే. ఒక వస్తువును ఎత్తుటకును, వ్రాయుటకును, సింగారించుకొనుటకును, ఇంక పలువిధములగు పనులు చేయుటకును అక్కఱపడువాఁడను నేనే. ఇచ్చువాఁడను నేను. పుచ్చుకొనువాఁడను నేను. ఇంత ఎందుకు? నేను పనిచేయకుంటినా తక్కినవారికి ఆహారము ఏది? నా పేరు చేయి. చేయి లేనివాఁడు మొండి

2. నాకడ ఐదుగురు పనివారు ఉన్నారు. చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేలు, నడిమివ్రేలు, చూపుడువ్రేలు, బొట్టనవ్రేలు. వీరు ఒకనాఁడు జగడమాడుకొని తగవు తీర్చుకొనుటకై నా దగ్గఱకు వచ్చినారు. నేను వారి సంగతి విచారించితిని. "నేనే అదృష్టశాలిని. దేవుని మ్రొక్కునప్పుడు నేను ముందు ఉండు వాఁడను" అని చిటికెనవ్రేలు అనెను. ఉంగరాలవ్రేలు "ముద్దుటుంగరము వేసికొని సొంపుగా ఉండువాఁడను నేనే" అని చెప్పెను. "అందఱికంటె ఎత్తయినవాఁడను నేనే" అని నడిమివ్రేలు పలికెను. చూపుడువ్రేలు "ఒక్కొక్కటి చూపువాఁడను నేనే" అని చెప్పెను. "అందఱికంటె బలశాలిని నేనే" అని బొట్టనవ్రేలు అనెను. నేను వీనినంతయు విని "మీలో ఒక్కొక్కరి దగ్గఱ ఒక్కొక్క గుణము ఉన్నది. కనుక మీరు అందఱును సమానులే" అని తగవు తీర్చి పంపితిని.

3. తన్ను తాను పొగడుకొనరాదు. అది మంచిది కాదు. ఏదైనను యోచనచేసి చెప్పవలెను. నేను అందఱికంటె పొడుగుగాను, లావుగాను ఉండియు నన్ను చూడక వీరు ఇట్లు వదరుచున్నారు. నేనుకదా అందఱిని ఒక చోటనుండి మఱి

యొక చోటికి కొనిపోవుచున్నాను. నేను లేకున్న యెడల వీరు ఉన్న తావు విడిచి కదల వీలు అగునా? దేహములో సగము



ఎత్తు నేనే. మీరు చక్కగా కొలిచి చూడుడు. నేను నాలుగు జేనల పొడుగు. తక్కిన భాగము నాలుగు జేనలు. నా పాదములను బాగుగా చూడుడు అవే మనలను పడకుండ కాపాడునవి. ఒక్కొక్క పాదము నందును ఐదేసి వ్రేళ్లు ఉన్నవి. వానికి అపాయము రాకుండునట్లు కొనలందు గోళ్లు ఉన్నవి. నా పేరు కాలు. కాలు లేనివాడు కుంటి నేనే అందరిలో మేలయినవాడను

**ప్రశ్నలు** - 1. చేతులవలన ఏమి ఉపయోగము? 2 కాళ్లవలన ఏమి ప్రయోజనము? 3. కాలు చేయి లేనివానిని ఏమందురు? 4. వ్రేళ్లవలన ఉపయోగము ఏమి?

**పదములు** —బలశాలి—సింగారించుటకు—బొట్టన వ్రేలు—ముద్దుటుంగరము — సమానులరు — అపాయము

**ఒరవడి** - కాలు కడప దాటదు.



# 23. చేలిపనులు.

1. కొండారెడ్డి అను అతఁడు జయపురము జమీనుదారు. అతఁడు చక్రవర్తిగారి జన్మదినము వేడుకను జరుపుటకై గ్రామస్థులను అందరిని రమ్మని దండోరా వేయించెను. గ్రామస్థులు అందరు చక్రవర్తిగారి పటమును బాగుగా అలంకరించి మేళతాళములతో గ్రామమంతయు ఊరేగించిరి. బీదలకు

గంజి పోసి, బడిపిల్లలకు మిఠాయి పంచిపెట్టిరి. పిదప అందఱును వచ్చి గ్రామచావడిలో కూర్చుండిరి. అంతట రెడ్డిగారు లేచి చేతిపనులవారిని చూచి, "మీలో ముఖ్యమయిన పని చేయువాఁడు ఎవఁడో ఆతనికి ఈ పది రూపాయలు బహుమతి ఇచ్చెదము" అని బల్లమీఁద పది రూపాయలు తీసి పెట్టెను. పిదప కొందఱు లేచి తమ తమ వృత్తులనుగూర్చి ఇట్లు పొగడుకొనిరి.

2. రాముఁడు—(లేచి) 'మహాప్రభూ! నేను రైతును (వ్యవసాయదారుఁడను) నేను నేల దున్ని ఏరువాక సాగించి ధాన్యములను పండించి జనులను కాపాడెదను. నేను లేకున్న, తినుటకు అన్నమును, బట్టలు నేయుటకు దూదియు దొరకునా? కనుక నా వృత్తి మేలయినది' అని చెప్పెను.

3. గోపాలుఁడు—'అయ్యా, నేను గొల్లవాఁడను. పశువులను, గొఱ్ఱెలను మేపి, జనులకు పాలు, పెరుగు, నెయ్యి మొదలగునవి ఇచ్చెదను. చలికాలమునందు కప్పుకొనుటకు కావలసిన కంబళ్లు నేయుటకు కావలసినంత గొఱ్ఱెబొచ్చు నావలననే దొరకుచున్నది. నేను గొప్ప' అనెను.

4. కృష్ణుఁడు—(గుంపునుండి లేచి) 'మహారాజా, నేను వడ్రంగిని. ఉలి, అంపము, తోపుడుపలక (చిత్రిక), బాడిసె (బాడితె) మొదలగునవి నా కోల (పని) ముట్లు. నేను నేదమునకు వలయు పనిముట్లు చేసి ఇత్తును. నేను లేకుంటినా ఇల్లు కట్టుట ఎట్లు? మీరు కూర్చున్న కుర్చి ఎక్కడనుండి వచ్చును? మీరు సంపాదించు పైకము దాఁచిపెట్టుటకు పెట్టెను, హాయిగా పరుండుటకు మంచమును చేసి యిచ్చువాఁడను నేను కానా? కనుక నేను గొప్ప' అని పలికెను.

5. రామాబత్తుఁడు — (లేచి) 'నా తండ్రీ, నేను కమ్మరిని. వడ్రంగి పెట్టె చేసి ఇచ్చినయెడల, దానికి బీగము (తాళము) చేయువాఁడు ఎవఁడు? నేనే. మంచములకు మరచీలలు చేయువాఁడు ఎవఁడు? నేనే. నేను బీగములు తాళపుచెవులు చేయకపోయినయెడల, వస్తువులు ఎట్లు పదిలముగా ఉండును. కాఁపులకు కావలసిన పారలు, కఱ్ఱులు, కొడవళ్లు మొదలగునవి చేసి ఇచ్చువాఁడను నేనే. తక్కిన వృత్తులవారికి అందఱికి వలయునట్టి పనిముట్లు చేసి ఇచ్చువాఁడను నేనే' అనెను.

6. కేశవుఁడు—'మహారాజా, నేను కుమ్మరిని. మీకు వంటవార్పులకు కావలసిన కుండలు, చట్లు, బానలు, కడవలు మొదలగునవి చేసి ఇచ్చువాఁడను నేనే' అని పలికెను.

7. వేంకటప్ప—"మహాప్రభూ, నేను కంసాలిని. వెండి, బంగారు మొదలగువానితో కడియాలు, మురుగులు, గొలుసులు, పట్టెడలు, కంటెలు మొదలగు నగలు చేసి ఇచ్చెదను. నేనుకదా మీ చెవులలోని అంటుపోఁగులను, మీ వ్రేళ్ల ఉంగరములు చేసినది? నేను లేకుండినా మీ యింటి ఆఁడువారికి నగలు ఎక్కడివి?" అని చెప్పెను.

8. మునుసామి—'అయ్యా, నేను కంచరిని. నేను ఇత్తడి, రాగి, కంచు మొదలగు లోహములతో మీరు కోరిన పాత్రలు చేసి యిచ్చెదను' అనెను.

9. పొన్నఁడు—'మహాప్రభూ, నేను కుట్రపు (కుట్టు) పనివాఁడను (దర్జీని). నేను తమరు కోరు ఉడుపులను కుట్టి ఇచ్చెదను' అన్నాఁడు.

10. నారాయణరావు—'నేను బడిపంతులను. నేను పిల్ల

లకు చదువు చెప్పెదను. చదివినయెడల తెలివి కలుగును. ఇది మిక్కిలి అవశ్యముగదా' అనెను.

11. ముత్తిగాఁడు—'నా సామీ దండాలు. నేను మాదిగ వాణ్ణి. మీకు చెప్పులు, కపిలబానలు, గుఱ్ఱమునకు కళ్లెము, జీని మొదలగువానిని కుట్టి ఇచ్చువాణ్ణి నేనేకదా' అనెను.

12. రెడ్డిగారు వీరు అందఱు చెప్పినది విని 'మీరు అందఱు కావలసినవారే. ఒక్కొక్కరు ఉపయోగపడువారుగానే ఉన్నారు. కాఁబట్టి యీ పది రూపాయలు తలకు ఒక రూపాయవంతున పంచి పెట్టెదను' అని ఒక్కొక్కనికి ఒక్కొక్క రూపాయ ఇచ్చెను.

ప్రశ్నలు—కొందఱు పనివాండ్రును, వారి పనులను చెప్పుము.
పదములు.—జమీన్‌దారు — జరుపుటకు — చేతిపనులవారు — సంసారి—కంబళ్లు—త్రోపుడుపలక—కొలిముట్లు.



# 24. ఏనుఁగు.

1. భూమిమీఁద సంచరించు జంతువులు అన్నిటిలో పెద్దజంతువు ఏనుఁగు నీవు ఎప్పుడు ఐనను ఏనుఁగును చూచి ఉన్నావా? ఇదిగో ప్రక్క పుటలోని పటమునందు ఉండునది ఏనుఁగు: చూడుము.

2 ఏనుఁగునకు చెవులు, కాళ్లు, తల మొదలగు అవయవములు పెద్దవి. కాని, కన్నుమాత్రము చిన్నది. ఏనుఁగు నోటిమీఁదనుండి నిడుపుగా వ్రేలాడు అవయవమునకు తొండము అని పేరు. మనకు చేయివలెనే ఏనుఁగునకు ఏ పని చేయుటకును తొండము ఉపయోగపడుచున్నది.



3. ఏనుఁగు తన ఆహారమును తొండముతో తీసికొని నోట పెట్టుకొనును. దాహము ఎత్తినప్పుడు అది మొదట తొండమునిండుగా నీళ్లను పీల్చుకొనును. పిదప దానిని నోటఁ బెట్టుకొని గొంతులోనికి పోవునట్లు నీటిని ఎగజిమ్మి కుమ్మరించు కొనును.

4. మగ ఏనుఁగునకు తొండమునకు ఇరువైపులను రెండు కోఱలు కలవు. ఆ కోఱలకు దంతములు అని పేరు. దంతము తెల్లగాను, గట్టిగాను, నున్నగాను ఉండును; తళతళమని మెరుగుచుండును. ఏనుఁగు దంతము మిగుల వెలకలది.

5. ఏనుఁగు మిక్కిలి బలముగల జంతువు. అది పెద్ద కలపను, గొప్ప బరువులను మోసికొనిపోవును. ఏనుఁగులను గుళ్లయందును, నగళ్లయందును పెంచుదురు. అది ఒకప్పుడును పరుండి నిద్రింపదు. ఎప్పుడు ఇటు అటు కదలుచునే ఉండును.

6. ఏనుఁగును తోలువానికి మావటివాఁడు అని పేరు. ఏనుఁగునకు ప్రతిదినము వాఁడే ఆహారమును పెట్టును. మావటి వాని అంకుశమునకు జడిసి వాఁడు చెప్పినట్లు అది నడచును. అంకుశముతో పొడిచిన గీపెట్టును

7. ఏనుఁగులు అడవులందు వసించును చెట్లనుండి ఆకులు లాగికొని తినును. వానికి చెఱకుగడలు తినవలెనను కోరిక మిక్కిలి అధికము. మనుష్యులు అడవులలో ఏనుఁగులను పట్టి తెచ్చి మచ్చిక చేసికొందురు.

ప్రశ్నలు· — 1. ఏనుఁగు ముక్కునకు ఏమి పేరు? 2. దాని కన్ను ఎట్లు ఉండును? 3. తొండము కొన ఎట్లు ఉండును? 4. ఏనుఁగు ఎట్లు నీళ్లు త్రాగును? 5. ఏనుఁగు దంతముయొక్క ఉపయోగము ఏమి? 6. దానికి ఆహారము ఏమి? 7. ఎద్దులను, గుఱ్ఱములను, ఏనుఁగులను తోలునట్టి కొఱముట్ల నేమందురు?

పదములు.—ఏనుఁగు—గజము—కుమ్మరించు — కోఱలు—చెఱకుగడ — గుళ్లయందు — అంకుశము — మచ్చిక చేసికొందురు.

ఒరవడి.—ఏనుఁగు చచ్చినను బ్రదికినను వేయివరహాలు.



# 25. ఏనుఁగును గుఱించిన కథ.

1. చాల ఏండ్లక్రిందట విజయనగరమునందు ఒక గొప్ప ఏనుఁగును పెంచుచుండిరి. మావటివాఁడు దానిమీఁద ఎక్కికూర్చుండి దానిని ప్రతిదినము ఏటికి తోలుకొని పోయి, దానిని నీళ్లు త్రాగించి తోలుకొనివచ్చుట వాడుక.

2. పోవునప్పుడు దారిలో ఎవరు అయినను దానికి అరటి పండు, కొబ్బరికాయ, చెఱకుగడ మొదలగువానిని ఇత్తురు. వారు ఇచ్చువానిని ఏనుఁగు మిగుల సంతోషముతో తన తొండము జాపి తీసికొని తినును. వారు కొంచెము అయినను వెఱవక దానిని చేతులతో తట్టుదురు. అది వారిని ఏమియు చేయదు.

3. ఒకనాఁడు కొంటెపిల్లవాఁడు ఒకఁడు టెంకాయ ఒకటి పగులగొట్టి దానిలోని కొబ్బెరను తీసివేసి, దాని నిండుగ సున్నము, బంకమన్ను, ఇసుక, గుండుసూదులు ఇవి పోసి మూసి కొబ్బరికాయవలెనె చేసి, ఏనుఁగు ఎప్పుడు వచ్చునా అని కాచుకొని ఉండెను.

4. వాడుకచొప్పున ఏనుఁగు ఆ తుంటరిపిల్లవాఁడు ఉండు వీథిన పోవుచుండెను. వెంటనే ఆ తుంటరి ఏమియు యోచించక మోసమునకై తాను తయారుచేసిన కాయను దానికి ఇచ్చెను. ఏనుఁగు ఎక్కువ సంతోషముతో దానిని అందుకొని నోట పెట్టు కొనఁగానే పిల్లవాని తుంటరితనము దానికి తెలిసినది. అయి నను అది కోపమును అడచుకొని ఆ కాయను తననోట ఒక ప్రక్కన పెట్టుకొనెను. నాఁడు మొదలు ఆ పిల్లవాఁడు ఏనుఁ గును చూచినయెడల లోపలికి పోయి దాగును.

5. ఇది జరిగి నాలుగు ఐదు ఏండ్లు కడచిన పిదప ఒక నాఁడు గుడియందు స్వామికి ఊరేగింపు జరుగుచుండఁగా ఏనుఁగు స్వామికి ముందుగా పోవుచుండెను. వేడుక చూచు టకై అనేకులు పిల్లవాండ్రు ఏనుఁగు వెంబడి పోయిరి. అది వారిని ఏమియు చేయలేదు.

6. అప్పుడు ఆ తుంటరిపిల్లవాఁడు తన తప్పిదమును అది మఱచి ఉండుననియు, అది తన్ను గుర్తుపట్టజాలదు అనియు,

తలఁచి దాని సమీపమునకు పోయెను. వానిని ఏనుఁగు ఎట్టులో ఆనవాలుపట్టి తన నోటిలో పెట్టుకొని ఉన్న ఆ కాయను వాని నెత్తిమీఁద వడిగా విసరి వైచెను. దానివలన ఆ పిల్లవానికి పెద్ద దెబ్బ తగిలి ఒక సంవత్సరము వఱకు గాయము మానక బాధ కలిగించెను. అందఱును ఈ వింతను చూచి ఆశ్చర్యపడిరి.

ప్రశ్నలు:—1. మావటివాఁడు ఏనుఁగును ఎక్కడికి కొనిపోవును? 2. దారిలో తుంటరిపిల్లవాఁడు ఏమి చేసెను? 3. ఏనుఁగు ఏమి చేసినది?

పదములు - కూర్చుండి—కొబ్బరికాయ—నారికేళము—చేతులతో—హస్తములతో—చొప్పున—ప్రకారము—తుంటరి—దుష్టుఁడు—స్వామికి—దేవునికి.

ఉరవడి.—చెఱపకురా చెడేవు.



# 26. ఎలుకయు, పిల్లియు.

మ-రా-రా-శ్రీ జి సీతాపతి. బి. ఏ, ఎల్. టి., గారు రచించినది.

1. ఎలుకతోడ పిల్లి యొకటి—చెలిమి చేసి వింతగాను
మంచిమాట లాడి దాని—పంచఁ జేరెను.

2. పండు గనుచు నొకరియింట—వండుకొనిన పిండివంట
మెల్లగాను దొంగిలింపఁ—బిల్లి తలఁచెను.

3. వంటయింటి తలుపు వేసి—యింటివారు పండుకొనిరి
యెలుకతోడఁ బిల్లి యపుడు—పలికె నిట్టుల.

4. "వంటయింటిగోడఁ ద్రవ్వి—యింటిలోకి పోయి నీవు
బుట్టలోని పిండివంట—పట్టితెత్తువా?"

5. పిల్లి చెప్పినట్లు ఎలుక—మెల్లగాను బైటికపుడు బుట్ట
లోనివాని నెల్ల—పెట్టివేసెను.

6. "ఎలుకబావ" యనుచు పిల్లి—పలికె నపుడు మంచి
గాను "మనము వీని నెల్ల దాఁచు—కొనుట యెట్టులు?"

7. "పొరుగువారి పాడు కొంప—పెరటి వైపు మిద్దె
మీఁద నుంచుకొన్న మనకు చాల—మంచిదే కదా?"

8. ఎలుకబావ మంచి దనచు—పలుకఁగానె వాని నచట
నుంచి వేసి తిరిగి వారు—పంచఁ జేరిరి.

9. తెల్లవాఱఁగానె కొంచె—పిల్లిబావ పలికె నిటుల
"యెలుకబావ, రాత్రి నాకు—కలలు వచ్చెను."

10. "తమ్ముఁ డొకఁడు పుట్టినటుల—అమ్మ నన్ను పిలిచి
నటుల కనుక నాకు వారిఁ జూడ—మనసు పుట్టెను."

11. "చూచివత్తు" ననచుఁ బిల్లి—దాచుకొన్న చోటి కేగి
బుట్టలోనివాని గొన్ని—పొట్టఁ బెట్టెను.

12. మెల్లగాను తిరిగి వచ్చు—పిల్లిఁ జూచి యెలుక పలికె
"వింత లేమి? బావగారు—వింత లేమిటి?"

13. "తమ్ముఁ డొకడు పుట్టె" ననుచు—"అమ్మ తనను
జూచె" ననుచు కల్లపలుకు లెలుకతోడ—పిల్లి పలికెను

14. "ఏమి పేరు? చిన్నబావ—కేమి పేరు పెట్టినారు?
తెలియ జెప్ప వేమి?" యనుచు—నెలుక యడిగెను.

15. అంత నెలుకతోడ పిల్లి—"కొంత హూంత్తు" అనెను;
గాని జరిగినట్టి దేమొ యెలుక—యెఱుగకుండెను.

16. కొన్ని దినములైన పిదప—మున్ను చెప్పినటులె పిల్లితనకు
దనయుఁడొకఁడు పుట్టె ననుచు జెప్పెను.

17. బుట్టలోనివాని నెల్ల—పొట్టలోన పెట్టుకొనుచు తిరిగి
వచ్చు పిల్లి నెలుక—మరల నడిగెను.

18. "అంత హూంత్తు" అనుచు పిల్లి—సంతసమునఁ జెప్పెఁ
గాని యెలుక కర్థమింతయైనఁ—దెలియకుండెను.

19. "కొంత హూంత్తు అంత హూంత్తు"—వింతపేర్లు పెట్టి
రనుచు నెలుకబావ జడ్డిగాను—తలఁచె నప్పుడు.

20. కొన్ని దినములైన పిదప—మున్ను తాము దాచుకొన్న
స్థలము కేగుదమా యటంచు—నెలుక పలికెను.

21. మంచి దనచు కొంటెపిల్లి—మంచిమాట లాడు
కొనుచు నెలుకతోడ తాను కూడ—కలసి వెళ్లెను.

22. అంత నచట జడ్డియెలుక—యెంతొ యాశతోడఁ జూడ
బుట్టలోన నేమి లేక—నట్టి దయ్యెను.

23. "అయ్యొ యనగ" జడ్డియెలుక—"కుయ్యొ?" యనుచు
కొంటెపిల్లి వింతగాను తాను కూడ—చింత చేసెను.

24. 'కొంత హూంత్తు' అనఁగ నేమొ—"అంత హూంత్తు"
అనఁగ నేమొ ఎలుక యప్పుడు తెలిసికొనుచుఁ—బలికె
నిట్టుల.

25. "మోసపోతి పిల్లిబావ—మోసపోతి పిల్లిబావ" నమ్మ
గూడ దింక నిన్ను—నమ్మగూడదు

26. ఇంక తన్ను నమ్మ దెలుక—యింక తన్ను జేరదనుచ
తత్క్షణంబె పిల్లి దాని—గుత్తి వేసెను.

27. 'కొంత హూత్తు?' మొదలుపెట్టి—"అంత హూత్తు' పిదపజేసి "యెలుక హూత్తు"తో ముగించె—తలంచి నట్టుల.



# 27. వారములు, తిథులు.

వారమునకు దినములు ఏడు.

1. ఆదివారము, 2. సోమవారము, 3. మంగళవారము, 4. బుధవారము, 5. గురువారము, 6. శుక్రవారము, 7. శనివారము.

ప్రతి నామములు లేక మారుపేర్లు.

1. భానువారము, 2. ఇందువారము, 3. భౌమవారము, 4. సౌమ్యవారము, 5. బృహస్పతివారము, 6. భృగువారము, 7. స్థిరవారము.

నెలకు పక్షములు రెండు.

1. శుక్లపక్షము లేక శుద్ధపక్షము 15 దినములు.

2. కృష్ణపక్షము లేక బహుళపక్షము 15 దినములు.

చంద్రుని నీవు చూచుచున్నావు గదా.

శుక్లపక్షమందు చంద్రుఁడు దినదినము పెరుగును.

కృష్ణపక్షమందు చంద్రుఁడు దినదినము తగ్గును.

ఈ దినములకు తిథులని పేరు.

| శుక్లపక్షముయొక్క కృష్ణపక్షముయొక్క తిథులు. | శుక్లపక్షమందు చంద్రుఁడు పెరుఁగు రీతి | కృష్ణపక్షమందు చంద్రుఁడు తఱుఁగు రీతి. |
|---|---|---|
| ౧ పాడ్యమి. |  |  |
| ౨. విదియ | | |
| ౩. తదియ | | |
| ౪. చవితి. | | |
| ౫. పంచమి | | |
| ౬. షష్ఠి. | | |
| ౭. సప్తమి | | |
| ౮. అష్టమి. | | |
| ౯. నవమి. | | |
| ౧౦. దశమి. | | |
| ౧౧. ఏకాదశి | | |
| ౧౨. ద్వాదశి. | | |
| ౧౩. త్రయోదశి | | |
| ౧౪. చతుర్దశి. | | |
| ౧౫. పూర్ణిమ శుక్లపక్షమందు. | | |
| ౧౫. అమావాస్య కృష్ణపక్షమందు. | | ఈ దినమున అగుపడదు. |

పూర్ణిమకు పూర్ణిమ 30 దినములు. అమావాస్యకు అమావాస్య 30 దినములు, అనగా ఒక నెల.

పాడ్యమి మొదలుకొని చతుర్దశివఱకు వరుసగా ౧ మొదలుకొని ౧౪ వఱకు ఉండు అంకెలకు సరి అయిన తిథులు, అనగా ౧. పాడ్యమి. ౨. విదియ ఈ విధముగా ఉండును.

శుక్లపాడ్యమినాఁడు కనఁబడు చంద్రుఁడు మిక్కిలి సన్నని చంద్రవంక.

ఈ చంద్రవంక, పైన కనఁబడు విధమున, దినదినము ఎక్కువయి పూర్ణిమనాటికి నిండుగా కనఁబడును. ఆవల దిన దినము తగ్గి అమావాస్యదినమున కనఁబడక ఉండును

**చంద్రుని వెలుఁగు తలుఁగుల ననుసరించి మన ఆంధ్రులు నెలలకు పేళ్లు పెట్టినారు.**

సంవత్సరమునకు నెలలు పండ్రెండు.

అవి యేవన.—(1) చైత్రము, (2) వైశాఖము, (3) జ్యేష్ఠము, (4) ఆషాఢము, (5) శ్రావణము, (6) భాద్రపదము, (7) ఆశ్వయుజము, (8) కార్తికము, (9) మార్గశీర్షము, (10) పుష్యము, (11) మాఘము, (12) ఫాల్గునము. ఈ నెలలకు మారుపేళ్లు కలవు. అవి యేవన.—(1) మేషము, (2) వృషభము, (3) మిథునము, (4) కర్కటకము, (5) సింహము, (6) కన్య, (7) తుల, (8) వృశ్చికము, (9) ధనుస్సు, (10) మకరము, (11) కుంభము, (12) మీనము.



# 28. దేహారోగ్యమునకు మార్గములు.

ప్రతి మనుష్యుఁడును సుఖముగా నుండవలయుననియే కోరును. కడుపునొప్పి, తలనొప్పి, జ్వరము మొదలగు రోగములు వచ్చిన మిగుల కష్టము కలుగును. అవి రాకుండుటకు కొన్ని విధులను అనుసరింపవలయును. వానిని దిగువ చెప్పి యున్నాము.

**మంచి ఆహారము** మనము భుజించు పదార్థములు ఏవియు అపరిశుద్ధమైనవిగా నుండకూడదు. చక్కగా వండిన అన్నమునే భుజింపవలయును. పక్వముకాని దానిని భుజింపకూడదు. కసరుకాయలుగాని, కుళ్లిపోయిన కూరగాయలనుగాని పండ్లనుగాని తినకూడదు. ఆహారమును నెమ్మదిగా భుజింపవలయును. నీళ్లతో కడుగక ఏ పండును కాయను తినగూడదు.

**శుద్ధమైన నీళ్లు** — మనము నీళ్లు త్రాగక బ్రతికి ఉండలేము. మనము త్రాగునవి మంచినీళ్లుగా ఉండవలయును. నీళ్లలో మిక్కిలి చిన్న పురుగులు, మన కండ్లకు తెలియక లెక్కలేక ఉన్నవి. వీనిలో అనేకములు రోగము పుట్టించును. అందువల్ల నీళ్లను బాగుగ పొంగబెట్టి, చల్లార్చి త్రాగవలయును.

**మంచి గాలి** ఊపిరిపీల్చుటకు మంచి గాలి మిక్కిలి ఆవశ్యకము. అది మన యిండ్లలోపలికి ధారాళముగ వచ్చుటకు గవాక్షము లుండవలయును వీనిని ఎప్పుడును తెఱచిపెట్టి యుండవలయును

**దేహపరిశ్రమము.** — మన దేహమునకు బలము కలిగించుటకు ఏదైన ఒక పరిశ్రమము చేయవలయును. బయులలో గాలి

హేరాళముగ నుండుచోట్లలో పలువిధములైన ఆటలు ఆడ వచ్చును, పరుగెత్తవచ్చును, వేగముగా నడువవచ్చును, దండె ములు తీయవచ్చును. వీనిలో దేనినైన ఒకదానిని ప్రతిదినము తప్పక అభ్యాసము చేయుచుండవలయును.

పరిశుభ్రత — మనము కట్టుకొను వస్త్రములను ప్రతిదినము ఉతికి ఆరవేయవలయును. ఏలాంటి మురికిగల ఉడుపులను ధరింపగూడదు. మన దేహమును సీకాయ, సబ్బు మొదలగు వస్తువులతో బాగుగ రుద్దుకొని ప్రతిదినము తప్పక స్నానము చేయుచుండవలయును. భోజనము చేయుటకుముందు కాళ్లు చేతులు చక్కగా కడుగుకొనవలయును. వ్రేళ్లలోని గోళ్లసం దుననుండు మురికిని తీసివేయవలయును. భోజనమైనతోడనే బాగుగ పుక్కిలించి ఉమ్మివేయవలయును. పండ్లసందున చిక్కి యుండు ముక్కలను తీసివేయవలయును. ఇండ్లలోగాని, చుట్టు ప్రక్కల సమీపప్రదేశములలో పెంట చేర్చియుంచరాదు.



# 29. నీతి వాక్యములు.

1. అడుసు త్రొక్క నేల
కాలు కడుగ నేల.
2. అబ్బ లేని బిడ్డ
మబ్బు లేని యెండ.
3. ఎక్కువైన బుద్ధి
పెక్కు కార్య సిద్ధి.
4. కట్టు లేని నోరు
కట్ట తెగిన యేరు.
5. ధనము లెన్న వారు
వినయ మెపుడు గోరు.
6. నీతి లేని వాఁడు
కోఁతి కంటె బీడు.
7. బాస లాడు వాఁడు
కాసు చేయ లేఁడు.
8. మంచి విద్య చదువు
మంచి బుద్ధి దలపు.
9. రాజు లేని యూళ్లు
పూజ లేని గుళ్లు.
10. దేవ దేవ రమ్ము
కావు మయ్య మమ్ము.

# 30. ద్విపదలు.

---

(1) ఉత్తముని గుణము లున్నె నీచునకు,
నెత్తెచ్చి కరఁగిన నిత్తడి పసిఁడౌ?

(2) ఊఁపిరి మేనిలో నున్న దినాల
నోపికతోఁ బను లొనరింప వలయు

(3) చదివినవాఁడె గా సర్వపూజ్యుండు,
చదువక రాజైన సత్కీర్తిఁ గనునె.

(4) జలములలో నున్న జంతువు లెల్ల
నిల మీఁదఁ ద్రోచిన నెట్టులు బ్రతుకు?

(5) బీదకు బిచ్చంబుఁ బెట్టఁగా నెంచి,
వాదంబు లాడకు వానితో నీవు.

(6) ఘన్నిన చీఁకటిఁ బాపంగ నొక్క
సన్నపు దీపంబు చాలదే తలఁప?

(7) బిడ్డల కిడకయుఁ బెండ్లాని కీక
వడ్డి కిచ్చుచుఁ జీమ వలెఁ గూర్పఁ దగదు.

(8) మదిలోన సత్యంబు మఱవక యున్న
ముదమును సుఖమును బొందంగ వచ్చు.

(9) శరణుఁ జొచ్చిన నెట్టి శత్రువు నైనఁ
గరుణించి కావంగఁ గలుగదే కీర్తి.

(10) సత్యంబుఁ దప్పక చరియింప వలయు,
నిత్యంబుగా గల్గు నీకు సంపదలు.

# కందపద్యములు

(11) తల్లికిఁ దండ్రికిఁ బెద్దల
కుల్లాసముఁ గలుగఁజేయుచుండెడి పనులన్
జల్లఁగఁ జేయుచు నుండినఁ
గొల్లగ సంపదలు నీకుఁ గూడును బుత్రా!

(12) చదువును పంతులు చెప్పిన
చదు వంతయు దానిలోని సంగతులెల్లన్
మదిలోన మఱవ కుండుము
ముదమున నిటునటులఁ దిరుగఁ బోకుము పుత్రా!

(13) అల్లరి పిల్లలఁ గూడిన
నల్లరియే సంభవించుచు నటుబోకు సుమీ
యెల్లప్పుడు మంచి పిల్లల
మెల్లఁగఁ జేరంగ నీకు మేలగుఁ బుత్రా!

(14) చీమలు దోమలు మొదలుగ
భూమిం దిరుగాడు జంతువులఁ జంపకుమీ
నీమంబుగాదు నీ కది
ప్రేమను నీవలెనె చూడు ప్రియ మగుఁ బుత్రా!

(15) పరిశుభ్రతకై దేహము
మురికియుఁ బోవంగ స్నానమును జేయఁ దగున్
దురదయు గజ్జియుఁ గలుగదు
మఱవకుమీ మంచిమాట మనసునఁ బుత్రా!

(16) అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుఁడుం
జొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టియూరుఁ జొరకుము సుమతీ.

(17) అక్కఱకు రానిచుట్టము
మ్రొక్కిన వరమీనివేల్పు మోహరమునఁదా
నెక్కినఁ బాఱనిగుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ.

(18) ఇమ్ముగఁ జదువని నోరును
నమ్మాయని పిలిచి యన్నమడుగని నోరుం
దమ్ములఁ బిలువని నోరును
గుమ్మరిమను ద్రవ్వినట్టి గుంటర సుమతీ.

(19) ఉపకారికి నుపకారము
విపరీతము గాదుసేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ

(20) ఉదకము ద్రావెడు హయమును
మదమున నుప్పొంగుచుండు మత్తేభంబున్
మొదవుకడ నున్న వృషభముఁ
జదువనియా నీచుకడకుఁ జనకుర సుమతీ.



—— VEPERY, MADRAS—

# TELUGU
# SECOND READER

NEW AND REVISED EDITION

## రెండవ వాచక పుస్తకము

ఇది

రావుబహదూర్ కం. వీరేశలింగముపంతులుగారిచేత

పరిచూడఁబడినది



MACMILLAN & CO., LIMITED
MADRAS, BOMBAY, CALCUTTA AND LONDON
1922

Annas]  [[illegible]

# విషయసూచిక.

# ఉపాధ్యాయుని పనులు.

1. పాఠమును చదువ నారంభించుటకు ముందు బాలురు పటమును గమనించునటుల చేయవలెను

2. పటముయొక్క ఒక్కొక్క భాగమును చక్కగా గమనించి చూచి తెలిసికొనునట్లు ప్రశ్నలు అడుగవలెను.

3. పటములో కనుబడుచిన వస్తువును గురించి బాలురతో సంభాషించునటుల కలిసి మాటాడి వారికి సంతోషము కలుగునట్లు చేయవలెను.

4. బాలురు గమనించి చూచిన విషయములను పరీక్షించి, వారు పటము మూలముగ గ్రహించిన విషయములను గురించి ప్రశ్నలు అడుగవలెను.

5. బాలురు చూచియును ఊహించియును తెలిసికోలేని విషయములను కొన్నిటిని పాఠమునకు కావలసినంతమాత్రము వివరించి చెప్పవలెను.

6. బాలురతో సంభాషణము చేయునపుడు పాఠమునకు సంబంధింపని విషయములో ప్రవేశింపకుండ చేయవలెను.

7. పాఠములో కనబడుచిన విషయములను గురించి ప్రశ్నలు అడుగునపుడు, పాఠమునకు క్రింద వ్రాసియుండు ప్రశ్నలనుమాత్రము అడిగి పాఠమును ముగింపగూడదు. ఆ ప్రశ్నలను మాదిరిలుగా భావించి వేరే ప్రశ్నలను అడుగవలెను.

8. ఎక్కడెక్కడ సాధ్యమగునో ఆయా పాఠములయందంతయు మంచి నీతులను బాలురకు నేర్పవలెను.

9. కష్టపదములు ఏవైన ఉండినయెడల వానికి నిదర్శనముగా వానివంటి వేరే పదములను నల్లపలకలో వ్రాసి చూపవలెను

10. ఒక్కొక్క పాఠమును దాని పటమునకుఁ దగినట్టు నేర్పి బాలురు చూచి అడిగిన విషయములతో సంబంధపఱుపవలెను

# రెండవ వాచక పుస్తకము.



## 1. గొఱ్ఱె.

ఇదిగో పై పటములోని జంతువును చూడుము. ఇది యొక గొఱ్ఱె. గొఱ్ఱెలు, మేఁకలు, అని యీ జాతి జంతువులు రెండు విధములు. ఇది మేఁక కాదు. ఇది మగది, అట్టి గొఱ్ఱెకు పొట్టేలు అని పేరు. పొట్టేలు కొమ్ములు మెలికలుతిరిగి యెంత వంకరగా నున్నవో చూచితివా? మేఁక కొమ్ములు మెలికలు తిరుగక సూటిగాను నిడుపుగాను ఉండును. ఆఁడు గొఱ్ఱెలకు కొమ్ము లుండవు. గొఱ్ఱెలకు కండ్లు తలకు రెండు ప్రక్కలను ఉన్నవి. మనకు ఉండునట్లు దాని కండ్లు ముఖమున సమము (సూటి) గా లేవు. గొఱ్ఱెకాళ్లు మిక్కిలి సన్ననివి. దాని గిట్టల (డెక్క) లను నిదానించి చూడుము. అవి గట్టిగ నుండును. పశువుల గిట్టలవలె దాని గిట్టలును చీలి ఉండును. అందుచేత ఱాళ్లపై ఎక్కుటకును అక్కడనుండి దుముకుటకును దానికి మిక్కిలి సులభము. గొఱ్ఱె మేఁకంత పొడవైన జంతువుగాదు.

గొఱ్ఱెకు దేహమునిండ బొచ్చు దట్టముగా ఉండును. ఈ బొచ్చునకు త్రుప్పుడు (ఉన్ని) అని పేరు. త్రుప్పుడు దానికి అంగీ వంటిది. త్రుప్పుడువలన గొఱ్ఱెకు వెట్ట కలుగును. చలికాలమున దానికి ఈ త్రుప్పుడు చాల ఉపయోగము. ఎండకాలమున దానికి అంత వెట్ట అక్కఱలేదు. కాఁబట్టి ఎండకాలము వచ్చినవెంటనే ఆ బొచ్చు రాలిపోవ నారంభించును. అట్లు రాలి పాడైపోకుండుటకై ఎండకాలము రాకముందే మనుష్యులు గొఱ్ఱె త్రుప్పటిని కత్తిరింతురు. త్రుప్పటితో కంబళ్లు మొదలైనవి నేయుదురు. మనలో కొందఱు చలికాలమున ఈ కంబళ్లను కప్పుకొందురు. కంబళ్లవలన మన దేహమునకు వెట్ట కలుగును.

మేఁక బొచ్చుకంటె గొఱ్ఱె త్రుప్పుడు బిఱుసు.

గొఱ్ఱె పాలు ఇచ్చును. పాలు పితుకునప్పుడు ఆవులను కట్టునట్లు దాని కాళ్లకు త్రాటిని కట్టనక్కఱలేదు. ఏలయన, అది తన్నదు; అది మిక్కిలి సాధువైన మృగము. మనుష్యులు గొఱ్ఱెపాలను త్రాగుదురు; దాని మాంసమునుకూడ కొందఱు తినెదరు. దాని మాంసమును తినుటకై పెక్కు క్రూరమృగములు దానిని చంపుటకు ప్రయత్నము చేయును.

మనుష్యులు గొఱ్ఱెలను మందలు మందలుగా ఉంచుకొని కాపాడుదురు. అట్లు కాపాడువానికి గొఱ్ఱెల కాపరి, లేక గొల్లవాఁడు, అని పేరు. గొల్లవాఁడు తన గొఱ్ఱెలపై చాల దయకలిగి ఉండును. వానిని మేపుటకై మందలు మందలుగా అడవులకును మళ్లకును ఈ కాపర్లు తోలుకొని పోవుదురు. అచ్చట అవి గఱిక మేయును.

రాత్రికాలమందు గొఱ్ఱెలను కాపాడుటకై వానిని మందలు మందలుగా దొడ్డకు తోలుదురు. గొఱ్ఱెపిల్లలను చిన్న గుడిసెల

యందు మూసియుంచుదురు. తెల్లవాఱఁగానే ఈ గొఱ్ఱెలను వేఱువేఱు మందలుగా భాగించెదరు. అప్పుడు వానిని చూచిన మిక్కిలి వేడుకగా ఉండును.

ప్రతి గొల్లవాఁడును తన మందలోని గొఱ్ఱె నొకదానిని గుఱుతుపెట్టుకొని యుండును. వాఁడు దాని వెనుకటికాలును పట్టి ముందునకు ఈడ్చుకొని పోవును. అప్పుడు వాని మందలోని గొఱ్ఱెలన్నియు దాని వెనుకనే పోవును. అట్లే గొఱ్ఱెలు సాధారణముగా ఒకటి పోయిన త్రోవనే మఱియొకటి పోవును. ముందుపోవు గొఱ్ఱె ఒక కొండమీఁదనుండి క్రిందికి దుమికిన అన్నియు ఒకటి వెనుక నొకటి అట్లే క్రిందికి దుముకును.

## గొఱ్ఱెదాఁటు.

**ప్రశ్నలు:**—గొఱ్ఱెకును మేఁకకును భేదము ఏమి? గొఱ్ఱె ఒడలిమీఁద నుండునది ఏమి? గొఱ్ఱె మనుష్యునకు ఎందుకు పనికివచ్చును? త్రుప్పటివలన గొఱ్ఱెకు ఏమి ప్రయోజనము? త్రుప్పటితో ఏమి చేయుదురు? గొఱ్ఱెల గుంపునకు ఏమి పేరు? గొఱ్ఱెల కాపరి అనఁగా ఎవఁడు? వాఁడు గొఱ్ఱెలను మళ్లకు ఏల తోలుకొని పోవుచున్నాఁడు?

**పదములు.**—పొట్టేలు—త్రుప్పుడు—గొఱ్ఱెల కాపరి—సాధువు—మెలికలు—వెంట్రుక—కత్తిరించు—బిఱుసు—గొఱ్ఱె—మేఁక—బొచ్చు—కంబళి—జంతువు—మృగము—ప్రయత్నము—యత్నము—మంద—దొడ్డి—పెట్ట—ఉష్ణము—త్రోవ.

**డ్రాయింగు.**—గొఱ్ఱె తల.

**బంకమట్టి పని.**—గొఱ్ఱె గిట్టలు.

**సామెత**—"గొఱ్ఱె బలిసినదంత గొల్లవానికే లాభము."



# 2. ధైర్యముగల మేఁక.

గోపాలుఁడను గొల్లవాఁడు పెక్కు మేఁకలను మేపు చుండెను. వాని మందలో ఒక మేఁక ఉండెను. అది చక్కఁగ బలిసి యుండెను. దాని కొమ్ములు వాఁడియైనవి. గిట్టలు సూదివలె కొనతేలి ఉండెను. దాని నోటిక్రింద గడ్డము నిడుపుగ ఉండెను. అది యెవరికిని భయపడుట లేదు. దానికి ఎప్పుడును జగడము నందే ప్రీతి. కాబట్టి దానిని చూచినవారందఱు భయపడు చుండిరి.

ఒకనాఁడు గోపాలుఁడు మేఁకలను దూరమునుండు అడవికి మేపుటకు తోలుకొని పోయెను. ప్రొద్దుపోవఁగనే వానిని మరల తోలుకొని వచ్చునపుడు ఆ మేఁక అగుపడలేదు త్రోవతప్పి యది యొక కొండ యడుగుభాగమును చేరెను. చీఁకటిపడినందున ఎటు పోవుటకును సాధ్యపడలేదు. తబ్బిబ్బులు పడి కడపట అది ఒక గుహలో చేరి పండుకొనెను. ఆ రాత్రి మేఁతకై బయట పోయియుండిన సింహమొకటి వేకువజామున అచ్చటికి వచ్చెను.

సింహము మిగుల భయంకరమైన మృగము. అది మృగ ముల కన్నిటికిని రాజు. దానిని సమీపించుటకు మృగములు అన్నియు భయపడును. మనుష్యులుకూడ భయపడుదురు. సింహమును చూచినతోడనే మేఁకకు భయము కలిగెను. ఇఁక “నేను దీని చేతిలో చచ్చుట నిశ్చయము, ఇది తప్పదు. అయినను ధైర్యము వదలకూడదు” అని ఆ మేఁక తలఁచెను.

పిమ్మట అది లేచి సింహమును చక్కఁగా చూచి తన తలను ఆడించి కొమ్ములతో నేలను గీఱి పెద్ద కేక వేసెను.

"ఆహా! మంచి యాహారము. దగ్గఱకు రా, నేను మేఁకను. ఏనను నాజీవితకాలమున పది పులులఁ జంపి తినియున్నాను ఇరువదిదా ఏను గులను కూడఁ జంపి తినియున్నాను. ఒక సింహమును చంపి తినక యీ గడ్డము తీసివేయకూడదని నిశ్చయించుకొంటిని. నేఁటికి నా పంతము నెఱవేఱునది" అని గట్టిగ అఱచెను.

దీనిని విన్న సింహము గడగడ వడఁకి ధైర్యమువదలి వచ్చిన త్రోవనె పరుగెత్తిపోయెను. వెళ్లవాఱఁగనే తనకు వచ్చిన యాపత్తు తప్పినదని మేఁక సంతోషపడి తప్పిపోయిన దోవను గనుఁగొని తన మందను కలిసికొనెను.

ఆపద గలిగినప్పుడు ధైర్యమును విడువకూడదు.

**ప్రశ్నలు** ఈ కథను నీ స్వంత మాటలతో వ్రాయుము. దీనిని నుండి ఏమి నేర్చుకొంటివి?

**పదములు**—వాఁడి—జగడము—కలహము—తబ్బిబ్బు—మేఁత—ఎర—కేక—గడ్డము—సింహము—పులి—ఏనుఁగు.

**వ్రాయుము.**—మేఁక తల ఒకవడి. చెడ్డ చోటు విడువు.



# 3. ఎద్దు.

అవిగో! రెండు ఎద్దులు. అవి వడిగా నడచి పోవుచున్నవి. వానిని ఒక మనుష్యుఁడు తోలుకొని పోవుచున్నాఁడు. అవి ఎక్కడికి పోవుచున్నవో ఎఱుఁగుదువా? ఇంటికి పోవుచున్నవి. అవి ఎక్కడనుండి పోవుచున్నవి? మల్లెదగ్గఱనుండి పోవుచున్నవి. అవి మోటకు (కపిలకు) లాగుటకు అక్కడికి పోయినవి.



ఆవునుగుఱించి మీరు మొదటి వాచక పుస్తకమున చదివి యున్నారు గదా? ఎద్దులును చూచుటకు చాలవఱకు ఆవుల వలెనే యుండును. ఆవులకువలెనే ఎద్దులకును కాలిగిట్టలు రెండుగా చీలియుండును. పచ్చిగడ్డి, ఎండుగడ్డి, దంటు, అవిసె, జనుము మొదలయిన ఆకులను పశువులవలె ఎద్దులును తినును. తవుడు, గానుగపిండి (తెలకపిండి), ఉడికిన యులవలను గూడ వీనికి పెట్టుట కలదు. మాంసమును అవి తినవు.

ఎడ్లు చాల కష్టపడి పనిచేసెడి జంతువులు. పొలములను దున్నును. మోట లాగుటకును బండ్లు ఈడ్చుటకునుగూడ నవి ఉపయోగమగుచున్నవి. బండ్లను లాగు ఎద్దుల కాలిగిట్టలు అఱుగకుండుటకై లాడము (నాళ్లు) కొట్టుదురు. కొన్ని యూళ్లలో వానిపై మూటలువైచి తోలుకొని పోవుదురు. ద్రావిడదేశమున ఎద్దుపై మేళము (బాజాబజంత్రీలు) నుంచి, మేళగాండ్రు దానిపై నెక్కి కూర్చుండి వాయించుచు పోవుట వాడుక.

ఈ యెద్దుల కొమ్ములను చూడుము. ఎంత వాఁడిగ నున్నవి! వానికేదైన మనము చెడుగుచేసిన, అవి కొమ్ములతో పొడుచును. అడవులలో తిరుగునప్పుడు వానిని పులులు, చిఱుతపులులు, తఱిమిన వాని నెదిరించి తమ వాఁడియైన కొమ్ములతో పొడిచి చంపును.

పై పటమును చక్కఁగా చూడుము. ఎద్దులను తోలుకొని పోవువాఁడు, తన కుడిచేతిలో ఒక కఱ్ఱను పట్టుకొని యున్నాఁడు. అది ఎందుకు? దానితో ఎద్దులను కొట్టి తోలును. వాని యెడమ చేతియందు ఎద్దుల తలలకు కట్టిన త్రాటిని పట్టుకొని యున్నాఁడు. ఈ త్రాడు లేకపోయిన అవి తిన్నగా నడువవు. బండి నీడ్చు నెద్దుల ముక్కులలో అడ్డముగా రంధ్రము చేసి త్రాడుగట్టి పట్టుకొందురు. ఈ త్రాటికి ముక్కుత్రాడు అని పేరు. అప్పుడవి బండితోలువాని యిష్టప్రకారము నడుచును. కాఁపు వాఁడు ఎద్లయందు ఎక్కువ ప్రీతి గలిగి యుండును. వాఁడు ముఱికిపోవువఱకు వానిని చక్కఁగా తోమి కడుఁగును. ఆవల వానికి మేఁత వేయును. అవి దప్పిగొనినప్పుడు మంచినీరు త్రాగించును. సాయంకాలమున వానికి తవుడుగాని, గుగ్గిళ్లుగాని, తెలకపిండి (గానుగపిండి) గాని పెట్టును. ఆవునకువలె ఎద్దునకును మంచి మేఁత వేయవలెను.

ఎద్దులలో పెక్కు జాతులు ఉన్నవి. వానిలో కొన్ని జాతులు పొడవుగలిగి బలిసియుండును. వాని కొమ్ములు చిన్నవి. ఈ జాతి యెడ్లను బరువు మోయుటకు ఉపయోగింతురు. మఱియొక జాతి ఎడ్ల కొమ్ములు నిడుపైనవి. ఈ జాతి యెడ్లు వేగముగ పరుగెత్తును. పుంగనూరు ఎద్దులు చాల చిన్నవి. తెలుఁగు దేశములో నెల్లూరియెడ్లు చాలా శ్రేష్ఠమైనవి.

అభ్యాసము.— ఈ పాఠమందలి పటమును గూర్చి మీ స్వంత మాటలతో చెప్పుడు

పదములు.—ఎద్దు—ఎద్దులు—దంటు—అవిసె—ఉలవలు—తవుడు —ఆహారము—మేత—దుక్కి—మోట — మేళము —త్రాడు—రంధ్రము—లాడము.

డ్రాయింగు.—ఎద్దు తల

బంకమట్టి పని.—ఎద్దు కొమ్ములు

ఒరవడి —ఎద్దులు మళ్లను దున్నును.

నీతి.—జీవహింస చేయరాదు.



# 4. ఎద్దుల కథ.

పోలవరము అను ఊరిలో సుబ్బడు అను ఒక కాపు వాడు ఉండెను. వానికి రెండు జతల ఎద్దులుండెను. చూపునకు అవి అన్నియు మీగుల సొంపుగ నుండెను. అవి నాలుగును మంచి చాయ కలిగినవి. ఎత్తునను పొడవునను అవి సరిసమాన ముగా నుండెను. వాని కొమ్ములును పొడవై మొనలు చీలి చివరలు సన్నములుగా నుండెను.

దుక్కికాలమున తప్ప తక్కినప్పుడు ఆ కాపువాని కుమారుడు వానిని మేపుకొనివచ్చును. వాని పేరు రమణుడు. ఈ రమణునికా యెడ్లపై ప్రేమ మెండు. వాడు వానిని దినమంతయు పచ్చికయుండుచోట్ల మేపును. తేటనీటిని త్రాగించును. వానిని ప్రతిదినమును ముటికిపోవువఱకు చక్కగా తోమి కడుగును. మిట్టమధ్యాహ్నపువేళను ఎండ తీవ్రముగ నుండు నపుడు చెట్ల నీడలలో వానిని తోలియుంచును. వానికేదైన

నొప్పి కలిగిన అవి వానియొద్దకు వచ్చును. తనకు తోఁచినట్లు ఆ నొప్పిని తొలఁగించుటకు వాఁడేదైన చికిత్స చేయును. వాఁడు వానిని ఎప్పుడును కొట్టుటలేదు; బెదరించుటలేదు. కాఁబట్టి వానిని చూడఁగనే ఆ యెద్దులు వాని దగ్గఱకు పోవుచుండెడివి. వాని మాట విన్నంతనే వాని ధ్వనిని గుర్తించి యతఁడుండు చోటిని అవి వెదకుకొని వెళ్లుచుండును.

ఇట్లుండఁగా ఒకానొక సమయమున ఆ యూరిలో వాన కురియక పైరంతయు ఎండిపోయెను. గొడ్లుమేయు పచ్చికకూడ గ్రామమునఁగాని దాని సమీపమునఁగాని దొరకకుండెను. అందుచేత అచ్చటికి కొంతదూరముననుండిన యడవిలో ఆ పిల్లవాఁడు వానిని మేపుకొని వచ్చుచుండెను.

ఒకనాఁడు రమణుఁడు ఆ యెద్దులను మేపుటకై వానిని అడవియందు తోలి ఒక చెట్టుక్రింద పండుకొని నిద్రించుచుండెను. కొంతసేపటికి అచ్చట తటాలున ఒక గర్జనము వినవచ్చెను. ఆ పసిబాలుఁడు దిగులుపడి ఏమియు తోఁచక నలుదిక్కుల చూచుచు నిలిచెను. అప్పుడు వానిపైకి కొంత దూరమునుండి పెద్దపులి యొకటి పరుగిడి వచ్చుచుండెను. దానిని చూడఁగనే వానికి కలిగిన దిగులింత యని చెప్ప తరముకాదు. అఱచుటకు కూడ వానికి అప్పుడు తోఁచలేదు. ఐనను దిగులుతోడ గట్టిగ నేడ్చుచు వాఁడు పరుగిడెను. చాలదూరముగ మేయుచుండిన వాని యెడ్లకు వాని యేడ్పుధ్వని వినవచ్చెను. తత్క్షణమే అవి వానియొద్దకు వచ్చి వానికి నాలుగుప్రక్కల నిలిచినవి. ఇంతలో వానిని పెద్దపులి సమీపించెను. ఏ వైపు చూచినను నాలుగెడ్లును ఒకటిగఁ జేరి కొమ్ముల మీటించి దానిని పొడిచి చంపుటకు సిద్ధముగ నుండినవి. అందువలన పులి

ఏమియు చేయలేక పరుగెత్తిపోయెను. తనకు చావు తప్పినని పిదప రమణునికి కలిగిన యానందము చెప్ప నలవికాదు. ఎద్దును వాఁడు కౌఁగిలించుకొని ముద్దుకొనెను. అవి వానిని క్షేమముగా ఇల్లు చేర్చినవి.

పదములు.—అది — అవి — ఇది—ఇవి — సొంపు — సొగసు — ప్రేమ — ప్రీతి — మిట్టమధ్యాహ్నము — నడిరేయి — తీక్ష్ణము — తీవ్రము — చికిత్స — జత — దుక్కి — ధ్వని — గొంతు — దిక్కు — దిశ — వైపు — ప్రక్క — ఆనందము — సంతోషము — అలవి — సాధ్యము — క్షేమము.

నీతి. —దయయే ధర్మకారణము.

# 5. కోఁతి.

అదిగో ఆ చెట్టుమీఁద కూర్చుండియుండునది ఏజంతువు? దానిని తెప్పవాల్చక నిదానించి చూడుము! ఈవఱకు అట్టి జంతువును ఎక్కడనైనను చూచి ఉన్నావా? అదే కోఁతి. అది ఇప్పుడు కనులు విచ్చి చూచుచున్నది. పండ్లను ఇగిలించుచున్నది. అది నిన్ను చూచి వెక్కిరించుచున్నది. నిన్ను భయపఱుచుటకై ఉఱుగొట్టుచున్నది.

జంతువులన్నిటిలో కోఁతుల రూపము మాత్రము మనుష్యునివంటిది. దాని మొగమును నిదానించి చూడుము. ఇంచుమించుగ అద్ది మనుష్యుని ముఖమును పోలియున్నది. అయిన మనుష్యునికి లేక దీని కుండునది తోఁక యొకటి. దీని యొడలంతయు వెంద్రుకలుండును. ఇతర మృగములవలె దీనికి



నాలుగు కాళ్లు లేవు. మనుష్యులవలె కోతులకు రెండు చేతులు గలవు. దాని కాళ్లలోను చేతులవలె ఐదు వ్రేళ్లున్నవి. కాని కోతులకు కాలివ్రేళ్లకంటెఁ జేతివ్రేళ్లు పొడవు. అవి మనవలె రస్తాలలో నడునవు. అందుచే వాని పాదములు మన పాదములవలె గట్టిగాను లావుగాను ఉండవు. చేతులవలె పలచగా నుండును.

కోతులు విశేషముగా చెట్లపైననే వాసము చేయుచుండును. అవి ఒక కొమ్మనుండి మఱియొక కొమ్మకు సులభముగా భయములేక దుముకుచుండును. కొమ్మలను చేతితో గట్టిగా పట్టుకొనునట్లే కాళ్లతోను గట్టిగా పట్టుకొని వ్రేలాడుచుండును. ఒక కొమ్మనుండి మఱియొక కొమ్మకును, ఒక చెట్టునుండి మఱియొక చెట్టునకును అవలీలగా దుముకును.

కోఁతికి రెండు బుగ్గలందును సంచులున్నవి. నీవు ఆ సంచులను చూడుము! కోఁతికి ఏదైన తినుబండము దొరికి నట్లయిన దానిని రెండు సంచులయందును కూరుకొనును. తీరిక కలిగినప్పుడు దానిని కొంచెము కొంచెముగా నోటికి తెచ్చు కొని నమలి తినును.

కోఁతులకు శాఖామృగములు అని పేరు. చెట్ల కొమ్మలపై ఎప్పుడుండుటచే వానికి ఈ పేరు వచ్చినది. అవి చెట్లపై దొరకు కాయలు, పండ్లు, గింజలు, మున్నగువానిని తిని బ్రతుకుచుండును.

గడ్డ (దుంప) లనుగూడఁ దినుటగలదు. దానికి బియ్యము పెట్టిన అది ఎంత త్వరలో నోట పోసికొని బుగ్గల సంచులలో చేర్చికొనునో నిదానించి చూడుము. ఆవల వాని బుగ్గలను చూడుము. అవి ఉబ్బుకొని యుండును.

కోఁతికి మిక్కిలి దగ్గఱగా పోకుము. అట్లు పోయినట్టు లయిన అది నీ పైనిబడి కఱచును. ఏలన అది అడవి కోఁతి. పెంపుడు కోఁతి కాదు. కొన్ని కోఁతులను చిన్నప్పుడే పట్టి పెంచవచ్చును. అట్లైన అవి బాగుగ మచ్చికపడును. పిమ్మట అవి పైఁబడి కఱవవు. తమ్ము పెంచువారి వెంబడి అవి కుక్కల వలె పరుగెత్తి వచ్చును.

కోఁతులలో అనేక జాతులు గలవు. వానిలో కొన్నిటికి తోఁకలు లేవు. అవి మనలను పోలియుండును.

మనలో కొందఱు కోఁతులను పూజించు చున్నారు. వానికి ఏవిధమైన చెడుగును చేయరు. దేవాలయములలో హనుమంతుని (ఆంజనేయుని) విగ్రహమును పెట్టి పూజచేయు చున్నారు.

**పదములు.**—కోఁతి — కోఁతులు — శాఖామృగము — వానరము — ఇగిలించు — ఊఱుగోట్లు — వ్రేలు — వ్రేళ్లు — కొమ్మ—అవలీల—అవయవము—బొమ్మ—ప్రతిమ—విగ్రహము.

**డ్రాయింగు.**—కోఁతి చేయి

**బంకమట్టి పని.**—కోఁతి తల.

**ఒరవడి**—కోఁతి చేతి పూమాల; కోఁతి పుండు బ్రహ్మరాక్షసి.



# 6. కోఁతుల కథ.

కోఁతులను ఆడించువాఁడొకఁడు రెండు కోఁతులను ఒక మేఁకను పెంచు చుండెను. వానికి తిమ్మప్ప అని పేరు. వాఁడు వానిని చిన్నప్పటినుండి పెంచు చుండినందున వాఁడు చెప్పినట్లెంతయు చేయుటకు అవి నేర్చియుండెను. వాఁడు వానిని వెంటఁబెట్టుకొని ఊరూరు తిరిగి వేడుక చూపించి చాల ధనము సంపాదించెను.

వాఁడొకనాఁడు ఒంటిమిట్టయను గ్రామాధికారి యింట కోఁతులను ఆడించి బహుమానము పొంది, తిరిగివచ్చు మార్గముననుండిన యొక సత్రమున పండుకొని యుండెను. ఆ సత్రమున నుండిన యిద్దఱు బాటసారులకు వానియొద్ద ధన మున్న సంగతి తెలిసెను. మఱునాఁడు వేకువ తిమ్మప్ప మఱియొక యూరిలో కోఁతుల నాడించుటకై అడవిమార్గమున పోవుచుండెను. వాని యొద్దనుండు ద్రవ్యమును దోచుకొని పోవలయునని తలఁచి ఆ బాటసారులు ఇద్దఱును వానిని వెంబడించిరి. నట్టడవికి రాఁగానే వారు తిమ్మప్పను చంపి వానియొద్దనుండిన రూపాయలను, వస్త్రములను తీసికొని వానిని పాతిపెట్టి పాఱిపోయిరి.

వానిని చంపునప్పుడు కోఁతులు కీఁచుకీఁచుమని అఱచి పరుగెత్తి పోయినవి. తర్వాత దొంగలు మేఁకను మాత్రము తోలుకొనిపోయి ఊరుచేరిరి. వీరు చేసినదంతయును కోఁతులు దాఁగియుండి చూచు చుండినవి. పిమ్మట అవి ఒంటిమిట్టకుపోయి గ్రామాధికారి చేతినిపట్టి యీడ్చి కేకలు వేసినవి. తన యింట అంతకు ముందునాఁడు కోఁతుల నాడించువాని వెంటవచ్చిన కోఁతులని ఆ యధికారి గుర్తుపట్టెను. తమ వెంట రమ్మని అత నికి అనేకవిధముల సైగలచే అవి తెలిపెను. ఏమో జరిగియుండ వచ్చునని తలఁచి ఆ గ్రామాధికారి వానిని వెంబడించెను. అడ వినిచేరిన వెంటనే అచ్చట నుండిననెత్తురును తడిమిట్టని ఎత్తి కోతులు చూపెను. కోఁతుల నాడించువానిని ఎవరో చంపి యుండవచ్చునని అతనికి అప్పుడు తోఁచెను.

పిదప కోఁతులు వానిని సత్రమునకు తీసికొనిపోయి ఆ దొంగల కాళ్లను పట్టుకొనినవి. ఆ గ్రామాధికారి జరిగిన సమా చారమునంతయు నూహించి తెలిసికొని ఆ యిద్దఱని విచారించి వారికి దండన విధించెను. అప్పటినుండియు ఆ రెండు కోఁతు లును ఒంటిమిట్ట అధికారి యింటను రామస్వామి గుడిలోను సుఖముగ వసించు చుండినవి. తిమ్మప్ప మేకయు గ్రామాధికారి యింటనే పెరుగుచుండెను.

పదములు.—మార్గము—దోవ—త్రోవ—దారి—ధనము—ద్రవ్య ము — సొత్తు—సత్రము — బాటసారి — ప్రయాణి కుఁడు — ఊరు — గ్రామము — దొంగలు — సైగ— గుర్తు — నెత్తురు — రక్తము.

నీతి — పేరాస పెద్ద దుఃఖము. పరులసొమ్ము కోరవలదు



# 7. వేఁపచెట్టు.

వేఁపచెట్టు మన దేశములోనుండు పెద్ద చెట్లలో ఒకటి. అది నాటిన కొన్ని సంవత్సరములలోనే పెద్దదిగ పెరుఁగును. వేఁపచెట్లు మొలచియుండు చోట నేల త్రవ్విన వాని వ్రేళ్లు కనఁబడును. ఇవి నేలలో పూడిపోయి యుండును. చెట్లు పెరుఁగుకొలఁదియు వ్రేళ్లును నేలలో పెరుఁగు చుండును. వ్రేళ్లను నఱికివేసిన చెట్లు బ్రతుకవు. అదియుఁగాక చెట్లు బ్రతుకుటకు నీరు కావలయును. మనము నీళ్లు పోయకనే చాలఁ జెట్లు బ్రతుకు చున్నవి. అది యెట్లు? నేలలో నీరున్నది. నేలను త్రవ్విన తడిమట్టి వచ్చును. నీళ్లుండుటచే నేల తడిగా నుండును. ఈ నీటిని చెట్లు వ్రేళ్లమూలముగా పీల్చుకొనును.

చెట్టు అడుగుభాగమును చక్కఁగ చూడుము. చెట్టు పెద్దదగుకొలఁది ఈ యడుగుభాగము పొడవుగాను, లావుగాను పెరుఁగును. ఈ భాగమునకు మొదలు (మొక్క, బోదె) అని పేరు. వేరునుండి ఇదియే మొదట పుట్టినది. కొన్ని సంవత్సరముల వఱకు ఇది సన్నని కొమ్మవలె ఉండును. ఈ మొక్క పైభాగమున పట్ట (పై పొర) యున్నది. వేఁపచెట్టు పట్టను చక్కఁగా చూడుము. ఇది ఎట్లున్నదో చెప్పఁగలవా? ఈ పొర దానికి మన దేహమునకు ఉండు పై చర్మమువంటిది. అయిన వేఁపపొర ఎంత దళసరియో చూడు. అది పగిలియున్నది. అప్పుడప్పుడు అది రాలిపోవును. ఈ అడుగు మ్రానునుండి కొమ్మలు చీలి నలు వైపుల వ్యాపించియుండును. ఈ కొమ్మలు మొదలుకంటె సన్నగ నున్నవి. ఒక్కొక్క కొమ్మనుండి పెక్కు చిన్న కొమ్మలు పుట్టి

నలువైపుల వ్యాపించియున్నవి. ఈ కొమ్మలలో ఆకులు, పువ్వులు మొగ్గలు, కాయలు, పండ్లును గలవు.

వేఁపాకు చాల చిన్నది. ఆకు పచ్చగనుండును. కొన్నాళ్లకు ఇది పండి ఆవల రాలిపోవును. వేఁపాకును మనము అనేక విధములుగా ఉపయోగించుచున్నాము. వేఁపాకు తోరణము గుచ్చి అమ్మవారు (స్ఫోటకము) మొదలగు వ్యాధులుండు ఇండ్లవాకిట కట్టుదురు. ఆ యాకును నూఱి అమ్మవారు పోసినవాని దేహమునకు పూయుట నీవు చూచియుండలేదా? కాఁబట్టి వేఁపచెట్లు విశేషముగనుండు ఊళ్లయందు జనులు సౌఖ్యముగ నుందు రని చెప్పుట కలదు. నీ తల్లి నీకు వేఁపాకు ఉండలు ఇచ్చుట లేదా? వేఁపాకు ఉండ లనిన ఏమో నీకు తెలియునా? వేఁపాకును, ఉప్పును, మిరియములును కలిపి నూఱుదురు. అది తినుట కష్టముగనుండును. అయిన అది దేహమునకు చాల మేలు కలిగించును. వేఁపపుల్ల (పుడక) ను విఱిచి పండ్లు తోము కొనుటను నీవు చూడలేదా?

వేఁపపువ్వు తెల్లగనుండును. అది మంచి వాసనగలది. దానిని బెల్లముతోను, మామిడికాయతోను చేర్చి పచ్చడి చేయుదురు. దానిని సంవత్సరాదిపండుగదినమున ముందుగ భుజింతురు. పువ్వును ఎండఁబెట్టి పలువిధముల నుపయోగింతురు

వేఁపకాయను చూడుము. ఇది ఎంత నునుపుగా నున్నది! ఇది పండిన పసుపువర్ణముగ మాఱును. కొందఱు పండ్లను తిందురు. ఈ పండ్లలోని విత్తనములను (గింజలను) ఎండఁబెట్టి నూనె తీయుదురు. ఈ నూనె మిగుల చేదు; వాసనగా నుండును. దీనిని బీదవాండ్రు దీపముల కుపయోగింతురు. ఇది గాయమును శీఘ్రముగ మాన్పును.

వేఁపచెట్ల పెద్ద కొమ్మలను, బోదెను, ఇండ్లు కట్టుటకు ఉప యోగించుచున్నాము. బోదె మిగుల గట్టిది. దీనిని పలక (బల్ల) లుగకూడఁ గోయుట కలదు. వేప వేరును చాల నుపయోగ మైనదే. చక్కఁగా ముదిరిన వేరును నూఱిన గంధమగును వేఁపచెట్లను ఇంకను అనేకవిధములుగ మనము ఉపయోగించు చున్నాము.

పదములు వేఁప—వేము—వేరు—మూలము—కొమ్మ—శాఖ—
తేమ—తడి—నీరు—నీళ్లు—పొర—చర్మము—పలక

డ్రాయింగు —వేఁపాకు

ఒరవడి - తినఁగ తినఁగ వేము తియ్యనుండు.



# 8. గాలి తన్ను గుఱించి చెప్పిన కథ.

మీరందఱు చక్కఁగా నా కథను వినుఁడీ! మీరు నన్నెఱుఁగుదురా? మీరు నన్నెఱిఁగియుండిన నన్ను నిదానించి చూడుఁడు. నన్ను కనిపెట్ట మీకు సాధ్యముకాదు. మీ రెవ్వరును నన్ను చూడలేరు. మీ కంటికి నే నగపడను. అయిన నే నున్నా నని మాత్రము మీకు ప్రతినిమిషమును తెలియపఱచుచున్నాను అదియే నా శక్తి. కొన్ని సమయములలో నేను వీధులలో మిక్కిలి వేగముగ పరుగెత్తి ఇంటి తలుపులనుగూడ ఆడింతును, చెట్టు కొమ్మలను కదలింతును; వీధిలో నడచువారి కండ్లలో దుమ్ము చల్లి కండ్లు మూసికొనునట్లు చేయుదును. వారి తలలపై నుండు టోపీ మొదలగువానిని క్రింద త్రోయుదును. నే నిట్లు చేయుటచేత మీరు నన్ను తుంటరి యని యెంచెదరు.

అయిన మీకు నేను చేయు నుపకారమును చెప్పెదను వినుఁడు. నేను లేకున్న మీరెవ్వరును బ్రతికియుండఁజాలరు. త్రాగుటకు మీరు మంచినీటిని ఉపయోగింపవలసినట్లే నేను శుభ్రముగా నుండినఁగాని మీకు సుఖములేదు. మీ యింటి లోను, నీటి దగ్గఱను, పెంట, జలదారినీరు, మురిగిపోయిన వస్తువులు మొదలయినవానిని చేర్చి (పోగు) పెట్టిన నేను చెడ్డవాఁడ నగుదును. అప్పుడు నన్ను పీల్చిన మీకు రోగము వచ్చును. నన్ను శుభ్రముగా నుంచుకొన్న మీకు ఏవిధమైన రోగమును అంటదు. మీ రిల్లుకట్టునప్పుడు నేను వచ్చుచు పోవు చుండుటకు పెద్ద కిటికీలు పెట్టవలయును. అట్టి కిటికీలు లేకున్న మీకు చెఱుపు కలుగును. నేను చొరని చోటు లేదు. నన్ను కావలయునని యెవరైన ఒక చోటినుండి తెరపివేసిన నచట ఒక ప్రాణియు జీవింప నేరదు. దీపము వెలుగదు. నీవు నీళ్లలో ఐదు నిమిషములు మునిఁగి యుండఁగలవా? అది నీచేత కాదు. ఏలయన నేను అచ్చట ఎక్కువగ నుండను. మీరు మబ్బును చూచియున్నారు గదా? ఆకాశమున దానిని చూడుడు. అది ఒకచోటనుండి మఱియొకచోటునకు పోవు చుండును. నేనే దానిని పోవునట్లు చేయుదును. మబ్బువలన వాన మీకుఁ గలుగుటకు కారణమును నేనే. నేను లేకున్న పైరుపచ్చలు బ్రతుకచాలవు. నిప్పు నావల్లనే మండును. దీపమును ఆర్పునదియు నేనే. నా పేరే గాలి.

పదములు.—నీటియావిరి — ఎఱుఁగుట — నిదానించి చూచుట — సంచరించుట—ఆడించుట— శ్వాసించుట—దుమ్ము —జీవప్రాణులు—పోకిరి —యంత్రములు — కిటికీలు — గవాక్షములు.

ఒరవడి. — గాలి వీచునపుడే తూర్పారఁ బట్టవలయును.



# 9. మన చక్రవర్తి.

[మాధవుఁడు, వాని తండ్రి సాంబశివయ్య ప్రవేశించు చున్నారు.]

మాధవుఁడు.—నాయనా! నేఁడు మన చక్రవర్తిగారు పుట్టినదిన మఁట.

సాంబశివయ్య.—మీ యుపాధ్యాయులు నిన్ను ఈ దినము బడికి రమ్మని చెప్పలేదా?

మాధ.—నే బడికి పోవలెను. తెల్లవాఱి స్నానము చేసి శుభ్రమైన గుడ్డలు కట్టుకొని, పట్టు చొక్కా వేసికొని పిల్లల నందఱిని బడికి రమ్మన్నారు. మాకందఱికి పప్పుబెల్లము, కలకండ (కండచక్కెర), అరఁటిపండ్లు, మిఠాయి ఇచ్చెదరఁట.

సాంబ.—నీవు ఈ రోజు బడికి పోయి ఏమి చేయుదువు?

మాధ.—మమ్ములనందఱిని వరుసగొత్తించెదరట. చెండాట (బంతి ఆట) ఆడవలయునట. బడిలో అంతటను మామిడాకు తోరణములు కట్టియున్నారు. వాకిట అరటిస్తంభములు కట్టియున్నారు. పెద్ద జండాలు బడికి ఎదురుగా వ్రేలాడఁ గట్టియున్నారు. నాకు వేళ అయినది, నేను పోవలయును.

సాంబ.—ఇంకను ఎనిమిది గంటలు కాలేదు. పోవచ్చును ఉండు. ఈ వేడుకలు ఈ అలంకారములు దేనికొఱకో నీకు తెలియునా?

మాధ.—మన చక్రవర్తిగారు పుట్టినదినమఁట.

సాంబ.—మన చక్రవర్తిగారి పేరేమి?

మాధ.—వారి పటమునకు ఈ దినము ఊరేఁగింపు.

సాంబ.—ఊరేఁగింపు సరే, వారి పేరు చెప్పుము.

మాధ.—పేరు నాకు తెలియదు. మా అయ్యవారు (పంతులవారు) చెప్పలేదు.

సాంబ.—వారు ఈ దినము తప్పక చెప్పుదురు. నేను చెప్పెద, వినుము. వారి పేరు జార్జి చక్రవర్తి.

మాధ.—మన రాజుపేరు జార్జి అని నాకు తెలియును. జార్జి చక్రవర్తి అంటేవే అదెవరు?

సాంబ.—వారే వారు. వారికే అయిదవ జార్జి చక్రవర్తి అని పేరు.

మాధ.—మన రాజుగారి బొమ్మ క్రొత్త రూపాయపై వేసియున్నది అంతే నాకు తెలియును. చక్రవర్తి అనగా నేమి?

సాంబ.—వీరు మన దేశమును పాలించుచున్నారు. ఇంకను ఈలాటి పెద్దదేశములను వీరు పాలించుచున్నారు. ఇట్లు పెక్కుదేశముల పాలించువారికి చక్రవర్తియని పేరు. అందుచేతనే మన రాజుగారికి జార్జి చక్రవర్తి అని పేరు. జార్జి అను పేరు కలవారు నలుగురు ఇప్పటికి రాజ్యము చేసిరి. అందువలననే వీరికి అయిదవ జార్జి చక్రవర్తి అని పేరు, బిరుదు వచ్చెను.

మాధ.—అయిన వారు మా బడికి ఈ దినము వచ్చెదరా? నాయనా, వారిని నీవు చూచి యున్నావా?

సాంబ.—రారు. రారు. వారు మన ఊరిలో లేరు.

మాధ.—అయితే వారెక్కడ ఉన్నారు?

సాంబ.—వారు ఇంగ్లాండుదేశమున ఉన్నారు. ఆ దేశము ఇచ్చటికి చాల దూరమున ఉన్నది. మన దేశమునకు ఇండియాదేశమని పేరు. హిందూదేశమని దీనికి మఱియొక పేరు.

మాధ.—అయితే వారు ఈ దేశమునకు వచ్చుటలేదా?

సాంబ.—రెండు పర్యాయములు వచ్చియున్నారు. విశ్వావసునామ (1906-వ) సంవత్సరమున వీరి తండ్రి రాజ్యము చేయు చుండినప్పుడు వీరు యువరాజుగ నుండిరి అప్పుడు ఒక పర్యాయము వీరి తండ్రి వీరిని మన దేశమునకు పంపిరి. పిదప వీరి తండ్రి సాధారణనామ

(1910-వ) సంవత్సరమున కాలముచేసిరి. అటువెనుక వీరు రాజ్యమునకు వచ్చిరి. తర్వాత ఒక పర్యాయము వీరు మన దేశమునకు వచ్చియుండిరి. అప్పుడు మన దేశమునకు ముఖ్య పట్టణమైన ఢిల్లీలో దర్బారు జరపిరి. ఢిల్లీ గొప్ప పట్టణము. అచ్చట విరోధికృత్ నామసంవత్సర మార్గశీర్షమాసములో (1911-వ సంవత్సరము డిసెంబరు నెల) తాము పట్టము కట్టుకొంటిమనియు, సింహాసనము నెక్కితిమనియు మనకందఱికి వెల్లడిచేసిరి. అచ్చటచ్చట రాజ్యము చేయు మహారాజులును, సర్కారులో గొప్ప నౌకరులును ఇంకను పలువురు పెద్దమనుష్యులును ఢిల్లీ పట్టణములో చేరి గొప్ప వేడుకలు జరిపించిరి. దీనికే ఢిల్లీదర్బారు అని పేరు.

మాధ.—అయితే వీరు పుట్టినదిన మంటివే, వీరు ఎప్పుడు పుట్టిరి?

సాంబ.—నేటిదినము జూను నెల 3-వ తేది. వీరు 1865-వ సంవత్సరము జూను నెల 3-వ తేదీని పుట్టిరి. ఇప్పుడు వీరి వయస్సెంతో చెప్పఁగలవా?

మాధ.—రాజునకు పుట్టినదినమైనచో మనకేమి?

సాంబ.—మనల నందఱిని కాపాడువారు ఈ చక్రవర్తిగారే. నీకును, నాకును, ఇంకను మన దేశములో నుండువారికిని వీరు తండ్రివంటివారు. మన దేశపు జనులయందు వీరికి విశేష ప్రీతి. ఆ ప్రీతి వేయి విధములుగ వీరు తెలియఁబఱచియున్నారు. మనమందఱము క్షేమము గానుండి సుఖముగ బ్రతికియుండవలెననియే వీరు ఎప్పుడును కోరుచున్నారు. మనకేదైన ఆపద వచ్చిన వీరు

చాలఁ జింతింతురు. మనకు వీరు చేయు ఉపకార
మునకై వీరియందు మనకు భక్తియు, ప్రేమయు,
విశ్వాసమును ఉండవలయును.

మాధ.—మన రాణిగారి పేరేమి?

సాంబ.—ఆమె పేరు మేరీ రాణిగారు. ఆమె మనకు చక్రవర్తిని.
ఆమె మన చక్రవర్తి భార్య.

మాధ.—వీరికి పిల్లలు ఉన్నారా?

సాంబ.—వీరికి అయిదుగురు కుమారులును, ఒక కుమార్తెయు
కలరు. వీరిలో పెద్దవారు మన కిప్పుడు యువరాజు
గారు. వీరికి ప్రిన్స్-ఆఫ్-వేల్సు అను బిరుదు. వీరు



1894-వ సంవత్సరము జూన్ నెల 23-వ తేదీని పుట్టిరి.
ఇట్లే ఇంగ్లాండురాజు పెద్దకుమారుని ప్రిన్స్-ఆఫ్-వేల్సు
అని పిలతురు.

మాధ.—మా బడియందు ఒక పెద్ద పటము పెట్టియున్నారు. దానిపై పూలదండలు వేసి అలంకరించియున్నారు. దానికి ఈ దినము సాయంకాలము ఊరేగింపు జరుగును. అదిగో మన యింటిలోను ఆ మాదిరి పటమున్నది. మన రాజుగారు ఇచ్చటికి రారు. అందుచే వారి రూపమును చూపు పటమునకు అలంకారము చేసి దానికి ఉత్సవము జరిపించెదము. మన రాజుగారు చిరంజీవిగ నుండవలెనని మనము దేవుని ప్రార్థింపవలెను. నాకు అయ్యవారు (పంతులవారు) ఒక పాట నేర్పియున్నారు. దానిని ఈ దినము పాడెదను. బడికి వేళ అయినది. నేను పోవలెను.

పదములు.—చక్రవర్తి — చక్రవర్తిని — పట్టము — సింహాసనము — జండా — తోరణము — స్తంభము — పర్యాయము — తడవ — ముఖ్యపట్టణము — రాజు — మహారాజు — దర్బారు — రాజభక్తి — విశ్వాసము.

ఒగవడి రాజునందు భక్తియుంచు.



# 10. కూరగాయలంగడి.

[రమణుఁడును, అతని తాతయు ప్రవేశించుచున్నారు.]

తాత.—నాయనా! రమణా! నేడు ఆదివారము కదా. మీకు బడి లేదు. అంగడికి పోయెదము వచ్చెదవా?

రమణుఁడు.—తాతా! ఇదిగో వచ్చితిని. పైన అంగవస్త్రము వేసికొని వచ్చెదను.

తా.— రమణా! మెల్లగా నడువుము. నేను ముసలివాఁడను కదా?

ర.— తాతా! యీ వీధి పేరేమి?

తా.— ఇదియే రాజవీధి. చూడుము ఎంత విశాలముగా నున్నదో? ఈ వీధికి రెండుప్రక్కల కొబ్బరి (టెంకాయ) చెట్లు ఉన్నవి. చక్కని మేడలున్నవి చూచితివా? అవి ఎంత అందముగా నున్నవి! ఈ యిండ్లయందు సర్కారు ఉద్యోగస్థులును, ప్లీడర్లును, వర్తకులు మొదలగు ధనవంతులు నివసించుచున్నారు.

ర.— తాతా! అది యేల అక్కడ జనులు గుంపుగూడి యున్నారు?

తా.—అదియే కూరగాయల అంగడి. మనవలెనే వారందఱు కూరగాయలఁ గొనుటకు వచ్చియున్నారు.

ర.— ఇదియా అంగడి. ఇదిగో అరఁటియాకులు, అరఁటి కాయలను అమ్ముచున్నారు. తాతా! నాకు అరఁటి పండ్లను కొని పెట్టవా? అవి యేమి? ఎందుకు ఇక్కడ అమ్ముచున్నారు?

తా.—అవి అరఁటిపువ్వులు. అరఁటిపువ్వునుకూడ కూరకు ఉపయోగించుచున్నాము. ఇవిగో కాఁకర కాయలు. ఆ గంపలో నుండునవియు కాఁకరకాయలే ఇవి పొట్టి కాఁకరకాయలు. అవి పెద్దకాఁకరకాయలు. కాఁకర కాయలు పందిళ్లపై నల్లుకొనియుండు తీఁగలలోఁ గాచును. పొట్టికాఁకరకాయలు గుండ్రముగ నున్నవి చూచితివా? పెద్దకాఁకరకాయలు నిడుపుగ నుండును. కాఁకరకాయల పైభాగము నునుపుగ నుండక గఱు

కుగనుండును. పచ్చికాయలు తినుటకు ఎక్కువచేఁదు. పండిన తరువాత అంత చేఁదుండదు.

రమ. — తాతా! అట్లయిన నివి మనకు వలదు.

తాత.—బెండకాయల తూఁచుచున్నారు. అవిగో! వానిని కొనుదము. ఆ బెండకాయలను తాఁకి చూడుము.

రమ. — తాతా! పైన ముళ్లుముళ్లుగా నున్నవే. బెండకాయలలోఁకూడ రెండు విధములున్నవా? నాఁడు నీవు తెచ్చిన కాయలు నూఁగులేక నునుపుగ నుండినవే?

తాత.—అవును. నూఁగుబెండ, పాలబెండ, అని బెండకాయలు రెండు విధములు. ఒక బెండకాయను విఱిచి దాని యందు గుండ్రముగనుండు గింజలను చూడుము. కొనను విఱిచి చూడుము.

రమ. — తాతా! ఈ బెండకాయ విఱుగలేదు? ఏమి?

తాత —అది ముదురుగాయ. మనకవి వలదు. లేఁతకాయలను తీసికొందము రమ్ము.

రమ. — తాతా! ఇక్కడ వంకాయలు గంపలనిండుగఁ బెట్టియున్నారు.

తాత. — ఆ వంకాయలకును, మఱియొక గంపలోనివానికిని ఎంత భేదమున్నదో చూడుము. వంకాయలలో ననేక రకములు కలవు. కొన్ని పొడవయినవి; కొన్ని పొట్టివి; మఱికొన్ని లావుగా గుండ్రముగా నున్నవి. రంగులోను భేదముకలదు. కొన్ని నల్లవి. కొన్ని తెల్లవి. కొన్ని ఆకుపచ్చవి. లేఁతవంకాయలివిగో? వీనిని తీసికొని యింటికి పోవుదము రమ్ము.

కములు.—భేదము — వర్ణము — రంగు — మేడలు — విశాలము — రాజవీధి — అంగవస్త్రము — కూరగాయలు — కాకరకాయలు — బెండకాయలు — ఉద్యోగస్థులు —వకీళ్లు — ప్లీడర్లు — ధనవంతులు — సాహుకార్లు.

డ్రాయింగు.—కాకరకాయ.

బంకమట్టి పని.—బెండకాయ.

రవడి.—చిత్తశుద్ధి గలిగియుండు.



# 11. కూరగాయలంగడి.

## రెండవ భాగము.

మణుఁడును, అతని తాతయు మరుసటి యుదయమున అంగడికి పోవుచుండిరి. అట్లు పోవునపుడు రమణుఁడు వంకాయలగంపను తలపైన ఎత్తుకొనిపోవు ఆఁడువారినిఁ జూచి, తాతా! ఈ గంపలను ఎక్కడికి తీసికొనిపోవుచున్నారు? అని అడిగెను.

తాత.—కూరగాయలమ్ము అంగడికి తీసికొనిపోవుచున్నారు.

ను.— వీరెక్కడినుండి తెచ్చుచున్నారు?

తాత.—కూరగాయలను తోఁటలలోను, యిండ్ల పెరడులలోను పైరుపెట్టుదురు. విత్తనముల నాటి, నీరుపోసి, వంగచెట్లు బెండచెట్లు కాఁకరతీఁగ మొదలగువానిని పెంచుదురు. ఈ చెట్లను ప్రతి సంవత్సరమును వేయుచుండవలయును. వీనిని నీరుపోసి బహు జాగ్రత్తతో పెంచుచుండవలయును. ఈ చెట్లలో కాయు కాయలను తోటవారు అంగడికి తీసికొనివచ్చి అమ్ముకొందురు.

రమ.—నేను వంగచెట్టును చూచియున్నాను. అది మన దొడ్డిలో పెరుగుచున్నది. బెండచెట్టును నే నెప్పుడును చూడలేదు.

తాత.—నేను ఇంటికిఁ బోవునపుడు తోఁటలోఁ జూపెదను. అది సన్నగాను పొడుగుగాను పెరుఁగుచుండును. కొన్ని చెట్లు నాయంత యెత్తు పెరుగును.

రమ.— బెండచెట్లలో పూవులు పూచునా?

తాత.—పూలు లేక ఏ కాయయును కాయదు.

రమ.— తాతా! అవి యేమి కాయలు? నాయంత పొడవున నున్నవి.

తాత.—అవి పొట్లకాయలు. ఎంత నున్నగ నున్నవో చూచితివా?

రమ.— కాయలపై ఏల సున్నము పూసియున్నారు.

తాత.—నాయనా! అవి సున్నపుచారలు కావు. పుట్టుకయందే అవి యట్లుండును. ఈ కాయలలో కొన్ని పొట్టి కాయలును కలవు. ఇదియు కాఁకరకాయలవలెనే తీఁగలలోఁ గాచును. దీని పువ్వు తెల్లగ నుండును.

రమ.— ఇవి యేమి కాయలు తాతా!

తాత.—ఇవి గోరుచిక్కుడుకాయలు. ఇవి వంకాయలవలె చిన్నచెట్లలోఁ గాచును.

రమ.— తాతా! మాయమ్మ చిక్కుడుగాయలు తెమ్మనెను. నిన్న వండినపుడు అవి చాల రుచిగనుండెను. అవి యివిగావే?

తాత. — చిక్కుడుకాయలకును గోరుచిక్కుడుకాయలకును భేదము గలదు. అవిగో చిక్కుడుకాయలు. అవి తీఁగలలో కాచును. వీనిలో ఎన్ని రకముల కాయలున్నవో చూడుము. అరవీసెకాయలు తీసికొనిపోవుదము.

ఇదిగో అంగడివాఁడు తూఁచుచున్నాఁడు చూడుము. ఇది అరవీసె గుండు. ఒకవైపు తట్టయందుఁ (సిబ్బిలో; పళ్లెములో) గుండు వేసియున్నాఁడు. మఱియొకవైపు తట్ట (సిబ్బిలో) యందు కాయలను పెట్టియున్నాఁడు. ఈ రెండు తట్టలు (పళ్లెములు) ను సమముగ తూఁగవలయును. గుండును కాయలను వేయుటకు ముందు తక్కెడ నెత్తిన ఈ రెండు తట్టలు సమముగ నుండవలయును. తట్టలు వ్రేలాడగట్టియుండు కొయ్యకు సన్నని త్రాడు కట్టియున్నది చూడుము. అది నట్టనడుమ నుండవలెను.

ు.— తాతా! అరవీసె అని యంటివే. ఎన్ని పలములు?

త.—వీసెకు ఎన్ని పలములయినవి నీకు తెలియదా?

ు.— వీసెకు నలుబది పలములని మా అయ్యవారు చెప్పియున్నారు.

త.—అట్లయిన అరవీసెకు ఎన్ని పలములు? నలుబదిలో సగమెంత?

.— ఇరువది. కూరగాయలను మానికతోఁగాని సేరుతోఁగాని పడితోఁగాని కొలుచుటలేదా?

త.—అట్లు కొలుచుట వాడుకలేదు.

.— తాతా! ఇది యేమి ఈ గంపలు?

త.—ఇదిగో, యిది కందగడ్డ; ఇది చేమగడ్డ; ఇది ఉరలగడ్డ (బంగాళాదుంప) గెనుసుగడ్డ (ఎఱ్ఱదుంప) లివిగో.

— కూరగాయలకును వీటికిని భేదమేమి?

త.—అవి కాయలు. ఇవి గడ్డలు (దుంపలు). కాయలు తీగలయందును చెట్లయందును కాచిన నివి భూమిలో వేరులవలన మొలచును.

రమ.— గనసుగడ్డలు నాకు చాల యిష్టము. అవి తియ్యగా నుండును. ఒక వీసె గడ్డలు తీసికొనిపోదము.

తాత.—అవి దేహమునకు ఆరోగ్యమైనవి కావు. పోదము రమ్ము.

రమ.—మఱచితిని. మా యమ్మ పచ్చిమిరపకాయలు, అల్లము, కరేపాకు (కఱివేఁపాకు), కొత్తిమిరి, నిమ్మపండ్లను తీసికొని రమ్మనెను. అవి యెక్కడ ఉన్నవి?

తాత.—అదిగో అమ్ముచున్నారు. అచ్చటికిఁ బోయి కొనెదము రమ్ము.

**పదములు.**—తోట— పెరడు —వీసెగుండు —త్రాసు—చిక్కుడు కాయలు — కాఁకరకాయలు — పొట్లకాయలు — బెండకాయలు — గోరుచిక్కుడుకాయలు — ఉరల గడ్డలు —కందగడ్డ— చేమగడ్డ — పలములు — పడి — మానిక — శేరు.

**డ్రాయింగ్.**—పొట్లకాయ.

**బంకమట్టి పని.** —గనసుగడ్డ

**ఒరవడి** – కాకరకాయ చేదు.

# 12. గేదెలు.

ఇదిగో ఎదుటి పుటలోని బొమ్మయందు చెఱువొకటి యున్నది చూడుము. ఈ చెఱువునిండ నీళ్లున్నవి. చెఱువుగట్టు దగ్గఱ నీరు తొడలోఁతు. గట్టుపైన ఒక మనుష్యుఁడును ఇద్దఱు పిల్లవాండ్రును నిలబడియున్నారు చూడుము. వారేమి చేయుచున్నారు చెప్పుము? వారు కొన్ని గేదెలను నీళ్లలోనికి తోలికని పెట్టియున్నారు.



గేదెలను నీవు చూచియున్నావా? వానిని బఱ్ఱెలని చెప్పుదురు. వీని ఆకారము దేనిని పోలియున్నది? వీని కొమ్ములు చాల పొడవయినవి. కాళ్లు పొట్టిగను బలము కలిగినవిగను ఉండును. వీని చర్మము నల్లగనుండి దళసరిగనుండును.

గేదెలను ప్రతిదినమును కడుగవలెను. అవి మడ్డిజంతువులు. నీళ్లు లేనియెడల అవి పందులవలె బురదలోపడి పొర్లాడును. వానికి చెమ్మనేల చాల యిష్టము. నీళ్లు దొరకనియెడల వానికి రోగము వచ్చును. ఈ పటములోని బాలురిద్దఱు గేదెలను కడుగుటకును, నీరు త్రాగించుటకును, ప్రతిదినము ఇక్కడికి తోలుకొని వత్తురు. ఒక బఱ్ఱె లేచి నిలుచున్నది చూడుము. మిగిలిన బఱ్ఱెలు తమ వీఁపులు మునుఁగునట్లుగా నీటిలో పండుకొనియున్నవి.

గేదెలు దుబ్బుల (పచ్చిక) ను, గడ్డిని తినును. పచ్చిగడ్డి

యందు వీనికి చాల ప్రీతి. ధాన్యపుగింజలన్ను, తవుడును, ఉలవలను, తెలికపిండిని తినును. గేదెలకు కుడితినీటియందు చాల యిష్టము. ఈ కుడితినీటితో తవుడు కలపి వానికిఁ బెట్టుదురు.

గేదెలు మనకు చాల ఉపయోగమైన జంతువులు. అవి మెండుగ పాలు ఇచ్చును. ఆవులకన్న బఱ్ఱెలు ఎక్కువ పాలు ఇచ్చును. ఆవుపాలకన్న బఱ్ఱెపాలు చిక్కగా నుండును. అయితే బఱ్ఱెపాలు ఆవుపాలవలె మంచివి కావు. ఆవుపాలలోకన్న బఱ్ఱె పాఁడినలన ఎక్కువ వెన్న దొరకును. వెన్నను నీవు చూచియున్నావా? వెన్నను కాచి నేయి చేయుదురు. మనము వాడెడు నెయ్యి విశేషముగా బఱ్ఱె నెయ్యి.

ఎద్దు మెండుగా దొరకని కొన్ని యూళ్లయందు దున్నపోతులనే నాఁగళ్లకుకట్టి దున్నుదురు. నేల తడిగానుండు భూమిని దున్నపోతులు చక్కగా దున్నును. ఇవి ఎడ్లకన్న నెక్కువ బలముకలవి. బండ్లను లాగుటకుకూడ దున్నపోతు లుపయోగమగుచున్నవి. ఎద్దులు లాగలేని బండ్లను దున్నపోతులు సులభముగా లాగును. అవి మిగుల నెమ్మదిగా నడచును. కొన్ని దేశములయందు దున్నపోతులకు ముక్కుత్రాళ్లు కట్టుదురు. తోలు (చర్మము) దళసరిగనుండుటచే కఱ్ఱతో కొట్టినను వానికి నొప్పి తెలియదు. కాబట్టి కొయ్యకు ఇనుపముల్లును గ్రుచ్చి యా ముల్లుకఱ్ఱతో పొడిచెదరు. ఇది చాల క్రూరమయినది.

గేదెలలో అనేక జాతులున్నవి. కొన్ని అడవులలో తిరుగుచు భయము కలిగించుచుండును. ఇట్టి జంతువులు మన జిల్లాలలో సాధారణముగ లేవు. కొన్ని జిల్లాలలో అడవిప్రాంతములయందున్నవి.

పదములు.—చెఱువు — గుంట — కొలను — మనుష్యుఁడు — గేదెలు — ఎనుములు — బఱ్ఱెలు — దున్నపోతులు — మడ్డిమృగము — నాఁగళ్లు — దుబ్బులు — తెలికపిండి — ముల్లుకఱ్ఱ — ముక్కుత్రాడు — క్రూరము — వెన్న — జున్ను — మీఁగడ.

ఈ పాఠమందలి పటమునుగూర్చి ఆరు ప్రశ్నలను అడుగుము.

ఒరవడి.—దున్నపోతు యముని వాహనము.



# 13. తపాలావాఁడు.

[జోగయ్యయు లక్ష్మయ్యయు వారి తల్లి విశాలాక్షమ్మయు ప్రవేశించుచున్నారు.]

జో.—అమ్మా! ఇదిగో తపాలావాఁడు వచ్చియున్నాఁడు. అతఁడు ఒక యుత్తరమును తెచ్చియున్నాఁడు.

విశా.—ఆ యుత్తరము నా పేరనా వచ్చియున్నది?

తపాలావాఁడు.—విశాలాక్షమ్మగారు మీరేనా?

విశా.—అవును నేనే. నాయనా! జోగయ్యా! ఈ ఉత్తరము పైవిలాసము చదువుము.

జో.—(తపాలావానియొద్దనుండి యుత్తరము తీసికొని పైవిలాసము చదువును.)

"ఈ జాబు విజయనగరము కోటరోడ్డు
సంస్కృతపాఠశాలకు ఎదురుగనుండు
చిరంజీవిని ముంగమూరి విశాలాక్షమ్మకు ఇచ్చేది."

"రవానా"

"విజయనగరము."

విశా.—ఆ జాబు నాదే. నాయనా! లక్ష్మయ్యా! మీ నాయన గారియొద్దనుండి ఈ జాబు వచ్చినది. వచ్చి చదువుము.

జో.—అన్నా! లక్ష్మయ్యా! ఈ జాబు ఎచ్చటనుండి వచ్చినది? నాయనగారు ఎక్కడ ఉన్నారు?

లక్ష్మ—వారు రామేశ్వరములో ఉన్నారు. అచ్చటినుండి జాబు వ్రాసియున్నారు.

జో.—ఈ తపాలావాఁడు రామేశ్వరమునుండి వచ్చుచున్నాఁడా?

లక్ష్మ.—లేదు, లేదు. వానికి మన యూరి తపాలాఫీసులో పని నాయనగారు ఈ యుత్తరమును వ్రాసి కవరులో పెట్టి పిదప దానికి పైవిలాసము వ్రాసి అర్ధణాబిళ్ల నంటించి తపాలాపెట్టెలో వేసినారు. ఆ యూరిలో నుండు తపాలాఫీసువారు ఈ జాబును ఇతర జాబులతో మూట కట్టి రైలుబండిలో మన యూరి కంపియున్నారు. ఆ అర్ధణాబిళ్లపై ముద్రఁ జూడుము. ఇంగ్లీషులో రామే శ్వరము అని వేసి ఉన్నది. దానిచే నీ జాబును ఆ యూరి తపాలాపెట్టెలో వేసిరని మనము తెలిసికొందుము. ఆ ముద్రయందు తేదిగూడ ఉన్నది. 28 జనవరి 18, అని యున్నది. ఇది 1918 సంవత్సరముగదా? జనవరినెల 28-వ తేది రామేశ్వరములో తపాలా పెట్టెలో వేయఁబడినది అని దీని యర్థము.

జో.—నేడు 31-వ తేదిగదా. అయిన మూఁడు దినములలో ఇచ్చటికి వచ్చెనా?

లక్ష్మ.—ఇదిగో కవరుకు వెనుకప్రక్కఁ జూడుము. విజయనగ రము 31 జనవరి 18 అని ముద్రకొట్టియున్నారు.

జో.—రామేశ్వరము ఎక్కడ? మనమెక్కడ? నాలుగు దినము

లలో వచ్చినదిగదా ఈ జాబు! ఈ జాబు రయిలులో వచ్చుటకు మనమెన్ని రూపాయల నీయవలయును?

లక్ష్మి.—రూపాయలేమియు లేదు. అర్ధణాబిళ్ల చాలును అర్ధణా బిళ్ల వేసి అంటించిన మన దేశములో కాశికిని, రామే శ్వరమునకును ఈ జాబు పోవును. ఇంకను చిన్న డబ్బుకు (కాణి, బొట్టు, పైసా, కాలణా) తపాలాఫీసులో కార్డు లమ్ముదురు. దానియందు సంగతులు వ్రాసి పైవిలా సము వ్రాసి తపాలాపెట్టెలో వేసిన అది చాలదూరము పోగలదు. ఇచ్చటికి సమీపముననుండు విశాఖపట్టణము నకు పోవుటకును దూరముననుండు కాశికిపోవుటకును అర్ధణాబిళ్లగాని, కాణిబిళ్లగాని చాలును. మనకు మన సర్కారువారు చేసియుండు గొప్ప యుపకారములలో నిది యొకటి. నీవు తపాలా పెట్టెను చూచియున్నావా? దాని బొమ్మను చూడుము. పిల్లవాఁడొకడు ఆ పెట్టెలో జాబు వేయుచున్నాడు చూడుము. దినమునకు రెండు మూడు పర్యాయములు తపాలాఫీసువారు ఈ పెట్టెను తెఱచి అందులోనుండు జాబులను తపాలాఫీసుకు తీసి కొనిపోవుదురు. ఆ ఆఫీసునకు తీసికొనిపోయి ఆ యూరి పేరు తేదియుండు ముద్రలను బిళ్లలపై కొట్టుదురు. జాబుల పైవిలాసమును ఈ క్రిందివిధమున వ్రాసిన, తపాలావారు జాబు లెచటికి పోవలసినదియు సులభ ముగ తెలిసికొందురు.

చిరంజీవిని ముంగమూరి విశాలాక్షమ్మ,
45 కోటరోడ్డు,
**విజయనగరము.**

45 మన యింటి తలుపుపైనుండు నంబరుగదా. ఆయా యూళ్లకు పోవలసిన జాబులను వేరుపఱచినపిదప వానిని మూటలోఁగట్టి బండిలో వేసికొని రైలుస్టేషనుకు తీసికొనిపోవుదురు.

జో. — రైలుబండిలేని యూళ్లలో నేమి చేయుదురు?

లక్ష్మి.—కొన్ని యూళ్లలో గుఱ్ఱపుబండ్లపై యీ మూటలను తీసికొనిపోవుదురు. ఇట్టి బండ్లు లేనిచోట మనుష్యులు గంటకు ఆఱు మైళ్లవంతున పరుగెత్తుచు ఈ మూటలను మోసికొని వెళ్లుదురు. మన యూరి జాబులన్నియు మన తపాలాఫీసుకు వచ్చును. మన యూరి పేరును, తేదియు, ఉండు ముద్ర వేసి తపాలావానిచేత నిత్తురు.

జో. — అదో తపాలావాని భుజమునుండి వ్రేలాడునదేమి?

లక్ష్మి.—వాని భుజమునుండి వ్రేలాడుచున్నదే అదే తోలుసంచి. దానిలో నిండుగ ఉత్తరములున్నవి. ఆ యుత్తరములన్నియు తీసికొని వాఁడు ఊరిలో పెక్కు యిండ్లకుఁ బోవును త్రోవలో నిలిచి ఎవరితోను మాటలాడడు సుమీ.

జో. — **అమ్మా!** దీనికి నాయనగారికి నేనే బదులు వ్రాసెదను లోపలికి పోదము రమ్ము.

ఈ పాఠమందలి బొమ్మలను (38-వ పుట) జూచి, ఒక్కొక్క దానినిగుఱించి నీకుఁ దెలిసినదంతయు చెప్పుడు.

**పదములు.**—కవర్లు — కార్డులు — బిళ్లలు — ఉత్తరము — జాబులు — లేఖనము — తపాలాపెట్టె — తపాలాఫీసు — పైవిలాసము.





## 14. పక్షి తన్నుగూర్చి చెప్పిన కథ.

నా పేరు పక్షి. నాకు కాళ్లు రెండు. రెక్కలు రెండు. జంతువులు ఒక చోటినుండి మఱొకచోటికి నడిచి వెళ్లును. అందుకు వానికి నాలుగు కాళ్లు ఉన్నవి. నేనుకూడ మఱొక చోటికి వెళ్లుటకు నాకు ఆ రెండు కాళ్లును, ఆ రెండు ఱెక్కలును ఉన్నవి. నాకు నోరు వేఱుగా లేదు. నోరు ముక్కు ఒక్కటిగనే యుండును. అది నా ముక్కులోపలనే యిమిడి యున్నది చూడుఁడు. నాకు పండ్లు లేవు. నా ముక్కు ఎంత చక్కగనున్నదో చూచితిరా? నా ముక్కు ఎంత కఠినముగా



నున్నదో తాకి చూడుఁడు. ఎద్దుకొమ్ములెంత కఠినమో అంత గట్టిగ నున్నది. పక్షిజాతిలోఁ జేరిన మాకందఱికి ముక్కు

ఒకే తీరున నుండదు. దీనికై మీరు నానావిధములగు పక్షులను చూచి తెలిసికొనవలయును. ఈ ముక్కుతో మాంసమును, పండ్లను, కఱచుకొని చీల్చుకొని మేము తినెదము.

మృగములకుండునట్లు మా దేహములపై చర్మము లేదు వెంట్రుకలును లేవు. మా శరీరమును యీఁకలు కప్పుచున్నవి. ఈ యీఁకలు చాల తేలికగ నుండును. అందుచేత మేము సులభముగ గాలిలో ఎగురఁగలము. మా యీఁకలు చిత్రవిచిత్రములగు రంగులు గలిగియున్నవి. కొన్ని చాల మృదువుగ నుండును. కొన్ని యీఁకలు పెద్దవి. కొన్ని చిన్నవి. తోఁక యీఁకలు నిడుపైనవి. ఈ యీఁకలన్నియు మా శరీరములో పొదుగఁబడియున్నవి

మా యీఁకలను మీలో కొందఱు కలములుగా ఉపయోగించెదరు. మా చిన్న యీఁకలను జాతివారి దొరసానులు టోపీలలో గ్రుచ్చుకొని అలంకరించుకొనుచున్నారు. విసనకఱ్ఱలకు మా యీఁకలను మీరు ఉపయోగించుచున్నారు. మెత్తలు, దిండ్లు చేయించుటకును మా యీఁకలను ధనవంతులగువారు ఉపయోగించుచున్నారు. మావలన మీకెంత యుపయోగమో తెలిసినదా?

మేము భూమిపై నివసించుట లేదు. చెట్లమీఁద వాసము చేయుచుందుము; గాలిలో ఎగురుచుందుము. మా వ్రేళ్ల చివరనుండు గోళ్లను చూడుఁడు. మా గోళ్లలో అనేక రకములు కలవు. మాలో కొన్నిటికి గోళ్లు వాడిగనుండును. కొన్నిటికి మొద్దుబారియుండును. ఈ గోళ్లుండుటచేత మేము చెట్లమీఁద గూర్చుని భయములేక సుఖముగా నిద్రించుచుందుము.

మీవలె మేము ఆహారమును నమలి మ్రింగము. మేము

పండ్లను కాయలను ముక్కుతో కొఱికి మ్రింగెదము. మేము చెట్లలోను ఇండ్లయందును గూళ్లు కట్టుకొనెదము. వానిలో గ్రుడ్లు పెట్టుదుము. మా గ్రుడ్లను మీలో కొందఱు దొంగి లించుకొని పోవుదురు. ఇది మీకు న్యాయమా? ఈ గ్రుడ్లను పొదిగి పిల్లలుగఁ జేయుదుము. మృగములవలె మేము పాలిచ్చి మా పిల్లలను పెంచము. అందుచే వెలుపలనుండి ఆహారము తెచ్చి మా పిల్లలచే తినిపించి వానిని బహు జాగ్రత్తతో పెంచు కొందుము. మనుష్యులందఱు మాయందు దయగలిగి ఉండ వలయును. మమ్ముల హింసించుట ధర్మముకాదు.

పదములు - న్యాయము—క్రూరము—ధర్మము — పొదుగుట — దయ — చివర — వాడిగల — కఱచుకొని — చిలుక —గోరువంక — భరద్వాజము — కాకి — కోకిల — హంస — పిచ్చిక — కోడి — బాతు — గ్రద్ద — పావు రము — గరుత్మంతుఁడు.

వ్రాయుంగు. — పక్షి ముక్కు

ఒగవడి.—గరుత్మంతుఁడు పక్షులకు రాజు.

# 15. గొడుగులు.

జడివాన కురియఁబోవుచున్నది సుమీ! అప్పుడు మనము తడిసిపోదుము కదా? అందునకు మనము చేయవలసినది యేమి? మనకు ఇల్లు చాల దూరము. కనుక మనము వడిగా నడచి పోలేము అయినను చింతలేదు. నాయొద్ద ఒక గొడుగు ఉన్నది. ఆ గొడుగు విప్పి పట్టెదను. ఇది మనకిద్దఱికిని



చాలును. ఇప్పుడు చినుకులు మనమీఁద పడవు. బట్టలు తడిసిపోవు.

ఆహా! ఇది యెంత మంచి గొడుగు! బజారులో రెండు రూపాయలు ఇచ్చి దీనిని కొంటిని. ఈ గొడుగును పెక్కు పని వాండ్రు చేయుదురు. మొదట కమ్మరవాఁడు ఇనుపకమ్ములను చేయును. కంచరవాఁడు ఇత్తడి చక్రములు మొదలయిన వానిని చేయును. వడ్రంగి మ్రానుతో చేతిపిడినిఁ జేయును. కుట్రపువాఁడు గొడుగుపైని గుడ్డను కుట్టును. పిమ్మట గొడుగులు చేయువాఁడు వీనినంతయు చేర్చి గొడుగులఁ జేయును మన గొడుగును ఇష్టమున్నప్పుడు తెఱచియుంచి తక్కినపుడు ముడువవచ్చును. ఈ గొడుగుపై గుడ్డయొక్క వర్ణమేమి (రంగు ఏమి)?

అదిగో! కొందఱు బీదవాండ్రు దారి నడిచి పోవుచున్నారు. చూచితివా? వారు రెండు రూపాయలు ఇచ్చి ఒక గొడుగు కొనలేరు. కాఁబట్టి వారు జమ్ముగూడ ఒకటి తలమీఁద వేసికొని పోవుచున్నారు. జమ్ముగూడలు చినుకులను మీఁద పడనీయక ఆఁపును. ఒక జమ్ముగూడ వెల నాలుగు అణాలు.

మఱియొకఁడు చుట్టుగొడుగు పట్టుకొని ఉన్నాఁడు చూడుము ఆ గొడుగు మన గొడుగువలె గుడ్డతో చేసిన గొడుగు కాదు అట్టి గొడుగు మొగలియాకుతో గాని తాటియాకుతో గాని చేయఁబడును. కనుక దానికి మొగలియాకు గొడుగు అని గాని తాటియాకు గొడుగు అని గాని పేరు దాని వెల నాలుగు అణాలు దానిని మన గొడుగు ముడిఁచినట్లు ముడుచుటకు వీలు లేదు.

ఇప్పటికి వాన వెలిసినది. ఇఁకమీఁద గొడుగు ముడిఁచి వేయవచ్చును. మనము కొంచెమైనను తడియలేదు చూచితివా?

ఎండ కాయుచున్నది. అబ్బా! ఎండ ఎంత వేఁడి! ఎండ వేఁడిమివల్ల తలనొప్పి వచ్చును. కనుక గొడుగు తీసి పట్టు. అప్పుడు చల్లగా ఉండును. ఎండ తగులదు. గొడుగు ఎంత మంచి వస్తువో తెలిసినదా? ఒక గొడుగు కొనియిమ్మని మా తండ్రిగారిని అడిగెదను.

నీవు వేసికొను గొడుగునకును, ఈ బొమ్మలోనున్న మనుష్యుఁడు వేసికొన్న గొడుగునకును గల భేదమేమి?

**పదములు**—జడివాన — చుట్టుగొడుగు — జమ్ముగూడ — కంచరవాఁడు — కుట్రపువాఁడు — కమ్మరవాఁడు.

**వ్రాయుము** —గొడుగు.





# 16. నా పేరేమి?

"నేనెవరో, నా పేరేమో మీరు చెప్పఁగలరా?"

నేను ప్రతిదినమును తూర్పున ఉదయించుచున్నాను. నేనుదయింపఁ బ్రారంభించినపుడు వెలుతురు వచ్చును. నేనుదయించునపుడు చూచి నా వర్ణము చెప్పగలవా?

నీకు ఇంకను నిదురకన్నులు. లే. లెమ్ము. నీవు నిదురపోవుటకా నేను ప్రకాశించునది. లేచి ముఖము కడఁగుకొని చదువవలదా? బడికి పోవలదా? నన్ను చూచినంతనే కొలనిలోనుండు తామరపువ్వులు ఎంత రమ్యముగా వికసించుచున్నవో చూడుఁడు.

మీరు నన్ను చక్కఁగా చూడుఁడు. నేను ఒక పెద్ద బాటసారిని. నేను ఆకాశమునంతయు ప్రయాణము చేయుచున్నాను. నేను ఒకచోట నిలచియుండుట లేదు. నిమిష నిమిషమును పోవుచునేయుందును. నాకెప్పుడును అలసట లేదు.

నేను ఆకాశమున ఎంతో ఎత్తుననున్నను నా కిరణములు వ్యాపింపని చోటులేదు. నా కిరణములను చూచియున్నావా? నేలపైనను, నీటిపైనను, చెట్లపైనను, ఇండ్లపైనను అవి ప్రకాశించుచున్నవి. నా కిరణములన్నియు విస్తరించి ప్రకాశించునప్పుడు ప్రతి వస్తువును తళతళ మెఱయుచుండును. అవి అప్పుడు చూచుటకు సొంపుగానుండును నా పేరు ఇప్పటికిని తెలిసికొనలేవా?

వెలుతురునకు నేనేకదా కారణము. నేను లేకున్న నీకు వేడిమి ఎక్కడిది? వాన కురిపించునది నేనే. ధాన్యముల పండించునది నేనే. నా యిల్లు చాల దూరమున ఆకాశమందున్నది. పక్షులు నా దగ్గఱకు ఎగురఁజాలవు చెట్లుకూడ నన్ను తాకలేవు. ఆకాశమున మీరు చూచెడు మబ్బుకూడ నన్ను అంటదు. నేను మీ దగ్గఱకు వచ్చితినా, నా వేడిమికి ఓర్వలేరు అంతేకాక పచ్చికయు భగ్గుమని మండఁబోవును.

ఇదిగో! నన్ను చూడుఁడు. మీరు నన్ను చూడఁజాలరు కన్నులు చెదరిపోవును. అట్లే నన్ను చూచుచుంటిరా మీ కన్నులు గ్రుడ్డివగును. కొన్ని సమయములలో మాత్రము నన్ను మీరు చూడఁగలరు. అప్పుడు నన్ను సన్నపాటి మబ్బు కప్పియుండును.

మిట్టమధ్యాహ్నమున నేను తళతళమని మెఱయుచుందును. అప్పుడే నాకు వేడి యెక్కువ. ఇప్పుడు సూటిగా నీ తలపై నున్నాను. తెల్లవారినప్పటికన్న నిప్పుడు నావలన నీకు తాప మెక్కువ. మఱల మధ్యాహ్నమునుండి నేను ప్రయాణము చేయుచుందును. సాయంకాలమున చల్లగానుండును అప్పుడు రాను రాను ఉష్ణము తగ్గుచుండును.

సాయంకాలమున అందఱు తమ తమ పనులను వదలి యిండ్లకు పోదురు. కొందఱు బంతులాట లాడికొందురు. పొలము లనుండి పశువులను తోలుకొని బాలురు పిల్లనగ్రోవు లూదుచు ఇండ్లకు వత్తురు. ఎరకై పోయియుండిన పక్షులు గూండ్లను చేరు చుండును.

ఇదిగో! నేను మఱుగి (చాటునకు) పోవుచున్నాను. గాఢాంధకారము రాఁబోవుచున్నది. అప్పుడు మీరు దీపముల వెలిగింతురు. ఆ దీపములోనుండు నిప్పునకు నేనే కారణము నే నెవరనో నా పేరేమో ఇప్పుడైనను చెప్పగలరా? నేనే సూర్యుడను.

ప్రతిదినమును మీరు ఉండు భూమి నా చుట్టును తిరుగు చుండును. నేను భూమిని చుట్టి తిరుగుచున్నానని మీరు అనుకొని, నావలన మోసపోవుచున్నారు గదా!

పదములు.— కమలాప్తుఁడు — సూర్యుఁడు — ఆదిత్యుఁడు — భానుఁడు — ఉదయము — ప్రాతఃకాలము — మధ్యాహ్నము — సాయంకాలము — కిరణము — వేడి — రశ్మి — ప్రయాణము — గాఢాంధకారము.

ఒరవడి —సూర్యుఁడు గ్రహములకు రాజు.



# 17. మహాభారతము.

మహాభారతము సంస్కృతభాషలో వ్రాయఁబడిన గొప్ప గ్రంథము. దానిని వేదవ్యాసులు అను మహర్షి రచియించెను. దానిని అనేక భాషలలో ఇప్పుడు వ్రాసియున్నారు.

మనముండు చోటునకు ఉత్తరమున చాల దూరమున హస్తినాపుర రాజ్యముండెను. అచ్చట ధృతరాష్ట్రుఁడు, పాండు

రాజు అను ఇద్దఱు అన్నదమ్ములు ఉండిరి. పెద్దవాఁడైన ధృత రాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు; కాఁబట్టి పాండురాజు రాజ్యము ఏలు చుండెను. ధృతరాష్ట్రునకు నూర్గురు కొడుకులు. వీరికి కౌరవు లని పేరు. వీరిలో దుర్యోధనుఁడు పెద్దవాఁడు. పాండురాజు నకు ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడని అయిదుగురు పుత్రులు. వీరికి పాండవులని పేరు.

ఈ రాజపుత్రులందఱు ద్రోణాచార్యులయొద్ద విలువిద్య నేర్చుకొనిరి. వీరిలో అర్జునుఁడు మిగుల నేర్పరి యాయెను. పాండవులకు రాజ్యము ఇయ్యవలసివచ్చునను భయముచేత దుర్యోధనుఁడు వారలఁ జంపఁ బ్రయత్నించెను. వీరిని చంపు టకు కట్టియుంచిన లక్క-యింటినుండి తప్పించుకొని వీరు ఎవరికిని తెలియక అడవులయందు తిరిగి పాంచాలదేశము చేరిరి.

పాంచాలదేశమును ద్రుపదరాజు పాలించుచుండెను. అత నికి ద్రౌపదియను కుమార్తె యుండెను. అతనియొద్ద ఒక మత్స్యయంత్రము ఉండెను. దానిని ఆకాశమున వ్రేలాడఁ గట్టి నీటియందు దాని ప్రతిబింబమును చూచి గుఱిపెట్టి కొట్టినవారికి తన కుమార్తె నిత్తునని చాటించెను. అర్జునుఁడు విలువిద్యయందు తనకుఁ గల నేర్పుతో ఆ యంత్రమును గుఱి పెట్టి కొట్టెను. అన్నదమ్ములు అయిదుగురును ద్రౌపదిని పెండ్లి యాడుట తటస్థించెను. happened

పిదప తమ రాజ్యమును తమకు ఇమ్మని అడుగగా ధృత రాష్ట్రుఁడు వారికి అర్ధరాజ్యమును ఇచ్చెను. ఆ రాజ్యమునకు ముఖ్యపట్టణము ఇంద్రప్రస్థము. మన దేశమున కిప్పుడు ముఖ్య పట్టణమయిన ఢిల్లీకి సమీపముననే పూర్వము ఇంద్రప్రస్థము ఉండెను. ఇచ్చట రాజ్యముచేయుచు పాండవులు సుఖముగా

నుండిరి. దానిని చూచి దుర్యోధనుఁడు ఓర్వలేక ధర్మరాజును జూదమాడఁ బిలువ ధర్మరాజు అందుకు ఒప్పుకొనెను. ఆ జూదమందు ధర్మరాజు ఓడిపోయెను. తానును, తన తమ్ములును, ద్రౌపదియు, దుర్యోధనునకు బానిసలయిరి. అప్పుడు రాజసభకు ద్రౌపదిని ఈడ్చి తెచ్చి దుర్యోధనుని తమ్ముఁడగు దుశ్శాసనుఁడు ఆమెను అవమానింప ప్రయత్నముచేసెను. అప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునిధ్యానింపగా అతఁడు ద్రౌపది మానమును గాపాడెను.

పాండవులు ఇల్లు రాజ్యమునంతెయుఁ గోలుపోయి అడవులఁ జేరిరి. దుర్యోధనుఁడు వారిని చాల కష్టపెట్టెను. అడవులలో పండ్రెండు సంవత్సరములు గడపి పదుమూఁడవ యేట ఎవరును తమ్ము గుర్తింపకుండునట్లు మాఱువేషములతో విరాటరాజు కొలువులో ఉండిరి. ఈ ప్రకారము పదుమూడు సంవత్సరములు గడచినతర్వాత పాండవులు తమ రాజ్యమును ఇమ్మని కోరిరి; కాని దుర్యోధనుఁడు అందులకు సమ్మతింపలేదు. రాజ్యమునకై పాండవులు యుద్ధము చేయవలసివచ్చెను. వీరికి సైన్యము చాల తక్కువ. దుర్యోధనునికి చాల సైన్యము కలదు. అయినను పాండవులు శ్రీకృష్ణుని సాహాయ్యమును పొందిరి.

కౌరవులును పాండవులును పదునెనిమిది దినములు యుద్ధమాడిరి. ఆ యుద్ధమందు కౌరవులు ఓడిపోయిరి. దుర్యోధనాదులు చనిపోయిరి. తరువాత ధర్మరాజు పట్టాభిషేకము చేసికొని రాజ్యమును చక్కగా పాలించెను. ప్రజలకందఱకు సౌఖ్యము కలుగవలయునని రాజ్యము చేసినందుచేత ఈయనకు అన్ని విధముల ధర్మరాజు అను పేరు తగియున్నది.

**పదములు.**—ధర్మరాజు—భీముఁడు—అర్జునుఁడు—దుర్యోధనుఁడు—ఇంద్రప్రస్థము—ఢిల్లీ—హస్తినాపురము.

# 18. వృద్ధుఁడు, సుల్తాను.

అపకారికి ఉపకారము చేయవలయును.

ఒక యూరియందు ముసలివాఁడొకఁడు ఒకనాటి సాయంకాలమున తన గుఱ్ఱముపై ఎక్కి స్వారిచేయుచుండెను. అప్పు డొకచోట ఆ గుఱ్ఱము అడుసులో దిగఁబడెను. అందునుండి అది బయటికి రాలేక క్షణక్షణమునకును ఇంకను లోతుగ దిగఁబడుచుండెను. ఆ సమయమున గాలి మిక్కిలి బలముగా వీచుచుండెను, వానకూడ జోరున కురియుచుండెను. అప్పుడే చీకటికూడ క్రమ్మనారంభించెను. ముసలివాఁడు ఇట్టి సందర్భములలో ఏమియు చేయలేక చేతులు నులుపుకొనుచు గుటకలు మ్రింగుచుండెను. అంతేకాక తనకు ఇట్టి స్థితి సంభవించుటకు తన దేశపు సుల్తానే కారణమని యెంచి అతనిని బహువిధముల దూరుచుండెను.

తెల్లవారి సుల్తాను ముసలివాఁడు అట్లు తిట్టుసమయముననే ఆవైపు పోవుట తటస్థించినందున ఆ ముసలివాఁడు చెప్పుచుండినదానిని వినెను. అంత ముసలివానిని కోపముతో తేఱి పాఱఁజూచి అవసరపడిన కార్యము చెడునని కోపమును అణచుకొనెను. తర్వాత తన సేవకుని పిలచి "ఈ ముసలివాఁడు ఏల కోపముతో నన్ను తిట్టుచున్నాఁడు? వీనికి నేనేమి అపకారము చేసితిని?" అని యడిగెను.

అందుకు ఆ సేవకుఁడు వినయముతో "తమ్ము అట్లు వృథాగా తిట్టువానిని ఊరక విడువకూడదు. తత్క్షణమే మీ కత్తితో వాని తల నఱకుఁడు" అని జవాబు చెప్పెను.

సుల్తానుకూడ ఆత్రపడిన ప్రమాదమగుననియు, నిజము

గిలుకడమీఁద తెలియుననియు ఎంచి మఱల ముసలివాని సమీపమునకు వచ్చి నిదానించి చూచి "అయ్యో! అతఁడు మిగుల ముసలివాఁడు, బురదలో అతని గుఱ్ఱము దిగఁబడినందు వల్ల చేయునదేమియులేక చలికి అల్లాడుచు కూర్చుండియు న్నాఁడు" అని సుల్తాను తెలిసికొనెను. తోడనే అతని మనస్సు కరగి ముసలివానిని దండించుటకు మాఱుగా, అతనిని మన్నించు టయేకాక వానికి కొంత పైకమును, స్వారిచేయుటకొక మంచి గుఱ్ఱమును, ధరించుకొనుటకు కొన్ని యుడుపులను బహుమాన ముగా ఇచ్చెను. ఆహా! దయ యెంతటిది! దానియంత గొప్పది వేఱు ఒకటి ఉండదు.

అంత సుల్తానుయొక్క సేవకుఁడు ముసలివాని దగ్గఱకు వచ్చి "ముసలివాఁడా! నీకు కొంచెమైనను బుద్ధిలేదు. సుల్తా నును తిట్టినందుకు నీకు కఠిన దండనయైయుండును. ఇప్పుడే కదా దానిని తప్పించుకొంటివి" అనెను.

అందుకా ముసలివాఁడు "నోరు మూయుము. నే నేమైన లేనిపోని వానిని చెప్పితినా? నా కష్టములన్నియు నిజములే. కాఁబట్టియే తగిన బహుమానము నాకు దొరకినది. సుల్తాను అట్లు చేయకపోయిన అతని గొప్ప యేమున్నది? అతనికి గౌర వము తగ్గును" అని జవాబు చెప్పెను.

కాఁబట్టి అపకారికి అపకారము చేయుట సులభము. నిజ మైన గొప్పతనము అపకారికి ఉపకారము చేయుటయందే యున్నది.

**పదములు**—వృద్ధుఁడు — అపకారము — సుల్తాను — సందర్భము — దండన — తత్క్షణము — బహుమానము — స్థితి — **నిజము.**

ఒరవడి.—సత్యముచే చెడినవాడు లేడు. అసత్యముచే బాగు పడినవాఁడును లేడు.





## 19. వరిపైరు.

మన దేశములో అనేకులు బియ్యమును వండుకొని తినుచున్నారు. కొందఱు గోదుమలు, రాగులు, జొన్నలు మొదలగు ధాన్యములను భోజనమునకై వాడుచున్నారు. మన యాంధ్ర దేశమునందు బియ్యమును ఎక్కువగా వాడుచున్నాము. వడ్లు దంచినయెడల బియ్యము అగును.

మీరు వడ్లను చూచియున్నారు కదా? చెన్నపట్టణము మొదలగు గొప్ప పట్టణములలోనుండు బాలురును బాలికలును

పరిపాలమును చూచియే యెఱుగరు. అట్టివారు వడ్లు చెట్లలో పండినవని చెప్పినను నమ్ముదురు. మీారందఱు పొలములను చూచి అచ్చట వడ్లు, రాగులు, జొన్నలు మొదలయిన ధాన్యములను ఎట్లు పండించుచున్నారో తెలిసికొనవలయును. పుస్తకములలో నిట్టి పాఠముల చదివినంతనే మీాకు స్పష్టముగ తెలియదు.

మన దేశములో వ్యవసాయము (సేద్యము) ముఖ్యమైన వృత్తి. "మీాకు యెన్ని యెకరముల భూమి యున్నద"ని ఒకరి నొకరు అడుగుట సర్వసాధారణము. నేలయే (చేనులు) మన దేశములో అనేకులకు ముఖ్యమైన ధనము. కొన్నిచోట్ల ఒక యెకరపునేల వేయి, వేయిన్ని యేనూఱు రూపాయలు వెల కలదైయుండును. పదునైదు, ఇరువది యెకరముల భూమి యుండిన రైతులను ధనికులందురు. వీరిని కొన్ని యూాళ్లలో పంటకాపులని పిలిచెదరు. సేద్యము సేయువారికి రైతులని పేరు. మన భోజనమునకై వరిపైరు పెట్టుటకు రైతులు ఎంత కష్టపడుదురో యని తెలియక మనము అన్నమును భుజించుచున్నాము.

వర్షము కురియ నారంభించినతోడనే మన రైతులు భూమిని చక్కగా దున్నుదురు. అప్పుడు కయ్యలు నీళ్లతో నిండియుండును. నదులయందు పూర్ణప్రవాహములుండును. బావులు నిండియుండును. చెఱువులనుండియు నదులనుండియు పోవు కాలువలనిండ నీళ్లు ఉండును. ఇదియే వరిపంట పండించుటకు మంచికాలము.

భూమిని దున్నుటకు ముందు ఎఱువును తోలుదురు. భూమికి ఎఱువు సత్తువనిచ్చును. ఎఱువు వేయకున్న, భూమి

ఒరవడి.—సత్యముచే చెడినవాడు లేడు. అసత్యముచే బాగు పడినవాఁడును లేడు.





## 19. వరి పైరు.

మన దేశములో అనేకులు బియ్యమును వండుకొని తినుచున్నారు. కొందఱు గోదుమలు, రాగులు, జొన్నలు మొదలగు ధాన్యములను భోజనమునకై వాడుచున్నారు. మన యాంధ్ర దేశమునందు బియ్యమును ఎక్కువగా వాడుచున్నాము. వడ్లు దంచినయెడల బియ్యము అగును.

మీరు వడ్లను చూచియున్నారు కదా? చెన్నపట్టణము మొదలగు గొప్ప పట్టణములలోనుండు బాలురును బాలికలును

వరిపొలమును చూచియే యెఱుగరు. అట్టివారు వడ్లు చెట్లలో పండినవని చెప్పినను నమ్ముదురు. మీరందఱు పొలములను చూచి అచ్చట వడ్లు, రాగులు, జొన్నలు మొదలయిన ధాన్యములను ఎట్లు పండించుచున్నారో తెలిసికొనవలయును. పుస్తకములలో నిట్టి పాఠముల చదివినంతనే మీకు స్పష్టముగ తెలియదు.

మన దేశములో వ్యవసాయము (సేద్యము) ముఖ్యమైన వృత్తి. "మీకు యెన్ని యెకరముల భూమి యున్నది" అని ఒకరి నొకరు అడుగుట సర్వసాధారణము. నేలయే (చేనులు) మన దేశములో అనేకులకు ముఖ్యమైన ధనము. కొన్నిచోట్ల ఒక యెకరపునేల వేయి, వేయిన్ని యేనూఱు రూపాయలు వెల కలదైయుండును. పదునైదు, ఇరువది యెకరముల భూమి యుండిన రైతులను ధనికులందుము. వీరిని కొన్ని యూళ్లలో పంటకాపులని పిలిచెదరు. సేద్యము సేయువారికి రైతులని పేరు. మన భోజనమునకై వరిపైరు పెట్టుటకు రైతులు ఎంత కష్టపడునదియు తెలియక మనము అన్నమును భుజించుచున్నాము.

వర్షము కురియ నారంభించినతోడనే మన రైతులు భూమిని చక్కగా దున్నుదురు. అప్పుడు కయ్యలు నీళ్లతో నిండియుండును. నదులయందు పూర్ణప్రవాహములుండును. బావులు నిండియుండును. చెఱువులనుండియు నదులనుండియు పోవు కాలువలనిండ నీళ్లు ఉండును. ఇదియే వరిపంట పండించుటకు మంచికాలము.

భూమిని దున్నుటకు ముందు ఎఱువును తోలుదురు. భూమికి ఎఱువు సత్తువనిచ్చును. ఎఱువు వేయకున్న, భూమి




చక్కగా పండదు. ఎఱువువేసిన వెనుక నీళ్లు పెట్టి భూమిని చక్కగా దున్నుదురు.

నీవు నాఁగళ్లను చూచియున్నావా? మన దేశములో అనేకవిధములగు నాఁగళ్లు కలవు. పైనుండు యంత్రమును చూడుఁడు. ఇది యొకవిధమైన నాఁగలి. నాఁగళ్లచే భూమిని దున్నుటవలన క్రిందిమట్టి మీఁదికి వచ్చును. గట్టిగనుండు భూమి మెత్తనగును. పొలమును దున్ను నాఁగలి మంచిదయిన భూమి చక్కగా పండును. మన దేశములో ఉపయోగించెడి నాఁగళ్లు సాధారణముగా అంత మంచివికావు.

నేలను దున్ని నీళ్లు కట్టి చదునుపఱచి దమ్ము (అడుసగు నట్లు) చేయుదురు. సన్నపాటి గట్లుకట్టి మళ్లను ఏర్పఱతురు. నీళ్లు కట్టునప్పుడు పచ్చియాకులు మొదలగునవి వేసి కుళ్లఁబెట్టుదురు. ఇట్లు చేయుటకు ఒక నెల పట్టును.

ఆవల విత్తనముల చల్ల నారంభింతురు. విత్తనములకై మంచి గింజలను రైతులు ప్రత్యేకముగా ఏర్పఱచుకొందురు. విత్తనములు చల్లుటకు ముందు పొలములో ఒకచోట చిన్న మడిని సిద్ధముచేసికొని అందు నారునకై వరివిత్తులను పోయు




దురు. ఈ విత్తనములను గడ్డిక్రింద మూడు నాలుగు దినములు కప్పిపెట్టి ప్రతిదినము నీరు పోయుచుండిన, గింజలు మొలకలెత్తును. ఇట్లు మొలకలు కట్టిన విత్తులను చిన్న మడియందు చల్లుదురు. ఒక అడ్డుగు ఎత్తు పెరిఁగినపిమ్మట ఆ వరి మొలకలను వ్రేళ్లతోడఁ బెఱికి పొలమునందు నాటుదురు. నేల బురదగా నుండుటచేత వేళ్లు దానియందు నాటుకొని పైరు చక్కగా పెరుఁగును. పైరు చక్కఁగ పెరుఁగుటకు విత్తనములు మేలైనవిగా నుండవలెను.

సామాన్యముగా కొన్ని యూళ్లయందు గింజలను చేతితో వెదజల్లుచున్నారు. ఈ పద్ధతిచే గింజలను చాల వేగముగా నేలయందు చల్లుటకు వీలుకలిగి ఉన్నది. ఇది అంత మంచి పద్ధతి కాదు. ఇదిగో! పైన ముద్రించియుండు యంత్రమును జూడుఁడు. దీనిపైన జోలువలె చెక్కఁబడి త్రాళ్లతో గించికట్టిన గుండ్రపాటి యంత్ర మొకటియున్నది. దాని యడుగున కొన్ని సందులు తొలిచియున్నారు. దానికి అడు

గున వెదురుగొట్టములున్నవి. ఆ యంత్రములో వడ్లగింజలు పోసిన అవి యీ వెదురుగొట్టములనుండి నాగళ్లుచేయు చాళ్లలో పడుచుండును. దీనివలన విత్తనములను చాళ్లుచాళ్లుగా పోయ వచ్చును. ఇట్లు పోయుటచే చాల లాభముగలదు. విత్తములు మొలచునప్పుడు కసవు, తుంగ మొదలగునవి మొలచును. వీనికి కలుపు అని పేరు. ఇవి పెద్దవయిన పైరునకు చెఱుపుచేయును. ఈ మొలకలను పెరికి వేయుటకు కలుపు తీయుట అని పేరు.

వరిపొలమునకు నీరు చక్కగా కట్టవలెను. నీరు కట్టని యెడల పైరు ఎండిపోవును. విశేషముగా కట్టినను కొంచెముగా కట్టినను మిగుల చెఱుపు. కాఁబట్టి రైతులు బహు జాగ్రత్తతో కాచియుండి ఎంత నీరు కావలయునో అంత నీరు కట్టుదురు.

ఇట్లు విత్తనముల చల్లినవెనుక కొన్ని నెలలకు పైరున వెన్నులు పెరుగుటకు ఆరంభించును. పచ్చని వరిపైరు కన్నులకెంతో ముచ్చటగానుండును. ఒక్కొక కంకికిని ఏబది అరువది గింజలుండును. కంకులు మొట్టమొదట ఆకు పచ్చగనుండి పిమ్మట బంగారువర్ణముగ మాఱును. అంతట వరిపైరు వెన్ను బరువువలన నేలకు ఒరగఁబడును. అప్పుడు పంటకాపులు పైరు కోఁతకు వచ్చినదని తెలిసికొని కోయనారంభింతురు. కూలివాండ్రను బిలచుకొనిపోయి కొడవండ్లతో పైరును కోసి కట్టలుకట్టి యొకచోట కుప్పలు వేయుదురు. కొన్ని నెలలు అయినపిమ్మట నేలను శుభ్రపఱచి కుప్పలను నూరుతురు. ఈ కుప్పలు నూర్చుచోటికి కళ్లమని పేరు. అక్కడ పశువులను తోలి కుప్పలను నూర్చు విధము మీరు చూడవలయును. కుప్పలను విడదీసివేసి దానిని



కశువుల చే ద్రొక్కింతురు. అప్పుడు గింజలు క్రిందరాలి
సవునుండి వేఱగును. ఆవల కసవును దీసివైచి గింజలను శుభ్ర
అచుటకై తూర్పార బట్టుదురు. అప్పుడు చెత్త అంతయు
కేఱయి శుభ్రమయిన గింజలు ఏర్పడును. ఆ గింజలను
నెలలో పోసి మూటలుకట్టి యింటికి ఎత్తించుకొనిపోదురు.

ఆవల వడ్లను ఱోటిలో పోసి దంచి బియ్యమును, బొట్టె
పొ(క)ను, తవుడును వేఱుపఱతురు. బియ్యమును జల్లించి
రాకలనుండి వేఱు చేయుదురు. ఇంత కష్టపడి సిద్ధముచేయు
య్యమునే మనము వండుకొని తినుచున్నాము. ఈ బియ్య
మును పిండిగా విసరి దోసెలు మొదలగు పిండివంటలుకూడ
యుచున్నారు. బియ్యములో అనేక రకములు కలవు. దీనిని
ఱించి మీరు ముందు చదువగలరు.

వడ్లు క్రింద రాలగా నిలిచిపోయిన గడ్డిని మోపులుకట్టి.

వంటకావు వామిగా వేయుదురు. ఈ గడ్డిని పలువిధములుగ ఉపయోగించుచున్నాము. గొడ్డుగోదలు వరిగడ్డిని తినును. కొన్ని గుఱ్ఱములు సయితము దానిని తినును. ఎండయు వానయు చొఱకుండునట్లు ఇండ్లమీఁద వరిగడ్డి వఱచుట వాడుక. ఈ వరిగడ్డిని కావలసినప్పుడు బండిమీఁద వేయించుకొనిపోయి వీధులలో అమ్ముదురు. అదిగో చూడు 59-వ పుట బొమ్మలో బండినిండుగ కసవువేసి ఉన్నది.

వ్రాయుంగు—నాఁగలి.

సామెత.—దుక్కిలేనివానికి దిక్కులేదు.

ఒరవడి.—చేనుచేసి యెవ్వరు చెడ్డదిలేదు.

కసవుబండి పటమునుగూర్చి మీ సొంతమాటలతో పది చిన్నవాక్యములను వ్రాయుము.



# 20. వృత్తి.

## మొదటి బాలుఁడు.

ద్విపద

పెద్దవాఁడయి తేను - పెంపుతో పొలము
ఎద్దులఁ గట్టుక - నేఱు దున్నెదను
విత్తనంబులఁ జల్లి - వేడ్కతోఁ బెంచి
కత్తులతో నేను - కసవుఁ గోసెదను
కళ్లములోఁ జేర్చి - క్రమమున నూర్చి
కుంచాన ధాన్యంబు - కొల్చుకొనియెదను
ఇంకను సుఖమున - నింపుతోఁ బసుల
గారాబమున నేను - కాపాడువాఁడ.

రెండవ బాలుఁడు.

ఎల్లకు జనులకు - హితమునుఁ గోరి
వడ్లంగి నయ్యెద - వసుధలో నేను
కఱకఱ ఱంపము - కమ్ములఁ జీల్చ
పనిముట్లఁ గొని నేను - బాగుగఁ జేతు
పడవలఁ బెట్టెలఁ - బండ్ల బల్లలను
నొండల నిండ్లను - నోపికఁ జేతు.

మూఁడవ బాలుఁడు

ఇనుమును నిప్పులో - నెఱ్ఱగఁ గాచి
నునుపుగ, సాగగ - నొనర నీరీతి
సుత్తెతోఁ గొట్టి నే - సొంపుగఁ జేసి
కత్తెరల్, కత్తులు - కలములు నిత్తు.
ఓడకు, బండ్లకు - నుయ్యాలలకును
బడులకు, నిండ్లకుఁ - బనిముట్ల నిత్తు.

నాలవ బాలుఁడు.

ఇటుకతోరాతితో - నిసుకపాల్గలయు
పటికంపుసున్నము - ప్రక్కలఁ జేర్చి
మిద్దెల నిండ్లను - మేడలనైన
కొద్దివి గొప్పవి - కూడ కట్టెదను
రాణి వాసములను - రాచనగరుల
రాణింపఁ గట్టెద - రయము మీరఁగను.

అయిదవ బాలుఁడు.

పాదరక్షలఁ గుట్టి - ప్రభువులనైన
సాదలఁ బేదలఁ - సౌఖ్యపెట్టెదను

పిల్లలతో నేను - పెంపుతోనుండి
చల్లగాఁ గూర్చుండి - సంతోషమొప్ప
చొప్పున పాడుచు - సూదితో కుట్టి
చెప్పుల నిచ్చెద - శీఘ్రమె మీకు.

ఆరవ బాలుఁడు.

హస్తంబులకు నేవి - భూషణము లయ్యె?
పుస్తకములు కావె - భువి నార్యులెంచ?
ప్రకటింతుఁ బటముల - బ్రకటింతు నెల్ల
బ్రకటింతుఁ బుస్తకం - బలరార నేను
అంపెదఁ బుస్తక - మచ్చొత్తి కుట్టి
పెంపొంద వానినే - ప్రీతితోనిత్తు.

అంపకము

పిల్లలమగు మేము - పెద్దలమయిన
గల్లలాడక జేసి - కార్యంబులెల్ల
ఉపయోగకరముగా - నుండఁ గోరితిమి
నృపులకు నరులకు - నవనిలో మేము.

## 21. ఊరిబావి.

మనము మంచి ఆహారమును తినుటయేకాక శు
నీరును త్రాగవలెను. మంచినీళ్లకొఱకై సర్కారువార
వసతుల కలిగింపఁ బ్రయత్నించుచున్నారు. చెన్నప
మొదలగు పెద్ద పట్టణములయందు నీటిని శుభ్రపఱచి
ములనుండి జనుల ఉపయోగమునకై అమర్చియున్నార



మన గ్రామములలోనుండు చెఱువులను బావులను శు
ముగా ఉంచుకొనవలయును. ఇదిగో! ఇచ్చట బావి పట
ఒకటి ఉన్నది చూడు. ఆ బావి మిక్కిలి లోతు అయి:
ఆ బావిలో పది నిలువుల నీళ్లున్నవి. ఆ నీళ్లు మంచి నీ
త్రాగిన ఉప్పగానుండవు.

బావిచుట్టు ఒక గోడ ఉన్నది చూచితివా? బావిచు
గోడ ఎందుకు? అది రెండు విధముల ఉపయోగించును. ౬
మనుష్యులు కాళ్లుజాఱి బావిలో పడకుండ ఆపును. ద
చుట్టుపడ్డ మురికినీళ్లు మరల బావిలో చేరి అందలి పరిశుద్ధమై
నీళ్లను చెడనీయక ఆపును.

గ్రామములందు ఆడువాండ్రు అందఱును ప్రతిదినము
ఉదయమున లేచి బావికి వెళ్లుదురు. వారు బిందెలు తీసికొ
పోదురు. బిందెలకు చేంత్రాళ్లుకట్టి బావిలోవేసి నీళ్లు చేం

దురు. వారు బిందెలు తోమి బావిదగ్గఱనే కడుగుటయు కలదు. చింతపండును మట్టియు వేసి తోమి పాత్రలు శుద్ధి చేయుదురు. శుద్ధిచేసిన వెనుక పాత్రములు తళతళ మెఱయుచుండును. మట్టిపాత్రలను ఇసుకవేసి తోమి కడుగుదురు. పాత్రలలో కొన్ని మట్టితోను కొన్ని ఇత్తడితోను మఱికొన్ని రాగితోను చేయఁబడును.

బావిచుట్టు చెట్లను పెంచుట తగనిపని. చెట్లను పెంచిన యెడల ఆకులురాలి బావిలోని నీళ్లు చెడును. ఇంతేకాక పక్షులు కొమ్మలమీదఁ గూర్చుండి నీళ్లలో రెట్టలు వైచును. ఎప్పటికిని నిర్మలమైన జలమే త్రాగవలెను. నిర్మలమైన జలము అద్దమువలె శుభ్రముగానుండును. నిర్మలమైన జలమునకు ఏ వాసనయు రుచియు లేదు. పాత్రమునకు అడుగున మురికి చేరదు. మురికినీళ్లు త్రాగినట్టైన వ్యాధులు తప్పక సంభవించును శుభ్రమైన నీళ్లకు వసతిలేని యూళ్లయందు రోగములు కలుగును.

**పదములు.**—శుభ్రము — నిర్మలము — వసతి — చేఁదుడుబావి — నది — వ్యాధులు.

ఊరిబావి పటమునుగూర్చి పండ్రెండు చిన్న వాక్యములను వ్రాయుము.

# 22. బాతులు.

బాతులు పక్షిజాతిలో చేరినవి. బాతులలో అనేకవిధములు కలవు.

పెంట్టిబాతులు కొంతసేపు నీళ్లయందును కొంతసేపు భూమియందును సంచారము చేయుచుండును. అడవిబాతులు



ముఖ్యముగా నీళ్లయందే వసించును. పెంపుడుబాతులు భూమి మీఁదనే వసించును.

బాతు ముక్కు మిక్కిలి మెత్తనిది. వంచిన అది వంగును. దాని ముక్కు వెడల్పుగాను చదునుగాను ఉండును. అందుచే అది నీటియందు వసించు పురుగులను తడవి పట్టుకొనఁగలదు. చదునైన దాని ముక్కుతో బురదమట్టిని క్రిందికి మీఁదికి కుళ్లగించును.

బాతు పురుగులను పట్టునప్పుడు మీరు చూచిన మీకు ఆశ్చర్యము కలుగును. తన ఆహారమునకై పురుగులను ఏరుటకు అది తన తలను నీటిలో ముంచి బురదమట్టినంతయు తన ముక్కుతో ప్రోగుచేయును. పురుగులతోనిండిన ఆ మట్టిని పీల్చుకొనును. బాతుముక్కు లోభాగము జల్లెడవలె నుండును. తన ముక్కు లోభాగమునకు పీల్చుకొనిన బురదమట్టిని అదిమి పట్టుకొనును. అప్పుడు బురదమట్టి అంతయు జాఱి క్రిందపడి పురుగులన్నియు దాని నోటిలోఁ జిక్కుకొనును. దానికి చేపలుమున్నగు నీటియందుండు పురుగులు ముఖ్యమైన ఆహారము.

బాతులు బాగుగ ఈఁదును. బాతులకు నీటిలో ఈఁదుటకు వసతిగలిగినట్టి పాదములుగలవు. బాతుల వ్రేళ్లు చర్మముతోఁ గూడియుండును. అందుచే అవి తట్టవలె విస్తరించి యీఁదుటకు వీలుగనుండును. కనుక అవి తమ కాళ్లచే నీళ్లు వెనుకకు త్రోయుచు ఈఁదులాడును. అవి భూమిమీఁద వేగముగ నడువఁజాలవు. ఏలన వాని దేహములు పెద్దవిగను కాళ్లు పొట్టిగను ఉన్నవి. బాతుల ఒడలిమీఁది యీఁకలు వానికి వెట్ట కలుగఁజేయుచుండును.

ఒక పక్షిని నీళ్లలో వేసినట్టయిన అది ముద్దగా తడిసి చాలసేపుదాఁక తడిగానే ఉండును. అప్పుడు ఆ పక్షి చూచుటకు అసహ్యముగా నుండును. అయితే బాతు నీళ్లలోనుండి బయటికి వచ్చినప్పుడు దాని యీఁకలు తడిసి ఉండవు. దాని ఈఁకలు ఎందుకు తడియవో తెలియునా? బాతువంటి జలచరపక్షుల ఒడలి మీఁద ఒక విధమైన చమురు ఉండును. ఆ చమురు ఈఁకలను కప్పును. కనుక నీళ్లు ఈఁకలకు అంటక జారిపోవును.

బాతులు నీళ్లకంటె తేలిక. కనుక అవి నీళ్లపైని తేలును. అవి నీళ్లమీఁద ఉన్నప్పుడే నిదురపోఁగలవు. బాతులను సరస్సులయందును గొప్ప చెఱువులయందును గుంపులు గుంపులుగా కనవచ్చును. అవి జమ్ముతోను పాఁచిమొదలుగాఁ గల వానితోను తమ గూండ్లు కట్టుకొనును. అవి చాలదూరము మిక్కిలి వడిగా ఎగిరిపోఁగలవు. చెఱువులు ఎండిపోయినపుడు నిండిన చెఱువులుండు బహు దూరదేశములకు ఎగిరిపోవుటయు కలదు. వర్షాకాలమందు అవి మరల ముందున్న చోటికే వచ్చి చేరును.

పెంపుడుబాతులు తఱచుగా భూమిమీఁదనే వసించును. వానిని మనుష్యులు పెంచెదరు. అవికూడ ప్రతిదినమును చెఱువులకుఁ బోయి ఈఁదులాడుటకు ఇష్టపడును. చెఱువులలో పడి ఈఁదకపోయినట్లైన వానికి వ్యాధి సంభవించును. పెంపుడు బాతులు, తమ్ము పెంచే వారు తమకుఁ గట్టించిన గూండ్లయందున్న, ఇసుకమీఁదను గ్రుడ్లు పెట్టును. రాత్రిపూఁట వానిని కోళ్లతోఁ గూడ చేర్చి, భద్రముగా ఆ గూఁటిలో విడిచి తాళము వేసి ఉంతురు. రాత్రిపూఁట అట్లు భద్రముగా గదిలో ఉంచి కాపాడనియెడల నక్కలు తిరుగులాడుచు వచ్చి వానిని ఎత్తుకొని పోయి చంపి తినును.

## 23. వ్యాకరణము.

అ, ఆ, ఇ, ఈ మున్నగునవి యొక్కొక్కటియు అక్షరములు. అట్లే క, ష అనునవియు అక్షరములు. ఁ, ం, ః ఇవియు అక్షరములే.

రాముఁడు, సీత, పక్షి, కోట్టైను మున్నగునవి పదములు. పై పదములలో ఎన్ని అక్షరములు ఉన్నవి? రా, పో ఇవియు పదములే.

(1) రాముఁడు సీతను పెండ్లియాడెను. ఇది యొక వాక్యము. ఇట్టి వాక్యముల మఱికొన్ని చెప్పుము.

(2) రాముఁడు రావణుని చంపెను. ఈ వాక్యమును గమనించుచు క్రింది ప్రశ్నలకు జవాబు చెప్పుము. రావణుని చంపినది యెవరు? రాముఁడు ఎవరిని చంపెను? రాముఁడు రావణుని ఏమి చేసెను?

(3) రమణుఁడు ఎద్దులను మేపెను. "రమణుఁడు" అను జవాబు నీవు ఇచ్చుటకు నీకు నేను ఏ ప్రశ్న వేయవలెను?

"ఎద్దులను" అను జవాబు వచ్చుటకు నేను ఏ ప్రశ్న వేయవలెను?

"చంపెను" అను జవాబు వచ్చుటకు నేను ఏ ప్రశ్న వేయవలెను.

పై వాక్యములలో సీతను పెండ్లియాడినది రాముఁడు కాఁబట్టియు, రావణుని చంపినది రాముఁడు కాఁబట్టియు, పశువుల మేపినది రమణుఁడు కాఁబట్టియు 1, 2 వాక్యములలో "రాముఁడు" అను పదము కర్త. 3-వ వాక్యములో "రమణుఁడు" అను పదము కర్త. ఒక పనిని చేయువాఁడు కర్త.

(4) గోపాలుఁడు బడికి పోయెను. బడికి పోయినది ఎవరు? గోపాలుఁడు. కనుక గోపాలుఁడు కర్త.

1-టి వాక్యములో "చంపెను" అనునదియు,
2-వ వాక్యములో "పెండ్లియాడెను" అనునదియు,
3-వ వాక్యములో "మేపెను" అనునదియు,
4-వ వాక్యములో "పోయెను" అనునదియు క్రియలు.

క్రియ అనఁగా ఏమియో చెప్పుము?
క్రియ బదులు వచ్చుటకు ఎట్టి ప్రశ్న వేయవలెను?
కృష్ణుఁడు పాలు త్రాగెను.
త్రాగినది యెవరో అతఁడు కర్త. కృష్ణుఁడు పాలును ఏమి చేసెను? త్రాగెను అనునది క్రియ.

# 24. ఐకమత్యము, బలము.

**గీతము.**

ఒక ముదుసలివాఁడొక యూరిలోన నతని
భార్య బిడ్డలఁగూడి తా బ్రతుకుచుండె
రోగబాధితుఁడై యనురాగమొంది
పుత్రులెల్లరు కలహింప నోర్వలేక
చాలకాలము మనసులోఁ దలఁచి తలఁచి
తుట్టతుదకాతఁ డొకయుక్తిఁ బట్టఁజాలె
అటుల యోచించి పుత్రులందఱనుఁ బిలచి
జగడమాడుట తగదని చాలఁ జెప్పె
తండ్రిమాటల కెంతయుఁ దాళలేక
కారణం బేమిలేక తా గలహమాడ
సాగనాతఁడు వినుఁడని సాంతముగను
చెప్పె తనయుక్తి నిక్కమై చెలఁగునట్లు
మోపుకట్టెలఁ దెమ్మని ముందుఁబెట్టి
విఱువుఁడని వారల నొకరొకరినిఁ బిలచి
చెప్ప నొక్కొకరు నిజ బలంబుఁ జూపి
విఱువఁజాలకఁ బోయిరి వెఱఁగుపడుచు
అట్లు కట్టెల విఱువక నచటయుండు
తనదు పుత్రులనెల్లఱఁ దానుఁ జూచి
పక్కమని నవ్వి కట్టెల నొక్కటొకటి
గాగతీసి విఱువుఁడని కాంచుచుండె
నిమిషకాలంబులో వారు తమ బలంబు
జూపి కట్టెల నొక్కొక రింపుతోఁడ
విఱువఁజాలిరి మిక్కిలి వేడ్కతోను

అప్పుడాతఁడు తనయులఁ దఱిని జేర్చి
బుద్ధి చెప్పె తా నిటువలె పొందుగాను
చూచితిరిగాదె? కట్టల విఱుచుటెంత?
అని తలంచితి రెంతటి పనియటంచు
కట్టెలన్నియు నొక్కటైనట్టి మోపు
విఱువఁజాలితిరే? వానిని వేఱువేఱు
గాఁగజేసి విఱిచితిరి గాకవని యందు
ఐకమత్యంబు బలమని తలఁపుఁడయ్య
మీరలెల్లను నీతీరు పోరుచుండ
లాతివారలు మిమ్ముల నతి సులువున
నాశమొందింపఁ జాలుదు రవనిలోన
కూడియుండిన బలముగుఁ గొమరులార
అటులనే మీరలెల్లను నైకమత్య
మున మెలఁగుచుండ నెవ్వారలైన నెప్పుడు
చేయఁజాలరు చెఱుపును గాయకుండు
డయ్యలారయటంచుఁ దాఁ బలికెనపుడు.

## 25. ద్విపదలు.

(1) ఎందుఁ జూచిన మఱి యే వేళ నైనఁ
గ్రందుగ దేవుండు గదిసియే యుండు.

(2) ఒప్పైనపని సదా యొనరించుచుండు;
తప్పైనపని కెప్డుఁ దలపెట్టఁ బోకు.

(3) కోపంబు కూడదు కులమెల్లఁ జెఱుచు;
నోపిక కుల మెల్ల నోగి వృద్ధిపఱుచు.

(4) గడుసుఁదనంబునఁ గానికార్యములఁ
గడుమెత్తబాటునఁ గావింపవచ్చు.

(5) చీమగుంపులచోలు చెలువొప్ప రేఖ
పామిన తీరున పను లలవడును.

(6) తా నీయఁగలతిండి తగ నిడువాఁడు
పూనికతోఁ జూడఁ బుణ్యాత్ముఁ డిలను.

(7) జననిని జనకు నాచార్యుని వెతకి
దినము మ్రొక్కుము వారు దేవతల్ సుమ్మి.

(8) తమతమ నెలవులు తప్పినఁ దమకుఁ
దమవారె పగవారు తలఁచి చూడంగ.

(9) ధర్మ మెయ్యెడ నైనఁ దనుఁ గాచునెడి
నిర్మలవాక్యంబు నెఱి నమ్మవలయు.

(10) పలుగొండ్లనె విషంబు ఫణికిఁ దేలునకు;
ఖలునకు నిలువెల్లఁ గదరా విషంబు.

(11) ప్రియ మైనసత్యంబె ప్రీతితోఁ బలుకు;
ప్రియ మసత్యము పల్క రీతి గా దెపుడు.

(12) బలవంతుఁడును జెడుఁ బలువురిపగను
జెలిచీమలకుఁ జిక్కు సర్పంబుపగిది.

(13) భయముతో నడువుము భగవంతు నమ్మి;
నయముగా నతఁ డన్ని నలిఁ జోచుచుండు.

(14) మనసు వాక్కును బని మహితుల కొకటె;
కన నీచులకు నవి కడు వేఱు వేఱు.

(15) లేమిని గష్టి తా లెక్కింపఁ బోఁడు;
లేమి కష్టికి లేదు లేశంబు కాని.

(16) విడువ కేపనిని గావించినయేని
కడ కది నెఱవేఱుఁ గాదె తాలిమిని.

(17) వ్యాధియందైనను నప్పునందైన
బాధ తప్పకకల్గుఁ బరిశేషమున్న.

(18) సద్విద్యఁ గొనుటకు జాతి చూడకుము,
సద్విద్య యుండదే చండాలునందు?

(19) సంపద టెంకాయ సలిలంబు భంగి
నింపుగ వచ్చును దెప్పుడో భువిని.

(20) హింస చేసినవాఁడె హింసఁ దా నొందుఁ
గంసునకే హింస కలిగినకరణి.



# TELUGU

# THIRD READER

BY

RAO BAHADUR K. VEERESALINGAM

NEW AND REVISED EDITION

---

# మూడవ వాచక పుస్తకము

ఇది

రాయబహదూర్ కం. వీరేశలింగముపంతులుగారిచేత

సరిచూడఁబడినది.

MACMILLAN & CO., LIMITED

MADRAS, BOMBAY, CALCUTTA AND LONDON

1921

[illegible], 4½ *Annas.*]  [[illegible]

# విషయసూచిక.

—oo⁂oo—

## పాఠములు.

కుక్క తోఁకను జూచియున్నావా? దానికి సంతోషము వచ్చినప్పు డది దాని నాడించును. దానికి నవమానము గలిగి నప్పు డది దానిని కాళ్లనడుమ ముడుచుకొనును. సాధారణముగా నడచునప్పుడు దాని తోఁక జీరాడుచుండును. అతివేగముగాఁ బరుగెత్తునపు డది బిఱ్ఱబిగిసికొనియుండును.

కోపము వచ్చినపుడు కుక్క గుఱ్ఱుపెట్టి కోఱలు చూపును. తనకెప్పుడైన వ్యసనము కలిగిన నది మోర పైకెత్తుకొని యేడ్చును.

మన యిండ్లయందుఁ గుక్కలను, పిల్లులను బెంచుచున్నాము. వీనికిఁగల భేదమును మీరు తెలిసికొనియున్నారా? ఈ రెంటికిని ముంగాళ్లయం దయిదేసి వ్రేళ్లును, వెనుకటి కాళ్ల యందు నాలుగేసి వ్రేళ్లునుండుటయేగాక, పాదములు మెత్తగ నుండును. పిల్లిగోళ్లు మిగుల వాఁడిగనుండును. తన కిష్టము వచ్చి నపుడు పిల్లి, గోళ్లను ముడుచుకొని, లోపలికి లాగుకొనును. గోళ్లు ముడుచుకొనియుండునపుడు పిల్లి కొంచెమైనను చప్పుడు చేయక నడుచును. కుక్క పిల్లివలె చప్పుడులేక నడువఁజాలదు. అది పరుగెత్తునపుడు, దాని గోళ్లు నేలకుఁ దాఁకును. అందుచేఁ జెప్పుడు కలుగుచుండునుగాన దానిరాకను మనము దెలిసికొన వచ్చును.

ఇదిగో చూడు! పిల్లిపాదము ఎదుటిపుట పటమున ముద్రింపఁబడియున్నది. మొదటి పటమున పాదమందలి గోళ్లు బయటికి వచ్చియున్నవి. రెండవ పటమున పాదమందలి గోళ్లు ముడుచుకొనియున్నవి. మూఁడవ పటము కుక్క పాదము. దాని గోళ్లు వెలికి నిగిడియున్నవి గాని, యవి ముడుచుకొనవు.



1 2 3

కన్నులయందును గుక్కకును బిల్లికిని భేదము కలదు. పిల్లి చీఁకటియందుఁ జూడఁగలదు. రాత్రిపూఁట నది తన కన్నులఁ బూర్తిగాఁ దెఱచును. పగటిపూఁట నది కన్నులను కొంచెమే తెఱచును.

కుక్క నాలుకను జూచియున్నావా? అది మృదువుగ నుండును. ఎండలోఁ బరుగిడునప్పుడు నోటిని దెఱచి నాలుకను వ్రేలాడవేయును. అందుండి నీటిబొట్లు క్రిందికిఁ బడుచుండును. మన దేహమందుఁ జెమట పోయునటుల కుక్క దేహముపైఁ జెమట పట్టును. చెమటనీరంతయు నాలుకనుండి క్రిందికిఁ గాఱును. కుక్క నీటిని నాలుకతోఁ జప్పరించును. కాని ఆవువలెఁగాని గేదెవలెఁగాని నీళ్లను పీల్చుకొని త్రాగదు.

**పదములు.**—కుక్క, శునకము, శ్వానము, సృజించుట = పుట్టించుట, ఉపద్రవము = ఆపద, సత్తువ = బలము.

**వ్యాకరణము.** — "కుక్క తన యజమానునిఁ గాపాడును" అను వాక్యమందు కర్త యేది? క్రియ యేది? కుక్క ఎవరిని కాపాడును? తన యజమానుని —దీనికి కర్మయని పేరు. క్రియతో 'ఎవనిని, ఎవరిని, దేనిని, వేనిని' అను ప్రశ్నల నడిగిన, దానికి బదులు వచ్చువాక్యము కర్మ. మన యిండ్లయందు కుక్కలను పెంచుచున్నాము — వేనిని పెంచుచున్నాము? 'కుక్కలను' ఇది కర్మ. ఈ పాఠమందుండు వాక్యములలో కర్త, కర్మ, క్రియలను చెప్పుము.

రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు, రాముఁడు + ఇతఁడు = రాముఁడితఁడు, రాముఁడు + ఎవఁడు = రాముఁడెవఁడు

వాడుక. 1. కుక్కను జంపిన పాపము గుడి కట్టినను బోదు.
2 ఏగులు కట్టలు తెగఁబాఱినను కుక్కకు గతుకుటయే గతి.

## (ii) కుక్కలజాతులు



వేఁటకుక్క.

కుక్కలలో ననేక జాతులు గలవు. ఒక్కొక్క జాతికుక్కయు నొక్కొక్క పనికిఁ బనికివచ్చును. ఈ పటమందుఁ జిత్రించియున్న కుక్క వేఁటకుక్క. దీనికే "పాళెగానికుక్క" (జాగిలము) యనియుఁ బేరు. దీనికి మూతి సన్నగిలి నిడుపై యుండును. దీనికి ముక్కును తోఁకయును నిడుపు. ఇది మిక్కిలి వడిగాఁ బరుగెత్తును. జింకలను నక్కలను గుండేళ్లను వేఁటాడుటకు నుపయోగించును.



గొఱ్ఱెలను గాచెడి కుక్క.

పైన ముద్రించియుండునది మందకుక్క. ఇది గొల్లవానికి నమ్మకమైన తోడు. దీనికి తన యజమానుని మందలోని మేఁకలన్నియుఁ దెలియును. ఇది వానితోఁ గూడఁ బోయి పగలంతయు మంద కాచియుండి సాయంకాలము మంద వెంబడి వచ్చును. ఏదేని యొక గొఱ్ఱె త్రోవవిడిచి తప్పిపోయెనా, ఇది పోయి వెదకి తెచ్చును. తోఁడేలు మందమీఁదకు వచ్చుట్లను గనిపెట్టి గొల్లవాఁడు వచ్చి దానిని బొఱఁదోలుసందాఁక నిది మొఱుఁగు చుండును.

పైవానికన్న మేలయిన జాతి యొకటి కలదు. ఈ జాతి కుక్క పరిమాణమందు మిక్కిలి పెద్దది. ఇది మన దేశమందు లేదు. ఇంగ్లీషువా రుండు దేశమందున్నది ప్రక్క పుటయందుఁ జిత్రింపఁబడియున్న కుక్క యీ జాతిది. ఇది బాగుగా నీఁదఁ గలదు. దీనికి శరీరబలమును బుద్ధిబలమును నెక్కువ. ఎవ



మేలుజాతి కుక్క.

రైనను నీళ్ళలోఁ బడి మునుఁగునపుడు జూచెనా, ఇది నీళ్ళలోఁ దూఁకి యీఁదుకొనిపోయి వెంటనే వానిని బట్టి తెచ్చి యపాయము లేకుండ గట్టుఁ జేర్చును. ఇట్టి యుత్తమ గుణముగల యీ జాతికుక్క యనేకుల ప్రాణములను గాపాడుచుండును.

**పదములు.**—పరిమాణము = కొలఁత, శరీరము = దేహము, ఒడలు.

**వ్యాకరణము.**—(1) కుక్క బాగుగా ఈఁదఁగలుగు (2) కుక్క ప్రాణములను గాపాడును (1) వాక్యమునందు—కుక్క యేమి చేయును? ఈఁదఁగలుగు—ఇది క్రియ ఏది యీఁదఁగలుగు? కుక్క—ఇది కర్త 'దేనిని ఈఁదఁగలుగు' అని ప్రశ్న వేసిన దానికి బదులు లేదు. అట్టి ప్రశ్నయే లేదు. కావున నీ వాక్యములో 'కర్మ లేదు' ఇట్టి క్రియ **అకర్మకము.** (2) వాక్యమునందు 'కుక్క దేనిని గాపాడును' అని ప్రశ్న చేసిన బదులు 'ప్రాణములను' అని వచ్చును ఇది '**సకర్మకము**' అకర్మకము=కర్మలేనిది సకర్మకము=కర్మగలది. పై పాఠము నుండి కొన్ని యకర్మకములు, కొన్ని సకర్మకములు చెప్పుము.

ఇది + ఏమి = ఇది యేమి, ఇదేమి; మఱి + ఏది = మఱేది, మఱియేది.

**పరపడి.** అగడ్తలోపడిన పిల్లికి అదే వైకుంఠము.



# 2. కుక్కల కథలు.

## (iii) వర్తకుఁడును, వాని కుక్కయు

ఒకానొకప్పుడొక వర్తకుఁడు గుఱ్ఱముమీఁద నెక్కి కుక్కను దన వెంటఁబెట్టుకొని పోవుచుండెను. వానియొద్ద నొక సంచి నిండఁ బయికమును, నొక తుపాకియు నుండినవి.

ఆ వర్తకుఁడు కొంతదూరము పోయి, భోజనము చేయుటకై యొక యేటియొడ్డున విడిసెను. అతఁడు భోజనముచేసిన తర్వాత రూకలసంచిని దనప్రక్క నుంచుకొని, కొంతసేపు నిద్రపోయి ఆవల మేలుకొని ఆ సంచిని మఱచి, గుఱ్ఱముమీఁద నెక్కి పయనమైపోయెను.

అతని కుక్క యా సంచిని జూచి తన యజమానునికి దానిగూర్చి దెలుపుటకై గట్టిగా మొఱుఁగుచుండెను, గాని, వర్తకుఁడు దాని యభిప్రాయమును దెలిసికొనజాలక తన త్రోవనే పోవుచుండెను.

ఈలోఁగా నాకుక్క గుఱ్ఱమును నిలుపవలెనను నుద్దేశముతో దానికాళ్లు పట్టుకొని కఱవఁబోయెను. అది చూచి వర్తకుఁడు తన కుక్కకు పిచ్చియెత్తిన దనుకొని తుపాకితో దానిని గాల్చెను.

పిమ్మట నా వర్తకుఁడు కొంతదూరము పోయి రూకలసంచి కనఁబడక పోయినందున నేటియొడ్డున దానిని మఱచివచ్చిన సంగతి యతని కప్పుడు జ్ఞప్తికివచ్చినది. అంత నతఁడు తాను వచ్చినత్రోవనే మరల నచ్చోటికి వెళ్లెను.

అచ్చటఁ దన కుక్క యొడలంత నెత్తురై పడి యుండెను. తన్నుఁ గాల్చినతోడనే అది నడువలేకున్నను దిన్నఁగాఁ

బోయి పైకమున్నచోటును జేరి దానిని గనిపెట్టి యుండెను ఇప్పుడది తన యజమానుని రాక తెలిసి సంతోషించినదై నిస్సత్తువతోఁ దోఁకాడించుచుఁ బ్రాణములు విడిచెను. ముందు వెనుకలు యోచింపక తన కుక్కను జంపుకొన్నందునకు వర్తకుఁడు చాల వగచెను.

## (IV) ధైర్యముగల కుక్క.

మన చక్రవర్తిగారుండు దేశమునకు నింగ్లాండు దేశమని పేరు గదా! ఆ దేశములోఁ బూర్వమొక రేవుపట్టణమునకు సమీపమున గాలివానచే నొక యోడ దరిని దాఁకెను. గాలివాన కొట్టినపుడు సముద్రములోని యలలు భయంకరముగా పైకిలేచుచుండెనుగాన నోడలోనున్న యెనమండ్రు మనుష్యులు "రక్షింపుఁడో! మమ్ము రక్షింపుఁ"డని మొఱపెట్టుచుండిరి.

వారికి సాహాయ్యము చేయుటకై పడవను దీసికొనిపోవ నెవరికి శక్యముగాకుండెను. ఇట్లుండగా నా సముద్రపుటొడ్డునకు నొక్క పెద్దమనుష్యుఁడు కుక్కను దన వెంటఁబెట్టుకొని పోయి, చిన్న కఱ్ఱ నొకదాని నా కుక్క నోటిలోఁ బెట్టి, దాని కాయోడను జూపెను. తెలివిగల యీ కుక్క వెంటనే తన యజమానుని యభిప్రాయమును గ్రహించి మిగుల ధైర్యముతో సముద్రములో దుమికెను. అలలప్పుడు దానిని మ్రింగునట్లుండెను. భయంకరములగు నలలను నా కుక్క లక్ష్యపెట్టక యీఁదుకొని పోయి యోడను సమీపించెను.

ఆ యోడలోనివారు చాల సంతసించి మరియొక కఱ్ఱకొక త్రాడు గట్టి, దానిని కుక్కయొద్ద విసరివేసి, త్రాటిని దాము పట్టుకొనియుండిరి. సూక్ష్మబుద్ధిగల యీ కుక్క వారి యుద్దేశ

మును క్షణములో నూహించి తెలిసికొనినదై, యాఁడకుక్క దననోట నుంచిన కఱ్ఱను విడచి యోడలోనివారు విసరివేసిన కఱ్ఱను నోటఁ గఱచుకొని, యీఁదుకొనిపోయి దానిని తన యజమానున కొప్పగించెను.

దీనివలన ఓడలోనుండి యొడ్డునకు రాకపోకలకు వీలేర్పడెను. అందుచే నోడలోనివారొడ్డుచేరి తమ ప్రాణములఁ గాపాడుకొనిరి.

**వచనరచన** — కుక్క విశ్వాసమును దెలుపు మఱికొన్ని కథలను చెప్పఁడు

**పదములు**—గుఱ్ఱము, అశ్వము, హయము, అలలు, తరంగములు, వగచెను = వెనుక చింతించెను, అనుతాపపడెను

**వ్యాకరణము:** — వర్తకుఁడు గుఱ్ఱము నెక్కి కుక్కతోడ బెజవాడకుఁ బోవుచుండెను. పై వాక్యమందు "వర్తకుఁడు"—ఒక పనిచేయువాని పేరు, గుఱ్ఱము, కుక్క—జంతువుల పేర్లు, బెజవాడ—ఊరి పేరు మనుష్యుని పేరుగాని, జంతువు పేరుగాని, ఊరి పేరుగాని, వస్తువు పేరుగాని తెలుపు పదమునకు 'నామము' అని పేరు ఇట్టివి పది నామములు వ్రాయుము.

వానికిన్ + ఇచ్చెను=వానికిచ్చెను, వానికినిచ్చెను.

**వరవడి.** — అన్నపుచోరవే గాని అక్షరపుచోరవ లేదు.

# 3. చిలుక.

చిలుక పక్షిజాతిలోఁ జేరినది. అది మిగుల సుందరమైనది. అది యాకుపచ్చ వన్నెకలది. దాని మెడచుట్టు నెఱ్ఱని రేఖ యుండును. చిలుకలలో తెల్లవికూడ కొన్ని కలవు. ఈ జాతి చిలుకల తలమీఁదఁ గొన్ని యీఁకలు జుట్టువలె నేర్పడి యుండును.

పక్షులకును, మృగములకు నుండు భేదమునుగూర్చి మీరిదివఱకె రెండవ వాచక పుస్తకమునఁ జదివియున్నారు.



చిలుక యీకలు పచ్చగ నుండును. దానికి ఱెక్కలు రెండు; తోఁక యొకటి; కాళ్లు రెండు. దాని కన్నులు తళతళమని మెఱయుచుండును. చిలుకముక్కు మనము సాధారణముగాఁ జూచే పక్షులముక్కులవలె నుండదు. దాని ముక్కును పటమున గమనించి చూడుఁడు. దాని కొన వట్రువదై కొక్కి (కొంకి) వలె నుండును.

చిలుక చెట్లకొమ్మలందు వాసముచేయుచుండును. అది తన యాహారమును జెట్లయందే సంపాదించుకొనును. కనుక నొక కొమ్మనుండి వేఱొక కొమ్మకు నెగురుచుండును. అది తన ముక్కుతోఁ గొమ్మ నందుకొని, తన దేహమునంతటిఁ పైకి నెక్కించి, కొమ్మను మొదట నొక పాదముతోను, దరువాత రెండవ పాదముతోను బట్టుకొనును.

చిలుక చెట్ల నెక్కునపుడు జాగ్రత్తతోను, మెల్లగాను నెక్కును. చిలుక కాలివ్రేళ్లు ముందుప్రక్క రెండును, వెనుక ప్రక్క రెండును నుండును. చిలుక కిట్టి కాలివ్రేళ్లు భగవంతుఁడేల సృజించెనో నీ కిప్పుడు తెలిసినదా?

మనుష్యులు చిలుకలను బట్టి తెచ్చి పంజరములయందుంచి పెంచెదరు. అంత నవి మచ్చికపడును. అప్పుడు బిడ్డలకువలె వానికి మాటలు నేర్పవచ్చును. వాని నాలుక కొంచెము మన నాలుకవలె నుండును. కాని యవి తెలిసి మాటలాడనేరవు. ఈ కారణమునుబట్టి యెవ్వఁడైనఁ దాను జెప్పుదాని యర్థముఁ దెలిసికొనక మాటలాడినట్టైన నట్టి మాటలు "చిలుక పలుకుల వంటి"వని చెప్పుదురు.

చిలుకలు మామిడి, అరఁటి మున్నగువాని పండ్లను, గట్టి పలుకులుగల గింజెల దినుసులను బగులఁ గొఱుకఁ గలవు. అవి పండ్లను దినునపుడు చూచియున్నావా? అవి యొంటికాలిపై నిలుచుండి రెండవకాలితోఁ బండును నోట నుంచుకొనును.

అడవులయందున్నప్పుడు చిలుకలు గుంపులుగూడి యిక్కడి కక్కడికి నెగసిపోవుచుండును. చిలుకలు, జెట్లయాకులవలె పచ్చగానుండుటచే జెట్లమీఁద అవి కూర్చున్నప్పుడు వానిని దెలిసికొనుట కష్టము.

**పదములు**—చిలుక = శుకము, కీరము

**వ్యాకరణము:**—చిలుక పచ్చని ఱెక్కలును, ఎఱ్ఱని ముక్కును గలది. ఇందలి ఱెక్కలయొక్క గుణమును 'పచ్చని' అను పదమును, ముక్కుయొక్క గుణమును 'ఎఱ్ఱని' అను పదమును తెలుపుచున్నవి. అనగా ఎట్టి ఱెక్కలు? పచ్చని ఱెక్కలు. ఎట్టి ముక్కు? ఎఱ్ఱని ముక్కు. ఇందలి 'పచ్చని' 'ఎఱ్ఱని' అనునవి విశేషణములు. విశేషణమనఁగా నేమి? ఒక వస్తువుయొక్క గుణమును దెల్పునది.

మంచి—చెడ్డ—పెద్ద—చిన్న—తెల్ల—నల్ల—ఈ పదములం జేర్చి వాక్యములు వ్రాయుడు.

**సామెత.** – ఇంటి దొంగను ఈశ్వరుండైనా పట్టలేఁడు.

## 4. చిలుక, కాఁపువాఁడు.

ఒక కాఁపువాఁడొక చిలుకనుబట్టి తెచ్చి పంజరములో నుంచి మాటలు నేర్పి గారాబముతోఁ బెంచుచుండెను. ఆ చిలుకయు మచ్చికపడి వాని మాటలకు బదులు సెప్పుచుండెను. ఆ కాఁపు పొలమునకుఁ బోయి యుండునప్పు డొక దొంగ యా చిలుక నపహరించుకొనిపోయెను.

కాఁపువాఁ డింటికివచ్చి చూడఁగాఁ జిలుక లేదు. అది మొదలు వాఁ డెక్కు-వవ్యసనముతో నూరంతయు వెదకెను. కడపట యొకని యింటఁ దన చిలుక యుండఁగాఁ దెలిసికొని వాఁడా యింటివానిఁ జూచి "యిది నా చిలుక; నీవెట్లు తెచ్చితివి? నా చిలుకను నా కిమ్ము" అని యడిగెను. వాఁడు కాఁపువానిం జూచి "ఓరీ! నీది కా దిది. దీనిని నే నీయను పొమ్ము" అనెను.

కాఁపువాఁడా యూరి న్యాయాధిపతికడ పిర్యాదుచేసెను. ఆ న్యాయాధిపతి వాదిప్రతివాదులను బిలచి "మీకు సాక్షులున్నారా" యని యడిగెను. అందులకు వాది "నాకు నా చిలుకయే సాక్షి" యనెను. అంత న్యాయాధిపతి చిలుకను రప్పించి వాదిని జూచి "నీ సాక్ష్యమును రుజువుపఱుపుము" అని యడిగెను. వాది చిలుకను జూచి 'నాకొక ముద్దిమ్మ'నెను. వెంటనే చిలుక వానిచేత నెగిరి కూర్చుండి ముద్దిచ్చెను.

ప్రతివాది యిది చూచి 'యిది యొక సాక్ష్యమా? నన్ను నామాత్రమది ముద్దుపెట్టుకొనదా?' యనెను. న్యాయాధిపతి ప్రతి

వాదిం జూచి 'నీవు నక్లు చేసి చూపుమ'నెను. ప్రతివాది చిలుకను జూచి 'న్నాకొక ముద్దిమ్ము' అని యడిగెను. ఆ చిలుక వానిపై కెగిరి భుజముపైఁ గూర్చుండి, వాని ముక్కును పట్టుకొనఁ గొఱికి నెత్తురు గ్రాఱునట్లు చేసెను. అంతటఁ బ్రతివాది యవమానముచేఁ దలవంచుకొనెను.

న్యాయాధికారి చిలుకను వాదికిచ్చి, ప్రతివాదిని దండించి, చిలుక తెలివిని మిక్కిలి పొగడెను. సభవారందఱు నీవింతను గొనియాడుకొనుచు నింట్లకుఁ బోయిరి.

**వచనరచన.**—ఈ కథను నీ సొంతమాటలతోఁ జెప్పము లేక వ్రాయుము.

**వ్యాకరణము.**—చిలుక చెట్టున నుండెను. చిలుకలు చెట్టునఁ గూర్చుండి యుండెను. (1) మొదటి వాక్యమున 'చిలుక' అనునది యెన్నిటిని దెలుపును? ఒకటిని. రెండవ వాక్యమున 'చిలుకలు' అనునది యెన్నింటిని దెలుపును? ఒకటి కంటె హెచ్చినవానిని. ఒకటిని దెలుపుపదము **ఏకవచనము.** ఒకటికన్న హెచ్చు సంఖ్యను దెలుపునది **బహువచనము.** పలక, పుస్తకము, పేనా, తలుపు—వీనికి బహువచనములను జెప్పుము.

కాదిది = కాదు + ఇది; కాఁపువాఁడు + ఇంటికి = కాఁపువాఁడింటికి.

**సామెత.**—చిలుక తన ముద్దేగాని యెదుటి ముద్దు కోరదు.

# 5. ఆరోగ్యమార్గము.

## (i) ఆహారము.

మనము అనుభవించెడి మేలులన్నిటిలో నారోగ్యము మిక్కిలి శ్రేష్ఠమైనది. నీ వారోగ్యవంతుఁడవై యుండఁగోరితివేని, నేను జెప్పెడి మాటలను శ్రద్ధతో నాలకింపుము. నీవు యారోగ్యకరమగు మంచి యాహారమును మాత్రమే భుజించి స్వచ్ఛమైన గాలిని బీల్చి నిర్మలోదకమును ద్రాగవలెను. నీ దేహమును నీ వస్త్రములను గూడ శుభ్రముగా నుంచుకొనవలెను.

నీవు పనిచేయునప్పుడెల్ల, నీ శరీరములోఁ గొంత భాగము తఱిగిపోవును. అట్లు తగ్గు భాగము మరల పెఱుగుటకు నీ వాహారమును భుజింపవలసియున్నది. మన యొడలు వెచ్చఁగా నుండునట్లు చేయుటకుఁ గూడ మన మన్నమును దినవలసి యున్నది. బాలురు నానాఁటికిఁ బెరిఁగి పెద్దవారగుటకు సయి తము వా రన్నమును దినవలసి యుండును.

పసిపిల్లలకు పాలు దివ్యమైన యాహారము. వారికంటెఁ బెద్దవారగువారు పలుదెఱఁగులగు ధాన్యములను భుజింతురు. చక్కఁగాఁ బండిన పండ్లుకూడ మనుష్యులకెల్ల నుత్తమమైన యాహారము. అయినను బచ్చికాయలనుగాని మిగుల మ్రాఁగి కుళ్లినపండ్లనుగాని దినుపక్షమున వ్యాధులు వచ్చును. పిల్లలు ఇట్టివానిని దినుటవలననే తఱచుగా జబ్బుపడుచుండెదరు. వండినపదార్థములు కొంతసేపటికి ననారోగ్యకరములగును. రోగములు ప్రబలమైయుండు కాలమందు జనులు తాము భుజించెడి యాహారమునుగూర్చి మిక్కిలి జాగరూకులుగా నుండవలయును.

నీవు యాహారపదార్థములను జెక్కఁగా నమలవలెను. బాగుగ నమలక ఏవస్తువును నెప్పుఁడును మ్రింగఁగూడదు. ఇదియునుగాక నీవు నియమితసమయములందు మాత్రమె యాహారమును భుజింపవలెనుగాని, వేళతప్పి యెన్నఁడును దేనిని దినరాదు.

## (ii) నీళ్లు.

మనుష్యుల కాహారమునకంటె నీళ్లెక్కువగాఁ బ్రాణా ధారమై యున్నవి. మన దేహమందలి విశేషభాగము జల

రూపమున నున్నది. మనము పానముచేయునట్టి యుదకము మన రక్తముతోఁ గలసి దేహమంతటను వ్యాపించును. మనము మురికినీటిని త్రాగినయెడల, త్వరలోనే జబ్బుపడుదుము.

నిర్మలమైన నీరు స్వచ్ఛముగను రంగులేకయు రుచిలేకయు వాసనలేకయు నుండును. ఆకసమునుండి కురియువర్షబిందువులు మిక్కిలి స్వచ్ఛముగా నుండును; కాని యా వాననీరు నేలమీఁద నైనను భూమిలో నింకియైనను బాఱునపుడు తఱచుగా మురికి యగును. లోఁతులేని బావులలోని నీళ్లు సాధారణముగా మంచివికావు. వాని చుట్టునున్న మురికినేలయొక్క పైభాగమునుండి పారు నీరు ప్రాయికముగా వానిలోఁ బడుచుండును. అట్టి మురికినీళ్లు వచ్చి కలియకుండునట్లు బావులన్నిటిచుట్టును గొంచెమెత్తైన గోడను గట్టవలెను. నూతులకు మిక్కిలి దగ్గఱగా వృక్షాదులుండఁగూడదు. వాని యాకులు గాలికిఁ గొట్టుకొనివచ్చి నూతులలోఁ బడెనేని యచ్చట నవి కుళ్లి నీళ్లను జెఱుచును. చెఱువులలో బట్టల నుదుకుటవల్లను స్నానాదులను జేయుటవల్లను బశువులఁ గడుగుటవల్లను వానిలోని నీరు మురికి యగును.

ప్రక్కపుటలోనుండు పటము దేనినిసూచించునో చెప్పఁగలవా? అది యొక నీటిబొట్టుయొక్క పటము. సూక్ష్మపదార్థములను బెద్దవిగా నగపఱుచు నొక యద్దముతో నొక నీటిబొట్టును మనము పరీక్షించితిమేని, అది యా పటమందు నున్నట్లగపడును. మిక్కిలి సూక్ష్మములగు జంతువులును మొక్కలును నీ నీటిచుక్కలో నెన్ని యున్నవో చూడుము. మురికినీళ్లను త్రాగువారు వేనవేలుగ నుండునట్టి యిట్టి చిన్న జంతువులను నెం...



లను నన్నిటిని ద్రాగుదురు. అట్లు చేయుట యారోగ్యము గాదు. మనుష్యులకు మంచి యాహారమును దినుటయు నెట్లావశ్యకమో, నిర్మలోదకమును ద్రాగుటయు నట్లే యావశ్యకము.

నీళ్లను సలసల కాచినయెడ నవి నిర్మలములగును. అట్లు కాచిన పిమ్మటనే యవి పానయోగ్యములగును. ఏ వ్యాధియైనను బ్రబలుచుండుకాలమున జను లెల్లరు ముఖ్యముగా నీటిని శుభ్రపరుపవలెను. నీళ్లను సలసల కాచినప్పుడు వానిలోనున్న చిన్న జంతువులును మొక్కలును జచ్చి నీళ్లు నిర్మలమగును. ఇట్లు బాగుగ గాచిన నీళ్లను జనులు చల్లార్చుకొని త్రాగుట యుక్తము. వేడినీళ్లు రుచ్యములైయుండవు

పదములు — ఆరోగ్యము = రోగములు లేకుండుట, ఆలకించి = విని; శ్రేష్ఠతమము = మిక్కిలి మేలయినది, ఉదకము = నీరు, నిర్మల + ఉదకము = నిర్మలోదకము — తేటనీరు; ప్రాణ + ఆధారము = జీవమునకు ఆదరువు; పానయోగ్యము = త్రాగుటకు తగినది; రుచ్యములు = కమ్మగానుండునవి.

వ్యాకరణము:—బండి, ఏకవచనము—బండ్లు, బహువచనము. కంకి, ఏకవచనము—కంకులు, బహువచనము. పిల్లి, ఏకవచనము—పిల్లులు, బహువచనము.

పండు, ఏకవచనము—పండ్లు, బహువచనము ముల్లు, ఏకవచనము—ముండ్లు, బహువచనము.

వరవడి — కడుపునిండా గారెలుతింటే వంటినిండా జ్వరము.



## 6. కాకి.

పక్షులన్నిటిలోఁ గాకి మిక్కిలి సాధారణమైనది. అది ప్రతి దేశమందును గలదు. అది యడవులయందు నివసింపక మనుష్యులు నివసించు స్థలములయొద్ద గూఁడు కట్టుకొని వసించుచుండును. పొడవైన చెట్లపైననే యవి సాధారణముగా గూండ్లు కట్టుకొనును. గడ్డిపరకలు, కఱ్ఱపుల్లలు మున్నగునవి తెచ్చి గూఁడు కట్టుకొనును. బొంబాయిలో నిటీవలఁ గొన్ని కాకులొక యంగడినుండి సులోచనముల చట్టములు దొంగిలించుకొనిపోయి, వానితో గూండ్లు కట్టుకొనెనని వార్తాపత్రికలవలనఁ దెలియుచున్నది.

కాకి నల్లగానుండును. మన దేశమందున్న కాకులలో రెండు జాతులు కలవు. అందు కాకోలము పెద్దదిగాను నెక్కువ నల్లగాను నుండును. సాధారణమైన కాకి దానికంటెఁ గొంచెము చిన్నదిగానుండును. దాని మెడ చుట్టును గొంచెము తెల్లగా నుండును.

తల్లికాకి మొదట గూటిని నిర్మించి పిదపఁ గ్రుడ్లు పెట్టును. ఒక్కొక్కదినము నొక్కొక గ్రుడ్డు పెట్టును. ఈ గ్రుడ్లు బూడిద రంగు మచ్చలతోఁగూడి నీలవర్ణముగలవిగా నుండును. ఇట్లు మూడు నాలుగు గ్రుడ్లు పెట్టినతర్వాత నవి పిల్లలగువఱకుఁ దల్లికాకి వానిపైఁ గూర్చుండును. ఇటులు గూర్చుండుటచే నా గ్రుడ్లకు వెచ్చన గలుగును. తండ్రికాకి తన భార్యకు నెర సంపాదించి తెచ్చి యిచ్చుచుండును. కాకి పిల్లలు మిక్కిలి నలుపు గానున్నను, వాని తల్లి కవి చాల సుందరములుగాఁ గనుపించును. కనుకనే 'కాకిపిల్ల కాకికి ముద్దు' అను సామెత వాడుకలో నున్నది. వానికిఁ దల్లిదండ్రికాకు లాహారమును దెచ్చి నోటఁ బెట్టుచుండును. పిల్లల కొకనెల నిండఁగానే యవి యెగురఁగలిగి తమంతటఁ దా మెర సంపాదింపఁబోవును.

కాకము మనకు మిక్కిలి ప్రయోజనకారియగు పక్షి. అది వీథినూడ్చువానిపనినిఁ జేయును. అది యే పదార్థమునైనను దినును; కీటకములు మొదలగువాని నెల్లపుడును దినఁ జూచుచుండును. అది చిట్టెలుకలు, బల్లులు, కప్పలు మొదలుగాఁగల చిన్న జంతువులను సహితము పట్టుకొని తినును. అది మొక్కజొన్నలు మొదలైన ధాన్యముల నన్నిటిని దఱచుగా దొంగిలి కొనిపోవుచుండును. తనకు సాధ్యమైనయెడల నది పక్షుల పిల్లలనుగూడ నెత్తుకొని పాఱిపోవును.

కాకి సాధారణముగా మన యిండ్లయొద్దనే తిరుగుచుండి యెంగిలియన్నము మొదలగు పదార్థములను దినుటకుఁ గాచుకొనియుండును. అది తఱచుగా మన యిండ్లలోనికి వచ్చి తనకుఁ దొఱికిన చిన్న పదార్థములనన్నింటి నపహరించి పాఱిపోవుచుండును. కాకి యొకానొకప్పుడు పశువుల వీఁపుమీఁద నెక్కి వానిని బీడించు పురుగులను ముక్కుతోఁ బొడిచి తినుచుండును.

కాకు లెన్నఁడు నొంటరిగానుండక గుంపుగాఁ గూడియుండును. రాత్రులం దవి యనేకము లొక్క చెట్టుమీఁదనే నిద్రింపును. చీఁకటి క్రమ్ముకొనుచున్న సమయమున నవి యొండొంటితో మాటాడుకొనుచున్నవో యన్నట్లు "కావు కావు" అని చాలసేపు కూసి పిదప నిద్రపోవును. వేఁగుజామున నవి మరల నొండొంటితో నొక కొంతసేపు మాటలాడుకొనిన పిమ్మటఁ దమ యాహారమును సంపాదించుకొనుటకు లేచిపోవును. కాకులబాధ మెండయ్యెనేని మనుష్యులు వానిలో నొకదానిని జంపి యొకచోట వ్రేలాడఁగట్టుదురు. అది యక్కడ నున్నంత కాలము మఱి యే కాకిగాని యచ్చటికి వచ్చుటకు వెఱచును.

**పదములు.**—కాకి, వాయసము, కరటము, చిరజీవి, ఏకదృష్టి, ఆత్మఘోషము ఇవి కాకి పేళ్లు

**వ్యాకరణము:**—

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| కాకి | కాకులు |
| తల్లి | తల్లులు |
| తండ్రి | తండ్రులు |
| పక్షి | పక్షులు |

[1] ఇకారము కడపటగల పదములలోని ఇ బహువచన ప్రత్యయము 'లు' చేరుటకుముందు 'ఉ' గా మారును.

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| గూడు | గూండ్లు |
| గ్రుడ్డు | గ్రుడ్లు |

దేశమందును+కలదు=దేశమందును గలదు, వానికంటెన్+కొంచెము = వానికంటెఁ గొంచెము; పక్షులన్నిటిలోన్+కాకి = పక్షులన్నిటిలోఁ గాకి, తమ+ఆహారము = తమ యాహారము, ఒకదానిని+చంపి=ఒకదానిని జంపి.

సామెత.—కాకి పిల్ల కాకికి ముద్దు.

## 7. కాకి, పిచ్చుక.

ఒక వనమునందొక కాకియుఁ బిచ్చుకయుఁ జెలిమిగలిగి యొక చెట్టుననే నివసించియుండినవి. అవి యొకనాఁడు వన భోజనము చేయవలయునని తలఁచినవి. వెంటనే పిచ్చుక బియ్యము తెచ్చినది. కాకి తక్కిన సామగ్రులు తెచ్చినది. పిచ్చుక వంటకత్తెగానుండి వంటఁ జేసినది. పిండివంటలన్నియు సిద్ధముకాఁగానే కాకి తన భాగమునిమ్మని యడిగెను. పిచ్చుక కాకిని జూచి 'ఎవరైనను నీవలె స్నానముచేయక, కాలుసేతు లైనఁ గడుగక భోజనమునకు వత్తురా? నీ యొడలు నల్లగా నున్నది. నీ మెడయంతయు బూడిదెతోఁ గప్పినట్లున్నది. చెఱువునకు వెళ్లి స్నానముచేసి రమ్ము' అని గద్దించెను.

ఆ మాట యన్నందునకు మొదటఁ గాకికిఁ గోపము వచ్చెను. కాని యది కోపము నణఁచుకొని యొక చెలమకడకేగి

'ఓ చెలమ, నీరిమ్ము స్నానమ్ముసేయ
నీ పేరు చెలమమ్మ, నా పేరు కాకి'

అని పాడి 'అమ్మా! నీవు కొంత నీరిచ్చితివేని, నా ముక్కును గాళ్లను గడిగికొని నేను విందారగించెదను. నేను బరిశుభ్రముగా నున్నను నన్నీపిచ్చుక యశుభ్రమని చెప్పుచున్నది' యనెను.

చెలమ యా మాటలు విని 'ఓ కాకమా! యట్లే నీరిచ్చెదఁగాని, నీవు మొదట జింకకడకేగి దాని కొమ్ము నడిగి తెమ్ము. ఆ కొమ్ముతో నన్నుఁ ద్రవ్విన నీకుఁ దేటనీరు దొఱకును' అనెను.

ఆ మాట విని కాకి యెగిరి జింకకడకుఁ బోయి 'యో జింకా! నీ కొమ్ము నిమ్ము. నేను దానితోఁ ద్రవ్వి చెలమలో మట్టిఁదీసి యందూఱిన నీటిలో స్నానముఁజేసి, పిచ్చుకతోఁగూడి నేను విందుభోజనము చేసెదను' అని యా జింక నడిగెను.

అందులకు జింక 'యట్లే నా కొమ్ము నీ కిచ్చెదను; కాని మొదట నీవు గోవుదగ్గఱకు వెళ్లి పాలు కొంచెము నాకిమ్మని యడిగి తెమ్ము. నే నాపాలు త్రాగిన బాగుగ బలిసియుందును. అప్పుడు నీవు నా కొమ్మును విఱుతువేని నాకు నొప్పియెత్తదు' అని యనెను.

కాకి యా జింకపలుకు లాలకించి, యావుకడకేగి 'యో గోవా! నేను నీకడఁ బనిపడి వచ్చితిని. నాకు నీ పాలు కొంచెమిమ్ము. నే నాపాలు గొనిపోయి, జింకకిచ్చి, జింకనడిగి దాని కొమ్మును దీసికొని, చెలమఁదీసి, అందూఱిన నీటిలో ముక్కుకాళ్లు గడుగుకొని పిచ్చుకతో విందారగింపఁ బోయెదను' అని యనెను.

ఆ యావు కాకి పలికిన మాటలను విని "సరేకాని నాకు ముందుగాఁ బచ్చిక దెచ్చియిమ్ము. కసవు (గడ్డి) మేయకయే యావు పాలిచ్చునా? ముందుగాఁ బచ్చికఁ దెమ్ము" అనెను.

కాకియు మిక్కిలి యాత్రముతోఁ బచ్చికను జూచి 'యో పచ్చికా! నా కైదాఱు దుంపల (పరక, దుబ్బుల) నిమ్ము. దానిని గొనిపోయి యావునకు వేసి, దానినడిగి పాలు దీసికొని యది జింకకిచ్చి, దాని నడిగి కొమ్ము దీసికొని చెలమలోఁ దవ్వి

యందలి తేఁటనీటితో నోడలు కడుగుకొని పిచ్చుకతో విందార గింపఁ బోయెదను' అని యడిగెను.

పచ్చికయు 'కాకమా! నీకుఁ గడ్డినిచ్చుటకు నాకేమి యాటంకము లేదుగాని, కమ్మరి నడిగి దోకుడుపాఱ (త్రవ్వ కోల) యొకటి చేయించి తెమ్ము' అనెను.

కాకి కమ్మరికడకుఁ బరుగెత్తిపోయి, 'నాకొక దోఁకుడు పాఱ చేసియిమ్ము. నేను దానితోఁ బచ్చికఁ ద్రవ్వి, దానిని గొనిపోయి, యావునకు వేసి, పాలుఁదీసి జింకకుఁ బోసి, దాని కొమ్మును దీసికొని దానితోఁ జెలమ దీసి, యందలి నీటితో నోడలు కడిగికొని పిచ్చుకతోడ విందు గుడువఁబోయెదను' అని ప్రార్థించెదను.

కమ్మరీఁడును 'కాకమ్మా! యట్లే చేసియిచ్చెదను గాని కొలిమిలో నిప్పువేసి, మంటఁబెట్టి కొలిమితిత్తి యూదుము' అనెను.

కాకియు మిగుల సంతసముతో దాని నూదఁబోయి కొలిమిలోఁబడి, తన కొండంత యాశతోడ మాడిపోయెను.

పిచ్చుక దానొకటియే వంటచేసినదంతయుఁ దినెను.

వ్యాకరణము:—

నేను మాట్లాడుచున్నాను.
నీవు మాట్లాడుచున్నావు
వాఁడు మాట్లాడుచున్నాఁడు.

నేను, నీవు, వాఁడు ఈ పదములనుగూర్చి యోచింపుడు

ఈ పదముల నుపయోగించి వాక్యముల వ్రాయుము.

ఈ క్రింది వాక్యములలో రాముఁడు మాట్లాడువాఁడు; కృష్ణునితో మాట్లాడుచున్నాఁడు, శంకరుఁ డను పిల్లవాఁడు వీరితో చేదువుకొను బాలుఁడు:—

రాముఁడు:—కృష్ణా, నీవు పోయి శంకరుని పిలుచుకొనిరా. నేను వానితో చేదువుకొనవలయును. వాఁడు పుస్తకములను తెచ్చుటకు పోయియున్నాఁడు.

మేము, మనము, మీరు, తమరు, వారు ఇవి బహువచనములు
వీనిని ఉపయోగించి కొన్ని వాక్యములు వ్రాయుము.

౯వడి.—కాకి గండాగొండిగాని కోకిల పిరికి.



# 8. ఆరోగ్యమార్గము.

## (iii) వాయువు.

మనకాహారము లేకపోయినను బెక్కునాళ్లు సజీవులమై యుండఁగలముగాని పీల్చుటకు గాలి లేనియెడలఁ గొన్ని నిమిషములలోనే మనము చనిపోవుదుము. మనకెట్లు గాలి యుండుట యత్యావశ్యకమని యెల్లరకుఁ దెలియునుగాని, మన మాఘ్రాణించుట కెట్టి గాలియైనను బనికివచ్చునని యనేకు లనుకొనెదరు. ఇది గొప్ప పొరపాటు. ముఱికినీళ్లను మనమెట్లు త్రాగఁగూడదో యట్లే మనము చెడ్డగాలిని బీల్చుచుండరాదు. కొన్ని పదార్థములు విషములు; గనుక మనము వానిని దింటిమేని యవి మన చావునకు మూలము లగును. ఆ ప్రకారముగానే గాలి యొకానొకప్పుడు విషమువలెఁ బని చేయును. అట్టి విషవాయువు నాఘ్రాణించినచో మనుష్యులకుఁ జేటు మూఁడును.

కొందఱాకస్మికముగా నీళ్లలోఁబడి మరణమునొందెదరు. దీనికిఁ గారణమేమి? వారు నీళ్లలోఁ బడినప్పుడు వారాఘ్రాణించుటకు గాలి దొరకదు. వారికి నూపిరి యాడదు.

మనుష్యులవలెనే పశువులు మొదలుగాఁగల సకల ప్రాణులును వానిచుట్టునున్న గాలి నాఘ్రాణించి చెడ్డగాలిని విడుచుట వలన గాలి [illegible]

లగు మంటలును గాలిలో వెలుఁగుటవల్ల గాలిని చెఱుచుచుండును. ముఱికివస్తువులన్నియుఁ గూడ గాలి నపరిశుద్ధపఱుచుచుండును.

మనుష్యులు రాత్రులందు నిద్రించునపుడు తామాఘ్రాణించుటకుఁ గావలసినంత గాలిని దాము నిద్రించు గదులకు రానీయక తమకుఁదామే కీడుచేసికొందురు. మన యిండ్లలోనికి మంచిగాలి రాకుండునట్లు మన గదుల తలుపులను గిటికీలను మనము గట్టిగా మూసికొనరాదు.

## (iv) మన యిండ్లు

మన మారోగ్యవంతులమై యుండఁగలుగుటకు మనకు విశేషముగా స్వచ్ఛమైన గాలి యుండవలెను గదా. ఒక బారుననే యుండెడి యిండ్లు మిక్కిలి క్రిక్కిఱిసి యుండునట్లు గట్టరాదు. ఏ గృహమందుఁగాని విశేషజనము కాఁపురముండరాదు. ఒక్కగదిలో ననేకులు నిద్రింపరాదు. మన దేశములో జాతితోఁ గట్టఁబడిన నిండ్లనేకములకు చిన్న కిటికీలు గొన్నిమాత్రమే యుండును. ఈ కిటికీలను రాత్రియందు మూయుదురు. ఇట్లు కిటికీలు మూసిన గదులలో నిద్రించువారు విడిచెడి శ్వాస మాగదులలోని గాలిని జెడిచి బయటికిఁ బోవకుండును. నిర్మలమైన గాలి గదులలోపలికి రాఁజాలదు. కాఁబట్టి యట్టి గదులలో నిద్రించువారెన్నఁడును బలాఢ్యులుగను నారోగ్యవంతులుగను నుండఁజాలరు. అట్టివారు బాగుగ సుఖనిద్రనొంది మేల్కొనినవారివలెఁ జుఱుకుఁదనముఁ గలిగి యుండక యుదయముననే డస్సినవారివలె నిద్రకన్నులు గలిగి యుందురు.

మనము నివసించెడి యిండ్లస్థితి యెట్టిదై యుండునో మన యారోగ్యము విశేషముగా దాని ననుసరించి యుండును

ఇండ్లను మనము పల్లపునేలమీఁదఁ గట్టుకొనరాదు. మనము ~~పొడిగా~~నుండు మెరక నేలపైని మన యిండ్లను గట్టుకొనఁదలఁచినను, వానిని నేలమట్టమునకుఁ బైఁగా రెండుమూడడుగుల యెత్తునఁ గట్టవలెను. ఇట్లు చేయుటవల్ల మన యిండ్లు తేమగా నుండవు.

మన యిండ్లలోని ప్రతిగదికిని అధమపక్షము రెండు గవాక్షములైన నుండవలెను. ఇట్లున్న యెడ వానిలోపలికిఁ గ్రొత్త గాలి ధారాళముగా వచ్చుచుండును. జనులు తమ పశువులను, మేఁకలను, కోళ్లు మొదలగు జంతువులను దమ యిండ్లలోఁ గట్టుకొనరాదు. వారు వానిని ముఖ్యముగాఁ దమ పడకగదులలోఁగాని వాని దగ్గఱఁగాని కట్టి యుంచుకొనరాదు. వారు తమ యిండ్లకు సంవత్సరమున కొకపర్యాయమైనను సున్నముఁ గొట్టించవలెను; (వెల్లవేయించవలెను.) తమ యిండ్లను బ్రతి దినము చక్కఁగ నూడ్చుకొనవలెను.

## (V). శుద్ధత.

పరిశుద్ధముగా నుండనివా రెవరును నారోగ్యవంతులై యుండఁజాలరు. రోగమునకు మురికి బుట్టింటివంటిది. మనము మన దేహములను, వస్త్రములను, గృహములను మిక్కిలి శుద్ధముగా నుంచుకొనవలెను. ఇదియు నారోగ్యమునకు దీర్ఘాయువునకును మూలాధారము.

మన యొడలి చర్మమందుఁ గంటికిఁ గనఁబడని యతిసూక్ష్మ రంధ్రములు లెక్కలేకయున్నవి. మనము పనిపాటులు చేసినపుడు మన శరీరము వెచ్చఁబడి, చెమట బయటికి వచ్చును. ఈ చెమటయే మన యొడలిలోని మురికి. ఆ నీరు మన దేహమందలి మురికి పదార్థములనన్నిటిని దనతోడ బయటికిఁ

దెచ్చును. మనము చాలఁ గష్టపడి పనిచేసినపుడుమాత్రమె విశేషముగాఁ జెమటపోసి యది మన కగపడును. మన చర్మము నందలి ప్రతి రంధ్రమును దేహములోనుండి వచ్చు నొక కాలువ యొక్క ముఖద్వారమైయున్నది. మురికిచేరి ఇట్టి చిన్న ముఖ ద్వారములు పూఁడిపోవకుండునటులు మనము వానిని మిక్కిలి శుద్ధముగానుంచుట యత్యావశ్యకమై యున్నది. కుంకుడు కాయలపులుసు, సీకాయపులుసు, సబ్బుమొదలగు పదార్థ ములు దేహమును శుభ్రపఱుచుటకు మిక్కిలి సాహాయ్యకారు లగుచున్నవి. మనము స్నానముచేసిన తరువాత మనయొడలిని శుభ్రమైన పొడిబట్టతోఁ దుడిచి శుభ్రముగ నుంచుకొనవలెను.

మురికిలో నాటలాడుకొను పిల్లలు తమ చేతులను, దేహ మును శుభ్రముగాఁ గడుగుకొనకున్నయెడ వారికి శీఘ్రకాల ముననే గజ్జిమొదలగు వ్యాధులు సంభవించును.

**పదములు** — ఆఘ్రాణించుట = మూఁచూచుట, మూర్కొనుట, పీల్చుట, సూక్ష్మ = చిన్న; గృహము = ఇల్లు, శుద్ధత = పరిశుభ్రముగానుండుట, మరణము = చావు, బలాఢ్యులు = బలముతోఁ గూడినవారు, సజీవులము = ప్రాణములతో నుండువారము.

**వ్యాకరణము** — ఆమె, ఆపె—ఇవి స్త్రీవాచకములు. రాముఁడు, దశరథుఁడు, కొడుకు, తండ్రి ఇవి మగవారిని తెలుపు పదములు. వీనిని **పుంలింగము** లందురు. సీత, ద్రౌపది, లక్ష్మి—ఇవి ఆడువారిని తెలుపు పదములు. వీనిని **స్త్రీలింగము**లందురు. నీరు, ఊపిరి, దీపము, గాలి—ఇవి **నపుంసకలింగము**లు.

**వరవడి** — జానెడు ఇంట్లో మూరెడు కఱ్ఱ.



# 9. హరిశ్చంద్రుఁడు.

దశరథుఁడు, శ్రీరామచంద్రుఁడును రాజ్యముచేసినది కోసలదేశమని నీవు మొదటిపాఠపుస్తకమునందు రామాయణ

మునఁ జెదివియున్నావు. ఆ రాజ్యమునసే వారికిఁ బిమ్మట హరి శ్చంద్రుఁడను రాజు రాజ్యము సేయుచుండెను. ఈ హరిశ్చంద్ర చక్రవర్తి తన దేశమునందలి జనులనందఱినిఁ దన బిడ్డలవలె మిగుల గారాబముతోఁ జూచుచుండెను. అతనికి చంద్రమతి యను భార్య యుండెను. వారిరువురికి లోహితాస్యుఁడను కుమారుఁడు పుట్టెను.

మనము నివసించు లోకమునకు మర్త్యలోకమని పేరు. ఈ లోకమేగాక దీనికిఁ బైన స్వర్గలోకమున్నదనియు, దీని క్రింద పాతాళలోకమున్నదనియుఁ బురాణములు చెప్పుచున్నవి. స్వర్గ లోకమున దేవత లుందురట. అగ్ని, యముఁడు, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు మున్నగువారు దేవతలు. దేవతల కధిపతి ఇంద్రుఁడు.

ఒకనాఁడు ఇంద్రుఁడు మొదలగుదేవతలు కొలువుదీఱియుండిరి. మునులును, గొప్ప ఋషులును అందుఁ జేరియుండిరి. వారిని జూచి ఇంద్రుఁడు "ఓ మునులారా! యీ మూఁడు లోకముల లోను నిజముఁ బలుకువాఁడెవఁడు" అని ప్రశ్నచేసెను. అంత వసిష్ఠుఁడను మహాముని లేచి 'దేవేంద్రా! భూలోకమున హరిశ్చంద్రుఁడనురాజు అయోధ్యాపట్టణము నేలుచున్నాఁడు. అతఁడెంత కష్టమువచ్చినను సత్యముఁ దప్పఁడు' అని పలికెను.

ఈ మాటలు వినగానే ఆ వసిష్ఠమహామునికి విరోధియైన విశ్వామిత్రుఁడను మహాముని లేచి నిలఁబడి 'సురరాజా! యీ వసిష్ఠుఁడు పలికినది తప్పు, రాజులెక్కడనైన సత్యముఁ దప్పకుందురా? ఈ వసిష్ఠుఁడా రాజునకుఁ బురోహితుఁడు కావున నితఁడతనిని బొగడుచున్నాఁడు. నే నతనిచేత బొంకులు పలికింపఁ గలననెను. అంత వసిష్ఠుఁ డాగ్రహమొంది 'విశ్వామిత్రా!

నీ వాలాగునఁ జేయించితేని, నా పెట్టును జందెమును దీసివేసె దను' అని ప్రతిజ్ఞచేసెను. విశ్వామిత్రుఁడామాట లాలకించి మఱింత యాగ్రహముతో 'నేనతనిని బొంకింపకుంటినా నా తపస్సు నతనికి దారివోసెద'నని పంతముపట్టెను.

వీరిట్లొండొరులు శపథములుచేసికొని భూలోకమునకు విచ్చేసిరి.

అంత విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునికడకుఁ బోయి 'నేను యజ్ఞముచేయఁ దలఁచియున్నాను. నాకుఁ గొంత ధనము కావలయు. వలయు ధనమిచ్చి నా యజ్ఞమును పూర్తిచేసి పుణ్యముఁ గట్టుకొనుము' అని యాచించెను. హరిశ్చంద్రుఁడు చాల సంతసించి మునీంద్రుఁడు కోరిన ధనమొసగెను. ఆ విశ్వామిత్రముని యా ధనమును రాజుకడనే యుంచి యక్కఱపడినప్పుడు తీసికొందునని చెప్పిపోయెను.

రాజును మోసముచేసి యతని రాజ్యమును గైకొని యడవులపాలుసేసి యెట్లయినను బొంకింపఁ దలఁచి, యా ముని సుందరులైన మతంగకన్యల నిరువురి సృజించి హరిశ్చంద్రునికడకుఁ బంపెను. ఆ పిల్లలు రాజునెదుట నిలువబడి యతిమధురముగ పాటఁబాడిరి. వారి గానమునకు మెచ్చి వారికి బహుమతి యియ్యఁబోఁగా వారు 'మా కీ బహుమతి యక్కఱలేదు. మమ్ముఁ బెండ్లాడుము' అని కోరిరి. రాజామాటలు విని కోపపడి వారిని దన యెదుటనుండి గెంటించెను.

వారాసంగతి విశ్వామిత్రుని కెఱిఁగింపఁగా, నతఁడు రాజుసభకు వచ్చి "రాజా! నీకెంత కావరమెక్కియున్నది. ఇవియే రాజులుచేయు చేఁతలు. వలయుదానినిఁ గోరుమనినందున వారి కిష్టమైనది కోరిరి. వారిని వివాహమాడెదవా లేదా?" అని

రాజేను గద్దించి యడిగెను. రాజు 'నా రాజ్యమునైన నిత్తుఁ గాని, నే నాపిల్లలఁ బెండ్లాడ'ననెను. సమయమునకై వేచియున్న విశ్వామిత్రముని తన పన్నుగడ యభివృద్ధియగునని తలఁచి 'అలాగే, నీ రాజ్యమిమ్ము. నీవు రాజ్యమును విడిచిపొమ్ము' అనెను. హరిశ్చంద్రుఁడు సత్యముఁ దప్పనివాఁడగుటచేఁ దన రాజ్యమును వెంటనే మునీంద్రునికిచ్చి, తన భార్యతోను, కుమారునితోను నడవికి బయలుదేఱెను.

పట్టువిడవని విశ్వామిత్రుఁడును 'ఓ రాజా! నాకిచ్చెద నన్న నూఱువేల వరహాల నిమ్ము. అది యీయకపోవుచున్నావే! లేదని చెప్పుము' అని యడిగెను. రాజు సత్యవాక్యపరిపాలన ముఁజేయుటకై యొక నెలదినములు గడవుకోరెను. ముని యట్లె యని నక్షత్రకుఁడను తన శిష్యునిఁ దరువుకానిఁగా హరిశ్చంద్రుని వెంట బంపెను.

హరిశ్చంద్రుఁడు తన భార్యాపుత్రులను నడపించుచు, నక్షత్రకుని భుజముల మోసికొని యడవులలోఁ బోవుచుండెను. విశ్వామిత్రుఁడు దారినడుమ వారికిఁ బెక్కు చిక్కులం బెట్టెను. హరిశ్చంద్రుఁ డా యిడుమలనెల్లఁ దప్పించుకొని కాశీ పట్టణము చేరెను. నెలదినముల గడువు సమీపించెను. నక్షత్రకుఁడు 'రాజా! పైకమిచ్చెదవా? లేదనెదవా" అని మాటిమాటికి నడుగఁజొచ్చెను. రాజు వానిపోరు పడలేక, సత్యమును గాపాడుకొనుటకై; తన భార్యాపుత్రుల నొక క్రూరుఁడైన బ్రాహ్మణున కమ్మి నూఱువేల వరహాలు నక్షత్రకుని కిచ్చెను.

ఆ పేరాసగల నక్షత్రకుఁడు "రాజా! ఇది నా దారిబత్తెమునకు సరిపోయినది. ఇఁక మా గురువునకియ్యవలసిన నూఱు

వేల వరహాల నిమ్ము"నెను. రాజు తన్నొక మాలవాని కమ్ము కొని, మునిఋణముం దీర్చి పంపెను.

తరువాత హరిశ్చంద్రుఁడు వీరబాహుఁ డను పేరుతో యా మాలవానికి సేవకుఁడై కాశీపట్టణమునందలి స్మశానమునఁ గావలి యుండెను. చంద్రమతిని గొన్న యా బ్రాహ్మణుఁ డామె కొమరునిఁ దన శిష్యులతో నడవికిఁ బంపెను. వాని నచటఁ బాము గఱచ వాఁడు ప్రాణము వదలెను. చంద్రమతి వానినిఁ గొనిపోయి, స్మశానమున నేడ్చుచుండఁగా, రాజభటు లా చంద్రమతిపైఁ గాశిరాజుశిశువును జంపిన నేరము మోపి యామెను బట్టుకొని పోయిరి. రా జామెకు మరణదండన విధించెను. రాజభటు లామెను స్మశానమునకుఁ గొనివచ్చి వీరబాహువున కొప్పగించి చంపుమనిరి.

హరిశ్చంద్రుఁ డామె తన భార్యయని తెలిసియుఁ దన ధర్మమును నెఱవేర్చుటకై కత్తినెత్తి యామెను నఱుకఁబోయెను. ఇంతలో విశ్వామిత్రుఁడు ప్రత్యక్షమై 'ఓ రాజా! వలదు. వలదు. ఈ పన్నుగడయంతయు నేను జేసినదే. నీ వాడినమాట తప్పవనుట లోకప్రసిద్ధ'మయ్యెను. నీకు నా తపస్సును ధారపోసితిని. నీవు రాజ్యముబడసి సుఖముగా నుండుమని, లోహితాస్యుని బ్రదికించి రాజ్యమొసంగెను. అదిమొదలు హరిశ్చంద్రుని సత్యసంధత్వము లోకమున వెల్లడియయ్యెను.

**పదములు.**—గారాబము = ప్రేమ, ప్రీతి; ఆగ్రహము = కోపము; బొంకులు = అబద్ధములు, యజ్ఞము = యాగము, జన్నము; కావరము = పొగరు; శ్మశానము=వలికేమిట్ట, వల్లకాడు; ప్రత్యక్షము=కంటికి ఎదురుగా; మర్త్యులు= మనుష్యులు; అమర్త్యులు = దేవతలు, చావులేనివారు; శబథము = పంతెము, పందెము.

వ్యాకరణము:— వారిన్ + చూచి = వారిని జూచి; నిక్కమున్ + పలుకు = నిక్కముఁ బలుకు; సత్యమున్ + పలుకు = సత్యముఁ బలుకు; నాకున్ + కొంత ధనము = నాకుఁ గొంత ధనము.

నిజము నిలకడమీద తెలియును.



# 10. పొలము దున్నుట.

ఈ పటమందలి మనుష్యు లేమిచేయుచున్నారు? వారు ఒక పొలమును దున్నుచున్నారు. రెండెద్దులనుగట్టి యొక నాఁగలితో పొలమును దున్నుదురు. నాఁగలిని జేయుటకొక కొయ్య తునుక (కఱ్ఱ, దుక్క)కు సన్నని మొనఁజేసి యా మొనకుఁ గఱ్ఱు అనెడి యినుపముక్కను బిగించెదరు. రైతు దున్నునప్పుడు దాని నదిమి [illegible]నును. అప్పుడది భూమిని భేదించుకొనుచుఁ బోవును.

రైతు తన పొలము నొకప్రక్కనుండి మఱియొకప్రక్కకు దున్నును. అప్పుడు నాఁగటికఱ్ఱువల్ల నించుమించుగా నైదంగుళ

ములలోఁతుగల నాఁగటి చాలొకటి యేర్పడును. ఇట్లొకఁడు సమదూరమునను దగ్గఱ దగ్గఱగను బొలమునంతను దున్నును.

ఇంగ్లండు మొదలుగాఁగల యూరోపాఖండపు దేశములలోని జనులు నాఁగళ్లకు గుఱ్ఱములను గట్టి పొలములను దున్నుదురు. వారు మన దేశపు రైతులవలెఁగాక భూమి నెక్కువ లోఁతుగా దున్నుదురు వారు పొలములలోఁ జేయు నాఁగటిచాళ్లెక్కువ వెడల్పుగనుండి యేడంగుళముల లోఁతుగలవై యుండును. ధనికులగు సేద్యగాండ్రు తమ నాఁగళ్ల నావిరియంత్రముల బలమువల్ల నడపెదరు. మన దేశమందలి పంటకాపులు మిక్కిలి ధని



కులు కానందున నిట్లు చేయఁజాలరు. ఇంగ్లండునందు వాడఁబడు నాఁగలియొక్క పటమిదిగో! చూడుఁడు.

చిన్నతోఁటను త్రవ్వుటకు తోఁటవాఁడు నాఁగలిని

పాడదు. దానితోఁ బనిచేయుట కష్టట నెడము చాలదు. వాఁ డాభూమిని పాఱతోనైనను గడ్డపాఱతోనైనను ద్రవ్వును. చెట్టువేయఁగోరుచోట వాఁ డాభూమిని మఱింత లోఁతుగను బాగుగను ద్రవ్వును. పొలములను సహితము మిట్టి పాఱలతోఁ ద్రవ్వక నాఁగళ్లతో దున్ను నేల? ఒక్కమనుష్యుఁ డేడుదినములలోఁ ద్రవ్వఁగలిగినంత భూమి నొక్క నాఁగలి యొక్కనాఁడే దున్నఁగలదు.

ఇట్లు తోఁటలు వేయుటకును బైరులు పెట్టుటకును మనుష్యులు భూమిని ద్రవ్వనేల? దున్ననేల? పైరుల కాహారము లేనియెడల నవి పెరుఁగవు. వాని కాహారము భూమిలో సులభముగా దొరకుటకుఁగాను వారిట్లు చేసెదరు. పైర్లు తమ వేరులకు దొరకెడి యాహారమునంతటిని గొంతకాలమువఱకుఁ దినును.

నాఁగలి భూమిలోపలి మంటిని బైకిఁ దెచ్చును గనుక నది గాలి పాఱి చెట్లకుఁ గావలసిన యాహార మెక్కువగఁ గలదగును. దున్నుటవల్ల భూమి కూడ మెత్తనగును గనుక వర్షజలమైనను, లేక మనుష్యులు పారించిన నీళ్లైనను భూమిలోనింకి నలుదిక్కులను వ్యాపించి దానిలోని యాహారపదార్థములను కరఁగించి వానిని జెట్లవేళ్లు తినుటకు సిద్ధపఱుచును.

ప్రక్కపుటలోని పటమందలి మనుష్యులు పొలమును దున్నుచున్నారా? లేదు. మఱేమి చేయుచున్నారు? వారు దున్నిన యొక పొలమును సమముచేయుచున్నారు.

గొఱ్ఱు అను సాధనవిశేషము పొడుగు పిడిగల యొక పలక. వానిని జలముతో నిండియుండు వరిపొలములు మొదలగు పల్లపు భూములందు వాడెదరు. రాగులు, జొన్నలు మొదలగు



పాపటము తోలుట.

పంటలు పండు మెరకపొలములందుఁ బాపటము అను వేరువిధమైన గొఱ్ఱు నుపయోగపఱిచెదరు.

పాపటమను పనిముట్టునందలి పలకకుఁ గ్రింద వాఁడి మొనలుగల యినుపమేకులుండును. పాపటమును దోలినప్పుడవి భూమిని బెకల్చుకొనుచుఁ బోవును. పొలమును దున్నినపుడు భూమి భేదిల్లి నాఁగటి చాలుప్రక్కను గడ్డలు గడ్డలుగాఁ బడియుండును. పొలమందలి మన్ను మృదువుగా నుండదు. మెరక పొలమునందు విత్తనములను వెదచల్లక మునుపు మంటిగడ్డలను జిదుగఁగొట్టి భూమిని మృదువుగాఁ జేయవలసియున్నది. పాపటము తోలుటవల్ల నా మంటిగడ్డలు పొడికాఁగా భూమి సమమగును. మఱియు భూమిలోనుండు కలుపుకూడఁ దీసివేయఁబడును.

పొలమందు మనము మొలపింపఁగోరు పైరుగాక మఱేవి దానియందు మొలచినను మనము వానిని కలుపనవచ్చును. కలుపు సహితము చెట్లే. అవికూడ నాహారమును దినును. అయినను వానికిని మన పైరులకునుగూడఁ గావలసినంత యాహారము మన పొలములందు లేదు. పొలములలోని కలుపు మనము పాటుపడి దీయనియెడల పైరులకుఁ గావలసినంత యాహారము దొరకకపోవును గనుక నవి రోగముగలవానివలె నగపడును.

**పదములు.**—రైతు = కాఁపు, కృషీవలుఁడు, కృషికుఁడు; సాధనవిశేషము = ఒక పనిముట్టు.

**వ్యాకరణము:**—కొన్ని పుంలింగపదములు చెప్పుము.

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| చెట్టు | చెట్లు |
| నాఁగలి | నాఁగళ్లు |
| అది | అవి |

సామెత—దున్నలాగున కష్టపడి, దొరలాగున తినవలెను.

**కాపీమానా** — చేనుచేసి చెడలేదు—చెడ్డజేసి బ్రతుకలేదు.



# 11. వేళ తప్పకుండుట.

గుంటూరుజిల్లాలో పొన్నూరను నొక గ్రామము గలదు. ఆ గ్రామమందొక బడి యుండెను. ఆ బడియందుఁ జదువు పిల్లవాండ్రందఱును వేళతప్పక పదిగంటలకు సరిగా బడికివచ్చుట వాడుక. ఆ బడి పంతులుగారు బాలురు మఱింత జాగ్రత్తతో వేళకు ముందే వచ్చుటకై పట్టుగుడ్డ కొక్కొక్కటి కుట్టించి దానిచుట్టు సరిగంచు వేయించి, మన చక్రవర్తిగారి

ప్రతిమను దానియందు వ్రాయించి, యే తరగతిలోని బాలు రొక్కవారమంతయు వేళదప్పక వత్తురో, యా తరగతికది యా వారమంతయు దానిని బహుమతిగా నిచ్చెదనని ప్రకటించెను. ఆ టెక్కెమునందు 'ఈ తరగతివారందఱు వారమంతయు వేళకు సరిగా బడికివచ్చిరి' అని వ్రాసియుండెను.

ఆయా తరగతిలోని బాలురందఱు ముందటికంటె నెక్కువ శ్రద్ధతోఁ బదిగంటలగునప్పటికిఁ దాము వచ్చుటయేకాక, తమ తరగతి బాలురను దోడ్కొని వచ్చుచుండిరి. అట్లు వారిలో నొక్కఁడు రాకున్నను, బహుమానచిహ్నము తమకు రాదని వారికి భయమెక్కువగ నుండెను.

ఇట్లుండగా, నా బడిలో మూఁడవ తరగతియందు రాముఁడు, గోవిందుఁడు అను నిద్దఱు బాలురుండిరి. వారికొక నాఁ డీవిధముగా సంభాషణ జరిగెను.

రాము.—గోవిందా! ఈమారైనను టెక్కెము మన తరగతికి రావలయును. నీవు వేళతప్పక బడికి వచ్చెదవా?

గోవిం.—రామా! ఆలాగే వచ్చెదను.

రామ.—'ఆలాగే, గీలాగే' అనినఁగాదు. రెండు వారములనుండి నీవలననే మన తరగతికి మంచిపేరు రాకుండఁ బోవుచున్నది. ఈ తూరినైనను మన తరగతికి బహుమాన టెక్కెము వచ్చునట్టులు చూడవలెయునని పంతులుగారు చెప్పియున్నారు. నీ వాలస్యముగా వచ్చితివా, యీతూరికూడ ఈ బహుమానము మనకు రాదుసుమీ!

అదిమొదలు రాముఁడు, మఱికొందఱు బాలురును తమ తరగతివారికి ధ్వజము రావలయునను తలంపుతోఁ బ్రతిదినము గోవిందుని యింటికి వెళ్లి వానిఁ దోడ్కొని బడికి గంట వాయించు

నప్పటికి వచ్చి చేరుచుండిరి. ఇట్లు వారముపొడుగునను వారు వానిని బడికి వేళదప్పక వచ్చుచుండునటుల చేసిరి. వారము కడపటిదినమున నుపాధ్యాయుఁడు బాలురనుజూచి యిట్లనెను:—

ఉపా.—గోవిందుఁడేడిరా?

ఒక పిల్లవాఁడు—అయ్యా! నేను వాని యింటికి వెళ్లి బడికి రమ్మని పిలిచితిని. అన్నముఁ దినుచుండెను. గంటయగునేమో యని నేను ముందుగా వచ్చితినండీ.

మఱియొకఁడు—గోవిందుఁడును నేనును బడికి వచ్చుచుంటిమి. వాఁడు దారిలో నొక్కొక్క యంగడి చూచుచుండినాఁడు. నాకు మొదటి హెచ్చరికగంట వినవచ్చినది. నేను తొందరగా వచ్చితినండీ.

ఉపా.—ఓరీ! వాఁడు వచ్చుచున్నాఁడేమో చూడు. ఇఁక రెండు నిమిషములే యున్నవి.

(టంగ్, టంగ్, టంగ్.)

రాముఁడు — గంట మ్రోగుచున్నది. ఇఁక ఈ వారము గూడ టిక్కెము మాకు రాదండీ.

ఉపా.—ఓరీ! రామా! ఆ సోమరి గోవిందుఁడు వచ్చుచున్నాఁడేమో చూడు.

రాముఁడు — (తొంగిచూచి) ఇదిగో వచ్చుచున్నాఁడు. రోఁజుచుఁ దల విరియఁబోసికొని పడుచు లేచుచు వచ్చుచున్నాఁడు.

ఉపా.—(గోవిందు నుఱిమిచూచి) ఏమిరా యింతసేపు? అన్యాయముగా నీ మూలమున నీతడవఁగూడ మన తరగతికి టిక్కెము రాకపోయినదిగదా.

రాముఁడు — గోవిందా! నేను మొదటనే నీకుఁ జెప్పితిని గదా. నీ వానాఁడేమంటివి?

గోవిందుఁడు—నే నిన్ని దినములు మీతోఁగూడ రాలేదా? నేఁడు దారిలో నెవ్వరో యిరువురు కేకలువేయుచుండఁగాఁ గొంతసేపాఁగితిని. అప్పుడే హెచ్చరికగంట వినఁబడినది. 'ఇఁకఁ బది నిమిషములున్నవిగదా; కొంతసేపు వేడుకచూచి పోద'మని యుంటిని. ఇంతలో రెండవగంట వినరాఁగా, నేను బరుగెత్తుకొని వచ్చుచుంటిని.

ఉపా.—అయిన నింతసేపేమి? అయిదు నిమిషములయినవే.

గోవిం.—దారిలో నా పుస్తకములు పడిపోయినవి. అవి యెత్తుకొని వచ్చుచున్నాను.

ఉపా.—ఓరి! సోమరీ! నీవలననే యీమాఱును బహుమానచిహ్నము మన తరగతికి రాకపోయినది. నీ వలనఁ దక్కిన బాలుర శ్రమము వ్యర్థమయినది.

బాలురందఱు — గోవిందా! నీవెందుకురా మాతరగతిలోఁ జేరితివి. నీవు లేకున్న మేమెంతో సంతోషముతో మాతరగతిముందట టెక్కెము గట్టియుందుముగదా!

గోవిందుఁ డుపాధ్యాయుని, బాలురను జూడక యవమానముచేతఁ దలవంచుకొని, యిఁకనైనను బడికి వేళదప్పక రావలయునని యొట్టుపెట్టుకొని మఱుసటివారమంతయుఁ గ్రమమున వచ్చి, బహుమానచిహ్నము తమ తరగతికి వచ్చునట్లు చేసెను.

బాలురారా! వేళతప్పి వచ్చుటచే గోవిందుఁడు దాను నష్టమునొందినదేకాక, తోడిబాలురకును నష్టముఁ గలిగించెను గదా! కావున మీరెల్లప్పుడును వేళమించకుండ బడికి పోవలెను.

**పదములు.**—టెక్కెము = ధ్వజము, పతాక జెండా.

**వ్యాకరణము:** — ఈ పాఠమునందలి పుంలింగపదములు చెప్పుము బాలుఁడు ఏకవచనము. బాలురు బహువచనము.

**సామెత.**—ఆడి తప్పరాదు. పలికి బొంకరాదు.

# 12. లోహములు.

నీవు బంగారు, వెండి, యినుము, రాగి, సీసము మున్నగు వానిని జూచియుందువు. వీనికి లోహములని పేరు. వీనిని మనుష్యులు పెక్కువిధముల నుపయోగించుచున్నారు. వీనిని నేలనుండి త్రవ్వి యెత్తుదురు. ఇవి దొరకునట్టి ప్రదేశమునకు 'గని' యని పేరు. దీనినే సంస్కృతమున 'ఖని' యందురు. అచ్చటఁ బుట్టుటచే లోహములకు 'ఖనిజము'లని పేరు. వీని కన్నిటికిని మంచి కాంతి కలదు. రుద్దను రుద్దను మెఱుగు యెక్కువగుచుండును. ఇవి నీటిలోఁ గరఁగునవికావు. నిప్పుచేఁ గరఁగింపవచ్చును. ఇవన్నియుఁ జల్లాఱినపిదప గడ్డకట్టును. వీనిని సాగఁగొట్టుట యసాధ్యము.

## 1. బంగారు

లోహములన్నిటిలోను బంగారము చాల విలువగలది. ఇది దొరకుచోటు లెక్కువగ లేవు. మన రాజధానియం దనంతపురముజిల్లాయును, మైసూరురాజ్యములోని 'కోలారు' అను ప్రదేశమును బంగారు గనులకుఁ బ్రసిద్ధిఁగాంచినవి.

సువర్ణము పసుపువర్ణముగలది. దీనికిఁ దుప్పుపట్టదు. వన్నె తఱుగదు. కనుకనే దీనిని విలువగల లోహమని చెప్పుదురు. ఈ కారణముచేతనే యాభరణములు, నాణెములుచేయుటకు నది యెంతయుఁ దగియున్నది. స్వచ్ఛమైన బంగారమును 'మేలిమి' యందురు. అది మిగుల మృదువు. ఒక గురిగింజ (గురివింద) యెత్తు బంగారును దీసికొని నీ ఫలక నిండునటు లఱువది

చదరపుటంగుళముల రేకుగా సాఁగఁగొట్టవచ్చును. బంగారు నుండి మిగుల సన్నని రేకును సాఁగఁదీయవచ్చును. ఒక యం గుళపుటెత్తపరంజిని రెండు లక్షల యెనుబది రెండువేల యాకు లుగఁ గొట్టవచ్చునని కనిపెట్టియున్నారు. బంగారుకమ్ములను (కాడతీగె) మీరు చూచియుందురు. వానిలోఁ గొన్ని లావుగ నుండును. కొన్ని సన్నవిగనుండును. సన్నని తీగెలతోఁ బని చేయుటకుఁ జాల నేర్పు కావలయును. ఒక గురిగింజయెత్తు బంగారముతో నేనూఱడుగుల కాడను దీయవచ్చును.

అనేక దేశములందు బంగారు నాణెములఁ జేయుచున్నారు. ఇంగ్లాండునందు బంగారుతోఁజేయు నాణెమునకు 'సవరను' అని పేరు. మన దేశములోజేయు బంగారు నాణెమునకు మొహారీ అని పేరు. దాని వెల పదునైదు రూపాయలుగ నుండెను. మన దేశమున వీనిని ధనవంతులు వాడెదరు. బంగారము చాల మెత్తని దగుటచే నాణెములను చేయునపుడు గట్టిగానుండు రాగిని దాని తోఁ గలుపుదురు. ఇరువది రెండెత్తుల మేలిమి బంగారమునకు రెండెత్తుల రాగిని గలుపుదురు.

## 2. వెండి

లోహములలో విలువనుబట్టి బంగారమునకు రెండవది వెండియని చెప్పవచ్చును. బంగారువలెనే యీ లోహమును మిక్కిలి యరుదు. సాధారణముగా దీనిని గనులనుండి త్రవ్వియెత్తు దురు. గనులనుండి త్రవ్వియెత్తిన ముతకవెండితో, సీసము, గంధకము మొదలయినవి కలిసియుండును. దీనిని నలఁగఁగొట్టి, కాచి, కడిగి, పాదరసముతోఁ గలిపి నూఱి ముఱుఁ గాచెదరు. ఉష్ణముచేఁ బాదరసమెగిరిపోఁగా అచ్ఛమైన వెండి నిలుచును. దీనిని గరిగించి కడ్డీలుగాఁ బోయుదురు.

బంగారమునకుఁ దరువాత నన్నిలోహములలో వెండి మిక్కిలి సాగునది. ఒక యంగుళపుఁబొత్తులోఁ బదివేల రేకు లణఁగియుండునంతటి సన్నముగా దానిని సాఁగగొట్టవచ్చును.

ఒక గురిగింజయంత వెండిని నన్నూఱడుగుల పొడవుగల తీఁగగాఁ దీయవచ్చును. బంగారమునకువలెనే దీనికిఁ ద్రుప్పు పట్టదు. కాంతియుఁ దగ్గదు. కావున నిది విలువగల లోహము. వెండితో ననేకమైన తొడవులును, పాత్రలును జేయుదురు; గిన్నెలు, పళ్లెరములు, కంచెములు, కూజాలు మున్నగునవి చేసికొందురు. ధనికులయిండ్లయం దిట్టి పాత్రలు విశేషముగ నుండును.

బంగారుతోను, వెండితోను జెల్తారు చేయుదురు. నాణె ములఁగూడ వెండితోఁ జేయుదురు. మన దేశమందు రూపాయ, అర్ధరూపాయ, పావలా (నాలుగణాలు) బేడ (రెండణాలు) నాణెములను వెండితోఁ జేయుచున్నారు.

**పదములు**—సువర్ణము = బంగారు, అపరంజి; ధనికులు = ధనవంతులు, డబ్బుగలవారు, బేడ = అర్ధపావలా

**వ్యాకరణము.**—మన రాజు మనలను పాలించుచున్నాఁడు. దీనిలో 'రాజు' కర్త. 'మనలను' కర్మ. నామవాచకములకు వచనము, లింగమేకాక విభక్తియుఁ గలదు. ప్రతి వాక్యములోని కర్త ప్రథమావిభక్తి. కర్మ ద్వితీయావిభక్తి. 'మనల' అను పదమునకు 'ను'కారము చేర్చిన ద్వితీయావిభక్తి యేర్పడినది.

జార్జిచక్రవర్తి మేరీని పెండ్లియాడెను. 'మేరీ' అను పదమునకు 'ని' చేర్చిన ద్వితీయావిభక్తి ఏర్పడినది. ఈ వాక్యములో ప్రథమావిభక్తియగు నామవాచక మేది?

ఓ భగవంతుఁడా! మా చక్రవర్తిని గాపాడుము. 'భగవంతుఁడా' యను పదము సంబోధనప్రథమావిభక్తి. ఓ రాజా! నా ప్రార్థన నంగీకరింపుము. ఇందు సంబోధన వాచక మేది?

**సామెత—'బంగారు ముచ్చెలు అయినా కాళ్లనే తొడగవలెను.'**



# 13. లోహములు.

## 3. రాగి.

ఎరుపురంగుగల లోహము రాగి యొకటే. దీనినిగూడ గనులనుండి యెత్తుదురు. బంగారమునకును వెండికినిఁ దరువాత రాగిని మెత్తని లోహమని చెప్పవచ్చును. ఇది సాగునట్టి లోహము. దీనిని రేకులుగఁ గొట్టవచ్చును. ఇది లోహము లన్నిటిలోను నధికధ్వని గలది; వెండి బంగారములకంటెఁ దక్కువ వెలగలది. రాగికిఁ ద్రుప్పు పట్టును. ఆ త్రుప్పునకు 'చిలుము' అని పేరు. చిలుము ఆకుపచ్చగానుండును. రాగి యందుఁ బులుసు తగిలినతోడనే చిలుమెక్కును. అప్పుడది విషముతో సమానము. కావుననే వంట కుపయోగించు తామ్ర పాత్రలకన్నింటికి సీసపుఁబూఁత (కళాయి) పూయుట యావశ్యకము. సీసముపూయని పాత్రలోనుంచిన యాహారమును దినుటచే ననేకులు మృతినొందిరి.

రాగిని మనము పలువిధముల నుపయోగించుచున్నాము. దానితో జనులు నానావిధములగు పాత్రలఁ జేయుచున్నారు; రేకులుగఁ గొట్టుదురు; రాగికడ్డీలను మెఱుపుదీపముల కుపయోగింతురు. పూర్వము రాగితోఁ గొన్ని నాణెములఁ జేయుచుండిరి. మనము వాడునట్టి అర్ధణాలు, కాలణాలు, (కానులు, బొట్లు) పైసలు రాగితోఁ జేయుచుండిరి. కాని యిపుడీలోహము దొఱకుట యరుదైనందున నట్టి నాణెములను 'బ్రాంజు' అను లోహముతోఁ జేయుచున్నారు. 'బ్రాంజు' అనఁగా నొకవిధమైన కంచు. రాగియు సీసమును చేరఁగ నిది యేర్పడుచున్నది.

కంచునకుఁ జిలుమెక్కదు. కావున దానిని వంటపాత్రల

కుపయోగింతురు. అది విగ్రహములపోఁత కుపయోగించును. నాలుగుపాళ్లు రాగియు, నొకపాలు సీసమును జేరిన నది చాల ధ్వని నిచ్చును. ఈ లోహముతోనే గంటలఁ జేయుదురు. 'కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా' యని చెప్పుట కలదు.

రెండుపాళ్లు రాగియు, నొకపాలు తుత్తినాగమును గలసిన నిత్తడియగును. ఇది చక్కని పసుపురంగు కలది. దీనిని సులభముగా పోఁతపోసి, తరిమెనపెట్టుదురు; దీనికి మంచి మెఱుగు పెట్టవచ్చును. మన యిండ్లయందు వాడుకొను తప్పెలలు, కొప్పెరలు, గిన్నెలు, దీపస్తంభములు మొదలయినవాని నిత్తడితోఁ జేయుదురు. రాగిపాత్రలకువలెనే యీ పాత్రలకు సీసపుఁ బూఁత పూయవలయును.

## 4. ఇనుము

ఇనుము మిక్కిలి కఠినమైనది. ఇది కందువన్నె గలది. అన్ని లోహములనువలె దీనిని నేలనుండి త్రవ్వి యెత్తుదురు. భూమియందుఁ బెక్కుచోట్ల నినుము సమృద్ధముగానుండును. ఇది యింగ్లాండునం దధికముగా దొఱకును. ఇంగ్లాండుననే సాలున కిరువదియయిదు లక్షల బారువల యినుము దొఱకును.

గనులనుండి త్రవ్వఁబడెడి యినుము గడ్డలుగనుండి యితర వస్తువులతోఁ గలిసియుండును. కొండవాగులందు సయితమిది యిసుకరూపమున దొఱకును. ముతక యినుపగడ్డలు దెచ్చి పగులఁగొట్టి, సున్నపురాలు, సుద్ద గలిపి కొలుములలోఁ గ్రాల్తురు.

తక్కిన లోహములన్నింటికంటె నిది చాలఁ జౌకమైనది. బంగారు మొదలయిన లోహములు లేకపోయినను బని సాగును గాని యీ లోహము లేకపోయినచో నేపనియు సాగదు. దీనితో నన్ని కొఱముట్లు (పనిముట్లు) చేయుదురు.

మంచి యినుముతో నూటికొకపాలు బొగ్గు కలిపిన నది యుక్కగును. ఉక్కుతోఁ గత్తులు, ఉలులు, ఆకుతాలు, సూదులు మొదలగునవి చేయుదురు.

ఇనుముయొక్క యుపయోగములనన్నిటిని జెప్పనలవి కాదు. సన్నని సూదులు మొదలుకొని గొప్ప దూలములు, యంత్రములు, రైలుపట్టలమీఁదఁబోవు ఎంజినులనఱకును, నాఁగేళ్లు, నాఁగేటికఱ్ఱులు మొదలగు కృషిసాధనములు, బాణలులు, గరిటెలు మున్నగు పాకసామగ్రులు, కత్తులు, ఫిరంగులు, గుండ్లు మొదలగు యుద్ధోపకరణములు నినుముతోఁ జేయుదురు. బంగారు, వెండి, రాగి మున్నగువానినుండి భస్మములు తయారు చేయునట్లు ఇనుమునుండియు భస్మముచేయుదురు. దానికి అయస్సింధూరమని పేరు. ఇట్టి సింధూరముల మందులుగ నుపయోగింతురు.

**పదములు.**—త్రుప్పు = చిలుము, రాగి = తామ్రము

**వ్యాకరణము** — రాగిని మనము పలువిధముల నుపయోగించుచున్నాము ఇందు కర్త యేది? 'రాగిని' ఏ విభక్తి? 'మనము' అను మాటకు బదులుగా 'మీరు' అను మాట నుపయోగించి యీ వాక్యమును మరల చెప్పుఁడు 'మనము' అను మాటకు బదులుగా 'వాఁడు' అని యుపయోగించి వ్రాయుఁడు

**సామెత.**—ఇనుము విరిగితే అతకవచ్చునుగాని మనసు విరిగితే అతకరాదు

# 14. (i) ఏల భూమిని దున్నవలెను?

పైర్లకు భూమిలోనున్న యాహారము వృద్ధియగుటకు నేలను దున్నుదురనియును, నాఁగలి భేదించిన భూమిని మొక్కల యొక్క యుపయోగార్థము సిద్ధపఱచేటకును దానిని గాలియును వర్షజలమును బదనుచేయఁ గలుగుటకును దానిని బాగుగఁ ద్రవ్వవలెననియును నీవీనఱకు వినియుంటివి. పొలము



నందు మనము మొలపింపఁగోరు పైరునకుఁ గావలసిన యాహార మును మనకుఁ బనికిమాలిన చెట్లు తినకుండునట్లు చేయుటకుఁ గూడ మనము నేలను దున్ని కలుపుఁ దీయవలయునని నీవు చదివియుంటివి. పైరులకెట్లో చెట్లకును అట్లే.

చెట్టునకుఁ గావలసిన యాహారమును సంపాదించుటకు దాని మూలములు భూమిలో వ్యాపింపవలెను. చెట్టుయొక్క పోష ణమునకుఁ గావలసియుండు పదార్థము లనేకములున్నవి. వానిని సమయోచితముగా వేరులు సంపాదించి దానికియ్యవలెను. నీ వొక గృహమును గట్టునపుడు నీ కిటుకలును, సున్నమును, ద్వారములు, గవాక్షములు మొదలగు సామగ్రులును గావలసి యుండును గదా. నీవు కూలివాండ్రను బంపి వానిని దెప్పించు కొందువుగదా. చెట్లు స్థావరములు గనుకఁ దమకుఁ గావలసి

యుండు పదార్థములకొఱకుఁ దమ వేరులను వ్యాపింపజేసి వానిని దెప్పించుకొనును. ఆ వేరులు చుట్టుపట్లదొరకు పదార్థములను సంపాదించి తెచ్చినతోడనే వానిని జెట్లాకర్షించుకొని యుపయోగించుకొనును.

45-వ పుటలో ముద్రించియున్న పెద్ద వృక్షముయొక్క పటమును జూడుము. దానికిఁ గావలసిన యాహారమును సంగ్రహించి తెచ్చుటకు దాని వేళ్లెట్లు నలుదిక్కులకు వ్యాపించి యున్నవో చూడుము. ఇట్లే వరి, జొన్న, రాగి మొదలగు మొక్కలయొక్క వేరులుకూడను నలువైపులను వ్యాపించును. చిన్న మొక్కలయొక్క వేరు లొక యడుగు మేరకును, ఒకానొకప్పుడొక గజము దూరమునకును, ఒక్కొక్కప్పుడు పెక్కు గజముల దూరమువఱకును వ్యాపించును. గొప్ప వృక్షముల వేరులు నూఱడుగులవఱకును బాఱును. చెట్టు మొలచు భూమియొక్క స్థితినిబట్టి యా వేరులు పాఱు దూరము విశేషముగా భేదించుచుండును. భూమి గట్టినేల యయ్యెనేని, జొన్న మొక్కలవంటి చిన్న చెట్లయొక్క వేరులు దానిలోనుండి బహుదూరము పోవుట దుర్లభమగును. కాఁబట్టి యా మొక్కలు మిక్కిలి యాలస్యముగాఁ బెరుఁగును. అయినను మనము భూమిని జక్కఁగా దున్నినను, త్రవ్వినను ఆ చెట్ల యొక్క వేరులు మిక్కిలి సులభముగాఁ బెరిఁగి భూమిలో అనాయాసముగాఁ బాఱును. కాఁబట్టి చెట్లకు ఆహారము సమృద్ధిగ నుండుటవల్ల అవి పుష్టిఁగలిగి పచ్చగా నగపడుచుండును.

### (ii) ఎరువు, విత్తనములు.

పైరు చక్కగాఁ బెరుగుటకుఁ బొలమును బాగుగా దున్నుటమాత్రము చాలదు. చెట్ల కాహారపదార్థములుగా

సులభముగా మాఱఁగల వస్తువులను మనము భూమికి పెట్టు చుండవలెను. కర్షకు లేటేటను దమ పొలములలోఁ బైరులు పెట్టి పంటలు పండించుకొనుచుందురు. అందువలన భూసారము తగ్గిపోవును కాఁబట్టి యా భూములకు పెంటగట్టి వానిని సారవంతములగునట్లు చేయవలెను.

ఎరువులు పలుదెఱఁగులైనవి. పశువులయొక్కయు, గార్దభములయొక్కయు, గుఱ్ఱములయొక్కయు, గొఱ్ఱెలయొక్కయు, మేఁకలయొక్కయు పెంటయే వానిలో సామాన్యమైనదియు శ్రేష్ఠమైనదియునై యున్నది. పొలమునందొక మూలనుగాని పొలము దూరమందున్నచో రాత్రులందుఁ బశువులను గట్టు దొడ్డిలో నొక మూలయందుఁగాని రైతులొక లోఁతు గోఁతిని త్రవ్వుకొని యది నిండునంతవఱకు దానిలోఁ బశువులపేడ నుంచవలెను. అది నిండినపుడు వారు దానిని మంటితోఁ గప్పి మైదాఱు నెలలమట్టునకు దానినట్లే యుంచవలెను. అటు పిమ్మట నా యెరువు వాడుకొనుటకు నుపయోగపడును గాన వారు దానిని దమ పైరులకుఁ గట్టవలెను. కృషికులు దానిని సాధారణముగాఁ బొలమంతటను జిన్న కుప్పలుగాఁ బోసి, దాని నప్పుడు పొలమంతటను బఱచి మంటితోఁ గలిసిపోవునట్లు చేయుదురు. వానలు కురిసినపు డది నీళ్లలోఁ గరఁగి పైర్లకుఁ దగిన యాహారము సమృద్ధిగా నిచ్చును. అట్టి యెరువుతోఁ గలిసియున్న భూమిమీఁద నంకురించు మొలకలయొక్క చిన్ని వేరులు పసిపిల్లలు పాలు త్రాగునటు లా యాహారపదార్థమును బీల్చును.

రైతులు తమ పొలములనెంత బాగుగా దున్నినను, తమ పైరులకెంత మంచి యెరువు గట్టినను, మంచి విత్తనములను

జేల్లని పక్షమున వారికి మంచి పంటలు పండఁజాలవు. కాఁబట్టి వారెల్లపుడును శ్రేష్ఠమైన విత్తనములను, అనఁగా నారోగ్య వంతములై బలిష్ఠములై యుండిన చెట్లకుఁ గలిగిన విత్తనములను మాత్రమే తమ పొలములందు వెదఁజల్లవలెను.

"పుచ్చిన విత్తనాలు చచ్చినా మొలువవు" అను సామెత సత్యముకదా? పురుగుపట్టని దృఢమైన గింజలు నీళ్లలో మును గును. పంట బాగుగానుండఁ గోరినయెడల విత్తుటకు ముందు మంచి విత్తనములను జాగ్రత్తచేయుట యెక్కువ యావశ్యకము. బాగుగాముదిరిన గింజలోని యంకురము పూర్ణముగాఁ దేలి యుండును. చింత, ఆముదాలు మొదలగు పెద్ద గింజలలోని యంకురములు స్థూలదృష్టికే కనుపడును.

**పదములు.**—గవాక్షములు = కిటికీలు; ద్వారములు = వాకిండ్లు; స్థావర ములు = స్థిరముగా నాఁటుకొనియుండునవి; సకలదిశలు = అన్నిదిక్కులు; దుర్ల భము = కష్టము; అనాయాసముగా = కష్టములేకుండా, సులభముగా, గోయి = గుంట; అంకురించు = పుట్టు; మూలములు = వేళ్లు; పోషణ = సంరక్షణ; సంగ్ర హించి = తీసికొనివచ్చి; కర్షకుఁడు = రైతు; స్థూలదృష్టి = పెద్దచూపు; పెంట = ఎరువు.

**వ్యాకరణము:**—ఈ పాఠారంభమున ముద్రించియున్న పెద్ద వృక్షము యొక్క పటమును చూడుము. ఈ వాక్యములోఁ గర్త యేది? కర్మ యేది? పట మును, ఏ విభక్తి? పెద్ద—ఇదియే వాచకము? చెట్టుయొక్క పటము; రాజుయొక్క నగరు; నాయొక్క పుస్తకము. 'యొక్క' అను ప్రత్యయము చేరియుండు పద మును షష్ఠీ విభక్తిగల పదమని చెప్పుదురు. 'నాయొక్క పుస్తకము' అను దానిని 'నా పుస్తక'మని చెప్పవచ్చును.

ఎరువు వుంటే వెర్రివాడు సేద్యగాడే. దుక్కికొద్ది పంట, బుద్ధికొద్ది సుఖము.



# 15. గోదావరినది.

## మొదటి భాగము.

ఉపాధ్యాయుఁడు — మీలో నెవ్వరైన నేదైన నొక నదిని జూచియున్నారా?

రంగయ్య—అయ్యా! నేను జూచియున్నాను. మా యూరి ప్రక్కన నొక నది ప్రవహించుచున్నది.

ఉపా.—ఆ నది పేరేమో నీకుఁ దెలియునా?

రం.—మా తండ్రి ప్రతిదినమును వేఁకువ లేచి గోదావరి యందు స్నానముచేయఁబోయెదనని చెప్పుచుండును. అందుచేత ఆ నదిపేరు గోదావరియై యుండును.

ఉపా. — నీవెప్పుడైన దానిలో స్నానముచేసియున్నావా?

రం.—మొన్న రథసప్తమినాఁడు మా తల్లిదండ్రులు స్నానముచేయుటకు నన్నేటికిఁ బిలుచుకొనిపోయిరి. నేనప్పుడు స్నానముచేసితిని.

ఉపా.—మీ యూరియొద్ద నా నది యెంత వెడల్పో నీకుఁ దెలియునా?

రం.—వెడల్పనఁగా నేమిటో నాకుఁ దెలియదు.

ఉపా.—ఏటిగట్టును జూచియున్నావా?

రం. — చూచియున్నాను. దానిప్రక్కనఁ గట్టు ఉన్నది. గట్టును దాఁటియే నీటియొద్దకుఁ బోవలెను.

ఉపా.—ఎదుటివైపు గట్టు నీకుఁ గనఁబడినదా?

రం.—ఆ యెదుటిగట్టును జూచితినిగాని, యది చాల దూరమున నున్నది.

ఉపా.—ఈ గట్టునుండి యా గట్టువఱకుండు దూరమునకు 'నది వెడల్పు' అని పేరు. ఈ గట్లకు మధ్య నదీజలము పల్లమునఁ బాఱుచుండును. ఇప్పుడు మీ యూరియొద్ద గోదావరినది యొక్క వెడల్పు ఎంతో చెప్పఁగలవా?

రం.—సుమారు రెండు మైళ్లుండునని తోఁచుచున్నది.

గోవిందుఁడు—మా యూరిప్రక్కన నొక నది పాఱుచున్నది. అది యంత వెడల్పుగలది కాదు.

ఉపా.—దాని వెడల్పు ఎంత యుండును?

గోవిం.—ఒక ఫర్లాంగు. ఎక్కువగానున్న ఫర్లాంగున్నర.

ఉపా. — మైలునకును ఫర్లాంగునకునుగల భేదము నీకుఁ దెలియునా?

రం.—ఎనిమిది ఫర్లాంగులొక మైలు.

ఉపా.—ఫర్లాంగునకెన్ని గజములు?

గోవిం.—రెండువందల యిరువది గజములు.

ఉపా. — ఒక మైలనఁగా నెంతో మీకిప్పుడు చక్కగా తెలిసినదిగదా? మీ యూరిదగ్గఱ నా నది వెడల్పు రెండు మైళ్లు. గోదావరి నిడివి యెంతో నీకుఁ దెలియునా?

గోవిం.—మాకుఁ దెలియదు.

ఉపా.—దాని నిడివి సుమారు తొమ్మిదివందల మైళ్లు.

రం. — అబ్బా! తొమ్మిదివందల మైళ్లా! ఎచ్చటినుండి యెచ్చటివఱకు తొమ్మిదివందల మైళ్లు?

ఉపా. — అది పుట్టుచోటునుండి సముద్రములోనఁ బడు చోటివఱకు తొమ్మిదివందల మైళ్లు.

గోవిం. — మీరు చెప్పునది మాకేదియుఁ దెలియలేదు. గోదావరికిఁ బుట్టుచోటున్నదా?

ఉపా. — ప్రతి నదికిని బుట్టుచోటు కలదు. దానికి "ఉత్పత్తిస్థాన"మని పేరు. ఉత్పత్తిస్థానమనఁగాఁ బుట్టుచోటని అర్థము. నదులు సాధారణముగాఁ గొండలయందుఁ బుట్టుచున్నవి. కొండలను మీరు చూచియున్నారుకదా?

రం. — కొండలను నేను జూచియున్నాను. మా యూరియొద్ద భద్రాచలముకొండ లున్నవి. చుట్టుపట్ల భూమికంటెనవి యెత్తుగానున్నవి.

ఉపా.—గోదావరియు నట్టి కొండలలోఁ బుట్టుచున్నది. అది పుట్టుచోట నా కొండలు రెండువేల యడుగుల యెత్తుగలవి. త్రింబక్ (త్ర్యంబకము) అను గ్రామసమీపముననుండు కొండలు అది పుట్టుచోటు. అవి త్రింబక్కును నానుకొనియున్నవి. ఈ గ్రామమిచ్చటికి సుమారు ఎనుబదియామడలదూరమునన్నది. అచ్చటికి మీరందఱు పోయి చూడవలయును.

గోవిం. — అయ్యా! అది పుట్టుచోటఁగూడ నింత వెడల్పుగానుండునా?

ఉపా.—దీని యుత్పత్తిస్థానము జూచుట కాశ్చర్యముగానుండును. త్ర్యంబక గ్రామమునకుఁ బోయి కొండ యడుగునుండి సుమారు ఏడువందల మెట్లెక్కినఁ గొండ పైభాగమున నొక కోనేరు గానబడును. అచ్చట ఱాఁతిలోఁ జెక్కిన విగ్రహమొకటి యున్నది. ఈ విగ్రహము నోటినుండి బిందువులు బిందువులుగా నీరు కోనేటిలోఁ బడుచుండును. ఇదియే గోదావరి పుట్టుచోటు. ఇచ్చోటికి లక్షలకొలఁది హిందువులు యాత్రచేసి, యీ కోనేరులో స్నానముచేసెదరు.

రంగయ్య — ఆ కోనేటియందు జలము కొంచెముగదా యుండవలయు. అయిన నింత నీరెక్కడినుండి వచ్చినది?

ఉపా.— ఏ నదియందైనను యుత్పత్తిస్థానమున నీరు కొంచెముగానుండును. కొండలయందుఁ బడు నీరంతయు దాని యందుఁ జేరుచుండును. అప్పుడు నది ప్రవాహమెక్కువై దానివెడల్పు అధికమగుచుండును. అచ్చటచ్చటఁ గొండల యందును, ఎత్తైన ప్రదేశములందును పడు వాననీరు చిన్న నదులుగ నేర్పడి యొక పెద్ద నదియందుఁ బడుచుండును. ఇట్టివానికి 'ఉపనదు'లని పేరు. గోదావరి కిట్టియుపనదు లెక్కువగా నున్నవి. ఈ యుపనదులు గోదావరిలోఁ బడుకొలఁది దాని వైశాల్య మధికమగుచుండును. అందువలననే యది పుట్టుచోటు నుండి యేనూఱుమైళ్లు ప్రవహించినవెనుక దాని వెడల్పు కొన్నిచోట్ల రెండు మైళ్లుండును.

జ్యేష్ఠాషాఢమాసములలో నీ కొండప్రాంత్యములలో నపరిమిత వర్షము కురియుచుండుటచే నదియం దామాసములలోఁ బ్రవాహములు పూర్ణముగనుండును. ప్రక్కనుండు నడవులనుండి చెట్లును, మేయుచుండు జంతువులును నీ వరదలలోఁ గొట్టుకొనివచ్చుచుండును.

రం. — గంగానది యంత పుణ్యమైన నదియా యిది?

ఉపా.—గంగయు, గోదావరియు నొకచోటనే పుట్టుచున్నవనియు, గోదావరి భూమిలోపల నెవ్వరికిని దెలియకుండఁ బాఱి త్ర్యంబకగ్రామసమీపమున వెలుపలికి వచ్చి పాఱుచున్నదనియు కథలు చెప్పుదురు.

వగచడి.—గంగలో మునిగినా కాకి హంస అవునా?

పదములు —ప్రవహించు = పాఱు; ప్రాంత్యము = సమీపము, నది = ఏఱు; వరద = వెల్లువ, ప్రవాహము; వైశాల్యము = విశాలత్వము, వెడల్పు; అపరిమితము = మితముకానిది, ఎక్కువైనది.

వ్యాకరణము:—అ + చోటు = అచ్చోటు; ఈ + చోటు = ఇచ్చోటు; ఏ + చోటు = ఎచ్చోటు.

# 16. గోదావరినది.

## రెండవ భాగము.

త్ర్యంబక గ్రామమునకు నేఁబది మైళ్లదూరమున నీ నదీతీరమందు 'నాసిక' అను పట్టణము కలదు. రామలక్ష్మణులును, సీతాదేవియు నరణ్యవాసము చేసినప్పుడీ పట్టణమునఁ గొన్ని సంవత్సరములు వసించిరనియు, అప్పుడు గౌతముఁడను ఒక ఋషి శ్రీరామునకు గోదావరిమాహాత్మ్యమును వెల్లడి చేసెననియుఁ బురాణములు చెప్పుచున్నవి. రావణుని చెల్లెలు శూర్పణఖ నాసికను లక్ష్మణుఁ డిచ్చటఁ గోసెననియు, నందుచే నీ పట్టణమునకు, 'నాసిక' అను పేరువచ్చెననియుఁ జెప్పుదురు.

ఈ యూర పంచవటి యను దేవాలయము కలదు. ఇది యయిదు మఱ్ఱిచెట్లక్రింద నుండుటచే దీని కీపేరు గలిగినది. 'నాసిక' అనునది చాల పుణ్యస్థలము. లక్షలకొలఁది హిందువు లిచ్చట గోదావరియందు స్నానముచేసి, పంచవటీదేవాలయములోని దేవునిఁ బూజింతురు.

అచ్చటినుండి యీ నది దక్కను పీఠభూమిపై హైదరాబాదు నిజాముగాజ్యము మూలమునఁ బ్రవహించుచున్నది.

ఈ నది కిరుప్రక్కల నెత్తైన శిఖరములుగల కొండలును, వ
యందు దట్టములయిన యడవులు నుండును.

గోదావరి ఇట్లు సుమారు ఎనిమిదివందలమైళ్లు ప
యావలఁ గొండలను తొలుచుకొని మైదానమునఁ బ్రవహిం
చున్నది. ఇది పర్వతప్రాంత్యములను వదలి మైదానము
బ్రవేశించుచోటు చూచుటకు మిగుల వినోదముగానుండును
అచ్చటఁ గొండల మధ్య నా నది వెడల్పు రెండువందల గ
ములకన్న నెక్కువ లేదు. అచ్చట నెటుచూచినను కొండ ల
డును. ఈ కొండలకుఁ దూర్పున నది మరల విస్తరిల్లును. అచ్చ
కేబదిమైళ్ల దూరమున రాజమహేంద్రవరము అను పట్టణవ
నకు సమీపమున దాని వెడల్పు రెండు మైళ్లు.

రాజమహేంద్రవరమున గోదావరినిదాటి రైలుబండి పోః
టకు వంతెనఁ గట్టియున్నారు. ఈ వంతెన చూచుటకు సొంపు
నుండును. దాని నిడివి యొకటి ముప్పాతిక మైలు. ఆ నదికి ఈ
గట్టునుండి ఆ గట్టునకు నేఁబదియాఱు దిమ్మెలను (స్తంభములు
కట్టి, యా దిమ్మెలపై నినుపగడ్డర్లు పెట్టియున్నారు. దిమ్మెలక
మధ్యనుండు ఎడము నూట యఱువది యడుగులుండును. ఆ
గడ్డర్లను నంత పొడవుగలవిగ నుండవలెనుగదా?

గోవిం.—ఈ వంతెనకా యనకట్ట (ఆనకట్ట) యని పేరు

ఉపా.—దానికిగాదా పేరు. ఈ స్తంభములున్నను నీరు
ధారాళముగా ప్రవహించుచుండును. రాజమహేంద్రవరమున
కావల ఐదుమైళ్ల దూరమున ధవళేశ్వరమను గ్రామమునొద్ద నీ
నదికి ఆనకట్ట కట్టియున్నారు. ఈ గ్రామమునొద్ద నీ నది వెడల్పు
మూడున్నరమైలు. ఇచ్చట నీ నది రెండు పాయలుగఁ జీలు

చున్నది. ఈ నదులకు మధ్యనుండు భూమితోఁజేరి యీ నది యిచ్చట మూఁడున్నరమైలు వెడల్పు. ఇచ్చటనే నీ నది డెల్టా ప్రారంభమగును.

రం.—'డెల్టా' యనఁగ నేమి?

ఉపా.—ఇచ్చటి భూమి మైదానప్రదేశము. కొండలప్రాంత్యములందుండునట్లు నేల యేటవాలుగనుండదు. అందుచే నది లోని జలము వడిలేక పాఱుచుండును. దానినిఁబట్టి కొండ ప్రాంత్యములనుండి ప్రవాహముతోఁ గొట్టుకొనివచ్చిన ఒండు (వండలి) మట్టియంతయు నిలచి నేలగా నేర్పడును. లక్షలకొలఁది సంవత్సరములనుండి మట్టి ప్రోగగుటచే దాని యెత్తేటేట నధిక మయి నీటిమట్టమునకన్న నెత్తగుచుండును. అందుచే నది ఏడు పాయలుగఁ జీలి, వానికి ముఖద్వారము లేర్పడి అవి సముద్ర ములోఁ గలియుచుండును. ఇట్లేర్పడు భూమికి డెల్టాయని పేరు.

ధవళేశ్వరమునకును సముద్రమునకును ముప్పదిమైళ్ల దూరము. ఈ ముప్పదిమైళ్ల దూరములో ఈ పాయలమధ్య ననేకలంక లున్నవి. లంకలు మిగుల సారవంతములు. వరిపైరు, పొగాకు, అరఁటి మున్నగునవి యిచ్చట సమృద్ధముగాఁ బండును.

పైఁజెప్పిన పాయలేడింటికిని వెవ్వేరు పేర్లు కలవు. ఒక దానికి గౌతమీ గోదావరియనియు, రెండవదానికి వసిష్ఠ గోదావరియనియు, మూఁడవదానికి భారద్వాజ గోదావరియనియు ఇట్లు ఏడింటికిని పేర్లు కలవు.

రం.—ఈ నదులవలన మన కేమి యుపయోగము?

ఉపా. — ధవళేశ్వరమునొద్ద ఆనకట్ట యున్నదికదా? ఇచ్చట మూఁడు కాలువలు త్రవ్వి గోదావరినీటి నీ కాలువలలో వదలియున్నారు. ఈ కాలువ లిచ్చటినుండి పోనుపోను. పెక్కు

పాయలుగఁ జీలి డెల్టాలోనుండు భూములకు గోదావరినీరు పాఱ
చుచున్నవి. ఇదిగాక పెద్ద కాలువలలోఁ బడవలపై సామగ్రి
దీసికొనిపోవుచుందురు. ఈ పడవలలో మనుష్యులుగూ
ప్రయాణము చేయుచుందురు. అందువలన నీ నది చాల ను
యోగకరమైనది. దీనియందు జ్యేష్ఠాషాఢ మాసములలో
బూర్ణప్రవాహముండును. హిందువులు ఈ నదిలో స్నానమ
చేసి దాని యొడ్డునఁ గూర్చుండి జపతపములు చేయుదుర
హిందూదేశములోనుండు పండ్రెండు పుణ్యనదులలో గోదావ
యొకటి. అందుచేఁ బండ్రెండు సంవత్సరముల కొకసా
పుష్కరము వచ్చుచుండును. అప్పుడు లక్షలకొలఁది జను
నదియందు స్నానముచేయుదురు. జనులు గోదావరియంద
స్నానముచేసి, చిత్తశుద్ధితో దేవునిఁ బ్రార్థించినఁ దాము చేసి
పాపములన్నియుఁ బోవునని వారు పూర్ణముగ నమ్మియున్నార

౮౦. — రైలుమార్గమేర్పడుటకు ముందు మనవారు గోదా
వరి నెట్లు దాఁటుచుండిరి?

ఉపా.—ఆ దినములలో పెద్ద పడవలపై దానిని వారు
దాఁటుచుండిరి. నేఁటికిని గోదావరిపైఁ బెక్కు పడవలున్నవి
పడవలవారీ క్రిందిపాటను బాడుచు పడవలను నడిపింతురు.

"గోదావరి తల్లికి—గొజ్జంగి పూదండ
సరసోతికీ సన్న—జాజిదండ
సుళ్లు దోపుళ్లు ము—సళ్లు దప్పించి మ
మ్మిల్లు సేర్చండి—వో తల్లులారా
పిల్లా జెల్లా అంతా—సల్లంగా రచ్చించి

యిల్లూ సేర్చండి—వో తల్లులారా
గోదావరి తల్లికి—కొట్టూరా టెంకాయ
కోరి దండామెట్టి—కుంకూమెట్టి."

పెన్న రావడం వెన్న కరిగేలోపల.

**పదములు**—నాసిక=ముక్కు; మాహాత్మ్యము = మహిమ, ప్రభావము; ఇరు ప్రక్కలన్ = రెండుప్రక్కలను; పోగు = కుప్ప; సమృద్ధముగా = నిండుగా; పూర్ణప్రవాహములు = నిండు వెల్లువలు.

**వ్యాకరణము**—నేను నదిని దాఁటితిని; నీవు నదిని దాఁటితివి; వాఁడు నదిని దాఁటినాఁడు—దాఁటు అను క్రియకు బదులు 'చూచు' అను క్రియ నుప యోగించి క్రొత్త వాక్యముల వ్రాయుఁడు.



# 17. రైలు.

## (i) గడియారము

బెజవాడయను పట్టణమున శేషగిరియను బాలుఁడు మూఁడవ తరగతియందుఁ జదువుచుండును. ఒకనాఁడతఁడు తన యుపాధ్యాయునియొద్దకు వెళ్లి 'అయ్యా! మా మామ రాజ మహేంద్రవరమునుండి వచ్చుచున్నాఁడు. నేను రైలుస్టేషనుకుఁ బోవలయును. నాకు సెలవీయవలయు'నని కోరెను.

ఉపా.—రైలుబండి యెన్ని గంటలకు వచ్చును?

శేష.— బండి పండ్రెండు గంటలకు వచ్చునని మా యన్నయ్య చెప్పెను.

ఉ.—ఇప్పుడెన్ని గంటలు?

శే.—పదిగంటలనర యయినది.

ఉ.—అది నీకెట్లు తెలిసెను?



శే.—అదిగో బడి గడియారము. దానిని జూచి తె
కొంటిని.

ఉ.—గడియారమును జూచి గంట దెలిసికొనఁగల
నీవు? పదిగంటలనర యెట్లో చెప్పుము?

శే.—ఇప్పుడు మా యన్నయ్య గడియారమును జూ
పదిగంటలనరయని చెప్పినాఁడు. కావున నేఁ జెప్పితిని.

ఉ.—ఆలాగా! కల్లలాడుట యెప్పుడు తగదు. ఇదిగో ·
యారమును జూడుము. దానిపైఁ గొన్ని గీఁతలు గీచియున్న
మనము 1, 2, 3 అంకెలను (౧, ౨, 3) ఇట్లు తిక్కిన యం
లను వ్రాయుచున్నాముగదా? ఇదేవిధముగా నీ యంకెఁ
I, II, III, IV, V. VI. VII, VIII. IX, X, XI. XI
అని వ్రాయుటగలదు. మట్టమధ్యాహ్నము మొదలు నడురేం
వఱకుఁ బండ్రెండు గంటలకాలము. నడురేయి మొదలు మఱు
నటిదినము మధ్యాహ్నమువఱకుఁ బండ్రెండుగంటల కాలము

ఈ గడియారమునందు రెండు ముల్లులున్నవి. అందొకటి పెద్దది. ఇంకొకటి చిన్నది. పండ్రెండుగంటల కాలమప్పుడు పెద్దముల్లును, చిన్నముల్లును నొకేచోట నొకదానిపై నొకటి యుండును. గంటకెన్ని నిమిషములో తెలియునా? గంటకొక పర్యాయము పెద్దముల్లు గడియారపు ముఖబిళ్లపై నొకచుట్టు తిరిగివచ్చును. పెద్దముల్లొక చుట్టు చుట్టునప్పటికిఁ జిన్నముల్లొక యంకెనుండి మఱియొక యంకెకుఁ బోవును. చిన్నముల్లును గమనించినఁగాని మనకు గంట యింతయని తెలియదు. పెద్దముల్లొక యంకెనుండి మఱియొక యంకెకుఁ బోవుట కైదు నిమిషములు పట్టును. ఇదెట్లో చెప్పఁగలవా?

శి.—గంట కఱువది నిమిషములు. అఱువది నిమిషముల లోపల XII నుండి I కిని, I టినుండి II కిని ఇటు లాగంట లోపలఁ బండ్రెండునఱకునుఁ బోవుచుండును. కావున నఱువది నిమిషములను బండ్రెండుచే భాగించిన నొక యంకెనుండి యింకొక యంకెకుఁ బోవుటకుఁ బెద్దముల్లుకుఁ బట్టు కాలమేర్పడును.

ఉ. — ఇప్పుడీ గడియారమునఁ జిన్నముల్లెక్కడనున్నదో చూడు: ఇది పదిగదా? ముల్లు దీనికిని బదునొకండునకును మధ్య నున్నది. దీనిచేఁ బది గంటలు కొట్టినదని యేర్పడును. పది గంటలు కొట్టినప్పుడు పెద్దముల్లు గడియారమున నెక్కడనుండును?

శి.—XII అని గుర్తించిన యంకె యుండుచోట నుండును.

ఉ.—ఆ చోటును వదలి యది యిప్పుడు VI అని గుఱుతు పెట్టినచోట నున్నది. కావున నిప్పుడు పదిగొట్టి ఆఱయిదులు—ముప్పది నిమిషములయినవని మనకేర్పడుచున్నది. రైలుస్టేషనులోఁ బెద్ద గడియారముండును. అది సరియైన గంటను జూపుచుండును. దానిని జూచియే యందఱు గడియారముల హెచ్చు

దక్కవలను సవరించుకొందురు. నీవు వచ్చునప్పుడు దానిని జూచి గంట యెంతో తెలిసికొనిరా. ఇదిగో మీ యన్న యిక్కడనే కాచుకొనియున్నాఁడు. పొమ్ము.

**పదములు.**—ఉపాధ్యాయులు = చదువుచెప్పువారు లేక అయ్యవారు; మధ్యాహ్నము = పట్టపగలు; నడురేయి = అర్ధరాత్రము, గమనించి = యోచించి.

**వ్యాకరణము** — నేను స్టేషనుకు పోవుచున్నాను. నేను స్టేషనుకు పోతిని. నేను రైలుస్టేషనుకు పోవలయును. 'నేను' అను మాటలకు బదులుగా నీవు, వాఁడు అను మాటల నుపయోగించి యీ వాక్యముల మరల వ్రాయుఁడు.

**కాపీమానా.** – గురువుమాట మీఱరాదు. గడ్డపార మ్రింగ రాదు.



# 18. రైలు స్టేషను.

శేషగిరియు, అతని యన్న సుబ్బారాయఁడును బెజవాడ రైలుస్టేషనునుఁ జేరిరి. వారు బండినుండి దిగి యచ్చటఁ జేరఁగనే గడియారము పదునొకండు గంటలు కొట్టెను. శేషగిరి స్టేషనులోనుండు పెద్ద గడియారమును జూచి చిన్నముల్లు XI అను గీఁతపై నుండెననియు, పెద్దముల్లు XII అను గీఁతపై నుండెనని యుఁ దెలిసికొనెను.

వీరచ్చట నుండునప్పుడు రైలెక్కి ప్రయాణముచేయుటకై వచ్చినవారు బండ్లనుండి దిగిరి. వారి మూటలను బండ్లనుండి దింపుటకుఁ గూలివాండ్రు పరుగెత్తుకొనివచ్చిరి. ఈ కూలివాండ్రకు 'పోర్టర్లు' అని పేరు. వారి చొక్కాయ మెడపట్టెపై 'పోర్టరు' అని యింగ్లీషున వ్రాసియుండును. వారు ప్రయాణి

కుల సామానుల దింపి, రైలు వచ్చువఱకును వానికిఁ గావలి యుండి, బండి వచ్చినంతనే దానిలో సామానులను బదిలముగాఁ బెట్టెదరు. ఈ పనులఁ జేయుటకై వారొక యణా, లేక రెండణాలు కూలిఁ దీసికొనెదరు.

శే.—అన్నయ్యా! యీ మనుష్యులందఱేల యీ కిటికీ యొద్దఁ గాచుకొనియున్నారు? వీరొక్కొక్కరిచేతిలోను పైకమున్నది.

సుబ్బా.—ఇది టిక్కెట్లమ్ము చోటు. రైలెక్కుటకు ముందు ప్రయాణికులు పైకమిచ్చి టిక్కెట్లు తీసికొనవలయును. ఆ టిక్కెట్లపైన వా రేయూరినుండి యేయూరికిఁ బ్రయాణము చేయవచ్చునో, ఆ యూళ్ల పేర్లుండును. బెజవాడనుండి విశాఖపట్టణము పోవలెనన్న, వారికిచ్చు టిక్కెట్లపై 'బెజవాడనుండి విశాఖపట్టణమునకు' అని ముద్రించియుండును. దానికి వారిచ్చిన విలువయు నందుండును. టిక్కెట్లిచ్చుటకు ముందు వానిపై తేదీని ముద్రింతురు. ఈ టిక్కట్లను గొనుటకై వా రెంత ప్రయాసపడుచున్నారో చూడు! ఒకరినొకరు నెట్టుకొనుచున్నారు.

శే.—ఆ టిక్కట్లను దీసికొని ప్రయాణముచేయువా రేమి చేయుదురు?

సుబ్బా.—రైలువచ్చుటకు ముందుగా నొక తలుపును తీసికొని టిక్కట్లను పరీక్షించుటకై ఒక రైలు ఉద్యోగస్థుఁడు నిలిచియుండును. అక్కడికిఁ బోయి టిక్కెట్టును జూపినవారి నతఁడు లోపలికి విడుచును. లోపలికిఁ బోఁగానే యా కట్టడమునకు ముందు నెత్తయిన తిన్నె యుండును. రైలు వచ్చువఱకు నందఱచ్చటఁ గాచుకొనియుందురు. దానికి 'ప్లాట్ ఫారం' అని పేరు.

వీరిట్లు మాట్లాడుచుండఁగా కూలివాఁడొకఁడు గంటఁ గొట్టెను.

శే.—అన్నయ్యా! ఏమి గంట యది?

సుబ్బా.—రైలుబండి ప్రక్క స్టేషను నడలినది. శీఘ్రముగా వచ్చును. టిక్కెట్లమ్ముట కారంభింతురు. గంటకొట్టిన తోడనే పనివాండ్రందఱు రైలువచ్చునని, జాగ్రత్తతోఁ దమ పనులకుఁ బోదురు.

వీ రిట్లు మాట్లాడుచుండఁగా తపాలాఫీసునుండి పెద్దపెద్ద మూటలు వచ్చి చేరెను. వానిని జిన్న బండ్లలోఁ బెట్టి పోర్టర్లు బండ్ల నీడ్చుకొనిపోయిరి.

శే.—అన్నా! యివి యేమిటివి?

సుబ్బా.—ఇప్పుడు రాఁబోవునది మెయిల్‌బండి. ఇది తపాలు నొక యూరినుండి మఱియొక యూరికిఁ గొనిపోవును. ఇది యతివేగముగాఁ బరుగెత్తును.

శే.—తపాలు నెట్లు తీసికొనిపోవునదియు నేనిదివఱకే రెండవ వాచక పుస్తకమునఁ జదివియున్నాను.

సుబ్బా.—ఇదిగో బండివచ్చు వేళయయినది. మనము ప్లాట్‌ఫారమునకుఁ బోవుదము రా.

అచ్చటఁ బ్రయాణికులందఱు దమతమ మూటలనెత్తుకొని బండిరాక నెదురుచూచుచుండిరి. ప్రయాణికులకు పాలు, కాఫీయమ్మువారును, ఫలహారములమ్ము వారును, వార్తాపత్రికలను పుస్తకములనమ్మువారును దిరుగుచుండిరి. రైలులో వచ్చినవారి సామగ్రుల దింపుటకు పోర్టరు లచ్చటఁ గాచుకొనియుండిరి.

శే.—ఈ పలకపై 'బెజవాడ సంధి' అని వ్రాసియున్నదే? ఇదేమిటి?

సుబ్బా.—ఈ యూరిపేరు బెజవాడగదా? రైలులోఁ బ్రయాణముచేయువారికీ యూరిపేరుఁ దెలిసికొనుటకై పెద్ద యక్షరములతో చెక్కియున్నది.

శే.—పేరు సరే! 'సంధి' యన నేమి?

సుబ్బా.—రెండు మూఁడు రైలుమార్గములు గలిగియుండు చోటునకు 'సంధి' యని పేరు. ఒక మార్గము చెన్నపట్టణము నుండి ప్రారంభించి, యీ బెజవాడ రాజమహేంద్రవరము, విశాఖపట్టణములమీఁదుగా నుత్తరమున కలకత్తా అను పెద్ద పట్టణమునకుఁ బోయి చేరుచున్నది. మఱియొక మార్గము తూర్పున బందరుకుఁ జేరుచున్నది. ఇంకొకటి పడమట హైదరాబాదు ప్రాంత్యములకుఁ బోవుచున్నది. ఇంకనొకటి గుంటూరు, నంద్యాలమీఁదుగా నైర్ఋతిమూలనుండు గుంతకల్లుకుఁ బోవుచున్నది. ఇన్ని మార్గములిచ్చటఁ గలియుటచేతనే దీనికి 'సంధి' యని పేరు.

శే.—అదిగో యా స్తంభమేమిటి? చేతివలె నొక బల్లను చాచియున్నది.

సుబ్బా.—దానికి 'చెక్కమ్రాను' అని పేరు. అది స్టేషను కడ బండ్లు నిలచి రాఁబోవుబండి నాటంకపఱచుచున్నవా, లేక రైలుమార్గమున నేయాటంకము లేకయున్నదాయని సూచించును.

శే.—గంటకొట్టి చెక్క వాల్పఁగానే రైలుబండి వచ్చునందురే, అదేమి?

సుబ్బా.—తెక్కవాల్చి, గంటకొట్టగానే రైలు రాదు. రైః ఒక మైలుదూరమున నున్నప్పుడే మార్గమున నేమియు నాట కము లేదని తెలుపుటకు గుఱుతుగా తెక్క వాల్చెదరు. అదిగో రైలు పోర్టరొకఁడు తెక్క వాల్చుచున్నాఁడు. బండి వేగముతో వచ్చుచున్నది. వెనుకకు రా! లేకున్న క్రిందఁ బడెదవు సుమీ

ఇంతలో రైలుబండి 'గుబ్ గుబ్'మని సద్దుచేయుచు నవీ వీరున్నచోటును దాఁటి పైకిఁబోయి తటాలున నిలచెను.

శే.—ఆ ముందుండునదేమి?



సుబ్బా.—అదియే 'ఎంజిన్' బండి. దానికిఁ బది పంద్రెం బండ్లు తగిలించియున్నవి. ఈ బండ్లలో మనుష్యులు ప్రయా ణముచేయుదురు.

రైలుబండి స్టేషనుకడ నిలువఁగనే వీరి మామ రామదాసు పంతులు బండినుండి దిగెను. శేషగిరియు, అతని యన్న సుబ్బారాయఁడును, వారి మామకు నమస్కారములు చేసిరి. పిల్లల నడిగి యింటి క్షేమసమాచారములను దెలిసికొని, మూటను పోర్టరు తలపైఁబెట్టి, టిక్కెట్టును వాఁకిటనిచ్చి, మేనల్లుళ్లతో నాతఁడు బండిలో నెక్కి యింటికిఁబోయెను.

**పదములు.**—ఉద్యోగస్థుఁడు = నౌకరి, జాగ్రత్త = హెచ్చరిక, ప్రాంత్యమున = సమీపమున.

**వ్యాకరణము.**—పోర్టరు—స్టేషను—టిక్కెట్టు, ఆఫీసు—ఎంజిన్ ఇవి యన్నియు నింగ్లీషుపదములు. ఇవి సాధారణముగా మన యాంధ్రభాషయందు ఇటీవల వాడుకలో వచ్చినవి. రైలుమార్గమును—ఇనుపదారియనియు 'ఎంజిన్' బండిని, పొగబండియనియు, పోర్టర్లను — కూలీలనియు, ఆఫీసును — కచ్చేరి యనియు వాడుట కలదు.

**కాఫీమానా.**—ప్రాణముపోయినా మానము దక్కించుకొనవలెను.



# 19. చెట్లు.

(౧)

## మొదటి భాగము.

చెట్లు, వాని యాహారము.

భూమిమీఁద ననేకవిధములైన మ్రాఁకులు, చెట్లు, గడ్డలు, పచ్చికయు మొలచుచున్నవిగదా? ఇవియన్నియు వృక్షవర్గమునందుఁ జేరినవి. వానిలోఁ గొన్ని మనుష్యులకును, మృగములకును, పక్షులకును నాహారమగును. మరికొన్ని వస్త్రముల నేయుటకును మందులకును నుపయోగించును.

జంతువులకువలె వృక్షములకుఁ బ్రాణము లున్నవి. అయిన నవి కదలలేవు. అవి పుట్టినచోటనే పెరిగి నశించును. పెను గాలి వీచిన, దానిబలముచే వేళ్లు పెళ్లగిలి వాని స్థానమును విడుచునేకాని మఱొకవిధముగా విడువదు. చెట్లు చిన్న విత్తనములనుండి యంకురించి ప్రాణముతోనుండి నానాఁటికి వృద్ధియై పెద్దపెరిగి వయస్సు మీఱినవెనుక నెండును. మనవలెనే అవియు భుజించుచు, నీళ్లు త్రాగుచుండును. పగటిపూట పనిచేసి రాత్రులందు నిద్రించుచుండును. ఒకటితోనొకటి వివాహముచేసికొని సంతాన మభివృద్ధిచేయుచుండును. వానికి నింద్రియజ్ఞానము గలదు. వృక్షముయొక్క కొమ్మ విఱిగిన నప్పు డది కాలు విఱిగిన కుక్కవలె బాధనొందును.

నీకైనను నాకైన నాహారము కావలసియున్నట్లే చెట్లకుఁ గూడ నాహారము కావలెను. మనమొకనాఁ డన్నములేక యుంటిమేని బలహీనులమై జబ్బుగానున్నట్లగపడుదుము. మన మనేకదినములు లంకణములు చేసితిమేని చనిపోదుము. అవ్విధముననే చెట్ల కాహారము చక్కఁగా దొరకనిపక్షమున నవి కృశించి వర్ధిల్లవు. వానికి బహుకాల మాహారము దొరకని యెడల నవి యెండి చచ్చిపోవును.

చెట్లు మనవలెఁ దమ యాహారమును భుజింపవు. మనకుఁ బండ్లున్నవి గనుక మన మాహారమును నమలఁగలము. శిశువులముగ నున్నపుడు మనకు దంతము లుండవు గనుక పాలుమాత్రమె త్రాగఁ గలిగితిమి. ఇట్లే చెట్లకు నీరాహారమగుచున్నది అవి భుజించెడి పదార్థములు స్వచ్ఛముగానుండును. అయిన నవి వట్టి నీళ్లుమాత్రము కావు.

సాధారణముగాఁ గనఁబడుచున్న నీళ్లలో సహితము, మనకంటె

కగపడకపోయినను, ఆహారపదార్థములు మిశ్రమై యుండ వచ్చును. నేను నీ చేతిలో నొక చక్కెరగడ్డ (పంచదారముక్క) నుంచినపక్షమున దానిని నీవు గుటుక్కున మ్రింగఁగో రెదవుగదా? అది చక్కెరయని నీకగపడుచుండును. అయినను దానినొక పాత్రలోనుంచి దానిమీఁద నీళ్లు పోసిన అది నీళ్లలోఁ గలసి పోవునుగదా? ఆ నీళ్లు తేటగా నగపడినను, ఆ పంచదార వానియందే కలసియుండును. ఆ జలమును ద్రాగితివేని, అది మధురముగానుండును. ఇవ్విధముననే చెట్లు తినెడి యాహారము నీళ్లలోఁ గలసియుండును.

చెట్లు బ్రదుకఁగలుగుటకు వాని కాహార ముండవలెను. వాని కాహారము దొరకకపోయెనా, అవి చచ్చిపోవును. చెట్లకు మూఁడువిధముల నాహారము లభించును. మిక్కిలి లేఁత మొక్కలకవి పుట్టు గింజెలలోనే యాహారము దొరకును. కొంచెము పెద్దవైన మొక్కలును జెట్లును భూమిలో నున్న యాహారపదార్థములను దమ వేరులమూలమునను, గాలిలోనున్న యాహారపదార్థములను దమ యాకులమూలమునను దీసికొనుచుండును.

కొన్ని సెనగగింజెలను దీసికొని వానిని గొంచెము నీళ్లలో నానఁబెట్టి యుంచుము. కొన్నాళ్లైనపిదప వానిని బరీక్షించి చూడుము. అప్పుడేమి నీకగపడును? ప్రతి విత్తులోనుండి యొక చిన్నమొక్క పుట్టుచుండును. అవియే చెట్లకు శిశువులవంటివి. అవి మిక్కిలి కోమలములై యుండును.

వానియాహార మవి పుట్టువిత్తనములలోనే యుండును. శిశువులకుఁ బాలిచ్చునట్లా విత్తనములా మొలకలకుఁ దమలో

నున్న యాహారమును ద్రవరూపమున నిచ్చును. అది వానికి సమృద్ధముగాఁ జిక్కనేని, అవి శీఘ్రముగఁ బెరుఁగును. విత్తనములలోని యాహారమంతయు నగువఱకు అవి దానిని ద్రాగుచుండును. ఆ విత్తనములలోఁ గావలసినంత చెమ్మ లేకపోయెనా, ఆ యంకురములు వానిలోని యాహారమును ద్రాగనేరవు. కొంతకాలమునకా గింజలు నట్టినగును. అంతలో నా మొలకలు పెద్దవైయుండును. అప్పటినుండి యవి తమ యాహారమును వేఱుచోట్ల వెదకికొన నారంభించును.

చెట్టుపెట్టినవాఁడు నీళ్లు పోయఁడా?

**పదములు**—కృశించి = చిక్కి, స్వచ్ఛము = తేటయయినది, పంచదార = చక్కెర, శిశువులు = బిడ్డలు, అంకురములు = మొలకలు.

ఇంద్రియము లయిదు—ముక్కు, కన్ను, చెవి, నాలుక, చర్మము. వాసన చూచుట, చూచుట, వినుట, రుచిచూచుట, తాఁకుటవలనఁ గలుగు జ్ఞానము—ఇవి యింద్రియజ్ఞానములు.

**వ్యాకరణము** — నీ వనేకలంకణములు చేసితివేని చనిపోదువు. ఈ వాక్యమున 'నీవు' అను పదమునకు బదులుగా 'మీరు, మేము, నేను, అది, ఆమె, ఇతఁడు, వారు, వీరు' అను పదములఁ జేర్చి వేర్వేరు వాక్యముల వ్రాయుఁడు.



# 20. చెట్లు.

## (౨)

## రెండవ భాగము

చెట్లు తమ యాహారమును దిన విధము.

ఇదిగో యిచ్చట ముద్రించియుండు పటమును జూడుము. మూఁడు సెనగగింజలను నానఁబోసి మొలకలెత్తినపిదప వానిలో నొకదానిని బల్లమీఁదను, రెండవదాని నొక తడిగుడ్డయందును నుంచి, మూఁడవదానిని నేలలోఁ బాఁతి పెట్టిన, కొన్నిదిన



ములకు, బల్లమీఁదఁబెట్టిన మొలకకు కావలసినంత ఆహారము లేమిచే నెండిపోవును. పై పటము మధ్యఁ జూపియున్న మొలకను అది పోలియుండును. తడిగుడ్డయందున్న రెండవ మొలక, యీ పటములోఁ గుడిచేతివైపున నుండుదానివలె సన్నగిలియుండును. మనుష్యులవలెనే చెట్లుకూడను వట్టి నీళ్లుమాత్రము త్రాగి జీవింపఁజాలవు.

ఇఁక మనము భూమిలోఁ బాఁతిపెట్టి నీళ్లుపోయుచున్న మూఁడవ మొలకను బరీక్షించెదము. ఇది మిగిలిన రెంటికంటెఁ జాలఁ బెద్దదైయున్నది. ఇది యొక చిన్న వేరును విడిచి రెండాకులను వేసియున్నది. ఇది లావై యారోగ్యకళలు గలిగియున్నది. దీనికిఁ గారణమేమన, నిది రెండవ మొలకవలె మొదట విత్తనములోని యాహారమంతయుఁ దిని, పిమ్మట భూమిలోను గాలిలోనుగల యాహారపదార్థములను దిననేర్చినందునఁ జక్కఁగా వృద్ధియగుచున్నది.

మనము ప్రతిదినమును మొక్కకు నీళ్లు వోయుచుంటిమేని, దానినుండి వేళ్లు పుట్టి లోపలివైపునకును, చిగుళ్లు పట్టి పై వైపున

కును బెరుగును. అటుపిమ్మట నే యవి తమంతటఁ దామాహార
మును దినఁగలుగును.

చెట్లకు భూమిలోపలినుండియు, పైనుండియు నాహారము
దొఱకుచున్నదియని చెప్పితిమిగదా? అందు భూమిలోపలినుండి
దొఱకెడి యాహారము చెమ్మ, ఉప్పు, మఱి గాలిలో దొఱకని
యనేకములయిన పదార్థములు. ఈ యాహారమును జెట్లు వేళ్ల
మూలమునఁ గైకొనుచున్నవి. వేళ్లయందుఁ బెక్కు నోళ్లున్నవి,
కాని యవి మనకంటికగపడనంత సన్ననైనవి. కనుక వేళ్లు చెట్టును
గదలకుండ నిలుపుటయే కాక, తమయందలి చిన్న నోళ్లతో
భూమిలోని యాహారపదార్థములను గైకొని చెట్టునకు నిచ్చు
చున్నవి. మన మాహారమును దంతములతో నమలి తిందుము.
మనము పసిబిడ్డలముగా నున్నప్పుడు దంతములు లేవు గనుక,
నప్పుడు పాలు మొదలగు ద్రవపదార్థములు మన యాహారమై
యున్నవి. చెట్లకు దంతములు లేవు గనుక, వాని యాహారము
గూడ ద్రవరూపముగా నుండవలయును.

ఇఁకను జెట్టు భూమి పైభాగమునుండి యెట్టి యాహారమును
గైకొనునని విచారింతము. అవి గాలి, వెలుఁగు, వేడిమి, నీరు.
గాలిలో నీరు గలసియుండును. చెట్టు తన యాకులమూలమున
గాలిలోని యాహారమును గైకొనును. ఆకునందు మనకగపడ
నన్ని నోళ్లున్నవి. మనము లోనికి గాలిని బీల్చుకొనునట్లె యాకు
లును దమ నోళ్లమూలమున గాలిలోనున్న యాహారపదార్థము
లను బీల్చుకొనుచున్నవి. ఒక మొక్కయొక్క యాకులను గిల్లి
వేసినయెడల నా మొక్క త్వరలో నెండిపోవును.

చెట్టునకు గాలి, నీరుమాత్రమే కాక, వెలుఁగును, నెండ
యుఁ గావలయును. కటికచీఁకటిలో నొక మొక్క నుంచిన



యెడల నది యెన్నాళ్లకైనను బాగుగాఁ బెరుగక, రోగమునఁ బడినట్లు తెల్లబాఱును. దాని యాకులును బచ్చగానుండక వన్నె చెడి తెల్లనైయుండును.

మంటిలోనున్న యాహారపదార్థములు నీటిలోఁ గరఁగి యుండవలయును గనుక, మనము చెట్లకు నీరు పోయవలయును. మనము పోయు నీరు భూమిలోని కింకి చెట్లయొక్క యాహార పదార్థమును గరఁగించుచున్నది. నీళ్లు పోయుటచేత నేల మెత్త పడును. కనుక చెట్లవేళ్లు భూమిలోఁ బాఱి తమ యాహార మును సంపాదించుకొనఁగలుగును.

ఇవ్విధముగాఁ జెట్లు భూమిలోపలనుండు నాహారమును వేళ్లమూలమునను, గాలిలోనుండెడి యాహారము నాకులమూల మునను గైకొని వెలుఁగును బొందుచు నానాటఁ బెరుగుచుండును. ఇట్టి చెట్లను విత్తనములు మొలవవేయుటచేతనే కాక, నారునాఁ టియు, అంట్లు ద్రొక్కియు, కొమ్మలను నఱికి నాఁటియుఁ బెం చుటగలదు.

**పదములు.**—పదార్థములు = వస్తువులు; వన్నె = వగను రంగు

వ్యాకరణము —ఈ క్రింది వాక్యములలో గీత యుండుతావులఁ బదములను జేర్చుము

చెట్టున కాహారము కావలెను. ———ప్రతిదినము నీళ్లు పోయవలెను. ———పోయుటచేత నేల మెత్తపడును. చెట్లకు నేను నీరు———. చెట్లకు ———నీరు పోసితివి ———ఆమె నీళ్లు———. ———గాలియు ఆహారము. చెట్లు———ఆకులమూలమున గాలిలోని యాహారమును గైకొనును

నట్టినిందలు చెప్పితే గట్టినిందలు వచ్చును.

# 21. ఎల్లప్పుడు నిజము పలుకుము.

బాలురారా! ఎల్లప్పుడును నిజమునే పలుకుచుండుఁడి. మీరాలాగునఁ జేసితిరేని మిమ్ము నెల్లరును నమ్ముదురు. మీరందఱు నిష్టులై యుందురు. మీకుఁ గీడు సంభవింపవచ్చునని తోఁచుచున్నను సత్యమునే పలుకుఁడి. అనృతమెన్నఁడు నాడని యొక బాలునిఁగూర్చి మీకు నొక కథ దెలిపెదను.

ఆ బాలునిపేరు రాజయ్య. వానితండ్రి వాని కొకనాఁ డొక కత్తి నిచ్చెను. ఆ కత్తి మిక్కిలి సొగసైనది. ఒక్కరూపాయ విలువగలది. రాజయ్య దానిని జూచుకొని మిక్కిలి మురియుచుండువాఁడు. వానికట్టి కత్తి యెన్నఁడును జేతఁ జిక్కియుండ లేదు. వాఁడు దానిని దన చొక్కాజేబులో నుంచుకొని బడికిఁ బోయెను. నాఁడంతయును వాని ధ్యానమంతయు నా కత్తిమీఁదనే యుండెను. బడి ముగియఁగానే వాఁడు తన యింటికిఁ బరుగెత్తుకొనిపోయి యచ్చటఁ దన జేబులోనుండి తన కత్తిని బయటికిఁ దీసి చూచుకొనెను.

అంతట వాఁడు తన తండ్రియొక్క యుద్యానవనములోనికిఁ బోయి యందుండిన యొక లేత నిమ్మచెట్టును జూచి దానిని

దన కత్తితో నఱకెను. తా నా చక్కని చెట్టును బాడుచేయుచున్నానని గ్రహింపక తన చక్కని కత్తి యొక్క బాగుగాఁ దెగగొట్టునో యని మాత్రమాలోచించుకొనుచుండెను. ఇంతలో వాని తల్లి పిలువఁగా వాఁడు భోజనముచేయుటకుఁ బరుగెత్తిపోయెను.

కొంతసేపైనపిదప వాని తండ్రి యింటికి వచ్చెను. అటు తరువాత నతఁడును రాజయ్యయును గలసి తమ తోటలోఁ దిరుగఁ బోయిరి. అప్పుడు తండ్రి యా నిమ్మమొలకను జూచి, “దీని నిట్లు ధ్వంసముచేసినవారెవరు? ఇది యింకఁ జచ్చిపోవును. ఎవరో దీనిని గత్తితో నఱకినారు. ఎవరో తుంటరు లీతోఁటలోఁ గాలుపెట్టిరి. వారు నా కంటఁబడిరేని యీ చెట్టు నిట్లు నాశముచేసినందునకు వారిచేతులు విఱుగఁగొట్టుదును” అని కోపపుఁజూపులతో ననెను. తండ్రి యిట్లు ప్రతిజ్ఞ చేయఁగా విని రాజయ్య భయముతో వడవడ వణఁకెను. తన తండ్రి యొక్క కోపోద్రేకమును జూచి, యతఁడు తన్ను గట్టిగా దండించి తనకత్తిని దీసికొని పాఱవేయునని వాఁడనుకొనెను. తన్ను శిక్షింపవలసినదే యని కూడ వాఁడు గ్రహించెను. అయినను వాఁడు సుశీలుఁడుగానఁ దక్షణమే “నాయనా, నే నన్నృతములను నుడువఁజాలను. నేనే యీ చెట్టును నా క్రొత్త కత్తితో నఱకితిని. తెలియక తప్పుఁజేసితిని” అని హీనస్వరముతో విన్నవించెను. తండ్రి వానివణఁకును జూచి వాఁడు సత్యము నొప్పుకొనినందునకుఁ గడు సంతస మంది, “కుమారా, నీవు నిజమాడినందునకు మిక్కిలి సంతోషపడితిని. ఈ చెట్లన్నియుఁ బాడైపోయినను బోవుఁగాక. నీవు నిజము తప్పక బ్రదికినఁ జాలును” అనెను.

రాజయ్య పెద్దవాఁడగుటయు తన దేశస్థులందఱికంటె మిక్కిలి ఘనత కెక్కినవాఁడయ్యెను. వారతనిని తమరాజునకు మంత్రినిగా నియమించుకొనిరి. అతఁ డెల్లప్పుడును న్యాయస్థుఁడును సత్యసంధుఁడునై యుండువాఁడు గావున నంతటి మహాదశకు రాఁగలిగెను.

**పదములు**—ధ్యానము = తలఁపు, ధ్వంసము = నాశనము, తుంటరులు = పోకిరులు, కోపోద్రేకము = కోపముయొక్క యెచ్చు, అనృతము = అసత్యము, అబద్ధము, సుశీలుఁడు=మంచినడతగలవాఁడు, సత్యసంధుఁడు=నిజమే ప్రతిజ్ఞ కలవాఁడు; తదనంతరము = అటుపిమ్మట, ఘనత కెక్కిన = కీర్తిపొందిన.

**వ్యాకరణము** — ఈ క్రింది వాక్యములందు అడుగున గీతలుండు పదములకు బదులుగా వేఱుపదములనుంచి వ్రాయుఁడు. రాజయ్య ఎప్పుడును నిజమునే పలుకుచుండును రాజయ్య తండ్రి రాజయ్యకు ఒక కత్తినిచ్చెను. ఆ కత్తి మిగుల సొగసైనది. రాజయ్య ఆ కత్తిని చొక్కాయజేబులో నుంచుకొనెను నాఁటితోయు రాజయ్య ధ్యానము ఆ కత్తిమీఁదనే యుండెను.

అబద్ధాలపంచాంగమునకు అర్ధవైగడియలూ త్యాజ్యమే.



# 22. మామిడిచెట్టు.

## మొదటి భాగము

వేఁపచెట్టును గుఱించి మీరు రెండవ వాచక పుస్తకములోఁ జదివియున్నారుగదా? ఇప్పుడు మామిడిచెట్టును గుఱించి కొంత తెలిసికొనవలయును. మీలో మామిడిచెట్టును చూడనివారెవ్వరు నుండరు గదా. మన దేశములోఁ బెరుగు వృక్షములలో నిది చాల ముఖ్యమైనది. లోకమునందు శ్రేష్ఠమైన పండ్లలో మామిడిపం డొకటి.

మామిడిచెట్ల వేళ్లు భూమిలోపలఁ జొచ్చి యందే పెరుగు చుండును. వేఁపచెట్టువలె నిదియు అనేక సంవత్సరములు బ్రతుకునది. అందుచేఁ జెట్లకు వయస్సు హెచ్చుకొలఁది వేళ్లు బలిసి పది పదునైదు గజముల నిడివి గలిగి చెట్ల ప్రక్కలయందేఁబది యఱువది గజములవఱకు వ్యాపించియుండును. 78-వ పుటలో బొమ్మను జూడుము. ఈ చెట్లయందుఁ గొమ్మలును, ఆకులును, పువ్వులును, పండ్లును మెండుగా నుండును. అందుచేఁ జెట్లు క్రిందఁ బడకుండ దృఢముగ నిలుచునట్లు చేయుటకును, చెట్టులోని ప్రతి భాగమునకును ఆహారపదార్థములను ద్రవరూపముగా సంగ్రహించి తెచ్చుటకును వేళ్లు నానాముఖముల వ్యాపించియుండుననియు, వేళ్లకు తేమగానుండుతావులను వెదకికొనిపోవుట స్వభావమనియు, నీ కొనవేళ్లయందు వేరువెండ్రుకలు చాల విచిత్రముగఁ బుట్టుచుండుననియు, నీ వెండ్రుకల మూలమున నాహారము ద్రవరూపమును జెంది, చెట్లలోని బోదెలకును, కొమ్మలకును బోవుచుండుననియు మీరు ఇదివఱకే చదివియున్నారు.

విత్తనమునుండి యప్పుడే పుట్టిన మామిడిమొక్కను జూచి యున్నావా? ఈ మొక్క దాని విత్తనమునుండి సూటిగా బైకిఁ బెరుగును. దీనికి బోదె యని పేరు. దీనినే ప్రకాండమనియుఁ జెప్పుదురు. పుట్టునప్పు డిది సన్నగిలి చాల మృదువుగా నుండును. సంవత్సరములగుకొలఁది నీ బోదె (మ్రాను) లావెక్కి పొడుగై, కొననుండి శాఖలుగఁ జీలి, యందుపశాఖలేర్పడి నలువైపుల వ్యాపించును.

వేఁప, మామిడిచెట్లు నిడివియందును లావునందును సమానములుగా నున్నవి. ఈ చెట్లబోదెలకు (మ్రానులకు) నెలుసుల

నుండు భాగమునకు పట్టయని పేరు. దీని పట్ట వేపచెట్టుపట్టను పోలియున్నది. చెట్టు చిన్నదిగా నున్నప్పుడు మామిడిపట్ట పచ్చగ నుండి నునుపుగనుండును. చెట్టు లావెక్కకొలఁది పట్ట చెట్టుతో సరిగా విస్తరింపఁజాలక పగులుట కారంభించును. కొన్నాళ్లకది యూడిపోవుచుండును. దీనిని సులభముగా నొలిచి తీయవచ్చును.

మనుష్యునకు చర్మమెంత యుపయుక్తమో, అట్లే పట్టయు చెట్టునకంత యుపయుక్తము. ఇది చెట్టులోపలిభాగమును ఎండ చేతను, గాలిచేతను జెడిపోకుండఁ గాపాడును.

ఇట్లు సులభముగా నొలవఁదగు పై పొరక్రింద నింకొక పొర గలదు. ఇది పైపట్టకంటె సన్నమైనది. దీనిని లోపలి చర్మమని చెప్పుదురు. దీనియందుఁ గణములుండును. నీసాబుడ్లకు మూఁతగ నుపయోగపడు కార్కును చూచియున్నారుగదా? ఇది బెండువలె నుండును. ఇట్టి బెండుపదార్థము ప్రతి చెట్టునందును కొంచెముగనో గొప్పగనో పెరుగుచుండును. చెట్ల పట్టను మనము నానావిధముల నుపయోగించుచున్నాము.

మఱియు నీ పట్టల యడుగుభాగమునుండియే వేళ్లు తాము తీసికొను నాహారపదార్థములఁ జెట్ల యాకులకుఁ జేర్చును. ఈ పదార్థములు ఆకులలో పక్వమై చెట్లకు పుష్టికలిగించు నాహారముగ మాఱి చెట్ల ప్రతిభాగమునకును, ఆకులనుండి యీ పట్టల యడుగుభాగముమూలముగనే తిరిగి ప్రసరించుచుండును. కత్తి నొకదాని నెత్తుకొని చెట్టు పొరను నఱుకుచుఁబోయిన, పట్ట నుండి రసము కాఱును. దానిని తాఁకిన నది చేతికి బంకవలె నంటుకొనును. ఇదియే చెట్టునకుఁ బుష్టికలిగించు నాహారపదార్థము.

పై జెప్పిన పట్టక్రింద చెట్లబోదె బలిసి కఠినముగానుండును. ప్రతి సంవత్సరము వర్షాకాలమున నీబోదె మునుపటి

కంటె లావెక్కి పెరుగును. ఈ మ్రాను పెరుగుకొలది చెట్టుయొక్క శాఖలును, నుపశాఖలును లావెక్కి, వానిలోఁ గ్రొత్త కొమ్మలు పుట్టుచుండును. మామిడిచెట్టుయొక్క అడుగుమొద్దును నడ్డముగా ఱంపముతోఁ గోయుము. కోసినభాగమును జూచిన నా మ్రానునందుండు పొరలెట్లు ఏర్పడునదియు మీకు తెలియును.



# 23. మామిడిచెట్టు.

## రెండవ భాగము.

మామిడియాకులను జక్కగా బరిశీలించి, యా యాకులకును బాదము, వేప, చింత, మఱ్ఱి, తామర ఆకులకునుండు భేదమును మీరు తెలిసికొనవలయును. మామిడికొమ్మ నొకదానిని విఱచి, యందెటు లాకు లమరియుండునో దానిని పరీక్షించిన ఆ కొమ్మయొక్క ఒక్కొక్క కనుపునకును నొక్కొక్క యాకువంతునఁ బుట్టుచున్నదనియును, ఆకొకటి కొమ్మకు కుడివైపునఁ బుట్టిన, దానికి ప్రక్కనుండు ఆకు, ఆ కొమ్మకు నెడమవైపున బుట్టుచున్నదనియు మీకు తెలియును. సూర్యుని వెలుతురు ఆకులపైఁ బడుట యావశ్యకము. ఒక యాకును మఱియొక యాకు మఱుగుపఱచిన సూర్యుని వెలుతురు దానిపై జక్కగఁ బడదు. అందు నిమిత్తమే భగవంతుఁ డాకుల నిట్లు నిర్మాణముచేసియున్నాఁడు. మామిడియాకులు సన్నగిల్లి పొడుగుగనున్నవి. అందుచే నెప్పుడును కదలుచుండుటకు వీలగుచున్నది. గాలి యెక్కువగా వీచునపుడు దానియొక్క వొత్తుడు ఆకులపైఁబడి చెట్లకేమి హానికలుగకుండునట్లు దేవుఁడాకులను నిర్మించియున్నాడు. ఆకు పొడుగుగ



నుండుటచే నది సులభముగా నెంగును. వాన కురియునపుడు వాన నీరు దానిపై నిలువక తత్క్షణమే క్రిందఁ బడుచుండును. మిడిమిడి యెండకాలమున మామిడిచెట్టు క్రింద నిలుచుండిన నది యెక్కువ నీడనిచ్చునని మీరు తెలిసికొనఁగలరు. మామిడియాకులు నును పుగనుండి తళతళ మెఱయుచుండును. మామిడి[illegible] [illegible]

నుండును. ముదిరినయాకులు పచ్చగనుండి కొంతకాలమైన పిదపఁ బండి క్రిందికి రాలును. అయినను మొత్తమున మామిడి చెట్ల యాకులు సంవత్సరముపొడుగునను పచ్చగనేయుండును. బాదము మున్నగు చెట్లలోని యాకులన్నియు నొక కాలముననే పండి యాకులు రాలుసమయమున రాలుచుండును. మామిడి తోరణముల మనము సంవత్సరముపొడుగునను శుభదినముల యందుఁ గట్టుటకు వీలగుచున్నది.

మామిడిపూఁతగుత్తి చూచుటకు సొంపుగనుండును. అది మొగ్గలుగ నారంభించి పిదప వికసించును. మామిడికొమ్మల కొనలయందే యీ గుత్తులు సాధారణముగా నేర్పడియుండును. ప్రతి సంవత్సరమునను సాధారణముగాఁ బుష్య మాఘమాసము లలో మామిడిచెట్టు పుష్పింప నారంభించును. పూఁత చక్కగా పట్టియుండు చెట్టును జూచినఁ బువ్వుల గుత్తులన్నియు ముందుఁ బడిన యాకులనుగూడ మఱచును. పుష్పములలో తేనె యుం డును. దాని నాకర్షించుటకై వానియందు తుమ్మెదలు వ్రాలు చుండును. తుమ్మెద లీప్రకారము ఒక పువ్వునుండి యింకొక పువ్వునకు వ్రాలుటచేఁ గాలక్రమమునఁ గాయలేర్పడుటకు వీలు గలుగుచున్నది.

మామిడికాయలను మనము పలువిధముల నుపయోగించు చున్నాము. లేఁతపిందెలను, పుల్లగనుండు ముదురుఁగాయలను వివిధములగు నూఱుఁగాయలు వేయుట కుపయోగించుచు న్నాము. చెట్లనంటుద్రొక్కి రుచ్యమైన పండ్లనిచ్చు మంచి మొల కలను మొలపించి, వానిని తోఁటలలోవేసి వానియందుఁ బండిన పండ్లను తిందుము. వైశాఖ జ్యేష్ఠమాసములలో నీ చెట్లు చక్కఁగ బండును. మనదేశమందు గొన్నిచోటలలో మామిడి

పండ్లరసము నెండఁబెట్టి పక్వముచేసి సంవత్సరముపొడుగునను పిండివంటలవలెఁ దినుచుందురు. దీనికి 'తాండ్ర' యని పేరు.

మామిడిమొద్దును నిలువుగ పలకలుగఁ గోసి యిండ్లకు నుపయోగించుచున్నారు. చూచితిరా యీ చెట్టు మన కెంత యుపయోగకారియో? ఇట్టి చెట్లను మనము సదా పెంచు చుండవలయును.

**పదములు.**—శ్రేష్ఠమైన = మేలైన, దృఢముగ = గట్టిగా, సంగ్రహించి = తీసికొని; విస్తరించు = విరివియగు, పుష్టి = బలము, పరిశీలించి = పరీక్షించి, ఆవశ్యకము = ముఖ్యము.

**వ్యాకరణము** — ఇవి మూడు పండ్లు ఇవి మామిడిపండ్లు ఈ పండ్లు రుచ్యమైనవి. వీని వెల ఎనిమిది అణాలు. ఈ నాలుగు వాక్యము లొకటిగా చేర్చిన, ఈ రుచ్యమైన మూడు మామిడిపండ్ల వెల యెనిమిది అణాలు. తోట వాఁడు మామిడిపండ్లను అంగడికి తీసికొనిపోవును తోటవాఁడు పండ్లను బుట్టలో తీసికొనిపోవును. వాడు అంగడిలో వీని నెనిమిది అణాలకు అమ్మును. ఈ వాక్యములన్నిటిని చేర్చి యొక్క వాక్యముగ వ్రాయుము.

మింగ మెతుకు లేదు, మీసాలకు సంపెంగనూనె.

# 24. గొల్లపిల్లవాఁడును, తోఁడేలును.

ఒకనాఁ డొక గొల్లపిల్లవాఁడు గొఱ్ఱెలమంద కాచుకొని యుండవలసి వచ్చెను. అప్పుడు వానితండ్రి "నీవు కేవలము పసి వాఁడవు. ఈ యడవియందొక భయంకరమైన తోఁడేలున్నది. అది గొఱ్ఱెలను బట్టి చంపుటకు సదా ప్రయత్నపడుచుండును. దానితో నీవు పోరాడలేవు. అయినను నీ వెలుఁగెత్తి నన్నుఁ

గెలువవచ్చును. కనుక తోఁడేలు కానవచ్చినప్పుడు గొంతెత్తి నన్నుఁ బిలువుము. అదిగో దవ్వున నున్న చేనిలో నేనును నీతోఁ బుట్టువులును బనిచేయుచుండెదము. నీ కేక వినినంతలోనే పరుగెత్తి వచ్చెదము'' అని తన కొడుకుతోఁ జెప్పిపోయెను.

ఆ చిన్నవానికిఁ బరియాచకము లాడుటయందు మిక్కిలి యిష్టము. కనుకఁ గొంతసేపటికి వాఁడు పనులేవియుఁ దనకు లేనందున నూరకుండి విసుగుచెంది యున్నట్టుండి 'అదిగో తోఁడేలు' అని కేకవేసెను. ఆ కేక విని వాని తండ్రియుఁ దోఁబుట్టువులును జేను విడిచి వాని సాహాయ్యమునకై పరుగెత్తి వచ్చిరి. కాని వారు దగ్గఱకు రాఁగాఁ బిల్లవాఁడు వారిని జూచి పకపక నవ్వుచుఁ దన సామర్థ్యమును దలఁచుకొనుచు నాశ్చర్యపడుచుండెను.

ఇట్లే వాఁడొకటి రెండు సారులు చేసినవాఁడై తనకు సహాయముగాఁ దన తండ్రిని నన్నదమ్ములను రావించి చూచి నవ్వెను.

ఇట్లుండ జాములోపల నొక తోఁడేలు చేట్టుప్రక్కలనున్న యడవులలోనుండి నిజముగా నక్కడికి వచ్చెను. అంతట వాఁడు దానిని జూచి భయపడి ''తోఁడేలు తోఁడేలు'' అని యెప్పటివలె గొంతెత్తి యఱచెను. కాని వాని తండ్రి మొదలుగాఁ గలవారెప్పటివలెనే వాఁడెగతాళికి నఱచుచున్నాఁడను కొని వానికిఁ దోడు రాకపోయిరి.

పిల్లవాఁడుమాత్రము మాటిమాటికి నఱచుచుండి రితి మాలుకొన్నను వారావూటలు పెడచెవినిబెట్టి యూరకుండిరి. వాఁడు కేకవేసియు వ్యర్థమయ్యెను. ఇంతలోఁ దోఁడేలు వచ్చి సుందరమైన యొక గొఱ్ఱెపిల్లను బట్టుకొని చంపి యరణ్యము

లోపలికి లాగుకొనిపోయెను. ఇంతేకాక పిల్లనానిని గఱచి పోయెను.

కనుక మనమెప్పుడును బారుగువారితోఁ బరిహాసములాడి వారికి లేనిపోని దిగులు పుట్టించుచుండుట తగని పని. అట్లు చేయుటవలన నొకవేళ నెప్పుడైనను మన కాపద వచ్చెనేని, అప్పుడు వారు మనకుఁ దోడుపడరు.

**పదములు.**—దవ్వున = దూరమున, అరణ్యము=అడవి; తోడుపడరు = సాహాయ్యపడరు.

**వ్యాకరణము.**—ఇది యొక అడవి. దీనియందొక తోడేలున్నది. ఈ తోడేలు భయంకరమైనది. ఆ తోడేలు గొఱ్ఱెలను పట్టి చంపును. వీనినన్నిటిని చేర్చి యొక వాక్యముగా వ్రాయుఁడు. ఈ యడవియం దొక భయంకరమైన తోడేలు గొఱ్ఱెలను పట్టి చంపును. ఈ వాక్యమును విడఁదీసి నాలుగు చిన్న వాక్యములుగా వ్రాయుడు. వాడు పకపక నవ్వెను. ఇట్లే 'చకచక, టక టక, నకనక, లబలబ' వీని నుపయోగించి వాక్యముల వ్రాయుడు



# 25. మఱ్ఱిచెట్టు.

మఱ్ఱిచెట్టు మన దేశమందుమాత్రమె కానఁబడుచున్నది. అది వృక్షరాజములలో నొకటియైయుండి మిక్కిలి యద్భుతమైన వృక్షమైయున్నది. అది రమారమి డెబ్బది మొదలు నూఱడుగుల యెత్తునకుఁగూడఁ బెరుఁగును.

అది యొకానొకప్పుడు మిక్కిలి విచిత్రముగా మొలచును. పక్షులు మఱ్ఱిపండ్లను దినును. అవి తఱచుగా నీఁతచెట్టు మీఁదనైనను దాటిచెట్టుమీఁదనైనను మఱేచెట్టుమీఁదనైనను గూరుచుండి వానిపై రెట్టవేయును. అప్పుడా గింజలలోఁ గొన్ని యా చెట్లపైని రాలి క్రిందఁబడిపోవక యచ్చటనే మొక్క-



మొలచును. ఇవ్విధమున నీఁదులు తాడులు మొదలగు చెట్ల మీఁద మఱ్ఱిచెట్లు మొలచుచుండుటను మనము తఱచుగాఁ జూచుచున్నాము. అట్టి మఱ్ఱిచెట్లు కాలక్రమమునఁ బెద్దవై భూమిలోనికి వేరులు దిగి తమ కాధారమైయుండిన తాటిచెట్టు మొదలగువాని నొకానొకప్పుడు చంపును.

మఱ్ఱిచెట్టు రమారమి యిరువదియేండ్ల చెట్టయినపుడు దానినుండి యూడలు దిగును. అవి భూమినంటుకొనఁగానే వానిలో నొక్కొక్కటి నాటుకొని వేరులు దిగి ప్రత్యేకమైన చెట్టై, తల్లిచెట్టుయొక్క కొమ్మ కాధారమగును గాన నా కొమ్మ దాని నాశ్రయించుకొని మఱింత పెద్దదగును. ఈవిధమున నా తల్లిచెట్టు కాలక్రమముచేఁ బెద్దదై విశేషభూమి నాక్రమించుకొనును. ఇట్టి వటవృక్షమొకటి మిక్కిలి పెద్దది గలదు.

దానినీడలో నించుమించుగ నేఁడు వేలమంది విడియఁగలరు. దానికి మూఁడు వేల యూడలు దిగియున్నవి. ఇట్లూడలుగల వటవృక్ష మొక్క చెట్టువలెఁ దోఁపక యొక తోఁపువలెఁ గనఁబడును.

వటవృక్షము నొక దేవాలయమునలెను దాని యూడలు దేవాలయమందలి స్తంభములవలెను గొందఱు వర్ణింతురు. హిందువులు తఱచుగా మఱ్ఱిచెట్లక్రిందఁ జిన్న దేవాలయములను గట్టుదురు.

ఈ చెట్టుయొక్క విశాలమైన నీడలోఁ బశ్వాదులు మధ్యాహ్నవేళలందుఁ బ్రాయికముగా విశ్రమించును. డస్సియున్న బాటసారులు దానినీడను దిగి వంటచేసికొని భోజనముచేసిన పిదప నొకటి రెండు గంటలకాల మచ్చటనే పరుండి విశ్రమింతురు. వందలకొలఁదిఁ బక్షులు దాని కొమ్మలలో నివసించి చిన్నవియు నెఱ్ఱనివియునైన దాని పండ్లను భుజించును. ఆ పండ్లు మర్కటములకు సహితము ఆహారమగును. మేఁకలు మఱ్ఱియాకులను దినును.

మఱ్ఱియాకులను విస్తళ్లనుగాఁ గుట్టుకొని మన దేశస్థులు కొందఱు వానిలో భోజనముచేయుదురు. అయినను గొంచెము కలిగినవా రరఁటియాకులనే విస్తళ్లుగా వాడుకొనెదరు. మఱ్ఱిపాలను మృగయులు పక్షులను బట్టుకొనుటకు బంకగా నుపయోగించుకొందురు. మఱ్ఱిపుల్లలతోఁ గొందఱు దంతధావనముఁ జేసికొందురు. మఱ్ఱినారతో ముదుకత్రాళ్లు పేనుదురు.

**పదములు.** — వృక్షరాజము = చెట్లలోఁ బెద్దది, పశ్వాదులు = పశువులు మొదలయినవి, ప్రాయికముగా = సామాన్యముగా; విశ్రమింతురు = కూర్చుందురు; దంతధావనము = పండ్లుతోముట, మర్కటము = కోఁతి; వటవృక్షము = మఱ్ఱిచెట్టు.

వ్యాకరణము:— నేను, మేము, నీవు, మీరు, వాడు, అతడు ఈ పదముల నుపయోగించి 'వటవృక్షము క్రింద' అనుదానితో వాక్యములను వ్రాయుము



# 26. జపానుదేశపు పిల్లలు.

## మొదటి భాగము

బాలురు బాలికలు

ఇదిగో నిక్కడ ముద్రించియుండు బొమ్మను చూడుము. వీరు జపానుదేశములోని పసిపిల్లలు. జపానుదేశము మన దేశ

మునకుఁ జాలదూరమున నున్నది. సముద్రములోఁ బెక్కుదిన ములు ప్రయాణముచేసినగాని యా దేశమును జేరజాలము. ఆ దేశముచుట్టును సముద్రమున్నది. నలుతట్లు సముద్రముచేఁ జుట్టఁబడియుండు నేలకు 'దీవి' యని పేరు. జపాను దేశము పెక్కుదీవుల కూటము. ఈ దీవులు మన దేశమున కీశాన్య మూల నున్నవి.

ఈ దీవులలో నిండ్లు మన యిండ్లవలె నుండవు. ఇటుకలు, ఇసుక, సున్నముతో నిండ్లు కట్టుటలేదు. వెదురుగడలను నాఁటి, వానిపైఁ దేలికగనుండు కప్పువేసియుందురు. ఇండ్లకు గోడలు లేవు. పగటిపూట నూనెకాగితములను గోడలకు బదులుగా వ్రేలాడఁగట్టెదరు. రాత్రులందుఁ బలుచని కొయ్యతలుపులను, కిటికీలను, గోడలకు బదులుగా నుపయోగింతురు. పలుమా రిండ్లకు నిప్పంటుకొనిపోవుటచేతను, భూకంపముచే నిండ్లు పడి పోవుటచేతను నిండ్ల నట్లు కట్టుకొనుచున్నారు.

జపాను దేశములో నిండ్లు పరిశుభ్రముగనుండును. అందుఁ గుర్చీలుగాని, మేజాలుగాని యుండవు. రత్నకంబళులు నుండవు. నేలపైఁ జిటిచాపలు పఱచియుండును. ఆ చాపలపై నచ్చ టచ్చటఁ బెద్ద దిండ్లుండును. మన దేశమున ధనవంతుని యిండ్ల లో నేలపై తివాసీలు పఱచియుంచుదురు.

వారు జెప్పులు, జోళ్లు మున్నగు పాదరక్షలతో నిండ్ల లోనికిఁ బోరు. వారు పాదరక్షలను చీపురు పుల్లలతోఁ జేయు దురు. వీనినిఁ దొడుగుకొని యిండ్లలోనికిఁ బోయిన, వానిలోని మట్టికియంతయు నింటిలోఁ జేరును. అందుచే జోళ్లు తొడుగుకొని యింటిలోనికిఁ బోవుట మంచి యాచారముకాదు.

మనము చెప్పులను తొడుగుకొని జపానువారి యింటికిఁ

[illegible]యి తలుపుఁ దట్టినతోడనే యొక బాలిక యెదురువచ్చి, తన తల నేలకుఁ దగులునట్లు దేహమును వంచి, మఱి పాదములలో నుండు జోళ్లను దీయును. పెద్దవారిని జూచినపుడు మనము చేతులఁ జోడించి నమస్కారముఁ జేయుచున్నాముకదా? జపానుదేశము నందుఁ దల నేలకుఁ దగులునట్లు వంచుటయే యితరులకు వారు చూపు గౌరవము.

జపానుదేశమునఁ దల్లిదండ్రులు వారి బిడ్డలను మిగుల గారాబముతోఁ బెంచుదురు. బిడ్డలకు వలయు సౌఖ్యములన్నింటి నిత్తురు. బిడ్డలు సూర్యోదయమునఁ బడకనుండి లేవఁగనే వారి తల్లి వారి మోమును గడిగి వారికి నుడుపులను దొడుగును. ఆ పిల్లల యుడుపు లెట్లున్నవో ఈ పాఠారంభమునందు పటములో చూచితివా? ఆ పిల్లలు పట్టుతోఁ జేసిన దట్టీలను గట్టుకొనియున్నారు.

పెద్దవారును, పిల్లలును దొడుగుకొను నుడుపులలో భేద ముండదు. ఆఁడువారంగీల క్రిందఁ దళతళ మెఱయుచుండు పావడ లను గట్టుకొందురు. ధనవంతులుగనుండువారు ధగధగ మెఱయు చుండు జలతారు దట్టీని నడుమునకుఁ గట్టుకొనెదరు. బాలురు కట్టుకొను దట్టి బాలికలు కట్టుకొనుదానియంత విలువగలదిగాదు.

వారు తమ వెండ్రుకలను చక్కగా దువ్వి మనవా రుప యోగించు రత్నములు, వజ్రములతోఁ జెక్కిన బంగారు నాగ రము, జడబిళ్లకు బదులుగా తాబేటిచిప్పలు, లక్కపగడము మున్నగువానితోఁ జేసిన యాభరణములను ధరించుకొనెదరు.

ఇట్లు వీ రుడుపులు తొడుగుకొనినవెనుక వీరి కన్నము పెట్టుదురు. మనవలెనే వారు నేలపైఁ గూర్చుండి భుజింతురు. బియ్యపుపిండితోఁ జేసిన యట్లు మున్నగువానిని దినెదరు. కొన్నివేళలలోఁ జేఁపలను దినుటయుఁ గలదు.

జపాను దేశములోఁ దేయాకురసమును (తేనీటిని) విశేషముగాఁ ద్రాగదరు. మనము భోజనముచేయునట్లు వారాహార పదార్థముల భుజింపరు భోజనముచేయునపుడు వారు పెన్సలుల మాదిరిగనుండు రెండు పుడకలతో నాహారము నెత్తి నోట వేసి కొందురు.

భోజనము చేసినవెనుక బాలురును బాలికలును బడికిఁబోవుదరు. వారి తల్లి వారికిఁ జక్కఁగాఁ దల దువ్వి కాలుసేతులలోని గోళ్లను మాలిన్యములేకుండ శుభ్రముగ నీళ్లతో గడిగి, పిల్లలకు మధ్యాహ్నభోజనమునకై వలయు నాహారమును జిన్నపెట్టెలలోఁబెట్టి సుమారేడుగంటలప్పుడు బడికిఁ బంపును.

# 27. జపానుదేశపు పిల్లలు.

## రెండవ భాగము.

ఏడు గంటలు మొదలు సాయంకాలము మూఁడు నాలుగు గంటలవఱకు వీరు బడిలోనే చదువుచుందురు.

జపానుదేశస్థులు మనము వ్రాయునట్లు వ్రాఁత వ్రాయరు. కలములతోను వ్రాయరు. చిత్రపటములను వ్రాయుటకుపయోగించు కుంచెతో వ్రాఁత వ్రాయుదురు. కనుకనే వారి వ్రాఁతఁ జూచిన నది చిత్రపటములవలె నుండును. అక్షరములను పైనుండి క్రిందికి వ్రాయుదురు. మహమ్మదీయులు వ్రాయునట్లు కుడిచేతివైపున నారంభించి పైనుండి క్రిందికి వ్రాసి, రెండవ పంక్తి నారంభింతురు.

బాలురును బాలికలును నింటికి వచ్చినతోడనే వారి కాడు కొనుటకు వీలు కాదు. బాలురు పాఠముల నింటిలో వ్రాసి,

రొట్టెలనువేసి, మరునటిదినము వానిని తమ యుపాధ్యాయులకుఁ జూపవలసియుండును. సాయంకాలమున నట్టి పనిని వారు చేయుదురు. బాలికలు నాట్యమాడుటకును, విసనకఱ్ఱలతో విసరుటకును, తేనీరు గిన్నెలలోఁ బోయుటకును, నేర్చుకొనవలసియున్నది. ఆ దేశములో బాలికలు నేర్చుకొనవలసిన విషయములలో నివి ముఖ్యమైనవి.

ఇవి యన్నియుఁ జేయుటకు నేర్పాటులు కలవు. ఈ యేర్పాటులప్రకారము నేర్చుకొనుట కష్టము. అభ్యాసము వలననే యివి పట్టుపడును. జపానుదేశస్థులకుఁ బుష్పములయందుఁ బ్రీతి మెండు. పువ్వులను గ్రుచ్చుటయు, నిండ్లను వానితో నలంకరించుటయును విద్యగా నేర్చుకొందురు.

ఈ పనులన్నియు ముగిసినవెనుక నయిదారు గంటలకు సాయంకాల భోజనమునకుఁ గూర్చుందురు. మనము పగటిపూట నాహారము భుజించునట్లు వీరిప్పుడు చక్కఁగా నాహారము భుజింతురు. ముఖ్యమైన భోజనము వారి కిదియే.

భోజనమైన తరువాత బాలురును బాలికలును స్నానము చేయుదురు. స్నానమైన పిమ్మటఁ బండుకొనువఱకు నాట్లాడుకొనుచుందురు. జపానుదేశములోని పిల్లలకు నాటలయందును, నాటలకుపయోగించు వస్తువులయందును బ్రీతి యెక్కువ. ఆ దేశములోఁ బొమ్మలమ్ము దుకాణములు పెక్కులు గలవు. కొందఱు బొమ్మల నిండ్లకుఁ దెచ్చి యమ్ముచుందురు. బాలురకు గాలిపటము లెగురవేయుటయందును, కొయ్య తుపాకి కాల్చుటయందును బ్రీతి యెక్కువ. మన దేశములో బొమ్మలకు వస్త్రములనుగట్టి పెండ్లిండ్లు చేయువిధముననే, జపానుదేశములోని బాలికలును బొమ్మలకుఁ బెండ్లిండ్లు చేయుదురు.

ఆ దేశములో వారు బిడ్డలనెట్లు ఎత్తుకొనుచున్నారో, పటమునుజూచి గమనించితిరా? మన దేశములో సాధారణముగా బిడ్డలను జేతులతో నెత్తుకొని చంకఁ బెట్టుకొనుచున్నాము కదా? మన దేశములో నెఱుకలు (చచ్చుటివాండ్రు) బిడ్డలను వీపునకుఁ గట్టుకొనులాగున, జపానుదేశస్థులు బిడ్డలను వీపునకుఁ గట్టుకొనెదరు. ఆడుచుఁ బాడుచు బాలిక లిటటు పడుచున్నను బిడ్డలకెట్టి హానియుఁ గలుగదు.

బాలురకు గాలిపటము లెగురవేయుటయందుఁ బ్రీతి మెండు. ఈ గాలిపటములు చేఁపరూపముగ నుండును. వారీ గాలిపటము లెగురవేయు నాటనాడుటయేగాక, తమ్ము ధైర్యవంతులనుగను, దృఢగాత్రులనుగను జేయునట్టి యాటల నాడుచుందురు. అందుచేతనే పెద్దపెరిగిన తర్వాత వారేపనినిగాని ధైర్యముతోను బట్టుదలతోను జేయఁగలిగియుందురు.

సంవత్సరాదిపండుగ జపానుదేశములో గొప్ప పండుగు దినము. ఆ దినమున నిల్లంతయు శుభ్రముచేసి, కడిగి, పచ్చతోరణములు కట్టి, నారింజపండ్లతో నలంకరింతురు. ఆ దినము నందే యిరుగుపొరుగువాండ్రకు బహుమానము లంపెదరు.

**పదములు.** — భూకంపము = నేలవణఁకు; గారాబముతో = ప్రీతితో, సూర్యోదయము = సూర్యుఁడుదయించు సమయము; దట్టి = కాసె, పంక్తి = వరుస; అభ్యాసము = వాడుక, దృఢగాత్రులు = గట్టి శరీరముగలవారు.

**వ్యాకరణము** — జపానుదేశమునఁ దల్లిదండ్రులు వారి బిడ్డలను మిగుల గారాబముతోఁ బెంచెదరు. ఈ వాక్యములోని ప్రతి పదమును బదులు వచ్చునట్లు ప్రశ్నలను వేయుము.



# 28. యుద్ధము.

మన ముండు దేశము ఆంధ్ర దేశము. మన భాషకుఁగూడ ఆంధ్రభాష యని పేరు గలదుగదా! ఇట్టి యాంధ్ర దేశమునఁ బెక్కు రాజ్యములుండినవి. ఆరాజ్యముల నేలు వీరులగు రాజులొండొరులతో పలుమాఱు యుద్ధమాడుచుండిరి. వీరిలో పలనాటివారు ప్రముఖులు. ఈ పల్నాడు గుంటూరుజిల్లాలో కృష్ణానదీతీరమున నున్నది. ఒక తరుణమున నొకరాజు తన శత్రురాజుపై దండెత్తుటకుఁ జాటించెను. ఆ సమయమున భట్టుమూర్తి యనునాతఁడు వారికి సంధిచేయ నెంచి, వారిలో నొకనిసభకుఁ బోయి, యుద్ధము చెడ్డదనియు, దానివలనఁ బెక్కులు చేటులు గలుగుననియు బోధించుచున్నాఁడు.

పోరు మంచిదికాదు భూమి నెక్కడను
బాడౌను దేశంబు పగ మించెనేని
ప్రజలెల్ల నశియించి పాఱిపోవుదురు
బండారమునకును బైకంబు లేదు
రాణువ యందుచే రహిం చెడియుండుఁ
జేజీతగాండ్రెల్లఁ జెలఁగి కోపించి
యీఁగల జీతంబు లిమ్మందు రపుడు
ప్రతిబంటు మేరలు పరిహారమౌను
బంపినఁ బనిసేయఁ బ్రాలుమాలుదురు
తెలిసిన శాత్రవుల్ ధీరతతోడ
భూమిని గొనుటకు బుద్ధి వెట్టుదురు
పగవారి వార్తలు పరికింపలేరు
మేకొని మీలోన మీరు పోరాడఁ

జూచెడువానికిఁ జులకనయౌను
కోరి శాత్రవులు మీఁ గుట్టలుంగుదురు
పలునలు మిముఁజేతి పగఁ జావనీక
చెప్పుచునుందురు చెనటివాక్యముల
నైకమత్యము చెడు నద్దానితోడఁ
జెడును బలంబును జెడును భాగ్యంబుఁ
జెడును యశంబును జెడును శౌర్యంబుఁ
జెడును రాజ్యమ్మును చెడ్డపిమ్మటను
దేశంబు పరనృపాధీన మౌనుమ్ము
పగవృద్ధిఁ బొందించు భ్రష్టులే కాని
యడఁగించు నేర్పరు లవనిలో లేరు.

**పదములు** — పోరు = యుద్ధము, పగ = విరోధము, మించెనేని = అధికమైన, బండారము = బొక్కసము, రాణువ = సైన్యము; రహి = ఆనందము, మేరలు = జీతములు; శాత్రవుల్ = శత్రువులు, ధీరత = ధైర్యము, చెనఁటి = కుత్సితము, ఉపాధి = కపటము, మోసము, నృపులు = రాజులు, భ్రష్టులు = వెలివేయఁబడ్డవారు.



# 29. పద్యములు.

1. చెప్పెద నొకమాట చెవియొగ్గి వినుము
తప్పుగాచినమీఁదఁ దగదెగ్గులెన్న.

2. ఇచ్చితెమ్మనఁ గోప మెవ్వరికైన
వచ్చునెప్పుడు నది వాలాయమరయ.

3. తన్నుమాలినయొక ధర్మంబుగలదె
యున్నసొమ్మంతయు నొరులకెపఁడిచ్చు.

4. తీపుసుచక్కెర తినినట్టినోట
వేపాకు దినిపించు విపరీతవేళ

5. మఱుఁగుచొచ్చినవాని మదిలోనఁగరుణ
నెఱయఁ బ్రోచుటమంచి నియమంబుసుమ్మి.

6. గీ॥ చిత్తశుద్ధిగల్గి చేసినపుణ్యంబు
కొంచెమైననదియుఁ గొదువగాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకునెంత
విశ్వదాభిరామ వినురవేమ.

7. గీ॥ అల్పుఁడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండుపల్కుఁ జల్లఁగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా॥ వి॥

8. గీ॥ మేడిపండు చూడ మేలిమైయుండును
బొట్ట విచ్చి చూడఁ బురుగు లుండు
బెరుకువానిమదిని బింక మీలాగురా॥ వి॥

9. గీ॥ అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచె ముండుటెల్లఁ గొదువగాదు
కొండ యద్దమందుఁ గొంచెమైయుండదా॥ వి॥

10. గీ॥ తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పుఁ
దప్పులెన్నువారు తమతప్పులెఱుఁగరు॥ వి॥

11. గీ॥ గంగగోవుపాలు గంటెడైనను జాలుఁ
గడవడైన నేమి ఖరముపాలు
భక్తిగలుగుకూడు పట్టెఁడైనను జాలు॥ వి॥

12. గీ॥ పదుగురాడుమాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁ డాడుమాట యొక్క దెందు
నూరకుండువాని కూరెల్ల నూఁకదు ॥ వి ॥

13. గీ॥ కోపమునను ఘనత కొంచెమైపోవును
గోపమునను మిగుల గోడు చెందుఁ
గోప మడచెనేనిఁ గోరిక లీడేరు ॥ వి ॥

14. గీ॥ అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్లఁ దొలఁగఁగొట్టుఁ
జెప్పుతినెడుకుక్క చెఱకుతీపెఱుఁగునా ॥ వి ॥

15. క॥ ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ

16. క॥ ఎప్పుడు తప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁగూడ దది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్ప వసించినవిధంబు గదరా సుమతీ.

17. క॥ కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టము గట్టిన
వెనుకటిగుణ మేల మాను వినురాసుమతీ.

18. క॥ కూరిమిగల దినములలో
నేరము లెన్నఁడును గలుగ నేరవు మఱి యా

కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు నిక్క మసుమతీ.

19. క॥ చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైనయట్లు పామరుఁడు దగన్
హేమంబుఁ గూడఁబెట్టిన
భూమీశులపాలఁ జేరు భువిలో సుమతీ.

20. క॥ తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకున్
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ.

21. క॥ కులకాంతతోడ నెప్పుడుఁ
గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠికంఠి కన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ.

22. క॥ రూపించి పలికి బొంకకు
ప్రాపగు చుట్టంబు నెగ్గు పలుకకు మదిలోఁ
గోపించురాజుఁ గొలువకు
పాపపు దేశంబు సొరకు పదిలము సుమతీ.

23. క॥ పురికిని ప్రాణము కోమటి
వరికిని ప్రాణంబు నీరు వసుమతిలోనన్
గరికిని ప్రాణము తొండము
సిరికిని ప్రాణంబు మగువ సిద్ధము సుమతీ.

24. క॥ ఎప్పుడు సంపదగలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నన్

దెప్పలుగఁ జెఱువునిండిన
గప్పలు పదివేలుచేరుఁ గదరా సుమతీ.

25. క॥ కొఱగాని కొడుకుబుట్టిన
కొఱగామియె కాదు తండ్రి గుణములఁ జెఱచున్
జెఱకుతుద వెన్ను పుట్టినఁ
జెఱకునఁ దీపెల్లఁజెఱుచు సిద్ధముసుమతీ.

26. క॥ వినఁదగు నెవ్వరుసెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలోసుమతీ

27. క॥ బలవంతుఁడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుటమేలా
బలవంతమైనసర్పము
చలిచీమల చేతఁజిక్కి చావదెసుమతీ.

28. క॥ సరసము విరసముకొఱకే
పరిపూర్ణసుఖంబులధిక బాధలకొఱకే
పెరుఁగుట విఱుగుటకొఱకే
ధరదగ్గుట హెచ్చుకొఱకె తథ్యముసుమతీ.

29. క॥ సిరిదా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలముభంగిన్
సిరిదాఁ బోయినఁబోవును
కరిమ్రింగిన వెలఁగపండు కరణినిసుమతీ.

PRINTED AT THE S. P. C. K. PRESS, VEPERY, MADRAS—A. 16070.

14-4-25

# TELUGU

# FOURTH READER

BY

RAO BAHADUR K. VEERESALINGAM

FOR

**V CLASS**

NEW AND REVISED EDITION

---

# నాల్గవ వాచక పుస్తకము.

(అయిదవ తరగతికి)

ఇది

రాయబహదూర్ కం. వీరేశలింగముపంతులుగారిచేత

సరిచూడఁబడినది

---


MACMILLAN & CO., LIMITED

MADRAS, BOMBAY, CALCUTTA AND LONDON.

1922

# వి ష య సూ చి క



## పా ఠ ము లు.

# నాల్గవ వాచక పుస్తకము.



## 1 సింహము.

సింహము మృగరాజు. అడవి మృగములలోనెల్ల నది మిగుల బలిష్ఠమైనది; ధైర్యముకలది. ఇతర జంతువుల కెన్నడు నది వ్యర్థముగా హానిజేయదు. అది అద్భుతమైన శౌర్యగాంభీర్యములు కలది. దానికి నితర జంతువులన్నియు భయపడును. పూర్వకాలమునందు సింహము లనేకదేశము లందుండెడివి. ఇప్పుడవి యాఫ్రికాఖండమందు మాత్రమె యున్నవని చెప్పవచ్చును. ఈ యాఫ్రికాఖండము మన దేశము నకు పడమట, సముద్రము మధ్యమునన్నది. ఈ ఖండము యొక్క మధ్యభాగములోనుండు అరణ్యములే వీనికి ముఖ్య నివాసస్థలములు. అయిన నుత్తర హిందూస్థానమందు నయిత

మవి కొన్ని యున్నవి. సింహములు సాధారణముగా వనము లలోఁ జిన్నచెట్లు దట్టముగాఁ బెరిఁగియున్న స్థలములఁ దుండును. సింహము ఎనిమిది తొమ్మిది యడుగుల పొడుగునుండి సుమారు మూడున్నర అడుగుల యెత్తుగనుండును. పెద్ద సింహము నాలుగేదడుగుల యెత్తుగనుండును. అది నివసించెడి యడవిలోని యిసుకవలె దాని దేహమంతయుఁ గొంచెము పసుపుదాళుగల బూడిదవర్ణము కలిగి యుండును. మగసింగము యొక్క మెడకును భుజములకును నలంకారముగా జూలువంటి కేసరములు పొడుగుగను దట్టముగను బెరిఁగియుండును. ఆఁడు సింగము మగదానికంటెఁ జిన్నది; దీనికి కేసరము లుండవు. సింహమునకు నాలుగేదడుగుల నిడుపైన తోఁకయు దాని చివర నొక కుచ్చునుండును. దాని తోఁకతో నొక్కవిసురు విసరిన నెంత బలముగల మనుష్యుఁడైనను ఆ దెబ్బకు పడిపోవును.

సింహము మార్జాలజాతిలోఁ జేరిన జంతువు. దాని పెద వులమీఁద మొలచు దీర్ఘములగు మీసములతో నది యంధ కారమందుఁ దడవికొని తన మార్గమును దెలిసికొనును. కండ గలిగి బలిష్ఠములైయుండు దాని కాళ్లయందొకటిం బాతిక యంగుళము నిడివిగల కఠినమైన వంకరగోళ్లుండును. అది పిల్లివలె వానిని తనపాదములోనికి ముడుచుకొనఁగలదు. దాని పాదముల క్రింద దిండువలెనుండు మెత్తనిమాంస ముండునుగాన నది చప్పుడు లేశమైనను జేయకయే నడచిపోవఁగలదు. పిల్లివలె నది రాత్రి వేళ మిక్కిలి బాగుగాఁ జూడఁగలదు. పగటివేళ దాని కన్నులలోని నల్లగుడ్లు పొడుగగు సన్న చీరికలవలె నుండి రాత్రులందవి తెఱచుకొని యెట్టగాఁ గాలుచున్న నిప్పు కణమువలెఁ బ్రకాశించును. దాని పండ్లు మిక్కిలి బలిష్ఠములై

పొడుగుగను వాఁడిగనుండి మాంసమును జీల్చుటకుపయోగ పడును. దాని నాలుక ఆకురాయివలె గఱుకుగా నుండును గాన నది దానితో నెముకలమీఁది మాంసమునంతను గీఱికొని తినఁగలదు. సింహము జింకలను, అడవిదున్నలు మొదలగు మృగములను బట్టుకొని తినును. దానికి బలమత్యధికముగాన, దాని యరచేతి యొక దెబ్బవలననే గుఱ్ఱముయొక్క నడుమును విఱుచుటకుగాని, దాని తలను చీల్చుటకుగాని, దానికి సామర్థ్యముకలదు. అంత పెద్దదిగాక యొక మాత్రముగా నుండు ఎద్దునుగాని దున్ననుగాని యది సులభముగా నోటఁగఱచుకొనిపోయి, దానితోనే యగడ్తల సహితము దాట నోపును. అది యొక్కొక్క గంతునకుఁ బండ్రెండు మొదలుకొని పదునేనడుగులవఱకుదుముకుచు, నద్భుతమైన వేగమునఁబోయి, తాను చంపితిన దలఁచుకొన్న జంతువుమీఁద బడఁజాలును. సింహము వేఁటాడఁబోయినపుడు దానికి హరిణములు మొదలగు జంతువులేవియుఁ గనఁబడకపోయినయెడల, నది యొకానొకప్పుడు తన ముట్టెను భూమిమీఁద నానించి యుఱుమువలె మిక్కిలి భయంకరముగా గర్జించును. ఆ భయంకరమైన గర్జన తమ చెవులఁబడిన తోడనే యడవిలో దాఁగియుండిన లేళ్లన్నియును దిగ్గున లేచి నానాముఖములఁ బరుగెత్తును. వాని చప్పుడు విని అవి యెక్కడెక్కడకుఁ బోవునో ఆ సింహము కనిపెట్టుచుండును. సింహ మొకానొకప్పుడు తాను బట్టుకొన్న జంతువును బట్టుకొనిన చోటనే తినును. అచ్చట తనకేయపాయమైనను వచ్చునని దోచిన పక్షమున, నది యా జంతువును వనమధ్యమున కీడ్చుకొనిపోయి దాని నచ్చటఁ దినును.

సింహము తన [illegible]

లన్నిటిలోఁ దన కిష్టమువచ్చినదానినిఁ జంపుకొని తినఁజాలును గాని, దానిని జంపఁజాలిన మృగమొక్కటియు లేదు. సింహము భయంకర మృగమైనను క్రూరమృగము కాదు; అది యాఁకలి దీర్చుకొనవలసిన యవసరమున్నప్పుడే తప్ప మఱెప్పుడుగాని, క్షుద్రజంతువులను నిష్కారణముగా బాధింపదు. ఆఁకలిదీఱినప్పుడది శాంతత వహించి, మిగుల సాధువై వర్తించుచుండును. సింహ మడవిమృగమైనను దానిని జనులు మచ్చికజేయవచ్చును. అప్పుడది తన యజమానునియందు విశ్వాసము గలదై, యతనివెంటఁ గుక్కవలె దిరుగుచుండును. సింహ మున్నతబుద్ధిగల జంతువు. అది నీచశత్రువుల లెక్కగొనక నవి తెలియక చేయుచుండు నపరాధముల సహితము క్షమించి వర్తించుచుండును. అది కృతజ్ఞతగల జంతువుగావున నితరులు తన కొనర్చినమేలు నెంతకాలమునకేని మఱువదు.

వ్యాకరణము:—సింహము మృగములఁ జంపును. సింహము మృగముల నేమిసేయును? చంపును. ఈ వాక్యమునందు ఏకార్యము చెప్పబడియున్నది? 'చంపుట' అను కార్యము. దీనిని తెలియఁజేయు పదమేది? చంపును. దీనికి 'క్రియ' అని పేరు. సింహము మాంసమును భుజించును. ఈ వాక్యమునందు ఏ కార్యము చెప్పబడియున్నది? 'భుజించుట' అను కార్యము. దీనిని తెలుపు పదమేది? భుజించును. దీనికి 'క్రియ' అని పేరు. కాఁబట్టి క్రియ అనఁగా నేమి? వాక్యమునందు చెప్పబడిన కార్యమును తెలియఁజేయుపదము.

పదములు — గాంభీర్యము చూపుటకు గంభీరముగానుండుట; కేసరములు = జూలు; బలిష్ఠము=మిక్కిలి బలముగలది; హరిణములు = ఆఁడుజింకలు; నానాముఖములు = నలుప్రక్కల, అన్నిదిక్కుల; క్షుద్రజంతువులు= అల్పమృగములు; నిష్కారణముగా = కారణములేకయే.

ఈ పాఠములో సింహమునకు మారుగా ఉపయోగింపబడిన మారుపేరు చెప్పుము.

సింహము, మృగేంద్రము, పంచాస్యము, హర్యక్షము, కేసరము, కంఠీ

# 2. సింహము, కుక్క.

కొన్ని సంవత్సరములకుఁ గ్రింద లండను కోటలో నొక మృగశాలయుండెను. దానిని జూడఁబోవువారెల్ల నచట నుండు సింహమును జూచుటకు నాలు అణా లియ్యవలసియుండెను. ఆ పైకమునియ్యశక్తిలేనివాఁడొక పిల్లిపిల్లనేని, కుక్కపిల్లనేని సింహమున కాహారముగా బలినిచ్చి పిమ్మట దానిం జూచువాఁడు.

ఇట్లుండ నొక బీదవాఁడొకప్పుడు సింహమును జూచు వేడ్కతో నచటికేతెంచి, తనయొద్ద రూకలులేకుండుటచే దగ్గర నుండు శునకపుబిల్ల నొక దానిని సింహము బోనులోనికి విడిచి, తన యభిమతమును దీర్చుకొని పోయెను.

ఆ కుక్కపిల్లయు మృగరాజుం జూడఁగనే నత్యంత భయముతో వడవడ వడఁక నారంభించెను. అంతట నది తన కాళ్లను జాచి, తన పొట్టమీఁద బరుండి యతిదీనముతోఁ దన్ను భుజింపవలదని కేసరిని బ్రార్థించినట్లు ఏకొంచెము కదలక మెదలకుండెను.

అంతట నా కంఠీరవమా శ్వానము నిటునటు పొరలించి, మూర్కొని, దానికేమియుఁ గీడు సేయకుండెను. పిమ్మటఁ గొంత సేపటికి సింహపు యజమానుడు దాని కాహారము దెచ్చి పెట్టెను. కాని, అది దానిని ముట్టక కుక్క కొఱకుఁ గాచుకొని యుండెను. కుక్కయు మిక్కిలి యాఁకలితో నుండినందున, త్వరలో భయము దీఱగా నాహారమును దినఁదొడఁగెను. అప్పుడు రెండును కలసిమెలసి, అతిప్రేమతో వర్తించుచుండెను.

అదిమొదలు శునకము దానికించుకేనియు జడియక తిరుగుచుండెను.

గానక గుఱువెట్టుచు పైబడును. దాని చెవులఁబట్టి యీడ్చును. ఇటు లా కుక్క యేమిచేసినను సింగమునకుఁ గొంచెమైనను కోపము రాకుండెను.

కొన్ని మాసములు గడచినపిదప కుక్క సొంతగాఁడగు ఒక ప్రభువు తుదకీ వృత్తాంతము విని యా మృగశాలకుఁ బోయి యా కుక్కపిల్ల తనదియని యడిగెను. అందులకా మృగశాల కాఁపరిట్లనియె. 'అయ్యా! మీరే చూడుఁడు అవి యెంత స్నేహభావముతో నున్నవో. వానిని వేఱుపఱుప నావలనఁ గాదు. వలయునేని మీరే యా కార్యము చేయుఁడు.' ఈ మాటలను విని యా ప్రభువు వచ్చినట్లే మరలిపోయెను.

ఈ వేడుకను జూచుటకై పెక్కుజనులచ్చోటికి వచ్చుచుండిరి. దీనినిఁ జూడవచ్చినవారిలో నొకఁడా రెండు మృగములు దినుచుండఁగాఁ జూడ నిచ్ఛఁగలవాఁడై యిరువది పౌనుల మాంసమును దెప్పించి వానిముందటఁ బడవైచెను. క్షుద్బాధచే బీడింపబఁడుచుండిన యాశునకపుబిల్ల మాంసమునంతయుఁదానే తినుగానివలెఁదనముందటి కాళ్లతో నంతయునదుముకొని గుఱ గుఱలాడి మొఱుగుచు సాహసముతో సింగము మొగము మీఁదికెగిరెను. సింగము దానికి వెఱచినదానివలె వెనుకఁదీసి, యొక్క ముక్కనైననుఁ దాకకుండెను. రెండుప్రక్క లుబ్బునట్లు తిని, సింహము నిద్రింపఁగా నా కుక్కపిల్ల దానిని నిదురఁ బోనీయక గంతులువేసి మొఱుగుచు, తలను ముంగాళ్లతో బరకుచు, చెవిపట్టి కొఱికి యీడ్చుచుండెను.

కొన్ని దినములకాకుక్క మృతినొందెను. సింగము తన చెలికాఁడు నిదురఁబోవుచుండెనని తలంచెను. దానిని కదల్చి చూచి, తుదకది గతించెనని తెలిసికొని వ్యాకులతతో నుండెను.

ఆ చచ్చిన కుక్కను బోనునుండి దీయ నెంచిరికాని, సింహ మడ్డ పడుచుండెను. ఎన్నియో కుక్కలఁ దెచ్చి బోనునందు వేసిరికాని, వాని నన్నిటిని యా మృగరాజు చంపివేయుచుండెను. ఇట్లుతన స్నేహితునికై విలపించుచు నిద్రాహారములు మాని, భయంకరముగాఁ బొబ్బరించుచుండి యాఱవదినమున సింహమును పరలోకమునకుఁ బోయెను. అప్పటి జనులందఱు కన్నీరువఱదలై పాఱ నేడ్చిరి.

వ్యాకరణము:—సింహము కుక్కతో నాటలాడెను. ఈ వాక్యమందు క్రియను పేర్కొనుఁడు. అది యేల క్రియ? క్రియ అనఁగా నేమి? సింహము తన స్నేహితునికొఱకు మృతినొందెను. కేసరి తన స్నేహితుని యపరాధమును సహించెను. ఈ వాక్యముల యందు క్రియలను పేర్కొనుఁడు. అవిక్రియలని యెట్లు దెలిసికొంటివి?

పదములు:—వేడ్క=వేడుక, సంతోషము; కుక్క=శునకము, శ్వానము; అభిమతము=కోరిక; ప్రార్థించినట్లు=వేడుకొనినట్లు; వర్తించుచుండెను=నడచుకొనుచుండెను; సరకుగొనక=లెక్కపెట్టక, లక్ష్యముచేయక; వృత్తాంతము=సమాచారము; క్షుద్బాధ=ఆఁకలిబాధ; విలపించుచు=ఏడ్చుచు లండను=ఇది యెచ్చటనున్నది?

# 3. కొబ్బరిచెట్టు.

కొబ్బరిచెట్టు మనుష్యులకు మిక్కిలి యుపయుక్తమగు వృక్షములలో నొకటి. దాని ప్రమాణేఁబది మొదలుకొని యెనుబదియడుగుల యెత్తువఱకు నెదుగును. దానికి శాఖలుండవు. పది పండ్రెండడుగుల పొడుగునఁ బెరిఁగియుండెడి మట్టలు దాని శిఖరమందుండును. ఆ మట్టల మధ్యమందుఁ గొబ్బరిగెలలు దిగును. ఒక్కొక్క గెలలో నాలుఁటికంటె నెక్కువగా కాయలుండును.



ఈ చెట్టు జాతి నేలలందుఁగాని పర్వతమయప్రదేశములందుఁగాని వృద్ధిఁబొందదు. కాని యది ముఖ్యముగా సముద్రతీర ప్రాంతములందు వర్ధిల్లును. సముద్రపు దరినుండు మెత్తని యిసుకనేలయు నుప్పునీళ్లును దానికి మిక్కిలి యనుకూలించును.

మన దేశమందలి సముద్రతీర ప్రాంతములదగ్గఱ కొబ్బరిచెట్లతోఁటలు విరివిగాఁ గలవు. ఆతోఁటల కాఁపులు చిన్నమొక్కలను మొలపించుటకుఁ గావలసిన ఫలములను మిక్కిలి జాగ్రత్తతో నేర్పఱచుకొనెదరు. అట్టి పండ్లను వారు మిక్కిలి లేఁత చెట్లనుండి కాని మిక్కిలి ముదురుపాఱిన వృక్షములనుండి కాని సంగ్రహింపక, మంచి నడిమివయస్సునందున్న తరువులనుండి కోయుదురు. వారు వానిని కోసి తెచ్చిన యొక మాసమునకుఁ బాతిపెట్టుదురు. వారు మొట్టమొదట వానికొఱకుఁ గుదుళ్లు త్రవ్వి యొక్కొక్క యడుగుదూరమున రెండడుగుల లోఁతుగల గోఁతులను జేసి, యా బొండములను పురుగులు

చెఱుపకుండునటులను వానికి నెరువగునటులను బూడిదను
౨వణమును వానిలో నుంచెదరు.' భూమిని దడిపి వృదువుగా
నుంచుటకు వారప్పుడప్పుడా పాదులలో నీళ్లుపోయుచుందురు.
ొబ్బరిమొక్కలు సుమారు తొమ్మిదినెలల యీడుకలవైనపుడు
ారు వానిని వర్షర్తువునందు భద్రముగాఁ ద్రవ్వి బయటికిఁదీసి
్థలాంతరములందుఁ బాతిపెట్టుదురు. ఇట్లుచేయునపుడు వారు
ానిని మూడడుగుల లోఁతును చుట్టును మూడడుగుల వెడ
ల్పునుగల గోఁతులలో దింపి వానికిఁ జేఁపపెంట నెరువుగాఁ
ోసెదరు. కొబ్బరిచెట్టునకు నీళ్లును పెంటయును సమృద్ధ
ుగా నుండినచో నది యయిదవయేటనే కాయలు కాయును.
ేనిచో నది ముక్కలి యాలస్యముగాఁ బెరిఁగి యెనిమిది తొమ్మి
ేండ్లకుఁగాని ఫలితమునకు రాదు.

ఈ తరుకాండముచుట్టును ఉంగరములవంటి వలయము
గపడును. వానిని మనము లెక్కపెట్టి యొక్కొక్క
ెట్టుయొక్క వయఃకాలమును దెలిసికొనవచ్చును. అది పెరిఁ
ఁకొలఁదిని దాని మట్టలు ఆఱునెలలకొకసారి రాలిపోవుచుం
ును. అట్లవి రాలిపోయినపుడెల్ల దాని బోదెమీఁద నొక
లయ మేర్పడుచుండును.

ప్రతి కొబ్బరిచెట్టుయొక్క శిఖరమందును పండ్రెండు
ొదలు పదునైదువఱకు మట్టలుండును. ఒక్కొక్క మట్ట
మారుపదుమూడడుగుల పొడుగుననుండి పక్షియీఁకయొక్క
ాకృతిని గలిగియుండును. కొబ్బరిమ్రాఁకు లిండ్లుకట్టుట
పయోగించును. ఆకులు గుడిసెలపైనిఁ గప్పుటకును పందిళ్లు
ులు మొదలగువానిని గట్టుటకును జాఁపలనల్లుటకును ఉప
ాగించును.



నారికేళజాతిలోఁ జేరిన వృక్షములన్నియును వేసఁగికాల మందు పుష్పించును. కొబ్బరికాయలు, భాద్రపద, ఆశ్వయుజ, కార్తీకమాసములలో ముదిరి పక్వమగును. ఒక్కొక్క చెట్టున సుమారొకటి రెండువందల కాయలు సంవత్సరమునఁ గాచును. మంచిజాతిలోనిదైన కొబ్బరి చెట్టేఁడాదిలోఁగా మూఁడు నాలుగు సారులు ఫలించును. కొబ్బరిచెట్లు డెబ్బది యెనుబదియేండ్ల వయస్సు వచ్చువఱకుఁ గాయలుకాచి నూఱేండ్లకాలము బ్రదుకును.

కొబ్బరికాయ మనుష్యునితలలో సగమంత పెద్దదిగా నుండును. దానిలోని కొబ్బరిచిప్పు నొక గట్టి పెంకుండును. ఆ పెంకుచుట్టును సుమారు రెండంగుళముల దట్టముగనుండు పీఁచుండును. ఆ పీఁచును మొదటఁ దీసివేసినఁగాని మనకా

కాయ లభింపదు. ఆ కాయను పగులఁగొట్టినయెడల, మనకుఁ దెల్లని కొబ్బెర కాన్పించును. ఆ కొబ్బెరలోపల స్వచ్ఛమైన నీళ్లుండును. ఆనీళ్లు త్రాగుటకు మిగుల మధురముగనుండును.

కొబ్బరిని బహువిధముల నాహారార్థముగా జనులుపయోగించుకొనెదరు. ముదిరినకొబ్బరి నెండబెట్టి దానిలోనుండి నూనెను దీయుదురు.



కొబ్బరిలోనుండి తీయఁబడునూనె మిక్కిలి యుపయుక్తమైనది. అది వంటలకును దీపముల వెలిఁగించుటకును నభ్యంజనస్నానముచేయుటకును స్త్రీలు శిరోజములకు రాచుకొనుటకును నుపయోగపడును. ఈ నూనెనుదీయు విధమెట్టిదనఁ బాగుగ ముదిరిన కొబ్బరి కురిడీని దాని చుట్టునున్న పెంకులోనుండి పదిలముగా విడఁదీసెదరు. అంత దానిని రెండర్థభాగములుగ విభజించి యెండఁబెట్టుదురు. ఇట్లొక్కవార మెండిన

తరువాత దానిని శకలములుగ ఖండించి గానుఁగలో నుంచె దురు. ఇరువది కాయలలోనుండి రెండు పెద్దబుడ్లు నిండఁ గొబ్బరినూనె వచ్చును. నూవులనూనె నాడెడి గానుఁగవంటి గానుఁగనే గొబ్బరినూనెను దీయుటకును వాడెదరు. బలిష్ఠము లగు నొక జత యెద్దులొక్కొక దినమునకు రమారమి పది మణుఁగుల నూనెను దీయఁదగిన పాటుపడఁగలవు. గానుఁగ నాడించెడి మనుష్యునియొద్ద నొక పిల్లవాఁడు కాచుకొనియుండి గానుఁగలోనుండి నూనె నొక గుడ్డపేలికతో బయటికిఁ దోడి తీయుచుండును.

మైనపువత్తులను సబ్బును జేయుటకుఁ గొబ్బరినూనె విశే షముగా వాడఁబడుచున్నది. అది యింగ్లండునకు మిక్కుట ముగా నెగుమతి చేయఁబడుచున్నది.

మిఠాయి చేయుటకుఁగాని వంట చేయుటకుఁగాని కొబ్బరి నూనె కావలసినప్పుడు జనులు మఱియొకవిధమున దానిని జేయు దురు. కొబ్బరి నెండఁబెట్టకయే తెచ్చి వారు సన్నగాఁ దఱిఁగి కొంచెము వేఁడినీళ్లను గలిపినపిదప దానిని గట్టిగాఁబిండి కొబ్బరి పాలను దీయుదురు. అంత వారాపాలను బ్రొయ్యిమీఁదఁ బెట్టి దానిలోని నీళ్లన్నియు నిగిరిపోవునట్లు గాచెదరు. అప్పుడు స్వచ్ఛమైన కొబ్బరినూనె పాత్రములో శేషించియుండును. అప్పుడు శేషించిన పిప్పినిఁ బశ్వాదులకుఁ బెట్టెదరు. దానిని పైరుల కెరువుగాఁ గూడ వేసెదరు. కొబ్బరచిప్పలను గొందఱు పానపాత్రలుగను గరిటెలుగను వాడుకొందురు. సముద్రతీర వాసులు కొందఱు కొబ్బరిపెంకులను వంటచెఱకుగాఁ గూడఁ బ్రాయికముగా నుపయోగపఱచుకొందురు. కొబ్బరిపీఁచు త్రాళ్లు, పగ్గములు, మోకులు, చాఁపలు, సంచులు మొద

లగునవి చేయుటకుఁ బనికివచ్చును, గాన నది విశేషముగాఁ బర దేశముల కెగుమతి చేయఁబడుచున్నది. టెంకాయపీఁచు మిగుల గట్టిగానుండి యుప్పునీళ్లయందును వర్షములందును చెడిపోవదు గాన నావల కుపయుక్తమగు పగ్గములను జేయుటకు మిక్కిలి యుపకరించును.

పశ్చిమ సముద్రతీరమందున్న కొచ్చిదేశములో దొరకెడి టెంకాయపీఁచు శ్రేష్ఠతమమైనది. ఆ దేశస్థులొక్క యుక్కు కత్తిని నేలఁ బాఁతి దానిమీఁదఁ గొబ్బరి బొండమును నేర్పుతో నొత్తివిడఁదీయుటచేఁ గొబ్బరికాయపీఁచూడిపడిపోవునట్లుచేసెదరు. ఇట్లొక్కొకనాఁటికొక పనివాఁడు సహస్ర నారికేళఫలములనుండి పీఁచును దీసివేయఁ గలుగును. అంత నా డిప్పలుప్పునీటిగుంటలలో నెనిమిదితొమ్మిది మాసములవఱకు నూరవేయఁబడును. తదనంతరమవి వెలుపలకుఁ దీయఁబడి కఱ్ఱసుత్తెలతో మోఁదఁబడిన పిమ్మటఁ బీఁచుగానగును. అప్పుడు కూలివాండ్రు దానిని దమ హస్తములతో నలిపెదరు. అప్పుడది చిక్కువిడిన నారయై యెండలో నెండఁబెట్టఁబడును. సుమారు పదునైదు కాయలనుండి యొక వీసెఁడు, నార లభించును. ఇట్టి నారయే పఱుపులు, త్రాళ్లు, తివాసులు, సంచులు మొదలగు వస్తువుల ననేకముల జేయుటకుఁ బనికివచ్చును. ఈఁడిగవాండ్రు కొబ్బరిచెట్లకు ముంతలుకట్టి కల్లు దించెదరు. ఆ కల్లులోనుండి బెల్లము తీయఁబడును.

వ్యాకరణము:—జనులు కొబ్బరికాయను దినుచున్నారు. ఈ వాక్యమునందు క్రియయేది? తినుచున్నారు; క్రియదెలుపు కార్యమేది? 'తినుట' అను కార్యము; ఆ కార్యము నెవరు చేయుచున్నారు? జనులు; ఈ వాక్యమున 'జనులు' అనునది 'కర్త' యనఁబడును. కొబ్బరిచెట్టు ఏబది అడుగుల

ఎత్తునకు పెరుగును. ఈ వాక్యమున క్రియ యేది? పెరుగును. ఈ క్రియ తెలిపెడు కార్యమేది? 'పెరుగుట'. అను కార్యము. దీనిని చేయునదేది? కొబ్బరిచెట్టు. "కొబ్బరిచెట్టు" ఈ వాక్యమున కర్త. కొబ్బరినుండి నూనె వచ్చును. ఈ వాక్యమున కర్మ పేర్కొనుడు.

పదములు.—కొబ్బరిచెట్టు=టెంకాయచెట్టు, నారికేళవృక్షము; ఫలితము=పంట; వయఃకాలము=వయస్సు; మధురము=తీపు; శిరోజములు=వెండ్రుకలు; నారికేళఫలము=టెంకాయ, కొబ్బరికాయ; సంగ్రహింపక=ఏర్పఱుపక; తరువు=చెట్టు, మ్రాకు, మ్రాను, వృక్షము.

నాళికేరము, నారికేళము, లాఙ్గలీ ఇవి కొబ్బరిచెట్టు పేళ్లు



# 4 పెద్దపులి.

పెద్దపులి మిక్కిలి ఘాతుకజంతువు. దానికి శరీర సౌందర్యము మెండు. దాని చర్మము నున్నగాను పసుపురంగుగలదిగానుండును. దానిమీఁదఁ గొంచెము బొచ్చుండును. దాని యొడలిమీఁదఁ జాఱ లుండుటవలన నది చాఱలమెకమనఁ బడుచున్నది. పెద్దపులి యెనిమిది తొమ్మిది యడుగుల పొడ

వును దాదాఁపుగా మూడడుగులున్నర యెత్తును గలిగియుం డును. అది మిక్కిలి బలాఢ్యమైనది. ఏనుఁగును దప్ప మతే జంతువునైన నది యవలీలగాఁ జంపఁగలదు. అది మన దేశ మందెల్లయెడలను పర్వత విపినప్రదేశములందుఁ గానఁబడును.

సింహమువలెనే పెద్దపులి పిల్లిజాతిలోఁ జేరిన జంతువు. దానికి వాఁడియగు పెద్ద గోళ్లున్నవి. అది నడచునపుడు వానిని దన పాదములో ముడుఁచుకొని యుండును; కాననది లేశమాత్ర మైనను సందడిచేయక యడవిలో నడచి పోఁగలదు. దాని పాదములక్రింద మృదువైన మాంసము దిండువలె నుండును. పెద్దపులి యంధకారమందుఁ జక్కఁగాఁ జూడఁగలదు; పగటి వేళను పిల్లియొక్క కంటిలోవలె దానికంటిలోఁగూడను పాప సన్నమైనందున వెలుఁగును సహింపఁజాలక యుండును.

వ్యాఘ్రము సింహమంత భారమైన జంతువుకాదు. అది హార్యక్షమంత గాంభీర్యముఁగలదియుఁగాదు. శార్దూలము దాని కంటెసన్నముగనుండి యెక్కువ చులుకఁదనము గలిగియుండును. కేసరికివలె దానికిఁ గేసరము లుండవు. దాని వాలము చివ రను కుచ్చుకూడ నుండదు. సింహముయొక్క దేహము తయు నొక్కరంగుగనే యుండును. పెద్దపులియొక్క యొడలన్ననో పసుపు నలుపు తెలుపు నను మూఁడువర్ణములఁ గలిగియుండును. ఇందువలననే పెదపులి మువ్వన్నెమెగమని పేరు పొందియున్నది.

వ్యాఘ్రము పగలంతయును కాననాంతరమునుండు తన గుహలోనో పొదలోనో నిద్రించును. సాయంసంధ్యవేళ లయందది గుహలోనుండి బయటికి వచ్చి రాత్రియంతయు నరణ్యమందుసంచరించుచు నేదైన నొక జంతువునుజంపి నోటఁబెట్టుకొనుటకుఁ గమకించుచుండును. అది యొ,,కొ,

క్కప్పుడు తన యాహారార్థ మిరువది ముప్పది మైళ్ల దూరము నకు సయితము పోవుచుండును. అది సాధారణముగా నడవుల లోని నీటిపట్టులయొద్దఁ బరుండి రాత్రులందు మృగములు నీళ్లు త్రాగవచ్చువేళను బ్రతీక్షించుచుండును. అది ముఖ్యముగా లేళ్లు దుప్పులు మొదలగు జంతువులను బట్టుకొని మెసవును. పెద్దపులులు తఱచుగా గ్రాఁవుల పశువులను జంపుచుండును. కొన్ని పులులు సుమారు అయిదువందలకంటె నెక్కువ సంఖ్య గల పశువులను సయితము చంపఁగలిగినవి.

మార్జాలము మూషికము నెంత యనాయాసముగా నెత్తుకొని పోవఁగలదో శార్దూలము అంత లాఘవముతోడనే యొక్క వృషభమును సయిత మెత్తుకొని పాఱిపోవఁగలదు.



శార్దూలము లనేకములు మనుష్యులకు భయపడును. అవి మనుష్యుని పొడఁగాంచిన వెంటనే సాధారణముగాఁ బలాయనమగును. అవి పశులమందలలో దూఱి యేపశువునైన నెత్తుకొని పోవునేగాని పశువుల కాపరి నెంతయు నడ్డగింపవు. అయిన నేపులియైన నొక్కసారి మనుష్యునిమీఁదఁ బడి చంపెనేని, యప్పటినుండి దాని స్వభావము మాఱిపోవును. అది యప్పటి

నుండి పశువులనుగాని దుప్పులు మొదలగు జంతువులనుగాని తఱచుగా బాధింపక గ్రామములయొద్ద మెలఁగుచుండి మనుష్యులను హింసించుచుండును. మనుష్యులను హింసించు పులులను జంపినవారికి దొరతనమువారు ద్రవ్యరూపమున గొప్ప బహుమతుల నిచ్చుచున్నారు.

మిక్కిలి చిన్నప్పుడు పట్టుకొనఁబడిన పులిపిల్లలు కొంత మట్టునకు సాధువులగును. అవి తమ పోషకుని బాగుగ గుర్తెఱిఁగి వానివెంట గ్రామసింహములవలెనే తిరుగుచుండును. అయినను, పెద్దపులిని బెంచుట మిక్కిలి యపాయకరము. పెక్కేండ్లనుండి మచ్చికపడియున్నను గొన్ని పులు లొక్కొక్కప్పు డాకస్మికముగా దుష్టస్వభావము కలవై, అవి చంపఁబడక మునుపు మనుష్యుల ననేకులను జంపును. కాఁబట్టి మనుష్యులు పులులను బెంచుట పసిపిల్లలు పదనుగల కత్తులతో నాడుటవలె నపాయకరమగును.

వ్యాకరణము—వ్యాఘ్రము రాత్రులందు సంచరించును. ఈ వాక్యమునందలి కర్త యేది? వ్యాఘ్రము. ఏల? సంచరించుట అను కార్యమును చేయునది వ్యాఘ్రము కాఁబట్టి యది కర్త. కర్త అనగా నేమి? క్రియచే చెప్పబడునట్టి కార్యమును జేయునది. కర్తకును క్రియకునుగల సంబంధ మేమి? చేయబడు కార్యమును తెలుపు పదము, క్రియ. కార్యము చేయువాని తెలుపు పదము, కర్త. పులి లేళ్లను వేటాడును. ఇందు కర్త క్రియలను తెలిపి వానికి గల సంబంధమును తెలుపుడు.

పదములు.—ఘాతుకజంతువు = క్రూరమృగము; అవలీలగా = సులభముగా; హర్యక్షము=సింహము; ముప్పన్నె మెగము=మూడువన్నెల మృగము గమకించు=ప్రయత్నించు; మూషికము=ఎలుక; శార్దూలము=వ్యాఘ్రము, పులి; గ్రామసింహము=కుక్క; శార్దూలము, ద్వీపి, వ్యాఘ్రము ఇవి పెద్దపులి పేళ్లు.



## 5. పులి వేఁట.

వ్యాఘ్రముల ననేకవిధముల జనులు వేఁటాడి చంపుదురు. అయోధ్యాదేశస్థులు పులిజాడ తెలిసినపుడు వెడల్పుగల కొన్ని యాకులను దీసికొని వానికి బంకవంటి యొక జిగురుపదార్థమును రాచి యా మృగము పోయెడి మార్గమున వాని నుంచెదరు. ఆ పులి తన పాదము నొక యాకుమీఁద నుంపఁగనే అది దాని కంటుకొనునుగాన నది దానిని వదలించుకొనుటకు యత్నించి, నిష్ఫలమనోరథమై చిరాకుపడుచు దానితోఁ దన ముఖమును రాచుకొని క్రిందఁబడి పొరలును. అది యిట్లు చేసినపుడు తక్కిన యాకులుకూడ దాని కంటుకొని శీఘ్రముగనే దాని ముఖము సయితము వానిచేఁ గప్పఁబడును. అప్పుడు దానికిఁ గన్నులగపడవు. కావున నది రౌద్రాకారముగలదియై దిక్కులు మాఱు మ్రోగునట్లు గాండ్రించును. కొంతసేపటికది యలసి కోఱలు తీసిన పామువలె క్రిందఁబడియుండును. అట్టి సమయమందు మృగయులు పరుగిడిపోయి దానిని బల్లెములతోఁ బొడిచి చంపుదురు.

చెన్నపురిరాజ్యమందలి వేఁటకాండ్రు పులులను మఱొక విధమునఁ బట్టుకొని చంపెదరు. వారు పులులు తిరుగు ప్రదేశములందొక మేఁకనైనను జిన్న దూడనైన నేదో యొక చెట్టునకుఁ గట్టివేసి దాని చెంతనుండు మఱొక చెట్టుమీఁది కొమ్మల మధ్య మాటు పెట్టుకొని కూర్చుండెదరు. సాయంకాలమందు సాధారణముగాఁ బ్రొద్దుక్రుంకువేళ గడ్డిలో గలగలయని ధ్వని వినఁబడును. పులి రాకయే యీ చప్పుడునకుఁ గారణము. మేఁక యీ సవ్వడి గ్రహించి యీ పులివాతనుండి తప్పించుకొని పాఱిపోవుటకు మిక్కిలి పెనఁగులాడును. వేఁటకాఁడు పైని కొమ్మలలోఁ గూర్చుండి శార్దూలమును జూచి దానిని తుపాకితోఁ గాల్చును. వాఁడు మెలఁకువగలిగి శీఘ్రముగఁ గాల్చెనేని, యీ క్రూరమృగము మేఁకను బట్టుకొనకమునుపే దానిని జంపఁగలుగును. ఒకానొకప్పుడు వ్యాఘ్రము బాగుగఁ జీఁకటిపడినతరువాతఁగాని రాదు గనుక వేఁటకాఁడు దాని రాకను దెలిసికొనఁజాలకపోవును.

పెద్దపులి వృషభమువంటి యొక పెద్దజంతువును జంపఁగలిగినప్పు డది దానిమాంసమంతయు నొక్కసారిగాఁ దినఁజాలదు. అది దానిలోఁ గొంత భాగమును దిని వెడలిపోయి నీళ్లు త్రాగి చేరువ నెచ్చోటనైనను బగలంతయు నిద్రించును. మఱునాఁటిరాత్రి యది మరల వచ్చి తక్కిన మాంసమును దినును. దాని స్వభావమిట్టిదని వేఁటకాఁడు గ్రహించి చచ్చిన గొడ్డుదగ్గఱ నేదైన చెట్టుమీఁద దాఁగియుండి యీ వ్యాఘ్రము రెండవ తడవ రాఁగానే దానిని దన తుపాకితోఁ గాల్చి చంపును.

ఉత్తర హిందూస్థానమందలి రాజులును గొప్పవారును గజారూఢులై పెద్దపులులను వేఁటాడుదురు. పులివేఁట

యింగ్లీషువారికి మిక్కిలి ప్రీతికరమైనది. వారొకానొకప్పు డిరువది యేనుఁగులను, నొకొక్కప్పు డేఁబదియేనుఁగులను, గొన్నివేళలందు నూటింటిని వెంటఁబెట్టుకొని రెండు మూఁడు వందల మనుష్యులను గూడఁ దీసికొని మృగయార్థము బయలు దేఱెదరు. అప్పుడు వారందఱు అడవిలోఁ జొచ్చి కిట్టలతోను డప్పులు మొదలగువానితోను మిక్కిలి సందడిఁ జేయుదురు. పెద్దపులి వారి రాకను గ్రహించి పాఱిపోవఁ జూచును గాని దాని యెదుటఁగూడ ననేకులుండి దానిని బెదరింతురు గనుక అది వెనుకకుఁ దిరిగి యెటులైనఁ బాఱిపోవఁ జూచును. తుట్టతుదకది తన్నావరించియుండు కరులలో దూఱి పాఱిపోవ నుద్యమించును. అప్పుడు గజారూఢులైయున్న వేఁటకాండ్రు దానిని తుపాకులతోఁ గాల్చెదరు. ఒకొక్కప్పుడా ద్విపములు వెఱపుచే గిఱ్ఱునఁ దిరిగి పలాయనమగును. అట్టి సమయమును గనిపెట్టి పెద్దపులి ధైర్యముతో వాని వీఁపుమీఁదికి దుమికి వేఁటకాండ్రను జంపఁగలుగును.

వ్యాకరణము:—వేటకాండ్రు పులులను జంపెదరు. ఈ వాక్యమునందు 'చంపెదరు' అనునది ఏమి వాచకము? క్రియ. వేటకాండ్రు అనునది ఏ వాచకము? కర్త ఎవరు చంపెదరు? వేటకాండ్రు. పులి ఏనుగునకు భయపడును. 'భయపడును' అనునది ఎట్టి వాచకము? క్రియ. 'పులి' అనునది ఏది? కర్త. ఏది భయపడును? పులి. కాబట్టి కర్త కనుగొనుటెట్లు? క్రియమీద 'ఎవరు,' 'ఏది' అను ప్రశ్న వేసిన జవాబుగా వచ్చునది కర్త. తుద + తుద = తుట్టతుద.

పదములు.—నిష్ఫలమనోరథయై=ప్రయోజనములేని కోరికగలదై; మృగయులు = వేటకాండ్రు; చేరువ = సమీపము; తుట్టతుదకు=కట్టకడపటికి; గజారూఢులు = ఏనుఁగునెక్కినవారు; ద్విపములు=ఏనుఁగులు; పలాయనమగును = పరుగిడును.

# 6. చేఁపలు.

చేఁపలు జలచరములు. వానికి నవయవములన్నియు నీటి యందు వసించుటకు దగినట్లేర్పడియుండును. అవి యీదుటకు సులభముగా నుండుటకై వాని శరీరములు సన్నగాను వట్రువ గాను ఏర్పడియున్నవి. చేఁపదేహము సాలెవాఁడుపయోగించు నాడివలెనుండును. అందుచే నది నీటి నతిసులువుగా జీల్చుకొని సంచరింపగలుగును. దానికి మనకువలెఁ గాళ్లు, చేతులు లేవు గాని జలమునందు విహరించుటకు సహాయకారులగు ఱెక్కలును తోఁకయును గలవు. వాని మూలమున చేఁప నీటియందీదగల్గును. పడవ నడుపుటకు తెడ్లెంత ప్రయోజనకారులో జలములో దిరుగుటకు చేఁపలకవి యంత ప్రయోజనకారులు.



ముప్పలుండుటచేత చేఁపలు నీళ్లలో దాముండవలసినచోట నుండుటకును, ఇచ్ఛవచ్చినట్లు దేలియుండుటకును, ముందుకు బోవుటకును, నిలుచుటకును వీలుపడును. చేఁపలకు వీపు భారముగా నుండుటచేత, వానికి ఱెక్కలు లేనియెడల నవి యెల్లప్పు

డును వెలికిలబడి యుండవలసివచ్చును. సాధారణముగా చేప లన్నిటికిని వాని వెన్నెముక క్రింద నొక గాలి తిత్తియుండును. దానివలననే నవి నీళ్లలోమునుగుటకును, తేలుటకును సమర్థము లగును. అవి మునుగ నెంచినపుడు, ఆతిత్తుల నణచిపెట్టియుం తేలవలసినపుడు దానినిండ గాలి పూరించియు నట్లు చేయ గల్గును. చేపల దేహమంతయు పొలుసులతో గప్పబడియుం డును. ఈ పొలుసులు బిళ్లలు బిళ్లలుగానుండి యింటిమీంది పెంకులవలె నమర్పబడియుండును.

చేపలలో ననేకవిధములు గలవు. వానిలో గొన్ని యేను బోతుల యంతటి పెద్దవియు, గొన్ని చిటికెన వ్రేలికంటె చిన్నవియు గలవు. పెద్దచేపలు సామాన్యముగా సముద్రములలోను గొప్ప చెఱువులలోను, మహా నదులయందును నివసించును. చిన్నవి చిన్న నీటిగుంటలయందు నీదుచుండును.

చేపలుచ్ఛ్వాస నిశ్వాసములు తమ తలకిరుప్రక్కలనుండు మొప్పల (gills) మూలముగా జరుపగలుగును. మనుష్యు లకువలె వానికి శ్వాసకోశములు లేవు. నీళ్లలోనుండు వాయువు నోటిమార్గమున దేహములోనికి బోయి వాని రక్తమును శుభ్ర పఱచి పిమ్మట మొప్పలగుండా బయటికివచ్చును. చేపలకు నెత్తురు చల్లగానుండును.

చేపలు మృగములవలె పిల్లలకనక, పాములవలె గ్రుడ్లు పెట్టును. ఒక్కొక్క తల్లిచేపయును సాధారణముగా లక్షల కొలది గ్రుడ్లుపెట్టును. కొన్ని జాతులచేపలు కోటిగ్రుడ్లుపెట్టు టయు గలదు. కాలక్రమమున నివన్నియును జితికి పిల్లలగును. మన మెపుడైన నొక కొలనికేని, చెఱువునకేని బోయి చూచి నచో నొకకోటే ప్రమాణముగల చిన్నచేపలు నీటియందు గుంపులు

గుంపులుగా నీదుచుండును. ఒక్కొకప్పుడివి యసంఖ్యాకములుగా నుండును. ఇవన్నియును ఒకే తల్లిచేఁప పిల్లలుగా నుండనోపును. చేఁపపిల్లలు గ్రుడ్లనుండిబయటికివచ్చినతోడనే, జలములోనీదుటకును, తమ యాహారమును తామే సంపాదించుకొనుటకును సామర్థ్యము గలిగియుండును.



చేఁపలకు ఱెక్కలు మిక్కిలి బలిష్ఠములై యుండును. అందుచే నవి నీటినుండి మిక్కిలి యెత్తుకెగిరి మరల నీటియందే బడుచుండును. పెదచేపలు తమ తోఁకతోఁ నొక చిన్నపడవను కొట్టినచో నది తలక్రిందులై అందుండు జనులెల్లరును సముద్రమున మునిగిపోదురు. స్వోర్డచేఁపయనునది చాల భయంకరమైనది. దీనికి ఱంపమువలె కఱుకైన పొడుగు కొమ్ముండును. వేగముతోఁడవచ్చి అది ఓడల యడుగుభాగమును పొడచినచో, నా భాగమునందు రంధ్రమేర్పడి, యోడలనిండ నీళ్లునిండుటచే

నవి మునిగిపోవును. ఆ కారణమునుబట్టి నావికులు దీనికి మిక్కిలి భయపడెదరు.

చేపలు మనుష్యుల కాహారముగా నుపయోగించును. వానిని జనులు గాలములు వేసియు, వలలనుపన్నియుఁబట్టెదరు. కొన్ని దేశములందు జాలరులు సముద్రమున మిక్కిలి దూరము బోయి అచ్చట పెద్దపెద్ద చేపలనుబట్టి తెత్తురు. వారు సామాన్యముగా సాయంసంధ్యాసమయమునబయలుదేరి, తెప్ప, దోనె మొదలయిన తేలిక పడవలయందు రాత్రి పెక్కుమైళ్లు ప్రయాణముచేసి, తిరుగ మరునాడు ప్రొద్దుపొడుచునప్పటికి గొప్ప చేపలతో వచ్చెదరు. మాంసాహారము చేయుజనులుండు దేశములన్నిటిలో చేప ముఖ్యమైన పదార్థము. చేపభుజించుటకే కాక యితరపనులకుపయోగించును. దాని కొవ్వునుండి యొక విధమైన తైలమును దీసెదరు. దానితో మైనపువత్తుల గూడ చేయుటగలదు. ఆ నూనెతో పెక్కుగ్రుడు వైద్యులు మందులు సిద్ధపఱతురు.

వ్యాకరణము :—ఈ క్రింది వాక్యముల కర్తలఁ జేర్పుము. (1) చేపలు నీటిలో సంచరించును. (2) కొన్ని చేపలకుఁ గొమ్ములుండును. (3) కొందఱు మనుజులు చేపల భక్షింతురు (4) చేపలు తమ ఱెక్కలతో నీదును.

పైవాక్యములయందు క్రియలంగూడ దెల్పుడు. కర్త అనగా నేమి? క్రియ అనగా నేమి?

పదములు.—అవయవములు=అంగములు, చేతులు కాళ్లు మున్నగునవి; సంచరించు=తిరుగు; ఉచ్ఛ్వాసనిశ్వాసములు=గాలిని లోపలికి పీల్చుకొనుట, మరల బయటికి విడుచుట; శ్వాసకోశములు=ఊపిరితిత్తులు.



# 7. ఒంటె.

ఒంటె మిక్కిలి పెద్దజంతువుగాన మహాంగమనఁబడుచున్నది. దాని కాళ్లు పొడుగుగాను దాని మెడ మిక్కిలి నిడుపుగా నుండును. దాని రంగు గోదుమవర్ణమును బోలియుండును. ఒంటెయొక్క భుజముకడ రమారమి యేడెనిమిది యడుగుల యెత్తుండును. ఒంటెయొక్క పాదములు వెడల్పుగా నుండి యెద్దుయొక్క పాదములవలెఁజీలియుండును. అవి యిసుకమీఁద నడచుటకు మిక్కిలి యనుకూలముగనుండును. లొట్టిపిట్ట యెద్దువలె నెమరువేయును. దానికిఁ గొమ్ములుండవు. అది ముఖ్యముగా మనకు పశ్చిమముననుండు యరాబియా దేశమందలి యెడారులలో నివసించును. దాని కెడారియోడ యని పేరు.

అరాబియాదేశములోఁ బెక్కువఁ దలమైళ్ళకొలఁదివి వ్యాపించియుండెడి యెడారుల చలిచేఁడియిసుకమీఁద నుష్ట్రము తక్క మఱేజంతువును బయనము చేయఁజాలదు. అది మనుష్యులను బరువులను మోయఁగలదు. అది తన యజమానుని యాజ్ఞను గ్రహించి మోఁకరించి తనమీఁద బరువులను వేయించుకొనును; మఱిమనుష్యుల నెక్కించుకొనును. అది విశేష సహనశక్తి గలదియుఁ గష్టజీవియు నగుజంతువు. అది గంటకు రమారమి మూడుమైళ్లవంతుననే మెల్లగా నడచుచుండునుగాని, యొక్కపట్టుననే యేఁబది యిరువదిమైళ్ల దూరము నడవఁగలదు. అరబ్బీలకుఁ బశువులు లేవు గనుక వారు లొట్టియలయొక్క పాలనే త్రాగెదరు. దానిరోమములచే వారు తమ వస్త్రములను నేసికొనెదరు.

ఒంటెకువీఁపుమీఁద సాధారణముగా నొకమూఁపురముండును. ఆ మూఁపురమునందుఁ గ్రొవ్వుమాత్రముండును. ఒంటెకు బహుకాలము తిండి దొరకనిచో దాని మూఁపురము తకతకఁ జిక్కదగును. ఎందువలననన దానిలోని క్రొవ్వే దానికి కట్టి సమయములం దాహారమగును.

ఒంటె బహుదినములు నీళ్లుత్రాగక యుండఁగలదు. అది ప్రయాణారంభమందు విశేష జలమును ద్రాగును. ఆ నీళ్ళ నుంచుకొనుటకు దానికిఁ గడుపులో నొకవిధమగు తిత్తి గలదు. అది యానీటితోఁ బహుకాలము తృప్తినొంది యుండఁగలదు. అది మరల నీళ్లు త్రాగ నవశ్యములేకయే యాఱుదినముల వఱకుఁ బ్రయాణము చేయఁగలదు.

ఒంటె మన దేశమందును ఆఫ్రికాలో నైగుప్తుదేశమందున గూడఁ గలదు. ఒక జాతి లొట్టిపిట్టకు వీఁపున రెండు

మూఁడుపురము లుండును. ఉష్ణదేశములందును నెడారులందును నివసింపఁదగిన యొంటెల కిష్టముగా నుండును. విశేష వర్షములు కురియు దేశములందది శీఘ్రకాలమున మృతినొందును.

ఇతర జంతువు లెవ్వియు నంటని ముండ్లచెట్లు మొదలగు వానిని లొట్టిపిట్టలు తినఁగలవు.

వ్యాకరణము:—అరేబియాదేశస్థులు ఒంటెపాలు త్రాగుదురు. ఇచ్చట క్రియ ఏది? త్రాగుదురు. కర్త ఏది? అరేబియాదేశస్థులు త్రాగునదేది? పాలు. 'పాలు' ఈ వాక్యమున కర్త.

ఒంటె బరువుల మోయును. ఒంటెచే మోయబడునని ఏవి? బరువులు. ఇదియే కర్మ.

ఒంటె ఆకులను మేయును. ఒంటె పాలిచ్చును. ఈ వాక్యములలో కర్తలేవి?

పదములు—మోకరించి=మోకాళ్లు నేలకానునట్లుండ దిగి; సహనశక్తి=ఓర్పుగుణము; గ్రహించి=తెలిసికొని; ఐగుప్తుదేశము=ఆఫ్రికాఖండమున నుత్తరమునయుండు నొక దేశము.

---

# 8. వర్తకులును, వారి యొంటెయు.

ఇద్దరు వర్తకులు వ్యాపారమునకై బయలుదేరిరి. వారు పట్టణమునకు బోయి, తాము కొనిపోయిన సరకులనెల్ల నమ్మి, మరలి తమ యూరికి బోవుచుండిరి. వారియొద్ద నొక యొంటె యుండెను. దారిలో నెండ తీక్ష్ణమునకు తాళజాలక నొక చెట్టు నీడను బరుండి యలసటదీర్చుకొనుటకై తలంచి, యొక్కచోట నొక వటవృక్షముంగాంచి, దాని నీడను విడసిరి. ఒంటె నా చెట్టు యూడలకుఁగట్టి వారు పరుండి నిదురబోయిరి. వారట్లు సుఖనిద్రఁ జెందియుండగా నొక బెబ్బులికూఁత వినఁబడెను. ఆ శార్దూల రావమును విని యా యొంటె భయపడి తన్నుఁ గట్టియుండిన త్రాడు తెంపుకొని పరువిడెను.

కొంతసేపునకు వారు మేల్కొని తమ యొంటె లేకుండుటం జూచి దిగులొంది, దానిని వెదుక బ్రయత్నించిరి. ఒంటె కాలి జాడలు కొంతవఱకగుపడెనుగాని, వారు దాని జాడ తెలియ లేరైరి. ఇట్లు దానిని వెదకుచుం బోవుచుండ వారికొక సన్న్యాసి యగపడెను. ఆతండొకవేళ తమ యొంటెను జూచియుండునని, యతనియొద్ద కేగి నమస్కరించి ‹‹అయ్యా! మాదొక యొంటె పాఱిపోయినది. దానిని మీరు చూచితిరా'' అని అడిగిరి.

వారి మాటలకా సన్న్యాసి ‹దాని వీపుపై నొకవైపు గోదుమలును, మఱియొకవైపు తేనెయు నుండెగదా' అని యనెను. ఆ వర్తకులు ఆశ్చర్యముతో ‹అవునవు' ననిరి. ‹‹దానికొక కన్ను గ్రుడ్డియు, నొకకాలు కుంటియు, ముందటి రెండు పండ్లూడి యుండెనుగదా'' యని మరల నడిగెను.

దానిని వినగనే వర్తకుల యాశ్చర్యమునకు మేరలేకుండెను. తమ యొంటెదొరకెనని సంతసించి ‹అయ్యా! అది మా యొంటె గాని, యది యెటుబోయె' ననిరి. అందులకా సన్న్యాసి ‹‹అయ్యలారా! మీ యొంటె ఎటువంటిదో నాకు దెలియదు. దానిని నే జూడలేదు'' అని చెప్పెను.

ఆ సన్న్యాసి తమ యొంటెను దొంగిలించెనని తలంచి వర్తకు లతనిని నిర్బంధపెట్టిరిగాని లాభములేకపోయెను. తుదకు విసికి, కోపముతో నా సన్న్యాసినిం గొట్టి, సమీపముననుండు గ్రామ న్యాయాధికారియొద్దకు లాగుకొని పోయిరి.

ఆ యూరి న్యాయాధికారి వారిని జూచి ‹యిదియేమి' అని అడిగెను. వర్తకులు తమ వృత్తాంతమంతయు నివేదించిరి. వారి మాటలను చక్కగా విని యా న్యాయాధికారి సన్న్యాసిని జూచి

‘‘అయ్యా! నీవు చూచుటకు సన్యాసిగా నగపడుచున్నావు. నీ మీఁద నిట్టి నిందవచ్చుటకుఁ గారణమేమి? దీనికి నీవేమి చెప్పెదవు?’’ అని అడిగెను. ‘‘అయ్యా! నేను వీరి యొంటెను చూడలేదని చెప్పితిని. ఇప్పటికిని యీ మాటయే చెప్పగలను గాని, వేరెట్లు చెప్పగలను?’’ అని అనెను.

వర్తకులకామాటలకు కోపము రాగా నా సన్యాసిని మరల కొట్టబోయిరి గాని, యా న్యాయాధికారికి వెఱచి యూరకుండిరి. ‘‘నీవు వారి యొంటెను చూడలేదని చెప్పుచున్నావు. అయిన దానికుండు గురుతులెల్ల నీకెట్లు దెలియు’’ నని యా సన్యాసిని న్యాయాధికారి అడిగెను. అందుకా సన్యాసి ‘‘అయ్యా! ఆ యొంటె బోయినదారినంతయు నొకప్రక్క చీమలును, నొకప్రక్క యీఁగలు నుండినందున, నా యొంటెపై నొక వైపు గోదుమలును, యింకొకవైపు తేనెయు నుండెనని యూహించితిని. ఆ యొంటె దారియొక్క యొకవైపున చెట్లలోని యాకులగొఱికి దినినందున నొక కన్ను గ్రుడ్డియనియు, అది కొఱికిన యాకులమధ్య రెండు పండ్లుండదగినచోటు కొఱకక విడువబడియుండినందున దానికి ముందటి రెండుపండ్లు లేవనియు, దాని నాలుగు కాళ్లలో మూఁటి గురుతులే నేలపైయుండిన నది కుంటి యనియు తలంచితినే గాని దాని నే జూడలేదు’’ అని అనియెను.

ఈ మాటలకు వర్తకులిరువురు దిగ్భ్రమ జెంది నిరుత్సాహులైరి. వారల్లై కదలక మెదలక కొయ్యబొమ్మలవలె నిలువబడిరి. ఆ న్యాయాధికారి సన్యాసియొక్క బుద్ధికి చాల మెచ్చుకొని, ఆయనను కొన్ని దినములు తన యింట నుంచుకొని పంపెను. వర్తకులవమానముతో వృథాగా సన్యాసిని కొట్టినందులకు.

చింతిల్లుచు 'ముందాలోచనలేమి కిదియే తగుశిక్ష' యని మనస్సున తలంచుచు నిద్రకుబోయెను.

వాక్యగణము:— వర్తకులు ఒంటెను గోలుపోయిరి. ఇందు కర్తను జూపుడు. అది ఏల కర్త. క్రియకును, కర్తకునుగల సంబంధమేమి? కర్తగల వాక్యముల రెండు చెప్పుము.

పదములు.—రావము=ధ్వని; మేర=హద్దు; నిరుత్సాహులు=సంతోషములేనివారు; దిగ్భ్రమ=దిక్కుల తబ్బిబ్బు.

---

# 9. శత్రువుల జయించుట.

పూర్వము కాశీరాజ్యమున బ్రహ్మదత్తుడను రాజు పాలించుచుండెను. అతడు మిగులబలశాలియు, ధనికుడును; అతడసంఖ్యాకములగు సేనలకధిపతి. అందుచే నతని రాజ్యమందు శత్రుభయము లేకుండెను. ఆ సమయమున కోసలదేశాధిపతి విజయసేనుడు. అతని రాజ్యము మిగుల చిన్నది. అతడంత విత్తవంతుడును గాడు. అతనికిగల చతురంగబలము మిగుల కొంచెము. అందుచే గాశీరాజగు బ్రహ్మదత్తుడతనిని యుద్ధభూమి నోడించి, యతని రాజ్యమగు కోసలమంతయు గైకొని విజయసేను నరణ్యమునకు బారదోలెను.

అంత విజయసేనుడు వింధ్యపర్వత ప్రాంతమునందుండు నడవులనొక గుహయందు నివసించుచుండెను. అచట నతని కొకపుత్రుడు కలిగెను. అతనిపేరు వినయభూషణుడు. వినయభూషణుడు కొంతకాలమునకు బెరిగి పెద్దవాడయ్యెను. తన తండ్రికి గలిగిన రాజ్యచ్యుతికిని, ప్రస్తుతము తామనుభవించు నరణ్యవాసమునకు బ్రహ్మదత్తుడు కారణమని యతడు

కొనఁగొనెను. దానినెటేఁగిప్పటినుండియు, నతని హృదయము క్రోధాయత్తమై యే రీతినైన బ్రహ్మదత్తునికి ప్రతీకారము సేయవలెనని యెదురుచూచుచుండెను.

విజయసేనుఁడు ముసలివాఁడై, తన దరిగృహమునందే ప్రాణములు విడచెను. అవసానకాలమున నతఁడు తనతనయుని సెజ్జకడకుఁ బిలిచి 'నాయనా! నా కాలము ముగిసినది. కాల ప్రవాహముఁ బడి రాలిపోవు పండుటాకువలె నేను చనిపోవ నున్నాను. నీకిచ్చిపోవుటకు నాకు రాజ్యాదులు లేవు. ఐనను నా ఖడ్గమును గొని, దానిచే శత్రువుల జయింపుము' అని పలుకుచు ప్రాణములఁ గోలుపోయెను.

వినయభూషణుఁడు తనతండ్రిమరణమునకు మిగుల విచారమునొంది, పితృక్రియలాచరించి, కాశీరాజుని పట్టువట్టుటకై హృదయముఁ బూనికొల్పుకొని యతని దేశమునకుఁ బోయెను. కొద్దిరోజులలోనే యతఁడు కాశీపట్టణమును జేరి, బ్రహ్మదత్తుని సేవకుఁడుగా నియమితుఁడయ్యెను. అతనికి గుఱ్ఱపు లాయములపై నధికారమునిచ్చిరి. వినయభూషణుఁడు తన పని యందు మిక్కిలి కుశలుఁడయ్యెను.

ఒకనాఁడు వినయభూషణుఁడు తన దినకృత్యముల ముగించి, లాయమున బరుండి, యుచ్చైస్స్వరముతో మధురముగా బాడఁదొడఁగెను. అతని పాట చుట్టుప్రక్కలవారందఱును గుంపులు గట్టుకొని వినుచుండిరి. ఆ సమయమున బ్రహ్మదత్తుఁడును, ఆ త్రోవఁ జనుచుండి, వాని గీతము నాలకించి, మనమున మెచ్చి, అతని తనరథచోదకునిగా నియమించెను. వినయభూషణుఁడును తనకు సమయమునకు వేచియుండెను.

ఇట్లుండ నొక్క దివసమున బ్రహ్మదత్తుఁడు వేటకుఁబోయెను. అడవిని ప్రవేశించినపిమ్మట వేట గజిబిజిలో విజయభూషణుఁడు రథము తప్పుత్రోవం బోనిచ్చెను. అందుచే వారిరువురును సేన నెడఁబాసి యొంటిమైఁ జిక్కిరి. బ్రహ్మదత్తుఁడు వేఁటబడలికచే సొలసి నిదురబోయెను. అట్టి సమయమున విజయభూషణుఁడు తన కరవాలముం దీసి రాజుం జంపుటకు ప్రయత్నపడుచు నిట్లు చింతించెను. "వీడే మా తండ్రి యాపదలకెల్ల కారణము. కడువృద్ధుఁడైన నా జనకుని నడవులందోలిన పాపమిప్పుడు ఇతఁ డనుభవించవలెనుగాత" అని కత్తెత్తి "ఆహా! మాతండ్రి చనిపోవునపుడెంత కష్టపడెను? నిర్మానుష్యమైన కొండ గుహయందు బంధుగులెవ్వరును లేక పరితపించి చనిపోయెను. ఇతనను మూలుఁడైన ఈ పాపాత్ముని వధింపక మానను" అని అతని బొడువఁ బోయెను. అంతలోనే విజయభూషణునకు తన తండ్రి మరణకాలమందిచ్చిన యాజ్ఞ స్మరణకువచ్చెను. క్షమచే శత్రువుల జయింపుమని యాయన శాసించిపోలేదా? అని స్మరణకురాగానే విజయభూషణుఁడు "ఆహా! ఏ తసాహసకార్యముసేయ నొడిగట్టుచుంటిని? తండ్రి యాజ్ఞ నల్లంఘింపఁబోవుచుంటిని. ఏమైన నగుఁగాక, క్షమచేతనే వీని సద్దింపవలయు" నని చింతించి, మరల తన కరవాలమును యొఱలోఁ బెట్టుకొనెను. ఆ సమయముననే దీనిసంతయుఁ గలలోఁ గాంచిన బ్రహ్మదత్తుఁడు మేల్కాంచి, యతనిని జరిగిన వృత్తాంతము దెల్పుమనెను. విజయభూషణుఁడును వాయోడక, సమస్తము నతనికి నివేదించెను. దానిని వినినతోడనే బ్రహ్మదత్తుఁడు తాను జేసిన నీచపు కార్యమునకు సిగ్గుపడి, కోసలదేశమును, దానియందలి ధనమును విజయభూషణునకిచ్చి, తనయపరాధమును క్షమింపుమని వేఁడుకొనెను

ఇట్లు వినయభాషణుండు క్షమచే శత్రువుల నోడించి తన రాజ్యమును సుఖముగా పరిపాలించెను.

చంపదగినయట్టి శత్రువుఁ దనచేత
జిక్కెనేనిఁ గీడు సేయరాదు
పొసఁగ మేలుజేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ వినరవేమ.

**పదములు.**—అసంఖ్యాకములు=లెక్కలేనివి; దేశాధిపతి=రాజు; చతురంగబలములు=రథ, గజ తురగ, పదాతులు; ప్రతీకారము=ప్రత్యుపకారము; అవసానకాలము=ప్రాణముపోయెడికాలము; క్షమ=ఓర్పు; స్మరణము=జ్ఞప్తికి; క్రోధాయత్తము=కోపముతో కూడుకొనినది; రథచోదకుఁడు=సారథి, రథమునుతోలువాడు; తనయుఁడు=కుమారుడు; జనకుఁడు=తండ్రి; దినకృత్యము=ప్రతిరోజు జేయవలసిన పనులు; ఉచ్చైస్స్వరము=పెద్దగొంతు; గీతము=పాట; ఆలకించి=విని; మనము=మనస్సు; కరవాలము=కత్తి, బాఁకు; నిర్మానుష్యము=మనుష్యులు లేని; వధింపక=చంపక; నివేదించెను=విశదముగ దెలియజేసెను; దరీగృహము, (దరీ=గుహ) నివసించుచుండిన గుహ.

## 10. దేహపరిశ్రమ.

దేహారోగ్యముగను, పుష్టిగను ఉండుటకై జనులు ప్రతిదినమును దేహపరిశ్రమను జేయవలసియుండును. సామాన్యముగా జను లితరపనులయందు దృష్టిగలవారై దేహపరిశ్రమను మానెదరుగాని, యది గొప్ప పొరబాటు. మన కారోగ్యముండినగాని, యే పనిని జేయుటకు వలనుపడదు. పరిశ్రమములేనిచో దేహము క్రమక్రమముగా బలహీనమై, తుదకు మనము లేవలేనట్లు తటస్థించును. అందుచే మనము దినమున కొంతతూరియైనను దేహపరిశ్రమముఁ జేయవలెను.

పరిశ్రమ చేయుటకు ప్రాతఃకాలము మిక్కిలి యనుకూలము. నిదురనుండి మేల్కొంచినతోడనే ప్రతి మనుజుఁడును ఒకయరగంటసేపు వ్యాయామ మొనర్చిపిమ్మట స్నానము చేసి తరువాత నితరపనులయందు ప్రవేశించవలెను. అట్లు చేసినచో దేహములోని రక్తమంతయు మిగుల వేగముగా రక్తనాళములయందు పాఱి, దేహములోఁ బ్రతిభాగమునకును బోయి, దానికి కావలసిన శుద్ధమైన నాహారమునిచ్చుటచే పుష్టి కలిగించును. వ్యాయామము గొనునపుడు మన మలసటచే మిక్కిలి వేగముగాను, హెచ్చుగాను పరిశుభ్రమైన వాయువును బీల్చుటచే రక్తము మాలిన్యములేక శుద్ధమగును. అందుచే దేహమునకంతయు నారోగ్యము కలుగును.

మనుష్యులు కడుపునిండ భుజించి యేమియు దేహపరిశ్రమ లేనివారైనచో, వారికిఁ దినిన యన్నము చక్కగ జీర్ణముకానేరదు. అన్నము జీర్ణముకాకపోవుటయే సర్వరోగములకును మూలము. అట్లగుటచే మనుజుఁడు తాను భుజించు నాహారము జీర్ణమగుటకే దేని యొకయుపాయమును బన్నవలయును. కొందఱు ధనికులు దేహపరిశ్రమ చేయుటకు పాలుమాలి యౌషధముల సేవింతురు. అట్టివారికా యౌషధములు జీర్ణశక్తిని కలుగజేసినను, ఇతరరోగములఁ బుట్టించును.

పగలంతయుఁ గష్టపడి పనిఁజేయువారు సాయంకాలమందైన శరీరమున కుల్లాసముగలుగునట్లు ఏదేనొక యాట నాడుట మంచిది. తలుపులన్నియు బిగించిన గదిలో దేహపరిశ్రమచేయుటచే, నందులోనిగాలి చెడిపోయి, యాకారణమున దేహమునకనారోగ్యతసిద్ధింపవచ్చునుకాని, బాగుగ గాలియాడుబయళ్లలో సంధ్యాకాలమందాడుటవలన నట్టి బాధలు కలుగఁజాలవు.

సాయంసమయమున వీచుగాలి శరీరమునకు మిక్కిలి యారోగ్యకరము. అందుచే నట్టి సమయంబున నొక గంటసేపు స్నేహితులతోఁగూడి యాడుట ఇతర సమయములయందు రెండు గంటలు వ్యాయామము చేయుటతో సమానము.



పాఠశాలలయందుఁ జదువుకొను బాలురుకొందఱు సాయంసమయమున బంతులాడెదరు. మఱికొందఱు దండెములు బస్కీలు తీయుదురు. వారట్లుచేయుట దేహారోగ్యముకొఱకే. బంతులాడుటయందుఁ బిల్లలు చెండుకొఱకై యిటునటు పరుగిడుట వలన వారి శరీరముల కలసటగలిగి, దేహమునందలి రక్తము వేగముగా బ్రవహించి, యంగములన్నిటియందును స్వేదము గల్గును. వారా చెమటను పోగొట్టుటకై యాట ముగిసిన వెనుక నింటికి బోయి శరీరమునకు స్నానము చేయవలెను. అట్లు చేసినచో వారికానాడు రాత్రి సుఖముగా నిద్రపట్టి, మరునాఁడుదయమున మేలుకొనినపు డుల్లాసముగానుండును.

మనదేశమందు కొందఱు గరిడీలయందు దేహపరిశ్రమ పుచ్చుకొనెదరు. చాలమంది సంఘముగాఁగూడి యేదోనొక గృహమునందు లోడీలు, సంతూలాలు మొదలైనవి త్రిప్పుచు దండెములఁ దీసెదరు. ఈవిధమైన పరిశ్రమ జేసియే మన యాంధ్ర

దేశస్థుఁడగు రామమూర్తి మిక్కిలి బలముగలవాఁడై, కలియుగ భీముఁడను కీర్తినామమును బొందెను. ఇతఁడు ప్రతి దేశమునకుఁ బోయి యచ్చటనుండు బలాఢ్యుల నోడించి, ప్రపంచమునందం తటను ప్రఖ్యాతిగాంచెను. ఇప్పుడు రామమూర్తి యనిన మిక్కిలి బలశాలియని యర్థము.

వ్యాకరణము:—ఒక మనుష్యునిగాని, జంతువునుగాని, వస్తువునుగాని తెలుపు పదములు నామములు. ఉ. రామమూర్తి, గుఱ్ఱము, గరిడీలు, నామము, అనగా "పేరు."

బొగ్గు నల్లగానుండును. ఈ వాక్యమున బొగ్గు అనునది యొక వస్తువు పేరు. కావున నది నామము.

నలుపు—అనునది యొక రంగు పేరు గావున నదియును నామమే. ఇట్లే తెలుపు, పసుపు; రామమూర్తి బలముగలవాఁడు కాబట్టియితర దేశములందుండు జట్టీలనందరి నోడించెను. చిన్నతనమునుండి దేహపరిశ్రమచేయుటచే బాలురు ఆరోగ్యవంతులగుదురు.

ఈవాక్యములోని నామముల బేర్కొనుడు.

పదములు....పొరబాటు=తప్పు; పుష్టి=బలము; మాలిన్యము = మురికి; సంఘము=గుంపు; ప్రఖ్యాతి=కీర్తి; బలాఢ్యుల=బలముగలవారల; స్వేదము= చెమట; వ్యాయామము=సాము.

---

## 11. బలపపురాతి పలకలు.

పలకలు వ్రాయుటకును గణితము వేయుటకును దిన దినము వాడఁబడుచుండుటను నీవు చూచుచున్నావుగదా. అవి దేనితోఁ జేయఁబడినవో యెచ్చట మనకు దొరకునో నీకుఁ దెలియునా?

అవి యొక విధమగు శిలలు. అవి భూమిలోనుండి త్రవ్వఁ బడును. ఒకానొకప్పుడవి కొండలలోనుండి త్రవ్వి తీయఁబడును.

బలపపుఱాళ్లు తక్కినఱాళ్లనుండి యొక విషయమందు ముఖ్యముగా భేదించుచున్నవి. అవి మిట్టబల్లములులేక మిక్కిలి చదును గలిగియుండునట్లును సమమైన దళసరితనము గలిగియుండునట్లును సన్నని పలకలుగా నగునట్లును జేయఁదగియుండును. మఱేవిధమగు శిలనైనను మనము కోసితిమేని యది బలపపు



ఱాతివలె సన్నని పలకలుగాఁ జీలక ముక్కలగును. ఇచ్చట ముద్రించిన పటమందొక బలపపుఱాళ్లకొండ కనఁబడుచున్నది. ఇంగ్లండునం దిట్టినగములు పెక్కులున్నవి.

ఱాఁ జెక్కువాఁడొక బలపపుఱాతిని దీసి తన జానువుల మధ్యనుంచుకొని యులితోడను సుత్తెతోడను దానిని సన్నని పలకలుగాఁ జీల్చును. ఆ బలపపుఱాయి గనిలోనుండి త్రవ్వి తేఁబడిన వెంటనే దాని నిట్లు చీల్పవలెను. ఎందుకన నది యప్పుడు తడిగా నుండి మెత్తనైయుండును. అది కొంచె మెండిన తరువాత చీల్పఁబడినయెడల, సమమైన దళసరిగల పలకలుగాఁ బగులదు.

క్రొత్తగాఁ జేల్పఁబడిన పలకలు వ్రాయఁదగినంత స్నిగ్ధముగా నుండవు. కాఁబట్టి యివి యొక ఱాతిమీఁద నఱుగఁ దీయఁబడిన పిమ్మట బాగుగ, నున్నగానుండునట్లిసుకతో రుద్దఁబడును.

బలపపుఱాతి పలకలు మనకు ద్వివిధములుగ నుపయోగించును. అవి యిండ్లకుఁ గప్పులుగ వినియోగించును. ఇంగ్లండునందు బలపపుఱాళ్లు సులభముగను నెక్కువగను దొరకెడి ప్రదేశములందు జనులందఱును దమ గృహములకు వానినే పైకప్పుగ నుపయోగపఱచుకొనెదరు. వారీ ఱాతిపలకలను పరిమాణమందును నాకృతియందును నొక్క విధముగా నుండునట్లు చెక్కి వానిని పెంకులవలె నొక దానిమీఁద నొకటిని దమ యిండ్లపైఁ బఱచెదరు. ఇతర విధములగు శిలలు కొన్నిటిలో వలె బలపపుఱాలలోనుండి నీరు స్రవింపవు.

బలపపుఱాలవలన రెండవ ప్రయోజనమేమనఁగా, మనము వానిమీఁద వ్రాయఁగలుగుటయే. బలపపుఱాతిపలకలు వ్రాయుటకు నుద్దేశింపఁబడినపుడవి విఱుగకుండునట్లును వానివి హస్తమందుఁ బట్టుకొనుటకనుకూలమగునట్లు నవి యొక కొయ్యచేట్టములో బిగింపఁబడును.

మనము ఱాతిపలకలమీఁద బలపములతో లిఖించుచున్నాము. ఆ బలపములుకూడ నీ జాతిఱాతిపొడితోఁ జేసినకడ్డీలే. వానితో వ్రాయునపుడవి నల్లగనుండు పలక మీఁదఁ దెల్లనిగీఁతలు గీఁచును.

పలకలమీఁద వ్రాయునపుడు మనకు రెండు లాభములు కలుగును. మనము కాగితములమీఁదఁ గలములతో వ్రాయఁగలిగినదానికంటె నెక్కువ త్వరగా బలపపు ఱాతిపలకలమీఁద

వ్రాయఁగలము. రెండవ లాభమేమనఁగా, మనము వ్రాసికొన్నదానిని మన కావశ్యకము లేనపుడు చెఱిపి, యా పలకనే పెక్కుమాఱులు మనము వ్రాయుట కుపయోగించుకొనఁగలము.

బలపముతో మనము వ్రాయను వ్రాయను నది యఱిగిపోవుచుండును. దీనికిఁ గారణమేదియన, మనము దానితో వ్రాసినపుడెల్ల దానిలోఁ గొంచెము భాగము పలకకంటుకొనుచుండును. పలకమీఁద వేయఁబడు గుఱుతులు బలపములోని మిక్కిలి సూక్ష్మభాగము దాని కంటుకొనుటవలననే కలుగును.

మన దేశమందలి దక్షిణభాగమందు బలపపుఱాల కొండలనేకములున్నవి. ముఖ్యముగా నవి కడప కర్నూలు జిల్లాలలోఁ గలవు. ఆ జిల్లాలలోని జనులు వానిని తమ యిండ్లకుఁ పైకప్పులుగా నుపయోగపఱచుకొందురు.

వ్యాకరణము:—బలపపుఱాయి కొండలనుండి త్రవ్వఁబడును. అది మిగుల పలుచగానుండును.

ఈ వాక్యములలో 'అది' అను పదము దేనిబదులుపయోగింపఁబడియున్నది—'బలపపుఱాయి' అనుదానికి బదులు. బలపపుఱాయి యనునది యే భాషాభాగము? నామము. ఇట్లు నామములకు బదులుపయోగింపఁబడు పదములు 'సర్వనామములు' అనఁబడును.

ఈ పాఠమున మొదటి పరిచ్ఛేదమునఁగల సర్వనామము జూపుఁడు.

పదములు—గణితము=లెక్కలు; శిలలు=ఱాళ్లు; దళసరితనము=దట్టము
నగము=కొండ; లిఖించు=వ్రాయు.

---

## 12. గోదుములు.

మనుష్యులు బహు పురాతనకాలమునుండి సేద్యముచేసి భోజనమునకై యుపయోగించుచున్న ధాన్యములలో గోదుమ

లొకటి. భూలోకమందెల్లెడలను ప్రజలు వానిని భోజ్యపదార్థములుగా వాడుకొనుచున్నారు. ఉష్ణదేశములం దెక్కువగా వరి పైరగునట్లు చలిదేశములందు గోదుమలు పైరగును. కాబట్టి యే దేశమువారి కాదేశమందు పైరగు వస్తువులే ముఖ్యాహార



పదార్థములగును; ఇంగ్లాండు చలిదేశమగుటచే నందలి జనులకు గోదుమలే ముఖ్యాహారములై యున్నవి. మన యిండియా దేశము ఆసియాలో జేరియున్నట్లు ఇంగ్లాండు ఐరోపాఖండములో చేరినది. ఈ యైరోపాఖండమునను అమెరికా ఆస్ట్రేలియా యను ఖండములలోను నిదియే ముఖ్యమైనయాహారపదార్థము.

ఇంగ్లండునందలి జనులు గోదుమరొట్టెలను సర్వసాధారణముగాఁ దిని బ్రదికెదరు గనుక వారిలో రొట్టెయన నాహారమని యర్థమగుచున్నది. కాబట్టి వారిలో నెవరైన దినుటకు రొట్టె కావలెనని రేని యాహారముకొఱకు బ్రార్థించుచున్నారని గ్రహించవలయును.

మన దేశమందలి పంజాబు దేశమందును, ఆగ్రా, అయోధ్య ఐక్యరాష్ట్రములందును, రాజపుత్రస్థానము, గుజరాతము, సింధు, నిజాము సంస్థానములందును గోదుమలు విశేషముగా పైరగు చేస్నవి. అచ్చటి వాసస్థులు గోదుమరొట్టెనే ముఖ్యమైన యాహారముగ నుపయోగించుచున్నారు. అవి బంగాళాదేశ మందుఁగూడఁ బైరగుచున్నవి.

చెన్నపురిరాజ్యమందంతగా దీనిని బైరుచేయుట లేదు ఆందుచే నిచ్చట ప్రజ లాహారమునకై స్వల్పముగా దీనిని వాడుచున్నారు. ఇట్లున్నను, ఆ సేతు హిమాచలము గోదుమ రవను చిఱుదిండ్లుచేయుటకు విశేషముగ వాడుచున్నారు.

గోదుమగింజె నొకదానిని పగులగొట్టి పరీక్షించినచో మధ్యపిండియు, దానియంచున స్ఫటికమువలె గట్టిగనుండి జిగురును గానఁబడును. గోదుమలను దిరుగలిలో వేసి విసరునపుడు ఈ జిగురావాలవలె గుండ్లుగుండ్లుగా నిలుచును. ఇదియే రవ. ఇది మనుష్యులకు మాంసపుష్టిని కలిగించి బలము కలుగ జేయును.

మంచుపడియెడి దేశములందు నేలలోవండు గోదుమలు చక్కగాఁ బెరుగును. గోదుమచెట్లు లేతగానున్నప్పుడు వాన కావలెను. ఆ సమయమునందు వానకురియనియెడల నీ పైరు పండదు. ఈ పంట పూచి కాచునప్పుడు మంచు కావలెను. గోదుమలు పండుటకు మంచినేల కావలెను. ఎరువును బలముగా వేయవలెను. సెనగలు మొదలైన కాయధాన్యములు బండుచోటే దీనికిఁదగినది. గోదుమలను జలాధారములచేఁ బండించుటయుఁగూడ కలదు.

హిందూస్థానమందు ఫలించు గోదుమలలోఁ బలుదెఱఁ

గులు గలవు. వానిలో ముఖ్యమైనవి తెల్లగోదుమలును, ఎఱ్ఱ గోదుమలును. కొన్నివిధములగు గోదుమలు గట్టిగను, కొన్ని మెత్తగను నుండును. గట్టి గోదుమలకంటె మెత్తనివే యెక్కువ సులభముగా బిండిచేయదగియుండి శ్రేష్ఠమైన బిండినిచ్చును గావున నవియే శ్రేష్ఠమైనవి. మన దేశమందు ఫలించు గోదుమలలో సాబాలు మాగాణిపైరులమూలమునను, శేషించినవి రెండవ విధమునను సాగుబడియగుచున్నవి. సంపద్వ్యక్తులగు కృషికులు తమ పొలముల కెరువువేసి యాలాగున జేయనివారి కంటె మిక్కిలి యెక్కువ పంటల ననుభవించెదరు. గోదుమలు రెండేండ్లకొకసారిమాత్రమే పైరువెట్టుదురు. ఆ పంట పైరు పెట్టని సంవత్సరమున జొన్నలనైనను, నులవలనైనను సేద్యము సేయుదురు.

గోదుమలను దిరుగంటిలోఁబోసి విసరినచో నవి పిండియగును. వానిని విసరుటకు ముందొక యర్ధదినమునకు మునుపే కొంచెము నీళ్లతోఁ దడుపుదురు. అవి విసరినపుడు వానిలోఁ గొంతభాగము గుండ్రమైన సన్నని నూకలుగను దక్కినభాగము మెత్తని పిండివలెను నగును. గోదుమపిండికంటె నూకలే శ్రేష్ఠములుగాన నెక్కువ ప్రియముగా నుండును. ధనికులుమాత్రమే గోదుమనూకలను విశేషముగా వాడుకొనెదరు.

హిందూస్థానమందు గోదుమపిండిని రొట్టెలనుగాఁ జేసికొని తిందురు. అవియే జనసామాన్యమునకు—ముఖ్యముగా, మహమ్మదీయులకు—జీవనాధారమై యున్నవి. ఆ రొట్టెల నెట్లు చేసెదరనఁగా, గోదుమపిండిని నీళ్లతోఁ గలిపి పిసికి చిన్నచిన్న ముద్దలుగాఁ జేసి వానిని హస్తముతో నదిమి గుండ్రమైన పలుచని రొట్టెలవలెఁ జేయుదురు. ఆ రొట్టెలను

పెనముల పైనుంచి కాల్చెదురు. వానిని ఘృతముతోడను శర్కరతోడనుగూడఁ జేర్చెదరు.

ఇంగ్లీషువారు గోదుమపిండిని గొంచెము పులియఁబెట్టి రొట్టెలనుగాఁ జేసికొనెదరు. ఇట్టి రొట్టెలను ముఖ్యముగా మహమ్మదీయులు చేసి విక్రయించెదరు. మనము వరియన్నమునుగాని జొన్నయన్నమునుగాని రాగిముద్దలనుగాని భుజించులాగుననే యైరోపాఖండస్థులందఱు గోదుమరొట్టెలను భోజనసమయములందు విశేషముగా వాడుదురు.

వ్యాకరణము:—గోదుమలు ఉపయోగకరమైన పంట. అవి రొట్టెలు చేయుటకు పనికివచ్చును. ఈ వాక్యమునందు 'అవి' అనునది సర్వనామము. ఇది 'గోదుమలు అను నామమునకు బదులుపయోగింపఁబడియున్నది.'

నామమును పలుమారుపయోగింపకుండుటకై, సర్వనామమును నుపయోగింతురు. ఇదియే సర్వనామముయొక్క ప్రయోజనము

ఉత్తరహిందూస్థానమందు గోదుమలు పండును. అవి యచ్చటివారికి బ్రతుకుదెఱువు. వారు దానితోఁ బిండివంటల సేతురుల. ఇందుగల సర్వనామము దెలుపుడు.

పదములు.—స్వల్పము=కొంచెము; ఆ సేతు హిమాచలము = సేతువు అనగా రామేశ్వరము, మొదలు హిమాలయపర్వతముల వఱకు; జలము + ఆధారము = జలాధారము, నీటివసతి; ప్రియము = వెల ఎక్కువ. ఆసియా, యిరోపా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా యనునవిఖండముల పేర్లు; ఖండమనగా గొప్పభూభాగము. సాఁబాలు=సగముపాలు

---

# 13. నలచరిత్రము.

పూర్వము నలుఁడను చక్రవర్తి యొకఁడు నిషధదేశమును పాలించుచుండెను. అతఁడు జనులను బిడ్డలవలెఁగాపాడుచుండెను. అతఁడు దయాళుఁడు; శౌర్యసంపన్నుఁడు; బలపరాక్రమ

ములతోఁగూడినవాఁడు. అతఁడు పిన్నవయసుననే నానాదిగ్దేశాధిపతులను జయించెను. అతని రాజ్యమున వర్షమునకు నాలుగు పంటలు పండుచుండెను.

విదర్భ రాజగు భీమునకు నొక కూఁతురుండెను. ఆమె పేరు దమయంతి. ఆమె యత్యంత రూపవతియై యుండెను. నలుఁడీమె గుణములను, సౌందర్యాతిశయమును బెక్కు జనులచే విన్నవాఁడై యామెను బెండ్లియాడఁ గోరియుండెను.

ఒకనాఁడు నలుఁడుద్యానవనమున విహరించుచుండ, రాజహంసల గుంపొక్కటి యచ్చోట వ్రాలెను. వానిని బట్టుటకై ప్రయత్నించి, తుదకొకదానిని నలరాజు పట్టుకొనెను. ఆ హంస భయముతో నలునిఁ జూచి రాజా! నన్ను విడువుము. నీకు మేలొనరించెను. నే మనోహారిణియైన దమయంతియొద్దకుఁ బోయి నీ గుణముల వర్ణించి నిన్నే పెండ్లి యాడునటులఁ జేసెద' ననెను. అందులకాతఁ డానందమొంది యా హంసను వదలెను. ఆ హంస దమయంతియొద్దకుఁ బోయి యామె నలునిదప్ప నితరుల వరింపకుండునటులఁ జేసెను.

భీమరాజు తనకూఁతురగు దమయంతి పెండ్లికై యోజించి స్వయంవరమును చాటించెను. రాజులందఱును స్వయంవరమునకు బయలుదేరిరి. నలుఁడు రథమునెక్కి విదర్భకుఁ బోవుచుండ, దారిలో నింద్రాగ్ని యమవరుణులను దేవతలతనిని సమీపించి 'నలరాజా! నీవు మాకొక యుపకారము చేయవలయు'నని యడిగిరి. అందులకాతడియ్యకొనెను. అంత వారిట్లనిరి. 'నీవు మాలో నెవ్వనినైన దమయంతి వరించునట్లుచేయుము.'

అదృశ్యకరణి ప్రభావముచే నెవరికిని గోచరము గాకుండ భీమరాజు నంతఃపురమును నలుఁడు ప్రవేశించి దమయంతితో

దేవతలయందొకరిని వరింపుమని నొక్కి చెప్పెనుగాని, యామె నలుని దక్క నితరులగోరనని పలికెను.

నలరాజీవార్తను వేల్పులకుఁ దెలిపెను. స్వయంవర ముహూర్తసమయమున నింద్రాదిదేవతలు నలుగురును నలుని రూపమునుబొంది యాతనితోడ నాసీనులైయుండిరి. దమయంతి నలునిఁ గనిపెట్టఁజాలక దిక్పాలుర నుద్దేశించి ప్రార్థించెను. దేవతలు నల దమయంతులను మెచ్చుకొని వారు కోరిన వరముల నిచ్చిచనిరి. కలిదేవత తన్ను దమయంతి పెండ్లియాడలేదని, లేని విరోధముఁగల్పించుకొనివారి నెటులైనబాధింపఁజూచుచుండెను. కల్యాణమైనపిదపఁ గొన్ని సంవత్సరములకు వారికొక పుత్రుఁడు కలిగెను. వానికి ఇంద్రసేనుఁడను పేరుపెట్టిరి. ఆ బాలుఁడు తన తల్లిదండ్రుల కల్లారుముద్దుగానుండెను. వాని కయిదు సంవత్సరములయినపిదప, ఒకనాఁడు నలుఁడు తన పినతండ్రి కుమారుఁడైన పుష్కరునితోఁ జూదమాడి యోడిపోయెను. వార్ష్ణేయుఁడను నలుని సారథి యింద్రసేనుని భీమరాజున కొప్పగింప విదర్భకుఁ బోయెను. నలుఁడును దమయంతియు కట్టుగుడ్డలతో నడవిపాలైరి.

నలుఁడు తన భార్య దుఃఖమున కోర్వఁజాలకుండెను. అన్నపానాదులు లేక యాకలిచేవారు కష్టపడుచుండిరి. ఒకనాఁడు నలుఁడు దగ్గఱ నెగురుచున్న రెండు పక్షులఁ బట్టుకొనుటకై పైగుడ్డను వానిపై విసరివేయగా నా పక్షు లుత్తరీయముతో నెగరిపోయెను. నలునికి మేరలేని దుఃఖముకలిగి, దమయంతి నిదురబోవుచుండఁజూచి, యామె చీరలో సగము చించుకొని, దమయంతిని నట్టడవిని వదలిపోయెను.

అటులఁ బోవుచో నాతఁడు నిప్పులోఁబడి యల్లాడుచుండిన యొకపామునుజూచి, జాలిగలిగి, యా పాము నెత్తి బయటవిడువ నది యాతనిని గఱచెను. నలుఁడు వికృతరూపుఁడై ఋతుపర్ణుని రాజ్యము చేరి, యా నరపాలునొద్ద బాహుకుఁడనుపేర వంటల వాఁడుగా నుండెను.

అడవిలో నిదురించుచుండిన దమయంతి మేల్కని నలుని గానక వెదకుచుండెను. ఒక పామామెను కఱువరాఁగా నామె యెలుగెత్తి యఱచెను. ఆమె యాక్రందనమును విని బోయ వాఁడొకఁడు సమీపించి, సర్పమును సంహరించి, యామెను గాపాడెను. ఆ సమయమున నాకిరాతుఁడు దమయంతిని జూచి, తన్ను పెండ్లి చేసికొనుమనెను. దమయంతి మిక్కిలి కోపము చెంది మండిపోవునట్లు వానికి శాపమిచ్చెను. వాఁడా క్షణ ముననె భగ్గుమని మండిపోయెను.

అంతట దమయంతి కొందఱు బాటసారులఁగూడి చేదిపుర మునకు బయలుదేరెను. త్రోవలో నొక చెట్టుక్రింద వారు విడిసిరి. నాటి రాత్రి యడవిమృగములు వచ్చి వారిలోఁ గొంద ఱిని జంపెను. కొందఱు భయపడి పరుగిడిరి. దమయంతికి మాత్ర మపాయము గలుగలేదు. మరునాటి యుదయమున దమయంతి చేదిపురముచేరెనుగాని, యెచ్చటికిబోవుట కామెకు తోచదయ్యెను.

చేదిపురపు రాణియైన విపుల దమయంతిని జూచి తనయొద్దనే గొలువున యుండుమనెను. దమయంతియు నందులకు సమ్మతించియుండెను.

భీమరాజు తనకూతురిని యల్లుని వెదుక నిరువురు బ్రాహ్మణులఁ బంపెను. వారిలోఁ బర్ణాదుఁడనువాఁడు చేదిపురము చేరి

యందు విపులయొద్ద సైరంధ్రిగానున్న దమయంతిని గనుగొని యామెను విదర్భకు తోడుకొనిపోయెను.

పిదప ఋతుపర్ణునియొద్దకు సుదేవుఁడు పోయి తన యుక్తి నంతయు జూపి వికృతవేషముననున్న నలుని (బాహుకుని) కని పెట్టెను. తాను పిలచిన విదర్భకు రాడని తలఁచి దమయంతీ ద్వితీయ స్వయంవరమను నెపమున ఋతుపర్ణ బాహుకులను మాత్రము రప్పించెను.

ఋతుపర్ణునికాశ్చర్యము కలిగెను. ఇతర రాజులెవ్వరును రాలేదు. అంత నతఁడు భీమరాజును బిలిచి 'నన్ను హేళనము జేయుటకా యిందు రప్పించితివని యడిగెను. అందులకు భీమ రాజు 'ఋతుపర్ణరాజా! కోపముడుగుము' నీయొద్ద నా యల్లుఁ డైన నలుఁడు వికృతరూపమున బాహుకనామమున నుండు టెఱిఁగి నిన్నిందు రప్పించితి' ననెను.

వారందఱు బాహుకుని కొన్ని గుఱుతులవనన నలుఁడని దృఢముగా నిశ్చయించి యతడు తన్నుతాను బయలుపఱచు కొనునటుల ప్రార్థించిరి. ఇంద్రసేనుఁడు 'నాయనా' యనియు, దమయంతి 'నాథా' యనియు పిలిచి యనుగ్రహింపుమనిదీనులై, వేడుకొనిరి. శిశుప్రాయముననే తండ్రి నెడబాసి కుందుచుండిన యా బాలునియొక్కయు, నడవిలోఁబతి నెడబాసి దుఃఖముచేఁ గృశించియుండిన దమయంతియొక్కయు నార్తస్వరములు విని యచటివారి గుండెలు నీరయ్యెను. విపత్పరంపరల దిగమ్రింగి యుండిన నలుఁడు తన భార్యను బిడ్డను జూచి తన హృదయ మున పొంగి పొరలుచున్న దుఃఖహర్షముల యుద్రేకమును పట్ట జాలక కర్కోటకునిఁ బ్రార్థించి నిజస్వరూపంబును దడసి వారిం గారవించి, యచటి జనుల నాశ్చర్యసముద్రమున ముంచెను.

తన వంటలవాఁడు నల సార్వభౌముని రూపమున ప్రత్యక్షముకాఁగా నిర్విణ్ణుఁడై, ఋతుపర్ణుఁడు తనను మన్నింపుమని వేడుకొనెను. అతనిని గౌరవించి నలుఁడు నిజరాజ్యంబును గైకొని చిరకాలము పాలించెను.

**వ్యాకరణము:—** సర్వనామమన నేమి? దానివలన ప్రయోజన మేమి ఒక యుదాహరణమిందు.

ఒక పనిని తెలియఁజేయు పదము క్రియ. నలుఁడు దమయంతిని పెండ్లియాడెను. ఇందు పెండ్లియాడు అనునది యొకపనిని తెలియజేయును. కావున నిది క్రియ.

దమయంతి నలునివరించి, దేవతల నొల్లకపోయెను. ఇందువరించి,పోయెను ఇవి రెండును పనులను తెలియజేయును. కావున క్రియలు.

నలుఁడడవికిపోయి యచ్చట సర్పము గఱచినందున కురూపుఁడయ్యెను. ఇందుక్రియలను జూపుఁడు.

**పదములు.—** సౌందర్యాతిశయము=అందముయొక్క ఆధిక్యత; ఇయ్యకొనెను = ఒప్పుకొనెను; వికృతరూపుఁడై = కురూపుడై; సార్వభౌముడు = చక్రవర్తి; దయాళుడు=దయగలవాడు; కృశించి=చిక్కి; అల్లారుముద్దుగా = వేడుకగా; ప్రత్యక్షముగా = అగుపడగా, అదృశ్యకరణి=(దృశ్యము - కనుబడునది; అదృశ్యము=కనబడునది) కనపడకుండునట్లు చేయునది.

# 14. మన గుడ్డలు—దూది, ఉన్ని

మనము ధరించు వస్త్రములు సాధారణముగాఁ బ్రత్తితోఁగాని, యున్నితోఁగాని నేయబడియున్నవి. కొన్ని నారతోడను మఱికొన్ని పట్టుతోడనుగూడ నేయుచున్నారు కాని, యట్టివి మిక్కిలి యరుదు. జనులలో ముప్పాతికపాలు ప్రతి వస్త్రములనే వాడుచున్నారు.

ప్రత్తి మనకొక వృక్షమునుండి లభించును. అది సామాన్యముగా నిండియా, యీజిప్టుదేశములయందును, అమెరికా,

ఆస్ట్రేలియాఖండములందును విశేషముగాఁ బెరుగును. వానిలో నమెరికాఖండమందుఁ బండు ప్రత్తి మిగుల శ్రేష్ఠమైనది. దాని నుండి చాల సన్నని దారముఁ దీయవచ్చును. అదియే యిపుడు పలుచని వస్త్రముల నేయుట కుపయోగింపఁబడుచున్నది. కొంచెము దళమైన బట్టల నేయుట కిండియా యీజిప్టు దేశముల ప్రత్తిని వాడెదరు.



ప్రత్తిచెట్లలో రెండు విధములుగలవు. కొన్ని నేలకుఁ బెటిగి రమారమి మనుష్యుని తొడల యెత్తుండును. అది జూచుటకు చిన్న పొదవలె గుబురుగానుండును. భూలోకమందంతట నిదియే విస్తరించియున్నందున మనము వాడుకొను దూది దీనివలననే యుత్పత్తియగుచున్నది. ఈ జాతి చెట్లుగాక మఱొకజాతిలోఁ జేరిన ప్రత్తివృక్షము గలదు. ఈ వృక్షము మన దేశమందును, చీనాదేశమందునుమాత్రము వర్ధిల్లుచున్నది. ఇది యించుమించుగా నిరువదియడుగులయెత్తునకుఁ బెరుగును. దీని కాయలలో దూది యుండును.



ప్రత్తితోటలనుండి తెచ్చిన దూదిని విత్తనములనుండి విడదీయవలయును. ఈ కార్యము మన దేశమందు రాట్నములచేఁ జేయుచున్నారు. మఱికొన్ని దేశములందుఁ బెద్ద యంత్రముల సహాయ్యమునఁ జేసెదరు. రాట్నమునందు రెండు గుండ్రని కొయ్యపుల్లలొకదానినొకటి యొరసికొని తిరుగుచుండును. ఆ పుల్లలమధ్య దూదినందిచ్చినచో విత్తనములులేని భాగమెల్లనవలి ప్రక్కకుఁబోయి, విత్తనములుమాత్ర మొకవైపునఁ బడును. ప్రత్తిని నూలువడకుటకును, విత్తులు నూనెదీయుటకును, పశువులకు మేతగాను నుపయోగింతురు.

విత్తులేర్పఱచిన ప్రత్తిని యంత్రసహాయమున నూలుగా వడకుచున్నారు. దానిలోఁ గొంత గుడ్డలునేయుటకును, మఱి

కొంత నెగుమతి చేయుటకును ఉపయోగపడును. నూలుతో వస్త్రములు నేయుట మన దేశమందును గలదుగాని,యంత విస్తారముగా లేదు. మనకు గావలసిన బట్టలలో చాల భాగము మనము ఇంగ్లాండు దేశమునుండి దిగుమతి చేయుచున్నాము. ఆ దేశమున నేతయంత్రములు చాల గలవు. అందుచే వారు బట్టల నగ్గువగా చేసి మనకుఁ బంపగలిగియున్నారు.

ఇంగ్లాండు దేశమున దూది పండుట లేదు. ఐనను, అచ్చటి వారితర దేశములనుండి దూది నెగుమతి చేయించుకొని, దానిని నూలుగాను, వస్త్రములుగాను నేసి, చాల నితర దేశములకు బంపుచున్నారు.

ఉష్ణదేశములందలి జనులు సామాన్యముగ దూదివస్త్రములనే వాడుకొనెదరు గాని, శీతదేశనివాసులకున్నివస్త్రము లత్యావశ్యకము. ఉన్నితో నేసిన బట్టలు వెట్టకలిగించును. వానిని గప్పుకొనినచో దేహమునఁ బుట్టిన యుష్ణము వెలికి యంగములకెల్ల నావరించును. అందుచే శీతలదేశమువారికివి మిక్కిలి యుపయోగకారులు.

ఉన్ని గొఱ్ఱెలవీఁపులను మొలచును. గొఱ్ఱెలలోఁ బలుజాతులున్నవి. కొన్నివిధములగు గొఱ్ఱెలయొక్క యున్ని పొడవుగను, కొన్నిటిది పొట్టిగనుండును. మన దేశమునందలి గొఱ్ఱెలకంటె నింగ్లండునందును నాస్ట్రేలియాయందును మిక్కిలి శ్రేష్ఠతరములగు గొఱ్ఱెలున్నవి. దీనికిఁ గారణమేమన నచ్చటి కాఁపులు తమ గొఱ్ఱెలను మిక్కిలి జాగ్రత్తతోఁ బెంచి వానికి మంచి మేఁతను బెట్టి వానిలో నుత్తమములైనవానినే పెరిగి పెద్దవి గానిచ్చెదరు.

ఆస్ట్రేలియాయందు నసంఖ్యాకములగు గొఱ్ఱెలమందలున్నవి. అవి యచ్చట వేనవేలుగా నున్నవి. చలికాలమందు

గొఱ్ఱెలకు చలిలేకుండుటకు వాని యున్ని ప్రబలముగాఁ బెరుఁగును. వేసవికాలమందా యున్ని తనంతట తానే యూడిపోవును. కాఁబట్టి శీతకాలము గతించు సమయమున గొల్లలా యున్ని నేఁటేఁటను కత్తిరించివేసెదరు. వారాగొఱ్ఱెలను మొదట నొక చెఱువులోనికిఁ దోలి వానిని శుభ్రముగాఁ గడిగి వాని దేహమారుటకు వాని నెండలో పరుగెత్తించెదరు. అంత వారు



వాని యున్నిని పెద్దకత్తెరలతోఁ గత్తిరించి తీసికొనెదరు. ఇచ్చట వేసిన పటమందుఁ గొందఱిట్టిపనిని జేయుచున్నట్లు కనఁబఱుపఁ బడియున్నది.

గొఱ్ఱెల దేహములనుండి కత్తిరించి తెచ్చిన యున్ని మొట్టమొదట మురికిగాను చెమురు రాచినట్టుగను నుండును. కాఁబట్టి వారు దానిని తామ్రపాత్రములందుంచి విశేషముగా సబ్బునీళ్లను గలిపి యుడకఁబెట్టుదురు. ఇట్లు చేయుటవలన నా యున్ని కంటుకొనియుండెడి చెమురును మురికియును బోవును. తదనంతరము వారు దానికిఁ దమ యిచ్చవచ్చినట్లు, నలుపు, పసుపు ఎఱుపు మొదలగు రంగులను వేయుదురు. ఇట్లు చేయనొల్లని

వారు దానిని దెల్లగా నేయుచుందరు. అంత నది యొక యంత్ర మందునుంపబడి దానిలోని పెద్ద వెంట్రుకలు తీసి పారవేయఁబడిన పిమ్మట దారముగాఁ బేనఁబడి మగ్గములలోఁ బలు దెఱగులగు వస్త్రములుగా నేయఁబడును.

ఉన్నితోఁ గట్టుబట్టలనుమాత్రమే గాక కంబళ్లను శాలువలను మేజోళ్లను దివాసులు మొదలగువానినిగూడ నేయుదురు. ఇంగ్లండులో నేయఁబడు వస్త్రములన్నిటిలో దూదిబట్టల తరువాత నున్ని బట్టలనేఁతయే మిక్కిలి ప్రధానమైనది.

కొన్ని దేశములం దున్ని యొంటెలనుండిగూడఁ దీయబడుచున్నది. అరేబియాదేశస్థుల కొంటెలు విస్తారముగానుండును గాన, వారు దాని యున్నిని కత్తిరించి వస్త్రములుగా నేయుచున్నారు.

వ్యాకరణము.—గొఱ్ఱె; ఈ పదము ఎన్నిటిని తెలుపును? ఒక దానిని. గొఱ్ఱెలు. ఇది ఎన్ని గొఱ్ఱెలు అని తెలుపును? రెంటినిగాని, అంతకంటె హెచ్చుసంఖ్యనుగాని.

ఇట్లు ఒక వస్తువును తెలుపు పదము ఏకవచనము, రెంటినిగాని, అంతకంటె ఎక్కువగాని తెలుపు పదము బహువచనము.

వచనము. ఒక పదము ఒక వస్తువును తెలుపునా, లేక అనేక వస్తువుల తెలుపునా అను విషయమునుఁ దెలియజేయును.

అరేబియాదేశమందు ఒంటెలు ఉన్నినిచ్చును. ఇచట దేశము, ఉన్ని, ఏ వచనము? ఏల? ఒంటెలు,—ఏ వచనము? ఏల?

పదములు.—ధరించు=తొడుగు; ఉత్పన్నమగు=కలుగు. అగ్గువగా = చవుకగా; తామ్రపాత్రము=రాగిపాత్ర; చైనా=ఆసియాయందొక పెద్ద దేశము; ఈజిప్టుదేశము=ఆఫ్రికాఖండమున నుత్తరభాగమందుండు దేశము.

———

# 15. వేరుసెనగ.

సామాన్యముగ మనదేశమున గానుగ నాడి నూనె దీయు వస్తువులలో వేరుసెనగ ముఖ్యమైనది. ఇది మన దేశమగు హిందూస్థానములోఁ బురాతనకాలమునుండి పైరు బెట్టబడుచుండెనుగాని, యూరోపాఖండమునకు నూతనముగ గొంపోవఁబడెను. ఆ ఖండవాసులు వేరుసెనగ తెలియక పూర్వము ఆలివునూనెను మిక్కిలిగా నుపయోగించెడివారు. కాని 18-వ శతాబ్దమున దక్షిణ అమెరికానుండి స్పెయినుదేశస్థులు వేరుసెనగ దెచ్చి, తమ దేశమందే నాటినపిమ్మట, నాలివునూనెకు వెలతగ్గి క్రమముగా నిదియే ప్రబలిపోయెను. ఆలివునూనెకంటె వేరుసెనగనూనెయే మేలైనదిగను, అగ్గువయైనదిగను ఉన్నది.

వేరుసెనగకాయలు సాధారణముగా నర యంగుళము పొడవు మొదలుకొని యొకటిన్నరయంగుళమువఱకు నుండును. దాని పైపొట్టు తెల్లగా గనుపులు బారియుండును. దానిని జితుకఁగొట్టి, యొలిచివేసిన యెడల నందులో సుమారుమూఁడు నాల్గు గింజలుండును. ఈ గింజ లెఱుపుగను, వేపవిత్తులంత ప్రమాణముగలవిగను ఉండును. ఆ గింజలను జేతులతో నలిపినపక్షమున దానిపైనుండు ఎఱ్ఱనిపొర తొలఁగిపోయి ధవళవర్ణముగల పప్పు శేషించును. ఇదియే వేరుసెనగలో ముఖ్యమైన భాగము. ఈ పప్పును మనము వేళ్లసందున నలిపినచో నూనెను జూడవచ్చును.

వేరుసెనగ గడ్డదినుసులలో జేరినదని చెప్పవచ్చును. దీని కాయలు కంది, పెసర మొదలగువానివలె చెట్టునబండక, వేరు నంటుకొని భూమియందుండును. ఒకొక్క వేరుసెనగచెట్టును

మనము సమూలముగా పెకలించి పరీక్షించితిమేని, దాని వేరు నంటుకొని గుత్తులుగుత్తులుగా నెన్నియో కాయలుండును. అవి బండు దేశములలో గింజ గట్టిపడగనే బాలురు, పొలముకావ రిని కనుగొనుటకునిచ్చి, వానిం బెటికి యాంపచ్చిగింజలనే దినుచుండుటగలదు.

పచ్చిమన్నుగల పొల మీపంటకు మిక్కిలి యనుకూలము. కొంచెమిసుకపాఱు ప్రదేశమైన దీని కుపయోగించెదరు గాని, నూనెవిస్తారముగా రావలయునని కోరినచో నీపైరెఱువు భూములయందు సేద్యము జేయవలయును. దీనిని పైరుబెట్టుటకు వేసవికాలమందు జ్యేష్ఠమాసమందుఁ బ్రారంభింపవలెను. తొలకరివానలు కురియగనే పొలముకాపులు చేలలో దుక్కిసాగించి బాగుగా దున్నెదరు. దీనికి సిద్ధపఱచు క్షేత్రము నెంతలోతుగా దున్నిన, పంట యంత పుష్కలముగాఁబండును. ఏలయనిన, భూమి మెత్తబడియీ మొక్కలమూలములు మిక్కిలి లోతునకు పాఱును. అందుచే నొక్కొక్క వేరునకును నొచ్చుకాయలు కాచెను. ఈ కారణమునుబట్టియే కొందఱు భూమిని రెండు మూడు పర్యాయములు దున్నుటయుగలదు. బాగుగా దున్నినపిమ్మట పశుల పేడయు, గొఱ్ఱెల యెరువును తోలి, భూమిని జెదరపఱచెదరు.

ఎరువుదోలుటయందు కాపులు మిగుల జాగ్రత్తగా మెలగవలయును. కొంచెము పచ్చిపేడ నుపయోగించినపక్షమున దానియందు చిన్నచిన్న పురుగులుద్భవించి, మొక్కలను పాడుచేయుటచే కాపు మిక్కిలి పలుచఁబడును. కావున కర్షకులెండిన యెరువునే తోలవలెను. అమెరికాదేశమందు జనులు చేఁపపెంట, ఎముకలచూర్ణము, చచ్చిన మృగపక్ష్యాదుల కళేబరములనుగూడ నెరువుగా నుపయోగించుచున్నారు.

వేరుసెనగవిత్తులు సిద్ధపఱచుటకు కర్షకులు మిక్కిలి యను భవశాలురుగ నుండనిచో నవి, చల్లినపిమ్మటc బురుగుపట్టి చెడిపోవును. అందువలన కాపువారీ విషయమునందు మిక్కిలి మెలకువతోc బనిచేసెదరు. పండినకాయలలో మేలైనవి యేర్పఱచి, వానిని బూడిదతో కలిపి, యొకకుండలోగాని తట్టలోగాని పోసి దాని మూతిని గడ్డితోc గప్పి పేడతో పూసివేయవలెను. ఇట్లు సిద్ధమైన కాయలను రెండు మూడు రోజులపిమ్మట వెలికి దీసి వాని పొట్టంతయు చేతులతో నొలిచివేయవలయును. ఇట్లు చేసినపిమ్మట రెండురోజులకు పొలములో విత్తినచోc జక్కగా మొక్కలు మొలచును. డొల్ల యొలిచిన గింజపైని యెల్లపొట్టు తీసివైచినచో నది విత్తనమునకు బనికిరాదు.

సారములేని ప్రదేశమునందు నీ విత్తులు మిక్కిలి దట్టముగా జల్లవలయును. సారవంతములయిన భూములలో గొంచెము పలచనగా జల్లుటయే పంటకు చాల యనుకూలము. ఋతువును మించి చల్లునపుడుకూడ కొన్ని విత్తనములు మొలకలెత్త నేరవుగాన కొంచెము నిబిడముగా జల్లుటయేమంచిది. వేరుసెనగవిత్తులను జల్లుట మిక్కిలి చిత్రము. ఒకడు నాగలితో పొలమును దున్నుచుంబోవును. మఱి యిద్దరు ముగ్గురు తమ యొడులనిండ విత్తనములను పోసికొని వరుసగా నాగేలి చాలునందు చల్లుచు వాని వెనుకనే పోవుచుందురు. ఇట్లు పొలమంతయు విత్తినపిమ్మట దానిని రెండవసారి దున్నినచో చల్లిన గింజలపైని మన్ను కప్పుకొనును. అటుమీఁద గొఱ్ఱుతో లవలెను. దీనిచేc బొలమునందుండు చెత్త మొదలైనవన్నియుc దొలగిపోయి పొలమంతయును కలియును. వానకురియకపోవునను శంకపొడమెనేని మోటచే నీరుకట్టుట కనుకూలముగానుండుకొఱకు

చేసినంతయు మళ్లుమళ్లుగా నేర్పఱచుకొనవలయును. విత్తులు తడిపి పెట్టినయెడలగాని, పొలమునందే తడివిస్తారముగానుండిన గాని త్వరగా నవి మొలకలెత్తజాలవు. నీరు మిక్కిలియయ్యే నేని విత్తులు కుళ్లిపోయినను బోవును. కావున తగుపాటి తడి యుండునపుడే విత్తుట ప్రారంభింపవలెను. చేను విత్తు అదను గొనుటకు కర్షకుల కనుభవ మత్యావశ్యకము. చేను విత్తుట కంటె విత్తినపిమ్మట నాభీజములను గాపాడుట మఱింత కష్టము. ఏలయనగా, పగలు పక్షులును, రాత్రి నక్కలును వీనిని కాజే యును. అందుచేఁ గాఁపువారు రాత్రిందిగళ్లు కంటిమీఁది ఱెప్ప వాల్చక నొడిసెలలతో కాచుకొనియుందురు. పగలు పక్ష్యాదు లను బాఱదోలుటకు కొన్ని యుక్తులఁ బన్నెదరు. పొలమునందు దేనినేని, నొక కాకినిగాని పక్షింగాని చంపి వ్రేలఁగట్టెదరు. దానిం జూచి యితర పక్షులన్నియు భయపడి పొలమువంక చూడనైన వెఱచును. కాని రాత్రులయందుమాత్రము నక్కల వలని బాధకై యొకరిద్దరు నిదురమేల్కొని యుండవలసి వచ్చును.

పొలము చల్లినపిమ్మట మూడు నాలుగు వారములకు గింజలు మొలకలెత్తి పొలమంతయు బచ్చగా గనుబడును. అప్పుడది చూచువారికి మిక్కిలి మనోజ్ఞముగానుండి మెత్తని పచ్చికబయలి ననుకరించియుండును. అట్టి సమయమున చాల యిఱుకుగానుండు మొక్కలను సర్ది పలుచనగా నమర్చవల యును. గుత్తుగా మొక్కలను నొక్కచోట నేమొలవనిచ్చినచో నవి విస్తరింపక నిలువుగా నెదుగును. ఇట్లెదుగుటచే పంటకు నాణెముకాదు.

విత్తనములుచల్లిన నెలరోజులవఱకు పొలమునకు తడిగట్ట

నక్కఱలేదు. ఆవెనుకఁగూడ మేఘములుగూడి వానలుకురియక పోయెనేని వారమునకొకతూరి మోట గట్టుచుండవలెను. నీ రెక్కువగా పొలమునందు నిలిచెనేని చెట్లు తెల్లబోయి కాయలు తాలుబడును. ఆఱేడునెలలకు మొక్కలు ఎదుగుట చాలించి పిమ్మట వాని యాకులు పండియెండుట కారంభించును. అప్పుడు మొక్క నొకదానిని పెకలించి దాని మూలమునకంటియుండు కాయలను హస్తములతో నలిపిచూచితిమేని దానియందు విత్తనములు కనఁబడును. అవి యెట్టఁబాఱియుండినచో నంతట నీరుకట్టుట మానవలయును.

వేరుసెనగ పైరంతయు నెండినపిమ్మట కోతపట్టునకుముందు రోజు పొలమునంతయు నీరుగట్టి నానబెట్టవలయును. పిమ్మట మరునాఁడుదయమున పెల్లగించివేయవలెను.

సెనగచెత్తను కట్టలుకట్టి యొండఁబెట్టవలయును. ఈచెత్తను మేసిన పశువులు పుష్కలముగా పాలనిచ్చును. వేరుసెనగ నువ్వులవంటిది. దీని పప్పును గానుగాడినచో చేమురు వెలువడును. ఈ చేము రౌషధములకును, పిండివంటలకును నుపయోగపడును. కొందఱు దీనిని దీపమునకును వాడెదరు. ఐరోపా దేశమున నిపుడిది ఆలివు నూనెకంటెను శ్రేష్ఠమని, దీనినే విశేషముగా నుపయోగపెట్టుకొనుచున్నారు. వారు దీనిని సబ్బు చేయుటయందుఁ బ్రాయికముగా వినియోగించుచున్నారు. నూనెతీసిన వేరుసెనగపిండి గొడ్లు తినుటకును పొలముల కెరువు క్రిందను అక్కఱకువచ్చును. దీనిపొట్టు కొంచెము చివికినయెడల మంచి సత్తువగల యెరువైయుండును. ఇది కర్షకులకెంతయు నాదాయకరమగు పంట.

**వ్యాకరణము:**—సామాన్యముగా ప్రతి నామమునకును, రెండు వచనములయందును రూపములు గలవు.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| **కాయ** | **కాయలు** |
| విత్తనము | విత్తనములు |
| గడ్డ | గడ్డలు |

ఇచట ఏకవచనరూపమునకును, బహువచనమునకునుగల భేదమేమి? బహువచనమెట్లు గల్గుచున్నది? ఏకవచనమునకు 'లు' చేర్చుటవలన.

**పదములు.**—ధవళవర్ణము = తెల్లవర్ణము, తెలుపు; సమూలముగా = వ్రేళ్లతోకూడా; విస్తారము = అధికము; పుష్కలము=నిండు, పూర్ణము; పర్యాయములు=తడవలు; నిబిడముగ =దట్టముగ, క్షేత్రము=స్థలము; సీత= నాగటిచాలు; కరకులు=కొప్పికులు రేకులు.



# 16. తేయాకు, కాఫీ.

తేనీరును, కాఫీయును అనేకులకు మిక్కిలి యిష్టమైన పయములు. ఈ రెండును మనదేశమునకు ఇతరదేశములనుండి తేబడినవి. ఉత్తరహిందూస్థానమువారు విశేషముగా తేనీటి పానముచేసెదరుకాని, దక్షిణదేశస్థులు రెంటినిగూడ త్రా

తేచెట్టు మొట్టమొదట చీనాదేశమందుండి యింగ్లండునకు సుమారు నన్నూటేండ్ల క్రిందటఁ గొంపోఁబడెను. అప్పుడు వీసెఁడు తేయాకు వెల రమారమి రెండువందల వరహాలుండెడిది. ఆకాలమందొక వణిజుండింగ్లండుదేశపు రాజేన కొక యఱవీసెఁడు తేయాకును కానుకగాఁ దెచ్చియిచ్చి యది మిక్కిలి గొప్ప బహుమతి యనుకొనెను. మంచి తేయా కిప్పుడు వీసె యొకటికి నొక్కరూపాయకే దొరకును.

తేయాకును గొంచెము నీవు చేత నునిచికొని పరీక్షించితి వేని, దానిలోఁ జిన్నవైన నల్లని యెండినయాకులున్నవని నీకు దెలియును. అదియే తేచెట్టుయొక్క యాకులు. తేచెట్టులు మొట్టమొదట చీనాదేశమందుఁ బెరుగుచుండినవి. ఆదేశస్థులు తేనీటి ననేకశతవర్షములనుండి త్రాగుచున్నారు. భూలోకమందలి యితరదేశస్థుల కందఱకునుగావలసియుండిన తేయాకు బహుకాలమువఱకుఁ నాదేశమునుండియే యెగుమతి చేయఁబడుచుండెడిది. అయినను నించుమించుగా నేఁబదియేండ్ల క్రిందటఁ దేచెట్లను సింహళమందును మన దేశమందును నాటుట కారంభించిరి. ప్రస్తుతమున మన దేశమందలి పర్వతములన్నిటి మీఁదను దేచెట్లతోఁటలు విస్తారముగా నున్నవి. దక్షిణ హిందూస్థానమం దవి ముఖ్యముగా నీలగిరులమీఁదను దిరువాన్కూరురాజ్యపుఁ బర్వతములమీఁద నున్నవి.

తేచెట్లు పర్వతములపార్శ్వములందు ముఖ్యముగా వర్ధిల్లును. అవి సుమారు నాలుగేసి యడుగుల దూరముగల వరుసలుగా నాటఁబడును. తేచెట్ల పొదల తలలను గత్తిరించినపిదపఁ గొన్ని వారములకు వాని శాఖలమీఁదఁ జిగుళ్లును మొగ్గలును విశేషముగాఁ గనఁబడును. ఆచెట్లను సంవత్సరమునకు మూఁడు

తడవలిట్లు కత్తిరించుచుందురుగాన నవి యేఁడాదికి మూఁడుపంటలు పండుచుండును. కూలివాండ్రు లేఁత తేయాకులను భద్రముగాఁ ద్రుంచి పళ్లికలతోఁ దీసికొని పోవుదురు. తేయాకు మొగ్గలే దివ్యమైన తేనీటి నిచ్చును. వాని తరువాత లేఁతయాకులు శ్రేష్ఠమైనవి. పెద్ద తేయాకులు మూఁడవ తరగతిలోఁ



జేరినవి. ఇట్లొక్కొక్క తేచెట్టులోనుండి దొరకు తేయాకులు మూఁడువిధములై యుండును. తేతోఁటల యజమానులాయా విధములగు తేయాకులను బ్రత్యేకముగానుంచి నిప్పుసెగఁజూపి వాని నెండఁబెట్టెదరు. కొన్ని సమయములందు వారు వానినొక పెద్దపెనమందుంచి ప్రొయ్యిమీఁదఁబెట్టి సన్నగా మంటవేసి యవి యెండునట్లు చేయుదురు. అట్లు చేసినపు డాయాకులు మొదట పసుపువర్ణమును దాల్చి పిమ్మట పింగళవర్ణమునకు మాఱి తుదకు నల్లనివగును. అప్పుడు ప్రతియాకును ముడుఁచుకొని చుట్టవలె గుండ్రముగానగును. ఆ యాకులనుండి విఱిగి పడిపోవు చిన్న ముక్కలను జాగ్రత్తతోఁ బ్రోవుచేసి యుంచి తేయాకు ధూళియను పేర విక్రయించెదరు.

తేనీళ్లను సిద్ధముచేయుటకుఁ గొంచెము తేయాకు నొక పాత్రమందుంచి దానిమీఁద సలసలఁ గ్రాఁగు నీళ్లనుబోసి యైదు నిమిషములకాల ముంచెదరు. అంత నా నీళ్లను పానపాత్రములలోఁ బోసికొనెదరు. అవి యప్పుడు కొంచె మెఱ్ఱగానుండి చిక్కని వాసనగలవై యుండును. ఆ నీళ్లలో క్షీరమును శర్కరను గలిపి త్రాగెదరు. ఐరోపావారు తేనీళ్లను జేసికొని త్రాగెడి విధమిదియే. తేనీళ్లు సిద్ధమైన పిదప పాత్రమందు మిగిలియుండు తేయాకులు నిష్ప్రయోజనమైనవిగానఁ బాఱవేయఁబడును. ఆ యాకుల నెవరును దినరు. తేయాకులను నిప్పుమీఁదఁ బెట్టి యుడుకఁబెట్టరాదు. వాని నుడుకఁబెట్టినయెడ, తేనీళ్లు రుచింపవు. ఇంతియగాక, తేయాకును వేఁడినీళ్లలోఁ గొన్ని నిమిషములేగాని బహుకాలము నాననియ్యరాదు. వానిని బహుకాలమిట్టి వేఁడినీళ్లలో నుంచినఁ దత్క్షణమున గూడఁ దేనీళ్లు చెడిపోవును. చెడిపోయిన తేనీళ్లనారోగ్యకరములు గావునఁ బానయోగ్యములు కావు.

తేనీరు పానీయమైన యాహారము. డస్సియున్న వారికది బలమొసఁగును. పనిపాటులుచేసి యలపు నొందియున్నవారు కాఫీనీళ్లను దేనీళ్లను ద్రాగినయెడల బడలికపోయినవారగుదురు. తేనీళ్లును కాఫీయును మత్తును గలుగఁజేసెడి పదార్థములు కావు కాఁబట్టి యవి కల్లు, సారాయివంటి మద్యములుకావు. అవి చెఱుపుచేయని పదార్థములు.

తేయాకునందు మనము వర్గములమాత్రమే ఉపయోగింతుము. కాఫీయందన్ననో, పత్రములనెల్ల బారవైచి గింజెలను మాత్రమే వాడెదము. ఇవి కాఫీకాయలలో దొఱకును.

ఒక్కొక్క కాఫీకాయలో రెండేసి గింజలుండును. కాఫీకాయలు పండినపుడెఱ్ఱగానుండి, మట్టిపండ్లంత చిన్నవిగానుండును. మట్టి పండ్లవలెనే, యివియు చెట్టుయొక్క కాడలకంటుకొని యుండును.



కాఫీగింజలు పసుపుపచ్చనివి, చిన్నవిగ నుండును. వాని సంగళ్లలో విక్రయింతురు. వానినొక మంగలములోనుంచి వేఁచినపుడవి కొంచెము మెట్టఁబాఱి మంచివాసనఁగలవగును. అప్పుడు వానిని దంచి పొడిచేయుదురు. పిదపఁ గొంచెము పొడి నొక పాత్రలో వేసి దానిమీఁద సలసలఁ గ్రాఁగు నీళ్లను బోసి యయిదు నిమిషములైన తరువాత యా నీళ్లను మఱియొక పాత్రలోనికి వడియఁగట్టినపుడు కాఫీయను కషాయమగును. కొందఱు దానితో నేమియుఁ గలపకయే దానిని త్రాగెదరుగాని సాధారణముగా ననేకులు దానితోఁ జెక్కెరను బాలను గలిపి త్రాగెదరు. ఇట్లు చేయుట ముఖ్యముగా నింగ్లండు దేశమందు వాడుకయైయున్నది.

కాఫీవిత్తనములను మొట్టమొదట మన దేశమునకుఁగొండ అరబ్బీలు పెక్కేండ్లక్రిందట నరాబియాదేశమునుండి తెచ్చి మైసూరుసీమలోని కొన్నికొండలమీఁద నాటిరి. కాఫీచెట్లి ప్పుడు మైసూరునందును, కొడగుదేశమందును, నీలగిరియం దును, శేర్వరాయకొండలమీఁదను, ఆనమలె (ఏనుగకొండలు మీఁదను విరివిగా మొలచుచున్నవి. అవి యచ్చోట లందుఁ బెద్దపెద్ద తోఁటలై వృద్ధినొందుచున్నవి.

కాఫీచెట్ల నించుమించుగా నాలేసియడుగుల దూరమున వరుసలుగా మొలపింతురు. కాఫీవిత్తులను బాఁదులలోఁ బెట్టి యా పాఁదులమీఁద నెండ తగులనీక చల్లఁగానుండునట్లు చాఁపలు కప్పపాఁదులలోఁ జాలనీళ్లు పోసెదరు. కాఫీమొక్కలు సుమారొక యడుగెత్తునఁ బెరుఁగఁగనే వానిని దీసి మఱియొకస్థల మందు నాటి వానికి విశేషముగా నెరువుఁ గట్టుదురు. ఆ మొక్కలు రెండేండ్ల యీడుగలవైనపుడు కొద్దిగాఁ గాయలు కాయ నారంభించును. అవి మూఁడేండ్ల యీడుగలవికాఁగానే సమృద్ధముగా ఫలించి యిరువది ముప్పది యేండ్లవఱకుఁ గాచు చుండును. ఆ చెట్లు మిక్కిలి యెత్తున కెదుగకుండునట్లు వాని శాఖలను గొన్నిటిని బ్రతి సంవత్సరమును గోసివేయుచుందురు. ఆ చెట్లు నీడలోఁ బెరుఁగునట్లు చేయుటకుఁ గాఫీతోఁటలలో నత్తిచెట్లు పనసలు మొదలుగాఁగల పెద్దవృక్షములను వేయు దురు. నిష్ప్రయోజనమైన చెట్లనన్నిటిని యేఁడాదికొకసారి త్రవ్వి పాఱవేయుదురు. కాఫీచెట్ల చుట్టునుండు నేలను ద్రవ్వి పదునుచేసి వానికిఁ జాలఁ బెంటయు నెముకలపొడియును జేఁప యెరువును గట్టెదరు.

చైత్ర, వైశాఖమాసములలో నారంభమగు వర్ష ఋతువునందుఁ దొలకరింపఁగానే కాఫీచెట్లింద్రజాలవిద్యవలననైనటు లొక్కసారిగాఁ బుష్పించి విరియఁబోయును. ఆ పుష్పములు మిక్కిలి తెల్లఁగానుండి మల్లెపూలవలెఁ గనఁబడుచుండును. వానికిమంచి పరిమళముఁగూడ నుండును. మూఁడు దినములైన పిమ్మట నవి రాలి పోయిపిందెలేర్పడును. అవియంతకంతకుఁ బెద్దకాయలై నవంబరు, డిసెంబరు నెలలలోఁబండి కోయుటకుఁ దగినవగును. వానినంతటఁ గోసి యొక యంత్రములో నుంచినపుడు వానిమీఁదితోలును గుజ్జును బోవ గింజెలు విడఁదీయఁబడును. ఆ గింజెలనెండఁబెట్టి గోనెలలోఁ బోసి పరస్థలముల కెగుమతి చేయుదురు. కాఫీతోఁటలు మిగుల లాభకరమైన యాస్తి. మంచి కాఫీతోఁట యొక బంగారు గనివంటిది. ఆ తోఁటలుగలవారు వానిని జేక్కఁగాఁ గాపాడుకొనిన పక్షమందు శీఘ్రకాలముననే ధనికులయ్యెదరు.

వ్యాకరణము:—'డు' కడపటగల పదములకు బహువచనమునందు 'లు' వచ్చునపుడు డు లోపించును.

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| స్నేహితుఁడు | స్నేహితులు |
| తమ్ముఁడు | తమ్ములు |
| మగఁడు | మగలు |

ఇకారాంతంబులైన పదముల కడపటి ఇకారముబహువచనమందు ఉకారముగా మారును.

వాజి—వాజులు
కాకి—కాకులు
బడి—బడులు, బళ్లు
గుమ్మడి—గుమ్మడులు

పదములు—వణిజుఁడు=వర్తకుఁడు; శతవర్షములు=నూరుసంవత్సరములు; ప్రత్యేకముగా;=వేరుగా పరిమళము=సువాసన; పరస్థలములకు=ఇతరచోట్లకు.

# 17. గారడివాండ్రు.

ఒకనాంటి యుదయమున గూడూరు గ్రామస్థులు వినోదములను వేనినైనం జూచుటకుం గుతూహలులై యున్న తఱి నూరి తలారియగు రామానాయఁడు గ్రామాధికారియగు ఆదినారాయణ రెడ్డియొద్దకుం బోయి కొందఱింద్రజాలికు లా గ్రామమునకుం గడచిన రాత్రియందు వచ్చిరనియు వారు దేవాలయపుం గోనేటియొద్దనుండు మామిడితోఁపులో విడిసియున్నారనియుం జెప్పెను. ఆ వార్త యూరివారి కందఱికి వెంటనే తెలిసెను. పసిపిల్లలు గంతులిడుచుంబోయి తమ తల్లుల కా సమాచారమును దెలిపిరి. కొందఱా గారడివాండ్రను జూచుటకు మామిడితోఁటకుంగూడం బరుగెత్తిరి. నాంటి సాయంకాలమందుం దమ గ్రామమునందు వినోదములు చేయంబడునని తెలిసికొని యాయూరి యిల్లాండ్రందఱు మునుపటికంటె వేగముగం దమ వంటలను సిద్ధముచేసికొన నారంభించిరి.

ఆ గ్రామమునకు వచ్చియుండిన గారడివాండ్రు దూరయూరికిం బోయి తమ కౌశలమును జూపి తమ యన్నమును సంపాదించుకొనుచుందురు. వారి మొనగాఁడు చేల్దియన్నమును దినినతోడనే గ్రామమునసబు (గ్రామాధికారి) యొక్క దర్శనముచేసి గ్రామస్థుల యెదుటం దామాడుటకు సెలవడిగెను. అటుపిమ్మట వాండ్రు నాంటి సాయంకాలమున మూఁడుగంటలకు వచ్చి యాడవచ్చునని గ్రామాధికారి యనుజ్ఞనొసంగెను. ఆ కాలము వచ్చుట కింకం జాల సేపుండఁగనే గ్రామమునందలి పిల్లలును బెద్దలును పంచములపల్లెలోని పంచములునుగూడ నాదినారాయణ రెడ్డిగారి యింటియొద్దకు గుంపులుగా వచ్చియుండిరి.

గ్రామాధికారియుఁ దక్కిన యూరి పెద్దలును జోపలమీఁదఁ గూరుచుండిరి. తక్కిన జనులందఱును వారి చుట్టును నిలుచుండిరి. స్త్రీలు దూరమున నొక మూలను గుమిగూడి యుండిరి. ఆ యూరిలోని పిల్లకాయలందఱొక పెద్దచెట్టెక్కి దాని కొమ్మల మీఁదఁ గాకులవలెఁ గూర్చుండిరి.

ఆ గ్రామాధికారి గారడివాండ్రాడవచ్చినని యాజ్ఞాపింపఁగనే వారి ముసలివాఁడు తన డోలును దీసికొని బిగ్గరగా వాయింప నారంభించెను. ఆ ధ్వని బహుదూరమునకు వినఁబడినందున నింక ననేకు లచ్చోటికిఁ బరుగులిడుచు వచ్చిరి. అంత నా ముసలివాఁడు గ్రామాధికారిని నితరులందఱికిని దండము పెట్టి యిట్లనెను:—"గూడూరు పురవాసులారా, నేను మన దేశమందలి ఘనులందఱియెదుట మిక్కిలి విచిత్రములగు వినోదములను జేసితిని. రంగారెడ్డి జమీందారుగారు నాకొక జరీబట్టను బహుమతిగా నిచ్చిరి. నాభార్య యిప్పుడు కట్టుకొన్న క్రొత్త కోకను రామానాయుఁడు జమీందారుగారు దయచేసిరి. నిన్నటిదినమున నేను నాయుడుపేటలో నాడిన యాటలను జూచి యా పౌరులు కడుసంతసించి నాకుఁ బ్రాఁతగుడ్డలను ధనధాన్యాదులను విశేషముగా నొసఁగిరి. నాయుడుపేట నివాసులకంటె ఘనులైన మీరందఱు నెక్కువగా దానపరులని నేనెఱుంగుదు. నా మహావినోదములను గరుణాకటాక్షముతో వీక్షించి నాకుఁ దగిన చాగముల నిండని వేఁడెద."

ఇట్లు వేఁడినపిమ్మట వాఁడు తన కొడుకులయిన యిద్దఱు బాలురను ముందునకు రమ్మనెను. వారప్పుడు వచ్చి జనులకు దండములు పెట్టిరి. అంతట వారిద్దఱు చకచకఁ గొన్ని పిల్లి మొఱములను బల్లటీలను వేసిరి.

ఆ బాలురిద్దఱొకనిమీఁద నొకఁడు నేలమీద బరుండి యొండొరులను బట్టుకొని గిఱ్ఱునఁ బొరలుచుఁ బోయినందున వారిద్దఱు నొక్క మనుష్యునివలెనే కనఁబడిరిగాని రెండు దేహములున్నటు లెవరికిని దోఁపలేదు. దానిని జూచి జనులందఱును బాగు బాగనిరి. మహమ్మదుఖాసను పెద్ద పోలీసుబంటు తన పెద్ద గడ్డమును సవరించుకొనుచుఁ "సెబాసు! సెబాసు!" అనెను.

ఆ గారడివాఁడు తరువాత చేసిన వినోద మింతకంటె విచిత్రమైనది. ఒకఁడు రమారమి రెండడుగుల పొడవుగల యొక కత్తిని దీసి యది వాస్తవమైన కత్తియే యని నమ్ముటకు



దానిని గ్రామాధికారికిఁ జూపి చేతికిచ్చెను. అంతట వాఁడు "మీరందఱీ కత్తిని జూచుచున్నారుగదా. ఇదిగో! దీనిని

మ్రింగివేసెదను" అనెను. "అది వట్టిమాట. అంత పెద్దకత్తి నెట్లు మ్రింగఁగలవు? నీవు గూడూరు నివాసస్థులను మోస పుచ్చఁ జూచుచున్నావు. ఎవరైన నంత పెద్దకత్తిని మ్రింగఁ గలరా?" అని మఱొక గారడివాఁడనెను. "నేనిట్లు చేసితినేని నాకుఁ బ్రాణోపద్రవము కలుగునని నాకుఁ దెలియును. అయిన నేమి? నా ప్రాణము నాకంత తీపికాదు. నాకు గూడూరు పురజనుల కటాక్షము లభించినఁ జాలును. నా ప్రాణము పోయినను నేను దీనిని మ్రింగక మానను" అని మొదటిగారడి వాఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్లనుచు వాఁడు చేతికిలఁబడి కూరుచుండి పైకిఁజూచుచు నా కత్తియొక్క కొనను నోటిలో నుంచుకొనెను. అంత వాఁడు దానిని సగముమట్టునకుఁ బదిల ముగాఁదన నోటిలోనికిఁ జొప్పించి తరువాత మరల దానిని బైకిఁ దీసివేసెను. దానిని జూచినవారందఱు భేష్! భేష్! అనుచు వానిని శ్లాఘించిరి. గ్రామమునసబుగారు తత్క్షణమే వానికొక రూపాయను బహుమానముగా నిచ్చిరి.

తరువాత నా గారడివాండ్రు చేసిన వినోదము మామిడి చెట్టును పుట్టించుట. వారికిఁ బెద్దయైనవాఁడొక మామిడిటెంకను తీసి సభ్యులకందఱికిఁ గనఁబఱచిన పిమ్మట దానిని నేలఁబాఁ తెను. వాఁడు దానిపైనిఁ గొంచెము నీళ్లను జల్లి యొక పళ్లె ను బోర్లించెను. కొన్ని క్షణములైన పిదప వాఁడా పళ్లెకను దీసివేయఁగా, వింత యేమని చెప్పుదు! ఆ మామిడిటెంకలో నుండి యొక చిన్నచెట్టు మొలచి దానికి రెండుమూఁడాకులు వేసి యుండెను. ఆ గారడివాఁడు దానిమీఁద మరలఁ గొంచెము నీళ్లుపోసి మరల బుట్టను బోర్లించెను. కొన్ని నిమిషములైన పిమ్మట వాఁడా బుట్టను దీసివేయఁగా, నంతలోన నా మామిడి



చెట్టు పది పండ్రెండంగుళముల యెత్తునకుఁ బెరిఁగియుండెను. వాఁడిట్లు నాలుగైదుసారులు చేసినంతలో నా చెట్టు మూఁడు నాలుగడుగుల యెత్తుఁగలదయ్యెను. జను లీ వినోదమును జూచి సంతోషభరితులైరి.

అటుతరువాత మఱియొక గారడివాఁడును వానిభార్యయును బుత్రుఁడును ముందునకు వచ్చి "ఆ సభ్యులంతవఱకుఁ జూచిన వినోదములకంటె నెక్కువ యాశ్చర్యకరమైన వింతను జూపెద" మనిరి. పిల్లవాఁడు క్రిందఁ గూరుచుండి మృదంగమును వాయించెను. ఆ స్త్రీ ముందునకువచ్చి నిలువఁగా నామె పెనిమిటి గట్టి త్రాటితో నామె కాళ్లను బాదములను బిగియఁగట్టి దాని నొక గంపలోనికి దించి యా గంపపై నొక గుడ్డను గప్పెను. కొన్ని నిమిషములకు వాఁడా గుడ్డను దీసివేసి యొక పొడుగుపాటి కత్తితో నా గంపలో నష్టదిక్కులను బొడిచెను. అంతట వాఁడా గంప



నొక తన్నుతన్ని బోర్లించెను. ఆ స్త్రీ దానిలోఁ గనఁబడక పోయెను. వాఁడు దానిని పేరుపెట్టి బిగ్గరగాఁ బిలువఁగా నది యా వీధిమూలనుండి పరుగెత్తుచు వచ్చెను.

వారియాట దీనితో ముగిసెను. దానిని జూచినవారందఱు నపరిమితానందభరితులైరి. వారిలోఁ గొందఱా గారడి వాండ్రకుఁ బ్రాఁత బట్టలను గొందఱు ద్రవ్యమును బహుమానముగా నిచ్చిరి. ఆ యూరి యిల్లాండ్రు గారడిచేసిన పిల్లకాయలకు రొట్టెలనిచ్చి తినుఁడనిరి. ఆ యూరిలోని ప్రతి గృహము వారును నొకసేరు వడ్లు నా గారడివాండ్ర కిచ్చునట్లు గ్రామాధికారి యుత్తరువు చేసెను.

ఇవ్విధమున నా గారడీండ్రు గూడూరునందు వినోదములు సలిపి సాయంకాలమున మఱొక గ్రామమునకుఁ బోయిరి. వారు వెడలిపోయిన తరువాత ననేకమాసములవఱకు నా గ్రామ

స్థులు వారినిఁ దలఁచుకొనుచు వారినిగూర్చి ముచ్చటించుకొనుచుండెడివారు.

**వ్యాకరణము:**—బహువచనమునందు 'లు' వచ్చినపిమ్మట, దానికిముందుండు అక్షరము డు, లు, రు అయినచో వాని బదులు ళు వర్ణకము వచ్చుట గలదు. త్రాడులు—త్రాళులు, త్రాళ్లు; గుమ్మడులు,—గుమ్మళులు, గుమ్మళ్లు మొగిలలు=మొగిళలు.

**పదములు.**—ఇల్లాండ్రు=స్త్రీలు; అనుజ్ఞ=ఉత్తరువు; కరుణాకటాక్షము=దయగలిగిన చూపు; వీక్షించి=చూచి; ప్రాణోపద్రవము=ప్రాణమునకపాయము; టెంక=ముట్టె; కుతూహలులు=ఇంతవఱకు అనుభవింపని దానియందు ఆశగలవారు.



# 18. చక్కెర.

చక్కెర సమస్తదేశస్థులకుఁ దెలిసిన పదార్థము. అది మన దేశములోఁగూడ వాడఁబడుచున్నది. అది యిసుకవలెఁ బొడిపొడిగానుండి యొకానొకప్పుడు ధవళముగాను నొకొక్కప్పుడు కొంచె మెఱ్ఱగా నుండును. అది మిక్కిలి మధురాహారమై యున్నది. అది మన కెట్లు లభించుచున్నదో తెలియునా?

చక్కెర యుష్ణదేశములందుఁ బెరుఁగు కొన్ని మొక్కల యొక్క రసమునుండియును యూరపుఖండమందు బీటుదుంపలనెడి కొన్ని దుంపలనుండియును జేయఁబడుచున్నది. నీళ్లలోఁ బడవేసిన చక్కెర యెట్లు కరఁగిపోయి మన కదృశ్యమగునో యట్లే యా మొక్కలరసమందును శర్కర కరఁగియుండుచు గాననది మన కన్నులకు మొదట గోచరముకాకయుండును. మన దేశమగు భరతఖండమందును, నమెరికాఖండమందును చెఱకు



గడలలోనుండి చక్కెరను జేయుదురు. ఇచ్చట వేసిన పటమందు నమెరికాఖండమందుఁ బెఱిఁగిన యొక చెఱకుపొలమున, గొందఱు మనుష్యులు గడలను గోయుటయును గనఁబఱుపఁబడియున్నవి.

భూలోకమందలి వివిధదేశములందు మొలచు చెఱకుగడలలో ననేక భేదములున్నవి. అయినను వానిలోని పరస్పర భేదము విశేషముకాదు. చెఱకుగడలు మన యిండియాలోను చీనాదేశములోను సుమారు రెండువేల యేండ్లకంటె నెక్కువ కాలమునుండి వర్ధిల్లుచున్నట్లు తెలియవచ్చుచున్నది. అవి మన దేశమందుండి పరదేశములలోఁ బ్రవేశపెట్టఁబడినవి. ఇక్షు వృక్షములను బుష్పింపనీయరుగాన నవి విత్తనములనుండి గాక కొమ్మలను నఱికి పాఁతిపెట్టుటవలన వ్యాపించెను. చెఱకు మొలకలొక్క యేఁడాదిలోఁగా నెనిమిది పదియడుగుల యెత్తునకుఁ బెరుఁగును. కొన్ని జాతు లిరువదియడుగుల యెత్తునకుఁ



గూడ నెదుగును. చెఱకుగడ తెల్లగానైనను, పసుపుదాళుగా నైనను నెఱ్ఱగానైన నుండును. దాని యాకులు పచ్చగానుండును. చెఱకుగడల కయిదాఱంగుళముల దూరమునఁ గనుపులుండును. ఆ గడలలోఁ జొప్పదంటులందువలె మెత్తని బెండుండును. ఈ బెండు బాగుగఁ బెఱఁగియున్నపు డిక్షువు రసపూరితమై యుండును. చెఱకుగడలు పుష్పింప నారంభింపఁగనే వానిని గోయుటకదియె యదనని తెలియును. అంత నవి గోయఁబడి తుండులుగా ఖండింపఁబడును.

ఆ చెఱకుతుండుల నెల్లఁ దీసికొనిపోయి పనివాండ్రు గానుఁగలలో రెండు పెద్ద శిలలనడుమనుంచి గానుఁగాడి రసమును దీయుదురు. ఆ రసమును శుద్ధపఱచుటకు దానితోఁ గొంచెము కారపుసున్నము కలిపి దానిని వడియఁగట్టి కాచెదరు. అప్పుడు దానిలోని ముఱికియంతయుఁ బైకిఁ దేలును. ఆ ముఱికి నప్పు

డప్పుడు గరిటెతో మెల్లగాఁ దీసి బయటవేయుచుందురు. ఆ రసము సలసలఁ గాఁగినకొలఁది దానియందలి జలమంతయు నావిరియై పైకెగసిపోవును గావున నా పాత్రమందుఁ జిక్కని పానకము శేషించియుండును. దానినివారు మ్రానిపాత్రలలోఁ బోసి యారనిచ్చెదరు. అది చల్లారఁగాఁ జల్లారఁగా దానిలోని చక్కెర స్ఫటికములవంటి గడ్డలుకట్టును. అట్లు గడ్డలుకట్టిన చక్కెర గోదుమవర్ణమునయుండును. దాని నింకను శుభ్రము చేయఁగా నది మల్లెపూలవంటి ధావళ్యమును దాల్చును. అదియె మొదటి రకములోఁజేరిన చక్కెర. దానినేకలిమిగలవారు వాడు కొందురు. మట్టపురకమైనది మెట్టచక్కెర యనఁబడును. బెల్ల మచ్చుబెల్లమనియు, ముద్దబెల్లమనియు రెండు విధములుగా నుండును. దానిని బీదలుపయోగించుచుకొందురు.

ఉత్తర అమెరికాయందు నిత్యవృక్షమనెడి యొక పెద్ద చెట్టునుండి చక్కెరఁ జేయుదురు. ఆ వృక్ష మెనుబది మొదలు నూఱడుగుల యెత్తునకుఁ బెరుఁగును. దానిలోని సారము చెఱకుగడలసారమువలె మిక్కిలి మధురమైనది. ఆ దేశస్థులా చెట్టుయొక్క మొద్దు నచ్చటచ్చటఁ గొంచెము నఱికి దానిలో నుండి స్రవించురసము నొక తొట్టిలో దినమునకు రెండుసారుల వంతునఁ బట్టుకొని దాని నచ్చటనే పెద్దభాండములందుంచి కాఁచెదరు. ప్రక్కపుటలో ముద్రించిన పటమందుఁ గొందఱు మనుష్యు లాలాగునఁ జక్కెరను జేయుచుండుట కనఁబడు చున్నది. రెండుమాసములకాలములో నొక్కొక్కఁడీవిధమున రెండుపుట్ల బెల్లమును జేయఁగలుగును.

మనదేశమందుఁ దాటిబెల్లమునుగూడ చేయుదురు. అది దివ్యమైనదని యెంచఁబడును.



యూరపుఖండమందుఁ జెక్కెరను విస్తారముగా భీటు దుంపలనుండి చేయుదురు. ఆ గడ్డలను జెఱకుగడలనువలె గానుఁగలోనుంచి గానుఁగ నాడక, వానిని చిన్నతుండ్లుగాఁ గోసి నీళ్లలో నూరఁబెట్టి వానిలోనుండి రసమును దీయుదురు.

మనము చెక్కెరను మితముగాఁ బుచ్చుకొన్నయెడల నది మన కారోగ్యకరమై యుండును. దానిని మనము మితముతప్పి భుజించినయెడ మన యారోగ్యమునకు భంగము కలుగును. చెక్కెర మనుష్యులను స్థూలశరీరులనుగాఁ జేయును. మన దేశస్థులు మధురాహారములను మిక్కుటముగా భుజింతురు. పిల్లలకుఁ దీపివస్తువులును మిఠాయియును బ్రియతమములు. వారి తల్లిదండ్రులిచ్చెడి పదార్థములనుమాత్రమే వారు తినవలెను, మఱి వేనినైనను ముట్టరాదు.

**వ్యాకరణము:**—నామము తెలియజేయబడు వస్తువు, ఒకటియా, అనేకమా అని చెప్పునది వచనమంటిమి. అట్లే వస్తువు మగదియో, ఆడుదా అని తెలుపునది లింగము. తమ్ముడు అనునది మగవానిని తెలుపునా? ఆడుదానిని తెలుపునా? మగవానిని. తమ్ముడు అను పదము పుంలింగము.

అల్లుఁడు అనునది మగవానిని తెలుపునా? ఆడుదానిని తెలుపునా? మగవానిని. అల్లుఁడు అను పదము పుంలింగము. మనుష్యులలో మగవానిని తెలుపు పదము పుంలింగము.

**పదములు.**—ధవళముగాను = తెల్లగాను; మధురాహారము = తియ్యని తిండి; గోచరముగాక = అగుపడక; ఇక్షువు = చెఱకు; ధావళ్యము = తెలుపు; స్రవించు = కాగు; ప్రియతమము = మిక్కిలి ప్రియమైనవి; రసపూరితము = రసముతో నిండినవి; స్థూలశరీరము = మిక్కిలి లావయిన దేహము.



# 19. అంగడివీధి.

కర్నూలుజిల్లాయందు నందియాలయను పట్టణమొకటి కలదు. అచ్చటనొక పాఠశాలయందు జోగయ్యయను బాలుడు నాల్గవ తరగతియందుఁ జదువుచుండెను.

అతనికిఁ బుస్తకపఠనమునందు శ్రద్ధ తక్కువ. తోడిబాలురు పుస్తకముల నెదుటఁ బెట్టుకొని వల్లించుచుందురుగాని యితఁడు వనములలోఁ జెవులపండువుగ గానము సేయు పక్షులఁ జూచుటయందును, వాని గూళ్లను బరిశీలించుటయందును, వాని గ్రుడ్లను గూఢముగాఁ దెచ్చుటయందును, వనములయందలి పుష్పవర్గములఁ జూచి వెఱఁగుపడి యా పువ్వులఁగిల్లి చేతఁ బెట్టుకొని, వాని సౌందర్యమును గని యానందించుటయందును ప్రియముగొని యుండెను.

అయిదు గంటలు కాఁగానే బడి గంట కొట్టెను. మరుసటి దిన మాదివారమగుటచే నది విరామదినమని బాలురందఱు కోలాహలధ్వనులు చేయుచుండిరి. కొందఱువిహారభూములకేగి త్రొక్కుడు మున్నగు నాఁటలనాఁడఁగడఁగిరి. కొందఱిండ్లకేగు చుండిరిగాని, జోగయ్యమాత్రము వెనుక నిలచి, యుపాధ్యాయునిఁ గాంచి యిట్లనెను. "అయ్యా! కడచిననెల మమ్ము వరిపొలములకు పిలచుకొనిపోయి వరిపైరును జూపి, యాపైరు పెట్టు విధమును బోధించితిరి. వీలుగలిగినప్పుడు దుకాణము లకుఁ దోడ్కొనిపోయి కాయధాన్యములఁజూపి వానింగుఱించి కొన్ని విషయములు బోధించెదమంటిరి. రేపు విరామముగదా? ఉదయమున నంగడికి వెంటఁబెట్టుకొనిబోయెద రా."

ఉపాధ్యాయుఁ డందులకు సంతసించు 'మంచిది. అలాగే' యని దేహపరిశ్రమకై విహారభూములందు విహరించుచున్న బాలురనుబిలిచి "మీరందఱు రేపుదయమున నెనిమిదిగంటలకుఁ బాఠశాలకడకు వచ్చిన మిమ్ముసందఱను బాజారుకుఁ దోడ్కొని వెళ్లి యచ్చట గాయధాన్యముల జూపెదను" అనెను.

మరుసటిదినము వారందఱుచేరి యుపాధ్యాయుని వెంట విపణివీధి కేగిరి. అచ్చట సూర్యోదయమగునప్పటికి సమీప గ్రామములనుండి కృషికులు రెండెద్దులబండ్లనుండి కాయ ధాన్యపుమూటలు దింపి రాసులురాసులుగఁ బోయుచుండిరి. ఆ రాసులలో నొకదానినుండి చేరెడుధాన్యము నెత్తి యుపాధ్యాయుఁడు బాలురకుఁ జూపి 'దీని పేరే'మని వారి నడిగెను. జోగయ్య వెంటనే 'అవి జొన్నలుగదా' యని చెప్పెను.

ఉపాధ్యాయుఁడు.—ఇవి మెట్టపంటలలోఁ జేరినవి. మన దేశమువారు దమ యాహారమునకై బియ్యపన్నమునేగాక,



జొన్నలు.

జొన్న సంకటియుఁ దిందురు. కనుక, బియ్యమునువలె మనదేశమున జొన్నలను నెక్కువగా వాడుదురు. వడ్లయందువలెనే జొన్నలయందును పెక్కు తెగలున్నవి. ఇవి తెల్లజొన్నలు. సత్తువగల నల్లరేగడనేలయందే జొన్నలు చక్కఁగాఁ బండును. ఇది మెట్టపంట గనుక వరిపైరుపంటకు వలయునంత నీరు దీనికక్కఱలేదు. వరి మాగాణిపైరు, జొన్న మెట్ట (మెఱక, పుంజ) పైరు. మెట్టధాన్యమునకంత నీరు కట్టవలసిన పనిలేదు.

భాద్రపదాశ్వయుజమాసములయందు వాన బాగుగాఁ గురిసి, కార్తికమాసమున నప్పుడప్పుడు కొంచెముగా వాన కురిసినను నీ పైరు విశేషముగా ఫలించును. పొలములలో బావులు త్రవ్వి యనేకులు నీరు పాఱించి జొన్న పైరుచేయుచున్నారు.

నేలను మూఁడు నాలుగంగుళములు త్రవ్వినఁ జొన్నదంటు

పొడుగుగాఁ బెరుగును. జొన్న దంటును మీరు చూచియున్నారా? ఆ చేనికిఁ బోయి చూడుఁడు. కొన్ని దంట్లు మిగుల తీపు గనుక పూఁతపట్టినది మొదలుకొని జొన్న చొప్పను చెఱుకువలెఁ దినెదరు. జొన్నపైరు పండఁగానే పొలముమీఁద నయిదాఱంగుళములు విడచి దంటులను గోయుదురు.

జొన్న కోసినతోడనే చొప్పను పొలముమీఁద మూఁడు దినములకు తగ్గక, యేడుదినములకు మించక యెండ నిత్తురు. పిమ్మట దీనిని కట్టలుగాఁ గట్టి నిలువఁబెట్టి గూడుకట్టుదురు. ఇట్టి గూళ్లను జొన్నపొలములందుఁ జూడవచ్చును.

నుఱుచుటకుఁ బదునుగ నుండునప్పుడు కంకులన్నిటిని గోసి కళ్లముమీఁదఁ బలచేనగా నెండనిచ్చి, పశువులను బంతులు గట్టి త్రొక్కించెదరు. కొలఁదిగఁ బైరుపెట్టువారు కంకులను బడితెలతోఁ గొట్టి గింజెలను వేఱుచేయుదురు.

తర్వాత జొన్నగింజెలను బ్రోగుచేసి తూర్పాఱఁబెట్టి యింటికిఁ దెత్తురు. అట్లు తెచ్చిన జొన్నను రెండు మూఁడు నెలలు పాతరలో వేసి తర్వాత నాహారమున కుపయోగించిన నది యారోగ్యకరముగనుండును. కొండవీటిసీమవారికి జొన్నలే ముఖ్యాహారము.

జొన్న మనుష్యులకేగాక పశువులకుఁగూడ రుచ్యమైన యాహారము. మన రాజ్యములోఁ బెక్కుచోట్ల నల్లజొన్నను నిస్సారపు భూమియందైనను జల్లి పశువులమేతకై విశేషముగ సాగుఁబడి చేయుచున్నారు.

పచ్చి జొన్నదంటు పశువులకు శ్రేష్ఠమైన మేఁత. వరిగడ్డి కంటె జొన్నచొప్ప మేటి యాహారమగుటచే వరికంటె

జొన్నయే ముఖ్యమైన పంటయని కొందఱు రైతులాపెరుసే వృద్ధిచేయుచున్నారు.



మొక్కజొన్న.

జోగయ్య— మొక్కజొన్న లివియేగదా?

ఉపాధ్యాయుఁడు— దానికిని దీనికిని భేదము కలదు. మొక్కజొన్న కంకులను బజారులోఁ జెఱకునమ్మునట్లమ్మెదరు. దానిని నీవు జూచియుండలేదా?

జో.—దానిని జూచియున్నాను. మొక్కజొన్న గింజే యీ జొన్నగింజకంటెఁ బెద్దది.

ఉపా.—మొక్కజొన్నలలోను పెక్కు తెగలున్నవి. అమెరికాయను దేశమొకటి మనదేశమునకు చాలదూరమున నున్నది. అచ్చట మనము చూచే దొరలవంటి జాతివారు నివసించు చున్నారు. అమెరికాదేశస్థులు మొక్కజొన్నను విశేషముగాఁ బైరుజేయుచున్నారు. మనదేశములో మొక్కజొన్న పైరు సాధారణముగాఁ బదియడుగులకంటె నెత్తుగఁ బెరుగదు. ఆ దేశములో నిది పదునైదు పదునాఱడుగుల యెత్తునగూడఁ బెరుగును. కంకులందుఁ బెద్దగింజేలుండును. పెక్కు గింజేలు

బంగారువన్నె గలిగినట్లుండును. ఆ దేశస్థులు మొక్కజొన్న చొప్పను విశేషముగాఁ బశువుల మేఁతకుపయోగించుచున్నారు. మొక్కజొన్నను బిండిగాఁ జేసి, పరిశుభ్రము చేసి, డబ్బిలలో బోసి, యితర దేశములకెగుమతి చేయుచున్నారు. ఈ డబ్బిలను గొని మందుతో పాటు మనము రోగుల కుపయోగించుచున్నాము. మన పిల్లకాయలు మొక్కజొన్న కంకిని కాని, కాల్చి యాగింజలను దినుచున్నారు. కొందఱు పిండిగా విసరి రొట్టెలను జేసి భుజింతురు.

## సజ్జలు.

ఇదిగో చూడు సజ్జరాశి. సజ్జలకును జొన్నలకు నేమి భేదమో చెప్పుము. ఇదియు జొన్నలవలె మెరకపంటయే. స్వల్పవర్షముగల స్థలములయందు నిది చక్కగా ఫలించును. ఇది పండుటకు భూమి సారవంతముగా నుండ నక్కఱ లేదు. నీరింకి పొడియైన నేలలోను దీనిని పండింతురు. కంకులు పాలు పోయుసమయములందు వర్షము మిక్కుటముగఁ గురిసినా, పాలన్నియుఁ గొట్టుకొనిపోవుటచే పంట తక్కువయగును.

జొన్నపైరుఁ గోసి, యెండబెట్టి, కట్టలుకట్టి గూళ్లువేసి, వాని కంకులు కోసి యెడ్లతో నెట్లు త్రొక్కింతురో, అట్లె సజ్జ దంటులనుండి ధాన్యమును వేఱుచేయుదురు. సజ్జలు విలువగల భోజనపదార్థము. సజ్జయన్నము దేహమునకుఁ జలువ. పైరు పండువఱకు దంటుఁ గోయరు. కనుక సజ్జదంటు పశువులకుఁ బనికిరాదు. సజ్జదంటు నమలుట కష్టము. కనుక దీనిని నిండ్లపై గప్పుదురు. ఇది యొక సంవత్సరమునకుఁ బైనఁ జెడిపోవును.

## రాగులు.

ఇవిగో రాగులు. వీనిని 'చోళ్లు' అని యందురు. ఈ గింజ

లెంత చిన్నవిగా నున్నవో చూడుఁడు. ఇది మెట్టధాన్యము. చలియును మంచునుగల దేశములలో నిది చక్కఁగాఁ బెరుగును. వరి కోసినపిదప భూమిని దున్ని రాగి పైరుపెట్టుదురు. వానకాలములోఁ గొంతకు రాకుండునట్లుల యదనుచూచి నాఁటుదురు. బాపులు త్రవ్వుకొని అందుండు నీటినిఁ బొలమునకుఁ బాఱించి రాగి పైరుపెట్టుదురు.

పెక్కుజనులు రాగులను విసరి సంకటిచేసికొనియైనను, అంబలిగాఁ గాచియైనను నాహారముగా నుపయోగింతురు. రాగులు మిగుల సత్తువగలవి. కనుక దీని పై పొట్టును దీసి యెక్కువ వెలకమ్ముదురు. రాగినంటు తియ్యగానుండుటచే శిశువులు దానిని బాగుగాఁ దినును. 'పైరునకు రాగులు, భాగ్యమునకు గొట్టెలు' అని చెప్పట కలదు.

ఆరికలు

ఇవి ఆరికలు. వీనిని సామాన్యపునేలలయందుఁ జల్లి పైరు పెట్టవచ్చును. తక్కిన యే పంటలకుఁ బనికిరాని నేలయందున దీనిని బైరుపెట్టుదురు. నెలవఱకు నీరు లేకుండినను నీ పైరు చెడదు. ఈ ధాన్యమునకుఁ బైనఁ బొట్టు విస్తారముగనుండును. బూడిదతో బంకమట్టిని గలిపి తిరుగలికిఁ బూసి విసరిన, పొట్టు విడును. ఆరికయన్నము దేహమునకు మిక్కిలి కాకచేయును. క్రొత్తగా తినువారికి కడుపునొప్పి కలుగును. ఆరికగడ్డి పశువులకు మంచి మేఁతగాదు. 'ఆరికచేల్లిన రెడ్డికి, ఆలూమగనికి ఒకటే చీర' యని సామెత కలదు.

కొఱ్ఱలు.

ఇవిగో కొఱ్ఱలు. ఈధాన్యము సజ్జలు, రాగులకంటె శ్రేష్ఠమయినది. ఎట్టి మిట్టనేలలందు నిది ఫలించును. కొన్ని జిల్లాల

యం దిదియే ముఖ్యమైన భోజనపదార్థము. పిండి మిక్కిలి రుచిగలది. రేగటినేలయందీ ధాన్యమును గొందఱు పండింతురు. అది మిగుల మృదువుగానుండును. కొఱ్ఱలను బాతరలోఁ బోసియుంచిన రెండుమూడేండ్లు చెడకయుండును. కొఱ్ఱకసవు పశువులకు మంచి మేఁత. కోళ్లకు మంచి తిండి. పాడిగేదెలకు కొఱ్ఱలను బెట్టెదరు.

వానతో కరువు లేదు. పెనిమిటితో దారిద్ర్యము లేదు.

**పదములు.**—గూఢముగా = రహస్యముగా; విరామదినము = ఆట విడుపు; దుకాణము=అంగడి; బోధించితిరి=చెప్పితిరి; కృషికులు=రైతులు; బడితె = కొయ్య; పరిశ్రమము = అలవాటు; సామాన్యము=సాధారణము; సౌందర్యము=అందము; విపణివీధి=అంగడివీధి; విహారభూములు=వేడుకగాఁ దిరుగుచోట్లు.

**వ్యాకరణము:**—అయ్యా! కడచిన నెల మమ్ము వరిపొలములకుఁ బిలుచుకొనిపోతిరి. 'అయ్యా' అనునది యే విభక్తి? ఈవాక్యములో కర్తయేది? 'వరిపొలములకు' అను జవాబు వచ్చుటకే ప్రశ్న వేయవలెను. క్రిందివాక్యములఁ బూర్తిచేయుము.

వరిపొలమునకు నేను———. నీవు పోవు———. వాఁడు పోవు———. మేము పోవు———. మీరు పోవు———.

# 20. త్రాఁచు పాము.

పాములన్నిటిలోఁ ద్రాఁచే మిక్కిలి ప్రాణహానికరమైనది. అది ముఖ్యముగా మనదేశమందలి యుష్ణభాగములందగపడును. చలిగానుండు పర్వతములమీఁదఁ ద్రాఁచులుండవు.

సర్పములకుఁ గాళ్లు లేకపోయినను నేలమీఁద మిక్కిలి వేగముగాఁ బాఱి చెట్లనుగూడ నెక్కఁగలవు. అవి యిట్లు చేయఁగలుగుటకుఁ గారణమేమనఁగా, వాని దేహము పొలుసు



లనెడి చిన్న చర్మపు ముక్కలతో నిర్మితమయి యుండును. వాని సాహాయ్యమువలన నురగములు తమ దేహమును దాము నేల మీఁద నీడ్చుకొనుచుఁ బోవఁగలుగును. అద్దమువంటి మిక్కిలి స్నిగ్ధముగానుండు వస్తువులమీఁద నవి కదలనైనను గదలఁజాలవు.

త్రాఁచునకుఁ గోపము వచ్చినప్పుడది తన శిరము నేలపై నుండి యొకటి రెండడుగుల యెత్తున కెత్తి తన మెడమీఁదనుండు పడగను విప్పును. ఆ పడగమీఁద రెండు నేత్రములవలెనుండు మచ్చలుండును. వాని మధ్య నొకనల్లని చారయుండును. ఆ మచ్చలును చారయును సులోచనముల జోడువలె నగపడును.



విషసర్పములన్నిటియొక్క నోటిలోఁ బైదౌడయందు రెండు పెద్ద కోఱలుండును. వాని వెనుక పార్శ్వమందు విషపూరితమైన చిన్న తిత్తులుండును. పాము కఱచినపుడా విషము దాని దంష్ట్రలనుండి జాఱివచ్చి గాయములోఁ బ్రవేశించును.

త్రాఁచుయొక్క కాటున కౌషధములేదు. పాముకఱచిన భాగమును దత్క్షణమే వాఁడిగలకత్తితోఁ గోసివేయుటయైనను లేక గాయమును యెఱ్ఱఁగాఁగాల్చిన యినుమునుగాని యెఱ్ఱఁగాఁ గాలుచున్న నిప్పునగాని చొప్పించి యచటి మాంసమును గాల్చివేయుటయైనను మాత్రమే ప్రాణమును గాపాడుటకు సదుపాయములు. ఇట్లు చేయనిపక్షమునఁ గఱవఁబడినవారు మృతి నొందక మానరు.



సర్పములకు చెవులున్నట్లు పైకి కనఁబడవు. కాని యది చక్కఁగా వినఁగలదు. పాములవాఁడు నాగస్వరమునూఁదు నపుడు నాఁగుఁబాము తన నెత్తి యాందోళనము చేయుచుండును. అది యా గానమును వినుచుండునపుడు కఱవదు. పాములవాఁడు సాధారణముగాఁ దాను పెంచెడి ఫణులయొక్క కోఱల నూడఁబెరికివేయునుగాన నవి యెవరిని గఱవఁజాలవు.

సర్పములు భూమిలోని బొక్కలందు నివసించును. వానికిఁ బుట్టలు దొరకనేని యవి యితర వాసస్థానములలోఁ దూఱి నివసించును. సర్పములకుఁ బాలు మిక్కిలి ప్రియమైన యాహారము. అవి కప్పలను, పక్షులను, పక్షులగ్రుడ్లను, దిని బ్రదుకును. మిక్కిలి పెద్దపాములు కొన్ని జింకలను నెడ్లనుగూడఁ జంపి మ్రింగఁగలవు. అట్టి పాములడవుల యందు నివసించును.



ముంగిసయను జంతువొక్కటిమాత్రమె త్రాఁచునకు వెఱవనిది. ఈ చిన్నజంతువు నిర్భయముగాఁ ద్రాఁచును బట్టుకొని చంపఁగలదు. ముంగిసను మచ్చికచేసికొని యింటిలోనైనను దోఁటలయందైనను విడిచిపెట్టుకొన్నయెడల నచ్చటఁ బాముల వలని భయముండదు.

వ్యాకరణము:— 'చెల్లెలు' అను పదము మగవానిని తెలుపునా? ఆడు దానిని తెలుపునా? ఆడుదానిని. 'చెల్లెలు' అనుపదము స్త్రీలింగము.

కోడలు అనునది యటులే స్త్రీలింగము. మనుష్యులలో ఆడుదానిని తెలుపు పదము స్త్రీలింగము.

పుంలింగము, స్త్రీలింగము అను భేదము దేనినిబట్టి యేర్పడుచున్నది? ఉదాహరణములనిండు.

ఈ క్రింది పదములలో పుంలింగములను, స్త్రీలింగములను ఏర్పఱచునది అన్న, రాజు, కూతురు, మఱది, తండ్రి, చెలికత్తె, రాణి.

పదములు.— ప్రాణహానికరమైనది=ప్రాణమునకపాయము కలుఁగఁజేయునది; నిర్మితము = చేయఁబడినది; ఉరగములు = పాములు, ఫణులు, సర్పములు;

స్నిగ్ధముగానుండు=నునుపుగానుండు; దంష్ట్రిలు=దంతములు; పండ్లు=కోఱలు; ఆందోళనము = నాట్యము.

# 21. నీళ్లు.

పదార్థములెల్ల సామాన్యముగా మూడు విధములుగా నుండును. కొన్ని ఱాతివలె గట్టిగానుండును. మఱికొన్ని నీటి వలె పాఱుచుండును. ఇంకను కొన్ని గాలివలె నుండును. వీనిలో మొదటి తరగతిలో చేరినవి ఘనపదార్థములనఁబడును. రెండవ తరగతివి ద్రవపదార్థములనియు, మూఁడవతరగతివి వాయు పదార్థములనియు చెప్పఁబడును.

నీరు ద్రవపదార్థము. అది యొకచోటినుండి మఱియొక చోటికి ప్రవహించును. ఇందువలననే భూమియందు దేశ్లు మొద లయిన యేర్పడినవి. నీళ్లు ఎత్తైనప్రదేశమునుండి పల్లపుచోట్లకే పాఱును. దీనిని నీవు సులభముగాఁ బరీక్షింపవచ్చును. ఎచట నైన మేడమీఁద నొక చెంబెడునీళ్లను దొర్లించితివేని యవి తమం తటతామే క్రిందికి పోవుచున్నవిగదా? వర్షములు కురిసినప్పుడు నీళ్లంతయు గాల్వలుగట్టి నిమ్నప్రదేశములయందుండు చెఱు వులలోనికిఁ బాఱుటకు మీరు చూచియేయుందురు.

పరిశుభ్రమైన నీరు చప్పగా రుచిలేకయుండును. కాని మనము త్రాగెడు నీరట్లుగాక, తియ్యగనో, యుప్పగనో యుం డును. దీనికి కారణము నీకు తెలియునా? నీవు కొంచెము వాన నీటిని రుచిజూచినపక్షమున, నది చప్పగానున్నట్లు నీకు తెలి యునుగాని, ఆనీరే, భూమిమీఁద ప్రవహించి, చెఱువులలో జేరినపుడు త్రాగుటకు రుచ్యముగానుండును. ఇందుచే మన

కేమి తెలియును? నీరుస్వతస్సిద్ధముగా రుచిలేనిదనియు, భూమిలో నుండు మంటితో గలసినపుడు తీవు, ఉప్పు మొదలైన గుణములఁ బొందుననియు తెలియుచున్నది. సారవంతమైన రేగటినేల యందుఁ బ్రవహించు జలము మధురముగానుండును. చవిటి నేలయందుఁ బారునీరు జవ్వలుగానుండును.

భూమిమీఁద వర్షము కురిసినపుడు దానిలోఁ గొంత భాగము భూమిలో నింకును. ఆలాగున భూమిలో నింకుచుండు జలమునకు గట్టిఱాతినేలయైనను రేగడనేలయైన నడ్డము వచ్చెనేని యది వానిలోఁ జొరలేక యచ్చటనే కూడి యొక మడుగు వలె భూమిలోపలనుండును. మన మెచ్చోటనైనను బావిని ద్రవ్వినపు డట్టి నీళ్లే యూటగా నగపడును. అట్టి నీళ్లనే మనము చేఁదలతో నూతులలోనుండి చేదుకొనుచున్నాము. భూమిపైని వర్షరూపమునఁ బడు నీళ్లలోఁ గొంత భూమిలోనికినింక కభూమ్యుపరిభాగముమీఁదనే పాఱుచుండును. ఇట్టి జలమునే మనము నదియనియు నేఁటియనియుఁ జెప్పుచున్నాము. ఇట్టి నీరు పల్లమునఁ బ్రవహించుచుండునపుడు మఱికొన్ని యేళ్లనుగలియు నంతకంతకుఁ బెద్దప్రవాహమై తుదకు సముద్రములోఁ బడును. వర్ష జల మొకానొకప్పు డేపల్లములోనికైనను బాఱి దానినిండ నుండును. అట్టి నీళ్లుగల పల్లమునకుఁ దటాకమని పేరు. మనము త్రాగెడి మంచి నీళ్లు మనకట్టి నూతులు బావులు చెఱువులు మడుగులు నదులు ననువానివలనను గొలఁకులవలనను దొరకుచున్నవి.

మనము త్రాగుటకు మిక్కిలి యోగ్యమైన యుదకము కొన్నిలోఁతు నూతులందు దొఱకఁగలదు. ఒకానొకప్పుడు జనులు ప్రాలుమాలి మురికినీళ్లను నూతులలోనికిఁ బాఱనిచ్చుటవలన

బావినీళ్లుకూడఁ జెడిపోయియుండును. కొన్ని నూతుల చెంతనే చెట్లు పెరిఁగి యుండునుగాన వాని యాకలును లా నూతులందుఁ బడి కుళ్లి వాని జలములను జెఱుచును. ఒక్కొక్కప్పుడు కొందఱు మనుష్యులు తమ మురికిబట్టలను నూతులయొద్ద నుదికికొనెదరు; కాన నాబట్టలలోని మురికి యూ నూతులోఁ బ్రవేశించి నీళ్లను జెఱుచును. కొన్ని సమయములందు జనులు కశ్మల పదార్థములను నూతులయొద్ద నుండ నిచ్చెదరు; గావున నట్టి మురికి వానకాలమందు భూమిలోఁజొచ్చి నూతులందలి నీళ్లను జెఱుచును.

మనము మన నూతులలోని నీళ్లు పరిశుద్ధముగా నుండవలెనని కోరిన పక్షమున, వానిలో మురికి నీళ్లు పడకుండునట్లు మనము వానిచుట్టు నొక చిన్నగోడను గట్టవలెను. మఱియు నా నూతులచుట్టునుండు భూమి కొంతమేరవఱకు మిక్కిలి శుద్ధముగా నుండునట్లు చేయవలెను. ఇదియుఁ గాక మనము నూతులపైని బలకలను బిగించి వానిలో నొక తలుపును జేసి యుంచి కొని నీళ్లను దోడుకొనని యప్పుడా తలుపును మూసివేయవలెను. బావులలోఁ బక్షులు గూఁడులు గట్టుకొననీయరాదు. త్రాగుట కుపయోగింపఁబడు నీళ్లుగల యే నూతి యొద్దఁగాని జనులు స్నానాదులను జేయరాదు; బట్టల నుదుకను గూడదు. అట్టి నూతులపైనిఁ జెట్లకొమ్మల నుండనియ్యరాదు. నీళ్లుతోడుట కుపయోగింపఁబడెడి పాత్రలు శుద్ధముగా నుండవలెను. నూతులనన్నిటిని జను లేడాదికొకసారియైనను శుద్ధము చేసికొనుచుండవలెను.

నదీతీరవాసులు తఱచుగా నదులలోని నీళ్లను బాడుచేయుచుందురు. నీళ్లలోఁ గొట్టుకొనిపోవునని వారు సాధారణముగా

నదులలో సకలవిధములైన మురికివస్తువులను బాఱవేసెదరు. వారు నదులలో స్నానములు చేయుచురు. ఒక్కొక్కప్పుడు వారు నదులదగ్గరనే లఘుశంకను గురుశంకను బోయెదరు. కొన్ని స్థలములందు శవములు సయితము నదులలోఁ బాఱవేయఁబడుచున్నవి. ఇన్ని విధముల నదులలోని నీళ్లు చెఱుపఁబడుచుండుటను గాన వానిని త్రాగరాదు. నదీతీరములకడ నూతులను త్రవ్వినయెడ నదీజలములు భూమిలోనుండి వానిలోనికి నూరి కొంతమట్టునకుఁ బరిశుద్ధముగా నుండును.

చెఱువులందలి నీళ్లు సాధారణముగా మిక్కిలి మురికిగనై యుండును. జనులు వానిలోనే స్నానాదులను జేయుదురు; వారు వానిలోనే దంతధావనము జేసి నోటను నీరు గుక్కకొని యుమియుచుందురు. వారు వానియందే తమ బట్టలను నంట్లను గడుగుకొని పశ్వాదులనుగూడఁ గడుగుచుందురు. అయిన నట్టి యుదకమునే వారు త్రాగెదరు. ఇట్లు చేయువారికి వ్యాధులు రాకమానవు.

మనము త్రాగఁదగిన మంచినీళ్లుగల నూతులేవియు లేక, మనకుఁ జెఱువులే యున్నచో, మనము శుద్ధోదకములకొఱకొక చెఱువును ప్రత్యేకముగా నుంచుకొని మఱియే చెఱువునందైనను స్నానాదులను బట్టలనుదుకుకొనుటలోనగు పనులను జేయుచుండవలెను. గ్రామస్థులందఱు నైకమత్యముగలవారై యుండి, యొక చెఱువునందలి నీళ్లను త్రాగుటకొఱకు శుద్ధముగా నుంచుకొనుటకుఁ దీర్మానించుకొనుటయుక్తము. అట్టి చెఱువులోని నీళ్లు పైఁజెప్పఁబడిన యేవిధమునైనను మురికికాకుండునట్లు వారు జాగ్రత్తపెట్టుకొనవలెను. తమ గ్రామమునొద్దికొక పెద్దపులి వచ్చెనేని వారందఱు నేకమై దానిని బాఱఁదోలి

వేయుదురుగదా. అయినను బెద్దపులి కొన్ని పశువుల నొక రిద్దఱు మనుష్యులను మాత్రమే చంపఁగలుగునుగాని, మురికి గానుండు చెఱువునందలి యపరిశుద్ధమైన నీళ్లు గ్రామస్థులనంద ఱిని వ్యాధిగ్రస్తులనుగాఁజేసి యనేకులపై జ్వరములు మొదలగు పీడలను బంపి వారిని తుదకుఁ జంపఁగలుగును.

నీళ్లను శుద్ధపఱుచుటకు బాగుగాఁ గాఁచుటయే మిక్కిలి మంచిపద్ధతి. అపరిశుద్ధమైన నీళ్లలో నొక్క బొట్టునందైన నదృశ్యములగునట్టి యతిసూక్ష్మజంతువులు వేనవేలుగా నుండును. నీళ్లను గాఁచుటవలన నట్టి చిన్నజంతువులన్నియుఁ జచ్చిపోవును. వేఁడినీళ్లు త్రాగుటకు బాగుగనుండవు గనుక కాఁచిన నీళ్లను మనము త్రాగకమునుపు చల్లార్చుకొనవలయును. మన చుట్టు పట్టులందే వ్యాధియైనను వ్యాప్తమైయున్న యెడల మన మెల్ల ప్పుడును నీళ్లను గాఁచుకొని త్రాగుట యత్యావశ్యకము.

వ్యాకరణము:—మగది, ఆడుది అను భేదములేని వస్తువుల పేళ్లునపుంసకలింగములు. చెట్టు, గుట్ట, కొండ, గోడ.

మృగముల పేళ్లకును, పక్షుల పేళ్లకును లింగభేదములేదు. పోతువు తెలియజేయు పదముగాని; పెంటిని తెలియజేయు పదముగాని నపుంసకలింగములే. 'ఎద్దు' అను పదము మగదానిని, 'ఆవు' అనుపదము ఆడుదానిని తెలిపినను నపుంసకలింగములే.

పదములు.—నిమ్నప్రదేశము = లోతైనచోటు; ఉపరిభాగము = పైభాగము; శవములు = పీనుగులు; వ్యాప్తమై = వ్యాపించి.

## 22. దామను, పిథియసు.

ఐరోపాఖండములో సిసిలీద్వీపమునకు రాజైన డియోనిసి యనువాఁడు తన రాజధానియగు సైరక్యూసుపట్టణమున

బాలించుచుండెను. అతఁడు మిక్కిలి క్రూరుఁడై, తన ప్రజల నధికముగా కాఱించుచుండెను. నిరపరాధుల దండించుటయు, నపరాధుల మన్నించుటయు నతనికిఁ జాల ప్రీతికరము.

ఒకానొకప్పుడు దామను అను తత్త్వజ్ఞుఁడతని యాగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. అందుచే రాజతనికి మరణదండన విధించి, తన పురియగు సైరక్యూసులోనే యతని నురిదీయునట్లు శాసించెను. దామను పొరుగూరివాఁడు. అతని భార్యపుత్రాదులును, అనుగుబంధుగులును తన యూరియందుండిరి. అతని యాస్తిగూడ నచటనేయుండెను. అందుచే నతఁడు రాజును గాంచి ‹‹ రాజా ! నే నెట్లును చనిపోవుట సిద్ధము. కాని, మావారిచట లేరు. నేను మా యూరికిఁబోయి వారిని సందర్శించి, వారి వలన సెలవు పుచ్చుకొని తిరిగి వచ్చెదను. దాని కానతిండు ’’ అని వేఁడెను.

అందులకా క్రూరుఁడగు రాజిట్లనియె. ‹‹ ఓయీ ! నీవు బోయినచో మరలివత్తువని యెట్లు నమ్మకము. నీకు బదులుమఱియొకని నైనబెట్టి నీవు రానిచో నతఁడు శిక్షబొందునట్లు లొప్పించితివేని, నీవు బోవచ్చును.’’

దామను మిగుల చింతాక్రాంతుఁడయ్యెను. తనకెవ్వరైనను శిక్షబొందుట కొప్పుకొనెదరని అతఁడు నమ్మలేదు. అందుచే నతఁడు తన బంధువులు జూచు నాస విడిచిపెట్టెను. కాని, పిథియసనువాఁడు దామనునకు ప్రాణస్నేహితుఁడు. అతఁడు రాజును సమీపించి ‹‹ అయ్యా! దామనునుఁ బోనిండు అతఁడు వచ్చువఱకును నేనతనికి బదులుండెద’’ ననెను. రాజు దామనునకు బో సెలవిచ్చెను.

పిమ్మట దామను బదులు పిథియసును బందెగా నుంచిరి. ఉరిదీయుటకు నియమింపబడిన దినము వచ్చెను. ఇంకను దామను రాలేదు. ఈ వార్త విని, రాజు పిథియసునందు కారాగృహము నకు బోయి ''ఓయీ! నేఁడే నియమితదినము. ఇప్పటికిని నీ నెచ్చెలి రాలేదుగదా! ఏమి చేసెదవు?'' అనెను.

అందుకాతఁడు ''అయ్యా! దామను ఇంకను రాకపోవుటయే నా యభీష్టము. అతఁడు వచ్చిన నతని నురిదీయుదురు. దానికి నేనోర్వఁజాలను. నేను చనిపోయి నా ప్రాణస్నేహితుఁడు బ్రదుకుటయే నేను కోరునది'' అని ప్రత్యుత్తర మిచ్చెను.

సాయంకాలమయ్యెను. ఇంకను దామను రాలేదు. ఊరి వారందఱును పిథియసునందు దయగలవారై, యతనికేమిదుర్గతి రానున్నదో చూతమని యురిదీయు స్థానమునకు వచ్చిరి. తడసిన దామను వచ్చునేమోయను భయముచే పిథియసు నురిదీయువారిని త్వరపెట్ట నారంభించెను. పిథియసుకు మెడచుట్టు నురివేసి, హంతకు లురి బిగింపబోవుచుండిరి.

ఆసమయమున దూరమునుండి ''డుగుఁ గుగు''మని పెద్ద ధ్వని వినఁబడెను. అచటివారందఱు నాశ్చర్యమగ్నులై యా వైపునఁ జూచిరి. అపుడు దేహమంతయుఁ జెమ్మటలుగ్రమ్మ, గుఱ్ఱము నెక్కి దామను మిగుల వేగముతో వచ్చెను. అతఁడు వచ్చిన వేగమునకు గుఱ్ఱము సొక్కిపడి నోట నురుగులగ్రక్కెను. దామను పరుగిడుచుపోయి తన స్నేహితుని కౌగలించుకొని ''నెచ్చెలీ! నాకై నీవు ప్రాణములు గోలుపోనుంటివిగదా! కొంచెము తడసియుండిన నెంత ప్రమాదము జరుగనుండెను'' అని కన్నీరుగార్చెను.

వారిరువురి, గాఢమైన ప్రేమనుగని, ఆ కఠినహృదయుఁడగు రాజునకుఁగూడచిత్తము కరగెను. వారిలో నెవరిని జంపినను రెండవవాని యసువుల బాపుటయే యని యతఁడు నిశ్చయించి, దామను మరణశిక్షను మరల్చి తన్నుగూడ తమ స్నేహితునిగా గ్రహింపుమని వారిరువురిని బ్రార్థించెను.

క. ఒల్లనిసతి నొల్లనిపతి
నొల్లనిచెలి కానివిడువ నొల్లనివాఁడే
గొల్లండు గాక ధరలో
గొల్లండును గొల్లఁడౌనె గుణమున సుమతీ.

వ్యాకరణము:— కొన్ని నామములకు లింగభేదము ప్రత్యేకపదములచే నేర్పడును.

| పుంలింగము. | స్త్రీలింగము. |
|---|---|
| అల్లుఁడు | కోడలు |
| తమ్ముఁడు | చెల్లెలు |
| అన్న | అక్క |
| మామ | అత్త |
| కొడుకు | కూఁతురు |
| బాలుఁడు | బాలిక |
| మగఁడు | పెండ్లాము |

పదములు:— నెచ్చెలి = స్నేహితుడు; అభీష్టము = కోరిక; దుర్గతి=చెడ్డ అవస్థ; తడసియుండిన = ఆలస్యము చేసియుండిన; గాఢము = అధికము; అసువులు=ప్రాణములు; సిసిలి = ఇది ఐరోపాఖండమునందలి యిటలీదేశమునకు దక్షిణమున నున్న ద్వీపము.

# 23. తిక్కనకవి.

సుమారెనిమిది శతాబ్దములక్రిందట నాంధ్రదేశమును హిందువులు పాలించుచుండిరి. ఆ కాలమున నాంధ్రదేశమెల్ల నొక్కనిక్రిందనుండక పలువురు రాజన్యుల యేలు

బడిలోనుండెను. వారిలో ప్రసిద్ధిగాంచి, నేటికి నాంధ్రుల కృతజ్ఞతకుం గుఱియై వెలసినవాఁడు 'మనుమసిద్ధి' యను నామము నఁబఱఁగు రాజన్యవరుఁడు. ఈయన నెల్లూరుసీమ నేలుచుండెను. ప్రజలే యీయన బిడ్డలు. వారియం దత్యంతానురాగముగల వాఁడై వారి నేమమే సంతతమరయుచుండెను.

మహామహుఁడగు తిక్కనకవి యీ భూపాలుని యాస్థానమందుండుటచే మనుమసిద్ధి నిరంతరయశముగాంచెను. తిక్కన యాంధ్రకవులలో నెల్ల నగ్రగణ్యుఁడు.

ఈతఁడు నెల్లూరిసీమవాఁడు. ఈయన తండ్రి గుంటూరు దేశమునుండివచ్చి నెల్లూరి మూలస్థానేశ్వరుని పేటయందు బెండ్లాడి చిన్నతనమునందే తన యత్తగారింటికి కల్లటమువచ్చెను. అప్పటి నుండి యతఁడు నెల్లూరియందే నిలిచెను. మనుమసిద్ధి యాస్థానమును బ్రవేశించినపిమ్మటఁ గొంతకాలమునకతఁడు గుంటూరికి దండనాథుఁడుగా నియమింపబడినందున తనకు స్వదేశదర్శన లాభముగలుగుచుండెనే గాని యతఁడు తనజన్మభూమినివిడనాడి భార్యాపుత్రులను బంధుపరిజనములను ధనభూమ్యాదులను సింహపురి (నెల్లూరు)యందే యేర్పఱచుకొనెను.

తిక్కన తండ్రిపేరు కొమ్మనామాత్యుఁడని చెప్పుకొని యున్నాఁడు. ఈయనను తన వరగర్భమందుఁగాంచిన పుణ్యావతి అన్నమాంబ. కొమ్మన మనుమసిద్ధి యమాత్యవర్గములో నొకఁడుగాఁ జేరినపిమ్మట నెల్లూరికనతిదూరమున నుండు పాటూరు గ్రామమునందు గృహమును గట్టించుకొని యచటనే కాపురము కుదుర్చుకొనెను. పాటూరు చేరిన కొద్దికాలమునకే యన్నమాంబ గర్భముదాల్చి నవమాసములునిండ నొకసుముహూర్తమున నొక పుత్రునిం గాంచెను. అతఁడు పుట్టిన సమయమున

నెన్నియో శుభసూచకములు గాన్పించెను. పురుడు తీరిననాఁడు కొమ్మన తనకొమారునికి జాతకర్మములు సేయించి "తిక్కన" యను పేరిడెను. తరువాత తిక్కన శైశవముదాటి బాలుఁడై తోడివారలతోఁ గలసి మెలసి యాటలాడుచుండెడివాఁడు. యుక్తవయస్సు రాగానే తిక్కన కుపనయన మొనర్చి యామన తండ్రి వానిం గురుశుశ్రూషకు నియమించెను. సహపాఠులలోఁ దిక్కన మేటియగుటచే గురువు మనస్సును త్వరలోనే మెప్పించి యాయన కరుణకుఁ బాత్రుఁడయ్యెను. అట్టివాఁడగుటచేతనే తన యుపాధ్యాయుని యొద్దనుండు విద్యనెల్లను సత[illegible]తికాలములోనే గడించెను.

తన పాండిత్యముచేతను, తన సద్గుణములచేతను రాజసమ్మానము చేతను తిక్కనకు రాజనాథునకు సేవ చేయుట సులువుగ నేగలిగెను. త్వరలోనే యతఁడు మంత్రులలో నొకఁడై కాలక్రమమున ముఖ్యమంత్రియయ్యెను. దినములు పోనుపోను రాజైనకును తిక్కనకును స్వామి భృత్యభావము పోయి స్నేహభావము, బంధుభావమును గలిగెను. రాజు తిక్కనమంత్రిని మామయని సైతము బిలుచుచుండెను. అందు, నిర్వచనోత్తరరామాయణమను గ్రంథమును వ్రాయుమని తిక్కనను బ్రార్థించుచు "ఓ తిక్కమంత్రీ: నిన్ను మా మామయని బిలుచుచుంటినిగదా? నీపుత్రికయగు కావ్యమునకు నన్ను బతిగాఁ జేయుము" అని కోరెను. మనుమసిద్ధి పలుకులు చిత్తమున కింపుగా నుండిన కారణమున తిక్కన తన కావ్యము నాతని కంకితముచేసెను.

కొన్నాళ్లకువెనుక తిక్కనమంత్రి గొప్ప సోమయాగమొనరించెను. సోమయాగము చేసినవారికి సోమయాజియను బిరుదు వచ్చెను. అందుచే యజ్ఞముచేసిన తిక్కనను జనులు తిక్కన

సోమయాజియని పిలుచుచుండిరి. యాగదీక్ష పూర్తియైనవెనుక తిక్కన తాను యాంధ్రమహాభారతము వ్రాయుట కారంభించెను. నెల్లూరులో నెలకొనియున్న హరిహరనాథుని యానతియైనట్లు తనకు స్వప్నమున గోచరించి యాతఁడు పంచమవేదమైన భారతమును వ్రాయ సమకట్టెను.

ఆంధ్రమహాభారతము హరిహరనాథున కంకితము చేయఁబడినది. ఆ మహాగ్రంథ మాంధ్రదేశమున మొదటి గ్రంథముగా నెన్నఁబడుచున్నది. సమస్త కావ్యగుణములతో నొప్పుచు మేటి తెలుఁగువారిచే నత్యాదరముచేఁ గొనియాడఁబడుచున్నది. అందు వర్ణింపఁబడియుండు యుద్ధాదివర్ణనము చదువునపుడు మనకన్నులయెదుట యుద్ధము జరుగుచున్నట్లు తోఁచుచును. తిక్కన మహాకవి యగుటచే నాతఁడు యుద్ధము వర్ణించుటకు సమకాలముగ భారతయుద్ధమునంతయు నతని కన్నులయెదుట జరుగునటుల హరిహరనాథుఁ డనుగ్రహించెనియు జనులు చెప్పుకొనుచున్నారు. తిక్కన పద్యములను చెప్పుచుండఁ గురునాథుఁడను కుమ్మరి కుండిగొనుచు వ్రాసినట్లు ప్రఖ్యాతిగలదు. తినిన గారెలఁ దినవలయును; వినిన భారతమును వినవలయునను వాక్యము నందఱెఱిఁగినదేగదా!

తిక్కన లోకమునకు మేలుచేయుటకై యితర సత్కార్యములనేకములు చేసెను. నెల్లూరునందొక గొప్ప చెఱువాతఁడే కట్టించెను.

**వ్యాకరణము:**—కొన్ని నామములకు లింగము పదమునందు మార్పుచే గల్గును.

చెలికాఁడు, చెలికత్తె; చక్రవర్తి, చక్రవర్తిని;
మాయలాఁడు, మాయలాఁడి; మనమఁడు, మనుమరాలు;

**పదములు.**—శుశ్రూష = పరిచారము, సేవ; చొరవ = ప్రవేశము ;

స్వామిభృత్యభావము యజమానుఁడు, సేవకుఁడునను తలఁపు; సోమయాగము సోమ, అను తీగనుండితీసిన రసమును ఈ యాగమునందు ద్రావుటచే దీనికా పేరువచ్చెను; గోచరించి=కనఁబడి; అంకితము సమర్పించుట; కావ్యలక్షణము మంచిగ్రంథమునకుండవలసిననియమములు; ఒప్పారు = కీర్తినొందను; అత్యాదరము మిక్కిలి గౌరవము; వెలసిన ప్రకాశించిన; అనురాగము ప్రీతి; సంతతము ఎల్లప్పుడు; జాతి ఇతర; అగ్రగణ్యుఁడు శ్రేష్ఠుఁడు; శైశవము బాల్యము; [illegible] ప్రఘము; కౌమారుఁడు పుత్రుఁడు, కుమారుఁడు; సహపాఠులు కూడ చదువువారలు.



## 24. హంపి, (విజయనగరము.)

హంపి ప్రసిద్ధమైన క్షేత్రము. ఇది బళ్లారిజిల్లాలో తుంగభద్రానదియొక్క దక్షిణతీరమునందున్నది. ఇదే మొదట విజయనగర సామ్రాజ్యములో నొక ముఖ్యనగరమై యుండెను. ఈ గ్రామములోఁ జూడఁదగిన రమణీయములైన పురాతనములగు దేవాలయము లనేకములున్నవి. వానియందు విరూపాక్షుని దేవాలయము ముఖ్యమైనది. ఆ గుడి తూర్పుద్వారముపైఁ బదునొకండు అంతస్తులు గలిగియుండెడి ఉన్నతమైన గోపురమున్నది. ఈ గోపురము మాతంగ ఋష్యమూకములు మొదలగు పర్వతశిఖరములంత ఎత్తయినది.

ఈ మహాద్వారములోపల రెండు ప్రాకారములున్నవి. రెండవ ప్రాకారము నట్టనడుమ విరూపాక్షుని దేవాలయమున్నది. ఈ దేవాలయమప్పటమైన నల్లరాతితోఁ గట్టఁబడియున్నది. ఒక్కొక్క రాతిపైనను అనేకవిధములయిన చిత్రములు చెక్కఁబడియున్నవి.

ఈ గుడియొక్క వెనుకటిభాగమున విద్యారణ్యస్వామి కూర్చుండు స్థలముకలదు. తుంగభద్రానదియొక్క కాలువను

ఈ గుడి పైభాగమునుండి దిగువపడునట్లు చేసియున్నారు. ఆ కాలువనీరెచ్చటెచ్చట కావలయునో, యాయా స్థలములకెల్ల తెచ్చుకొనియున్నారు. విరూపాక్షుని యుత్సవము ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ పౌర్ణమి మొదలు ప్రారంభింపఁబడును. అప్పుడచ్చోట నొక లక్ష జనులు కూడెదరు.

విరూపాక్షునిగుడిగాక, గుంజీమాధవునిగుడి, ఉద్దానవీరభద్రునిగుడి, సీతమ్మగారిగుడి మొదలగు పెక్కు దేవాలయములలో నాశ్చర్యముగలుగునట్లు శిల్పులు తమ శాస్త్రనైపుణ్యమును జూపియున్నారు. వానిని చూచుటకెంతయు నానందముగా నుండును.

ఈ విరూపాక్షుని గుడికి దక్షిణభాగములో రెండు విఘ్నేశ్వర దేవాలయములు కలవు. వానిలోనుండు మూలవిగ్రహములు చిన్నగుట్టయంత పరిమాణము గలిగియున్నవి. ఆవిగ్రహములలో నొకదానికి 'సాసువుగణేశుఁడు' అనియు, నింకొకదానికి 'సెనగలగణేశుఁడ'నియు పేర్లు. ఏలువమునకొక జాతి మంటపము కలదు. దానికి 'వసిష్ఠాశ్రమమని' పేరు. ఇవిగాక ఉగ్రనరసింహ, బడవీలింగ, సీతాకుండ, సీతమ్మచెరుగు, అక్కచెల్లెండ్రుగాయ మొదలగునవి చూడఁదగినవనేకములు కలవు. తుంగభద్రానదియొక్క యొక భాగమునకు చక్రతీర్థమని పేరు.

హంపికీశాన్యమున మూడుమైళ్ల దూరమందు తుంగభద్రానదీతీరమున పాడుపడిన విజయనగరపట్టణమున్నది. ఇప్పుడీచోట జనులు నివసింపకయుండినప్పటికిన్ని పూర్వమిది విజయనగర సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణముగా నుండెను. సుమారయిదువందల సంవత్సరములకు ముందీ పట్టణములోఁ జాలబలవంతులైన రాజులు రాజ్యముచేయుచుండిరి. వారిరాజ్య

పాలనకాలములోనే హంపిగ్రామములోనుండు పెక్కు దేవాలయములు కట్టఁబడినవి. వానిలో విఠ్ఠలునిగుడి చాల గొప్పది యగుటయేగాక బహు సుందరమైనది. ఈ రాజులు దక్షిణదేశమందు ముసల్మానుల యధికారము పెరుగకుండ జేసి, తమ బలపరాక్రమములచే ననేకరాజ్యముల జయించి, వానిని పరిపాలించుచు, హిందూమతధర్మములఁ గాపాడిరి. విజయనగరపు రాజులలో శ్రీ కృష్ణదేవరాయలు మిక్కిలి ప్రసిద్ధుఁడు. వీరి కాలములోనే విజయనగరరాజ్యము పెద్దదయ్యెను. ఈతఁ డఖండవిద్వాంసుఁడు. ఇతనియాస్థానమును సర్వశాస్త్రజ్ఞులైన పండితులత్యంత మన్ననఁబొందిరి. వీరికాలములోఁ బ్రసిద్ధిగాంచి యుండిన నెనమండ్రుగురు విద్వాంసులకు 'అష్టదిగ్గజముల'ని పేరు. వీరిలోఁ బెద్దనార్యుఁడు విఖ్యాతుఁడైన కవి.

ఈ విజయనగరరాజ్యము స్థాపింపఁబడిన యిన్నూరు సంవత్సరములకు రామరాయను నతఁడు రాజ్యము చేయుచుండగా దక్షిణదేశపు నైదు మహమ్మదీయులందఱొక్కటియై, యతని నోడించి, విజయనగరమును బాడుచేసిరి. ఈపట్టణపు పూర్వపు స్థితిని, ఇప్పటిస్థితిని విచారించిన మనస్సున వ్యాకులము కలుగును.

ఇచ్చట రాళ్లచే తీర్పఁబడిన మంటపముల వరుసలు రెండు గలవు. ఒక్కొక్క మంటపము రెండంతస్తులుగలది. ఒక్కొక వరుసయు నొక్కొక్క మైలు పొడవుండును. ఇవిగాక, శయనగృహములు, గాండ్లవాండ్రయిండ్లు, చాకలవాండ్లయిండ్లు, కుమారరాముని గరిడీయిల్లు, ఏనుఁగులు,గుఱ్ఱములుండు లాయములు మొదలగు పాడుపడినయిండ్లు నేటికి నచ్చట చూచినను గానవచ్చెను. ఇపుడు పాడుపడిన కట్టడములే మిక్కిలిరమణీయములుగా నుండును. అవి మంచిస్థితిలోనున్నప్పు డెటులుం

డెనో చెప్పశక్యముగాదు. హిందువుల నాగరికతకివియే ప్రమాణములు.

**వ్యాకరణము**:—సర్వనామములను **మూడు జాతులు**గా విభజింపవచ్చును.

(1) చెప్పువానికి బదులువచ్చు పదములు.

(2) వినువానికి బదులువచ్చు పదములు.

(3) వీరిద్దరును కాక పరోక్షమున నున్నవానికి బదులువచ్చుపదములు.

నేను వెళ్లితిని—ఇచట 'నేను' అనగా నెవరు? ఈవాక్యమును చెప్పువాఁడు
నీవు కూర్చుండుము—ఇచట నీవు అనగా నెవరు? ఈవాక్యమును వినువాఁడు
వాఁడుపరుగెత్తును—వాఁడు అనగా నెవరు! చెప్పువాఁడును వినువాఁడును కాక మఱియొకఁడు.

**పదములు**.—తుంగభద్రానది బళ్లారి కర్నూలు జిల్లాలగుండ ప్రవహించుచున్నది. హంపి హాస్పేటతాలూకాలో చేరినది. ఈ విజయనగరమునకును విశాఖపట్టణజిల్లాలోనుండు విజయనగరమునకును ఏలాటి సంబంధము లేదు. తీరము ఒడ్డు; నైపుణ్యము = నిపుణత; అంతస్థులు మేడలు, అఖండము గొప్పది; అత్యంత మిక్కిలి; సన్నుత గౌరవము; విఖ్యాతుఁడు పేరు చెందినవాఁడు; క్షేత్రము=ప్రసిద్ధినొందిన స్థలము.



## 25. కప్ప.

కప్ప కొంతమట్టుకు జలచరమును గొంతమట్టుకు భూచరమునైయున్నది. దానికి బాతునకువలెఁ గాలివ్రేళ్ల నడుమ

చర్మముండును గనుక యది బాగుగా నీదఁగలదు. అది భూమి పైని పరుగెత్తనేరదుగాని మిక్కిలి వేగముగా దుముకుచుఁ బోవఁ గలదు. దాని ముంగాళ్లు మిక్కిలి పొట్టివగుటవలనను వెనుకటివి మిక్కిలి పొడుగైనవగుటవలనను నది ఝుట్లు నడచును.

మండూకము చక్కని జంతువు కాదు. అయిన నది నిరపాయకరమైనది. తోఁటలుగలవారికి మిక్కిలి ప్రయోజనకారి. తోఁటలలోని మొక్కలను జెఱచు పురుగుల నది కడతేర్చుచుండును.

కప్పయొక్క చర్మము చల్లఁగానుండును. అది స్పంజియనెడి సముద్రపు పాచివలె నీళ్లను బీల్చుకొనును. కప్పకు నీళ్లదగ్గఱను దేమగానుండు చోటులయందుండుట మిక్కిలి యిష్టము. దానిని దేమలేనిచోట దీర్ఘకాలముంచితిమేని యది చచ్చును.

మండూకముల కన్న నాలుక పొడుగుగానుండి దాని మీఁద నొక విధమగు జిగురుండును. కప్పలు పురుగులను బట్టుకొనుటకు దమ నాలుకను వేగముగా లక్ష్యమునకుఁ ద్రిప్పుచుండును. అప్పుడవి వాని నాలుకకంటుకొనును గనుక యవి వానిని మ్రింగుచుండును.

కప్ప పుట్టినప్పుడు దాని రూపము కప్పవలె నుండదు. కప్ప లండజములు. తొక్కపుటలో మురిగించిన నీటమీఁదఁ గప్పగ్రుడ్లొక యాకునుండి గుత్తులుగా వ్రేలాడుచున్నవి. ఆ గ్రుడ్లు పగిలి పిల్లలు బయటికి వచ్చినప్పుడు వానికిఁ దలయును దోఁకయును మాత్రముండి కాళ్లులేక, యవి మిక్కిలి విచిత్రముగానుండును. అవి యప్పుడు నీళ్లలోమాత్రమే నీదఁగలిగియుండి మీలవలె నగపడును. రమారమి యొక నెలయైన పిమ్మట, పటమందుఁ గనఁబఱిచినట్లు వానికి రెండు వెనుకటికాళ్లు పుట్టును.



తదనంతరమునఁగూడ నవి యీఁదఁగలుగునేగాని భూమిమీఁద నడువఁజాలవు. అట్టి సమయమునందవి నీళ్లలో మొలచు మొక్కలను దిని జీవించును. మఱొక నెలయైన పిదప వానికి మఱి రెండుకాళ్లు మొలచును. అప్పుడు వానికిఁ జతుష్పాదములు నొక తోఁకయు నుండును. ఈ యా[illegible]న సయితమవి యీఁదను మాత్రమె నేర్చియుండును. ఇంకొక మాసము గడచినపిమ్మట వానితోఁక క్రమక్రమముగఁ బొట్టిదగును. తుదకది నిశ్శేషముగా నూడిపోవును. అప్పుడీ యా[illegible]వు మనకు సాధారణముగా నగపడునట్టి కప్పయొక్క రూపమును దాల్చును. కప్పయొక్క యాయుష్కాలములో దానికిఁ గలిగెడి మార్పులన్నియుఁ బైని ముద్రించిన పటమందుఁ గనఁబఱుపఁబడియున్నవి.

వ్యాకరణము:— చెప్పువానికి బదులువచ్చు పదములు ఉత్తమపురుష సర్వనామములు. నేను, నన్నుఁ, మేము, మమ్ముఁ. వినువానికి బదులు పదములు మధ్యమపురుష సర్వనామములు. నీవు నిన్ను, మిమ్ములను, మీరు,

తమరు. పరోక్షమున నున్న వానిం దెలుపు పదములు ప్రథమపురుష సర్వనామములు. వాఁడు, అది, వారు, వారిని, అవి. '

నామములకువలె సర్వనామములకును వచనభేదము గలదు.

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| వాఁడు | వారు |
| నీవు | మీరు |
| నన్నుఁ | మముఁ |

పదములు:—మండూకము కప్ప; ముంగాళ్లు ముందటికాళ్లు; అండజములు గ్రుడ్లనుండిబుట్టినవి మీలవలె చేపలవలె; నిశ్శేషముగా ఏమియులేక.

# 26. ధ్రువుఁడు.

ధర్మశాస్త్రములను జెప్పిన స్వాయంభువమనువునకిద్దఱు కొమరులు. ప్రియవ్రతుండు, ఉత్తానపాదుండు. వారిలో నుత్తానపాదునకిద్దఱు భార్యలు. వారిలో సునీతియనునామెకు ధ్రువుండును, సురుచియనునామె కుత్తముండను కొడుకులు కలిగిరి. ఉత్తానపాదునకు సునీతియందుకంటె సురుచియందు ప్రేమ మిక్కిలిగా నుండెను. అందుచే నుత్తముండే తండ్రికిఁ బ్రియకరుండై యాతనిని సతతము వినోదపఱచుచుండెను.

ఒకనాఁ డుత్తానపాదుండు తన భార్యయగు సురుచితో సరసములాడుచు నుత్తముని తన తొడపైఁ గూరుచుండఁబెట్టుకొని ముచ్చటలాడుచుండెను. దానింజూచిన ధ్రువుండును తండ్రియంకమునఁ గూరుచుండఁగోరి తనచిన్నచేతులను బైకెత్తి యతని వంకఁ జూచుచుండెను. సురుచి యాబాలునిం జూచి, మిక్కిలి యసూయగలదై యిట్లనియె 'ఓరీ! ఏల యిట్లు ప్రాకులాడెదవు? జనకుని యొడిని గూరుచుండు భాగ్యమందఱికిని గలుగునా? యువరాజవై తండ్రిసింహాసనమలంకరింప నెవ్వఁడు యోగ్యుఁడో

యతఁడే యతని తొడపైనుండుటకును దగును. అంతియగాని లాఁతివారికిఁ దగదు. నీవు నాగర్భమునఁ బుట్టక సునీతికడుపునఁ బుట్టినప్పుడే నీకట్టి పదవి దుర్లభమయ్యెను. నా కొమరుండైన యుత్తమునకే రాజ్యము రాఁగలదిగాన వానియిచ్ఛకుండ నర్హుఁడవు నీవు నీ తల్లికడకుఁ జనుము.'

ఆ మాటలు విని ధ్రువుఁడు మొగము చిన్నబోవ, తల వాల్చి, కన్నీరు బెట్టుకొనుచు తన తల్లియుండు మేడలోనికిఁ బోయెను. సునీతియు నా బాలునిఁ గని, యాతని మోముచందమునకు హృదయము నీరైపోవ, వెంటనే గారుగిడి యా బాలుని యెత్తి ముద్దులాడి యతనిశోకమునకుఁ గారణమడిగెను. అంత ధ్రువుఁడు తన తండ్రిపాల జరిగిన వృత్తాంతముఁ దెలిపెను. ఆ మాటలకు సునీతి చాల నొచ్చి, తనదౌర్భాగ్యమున నిందించుచు నా బాలునితో "తండ్రీ! నీవు నాకేల పుత్రుఁడవై జనించితివి? భర్తయాదరము లేని యిల్లాలికిఁ దనయుఁడై పుట్టుటకంటె నష్ట[illegible]కమైన వ్యసనమునందు జన్మించుటయే నాకు నెట్లు దుఃఖావహము. నాయందు నా పతికింతయైన గౌరవము లేదు. కావుననే నా సవతియైన సురుచి నిన్నింత హీనముగాఁ జూడఁగలిగెను. నీయయ్యయు దానికేమియు మారుమాటాడకయున్నాఁడు. ఆఁడుదాననగుటచే నేనేటి సహాయమును జేయఁజాలను. కావున నీకు దేవుఁడే శరణ్యుఁడు. దిక్కులేనివారికెల్ల నాతఁడే దిక్కు. నీవు నిష్ఠతో భగవంతునే ధ్యానింపుము. ఆయన నీయందుఁ గరుణించి నీకు సత్సంపదలనిచ్చును" అని పలువిధముల నేడ్చెను.

ధ్రువుఁడు తల్లి యాజ్ఞప్రకారమడవికిఁ బోయి శ్రీమన్నారాయణమూర్తిని ధ్యానించి యతని యనుగ్రహముఁ బడసి

తనకుఁగలిగిన యవమానమును దీర్చుకొనఁదలఁచెను. కాఁబట్టి యాబాలుఁడా యుద్దేశముతోనే కాలిబాట నరణ్యమునకుఁ బోవనడచుచుఁబోయెను. ఎండవేడిమిచే నతనికి మిక్కిలిదప్పిక కలిగెను. వేసవియగుటచే నాబాలుని కాళ్లు కాలుచుండెను. ఎప్పుడుగాని నడువనేరనియట్టి సుకుమారుఁడగుటచే బిడ్డయైనందున నతని పాదములు బొబ్బలెక్కిపోయెను. కాని ధ్రువుఁడు తాఁబట్టిన ప్రతిజ్ఞను విడువలేదు. ఒక్కొక్కప్పుడతనికి నిద్రాహారములులేక యుండుటచే శోషవచ్చుచుండెను. అయినను ధ్రువుఁడు కొంతసేపు చెట్టుచేమలక్రింద విశ్రమించి మరల పోవుచుండెను.

ఇట్లు ప్రయాసముతో నెన్ని కష్టములు వచ్చినను ఓర్చుకొని నారాయణుని ధ్యానించుచుఁ దెరువునఁ బోవుచుండిన సుపుత్రుని యందు కనికరించి నారదుఁడను మహాముని యతనికిఁ బొడసూపెను. ఆ మహామునిని జూచి ధ్రువుఁడు మహానందముతో నాతనికి, సాష్టాంగనమస్కారము చేసి నిలుచుండెను. నారదమునులు నాతని దగ్గరకు వచ్చి 'నాయనా! నీవెవ్వని వాఁడవు? బాలుఁడవైన నీవొంటిగను నడచుచు యీ త్రోవవెంట నీ కారడవికిఁ బోవుచున్నావు? నీ తల్లిదండ్రు లెవరున్నారు? వారిని విడనాడి నీవొంటరిగా రాఁగారణ మేమి?' అని యడిగెను.

అందుకు ధ్రువుఁడా మునితో వినయముగా 'మహాత్మా! మీరు నన్నేల యడిగెదరు? మీకుఁ దెలియని విషయములుం గలవే? అయినను అడిగితిరి గావున చెప్పెదను. నేను ఉత్తానపాదుని కొమరుఁడను. నా సవతితల్లిచే భంగపడి దాని కిట్లయినను ప్రతీకారము చేయనెంచి భగవంతుని ధ్యానించుటకై యిట్లడవికి బోవుచున్నాను' అనెను. నారదుఁడును 'అబ్బాయీ! నీవు చిన్నవాఁడవైనను నీ చెల్లు మెక్కువగానున్నది. బుద్ధిగలవాని మాట

కింత యలుగవలెనా? ఇట్లు చేయుట తగదు. నీవు మరలి యింటికిపోయి వారితో కలసి మెలసి సుఖముగానుండుము”ని చెప్పెను కాని ధ్రువుఁడాయనతో మిక్కిలి వినయముతో “అయ్యా! నేను నారాయణుని ధ్యానింపఁబోవుచున్నాను. నన్నడ్డగింపకుఁడు. ఎల్లేని నేఁబడిన యవమానమునుదీర్పకమానను. అదినా హృదయమును గాలించుచున్నది. నాయందుఁ బ్రీతిలేని తండ్రి యొద్దకు నే నెట్లుబోవుదును? తండ్రులు మఱచిన బిడ్డలకు మాధవుఁడే తండ్రి. కావున నే నాతండ్రియొద్దకే బోయెదను. నాకు సెలవిండు” అని వేఁడుకొనెను.

ధ్రువుని పట్టుదలకును నతని భక్తివినయములకును మెచ్చి నారదుఁడు కనికరించి “వత్సా! నీయందు ప్రీతుఁడనైతిని. నీవు బాలుఁడవు. కావున నారాయణు నుపాసించు మార్గము నీకుఁ దెలియదు. నీవు నాతోరమ్ము. నేను నీకు దేవుని ధ్యానించు విధముఁ జెప్పెద”నని యతని తనతోడఁదీసికొనిపోయెను. అచ్చట నొక మహారణ్యమున మనుష్యులు లేని స్థలమును వారిరువురును జేరిరి. అచ్చట వృక్షములు మిగుల దట్టముగానుండెను. తీఁగెలన్నియు నల్లిబిల్లిగ నల్లుకొనియుండెను. వేసవి యెండ మిక్కిలిగానున్నను చెట్లనీడలు చల్లగానుండెను. ఏవైపున జూచినను పచ్చనిపొదలును, దట్టమైన గుబురులును గనఁబడుచుండెను. వృక్షచ్ఛాయల నానాజాతిమృగములు బరుండి నిదురించుచుండెను. పొదలయందు పక్షులన్నియును గుంపులుగుంపులుగా జేరి కలకలమని పాడుచుండెను. వారిరువురు నచ్చోటికిఁ బోవునప్పటికి ధ్రువునకా రమణీయ ప్రదేశమును జూచిమహానందము కలిగెను. త్రోవనడచిన బడలిక యెల్లను దీఱిపోయెను.

అచ్చట నారదమహాముని ధ్రువునకు భగవంతు నుపా

సించువిధమును బోధించి యంతర్హితుఁడయ్యెను. ధ్రువుఁడును నతిచేలముతో నా మునిజెప్పినరీతినే ధ్యానించుచుండెను. ఇట్లు కాలము గడువను గడువను పరమాత్ముఁడైన నారాయణుఁడు ధ్రువునియందు దయగలవాఁడై, యాతనిభక్తికిఁ జాలసంతసించి యతనికిఁ గోరినవరమిచ్చుటకై గరుడవాహనమెక్కి వచ్చెను. అంత ధ్రువుఁడతనికి నమస్కరించి నిలుచుండగా నాదేవుఁడు "బిడ్డా! నీభక్తికిఁ జాలమెచ్చితిని. నీకేమికావలయునో వేఁడుము" అనెను. అంత ధ్రువుఁడు "దేవా! నేను మా తండ్రిచేతను మా సవతితల్లియగు సురుచిచేతను భంగపడితిని. దానినెట్లయి నను దీర్పవలెను నీవు కరుణించిన కాకపోవు కార్యమొక్కటి యులేదు" అనెను. అందుకు విష్ణుమూర్తి "వత్సా! నీపరిభవ ము తీరునుగాక" అని చెప్పి యంతర్హితుఁడయ్యెను. ధ్రువుఁ డును తిరిగి తన తండ్రియింటికేగెను.

తరువాత కొద్దికాలములోనే సురుచి కొమరుఁడు మృగ యార్థ మడవికిఁబోయి యచ్చట ప్రాణములఁ గోలుపోయెను. సురుచియును వాని వెదుకుచుఁబోయి కారుచిచ్చులోఁబడి చని పోయెను. ఉత్తానపాదుఁడైహికసుఖములమీఁద వైరాగ్యముఁ బూని ధ్రువునికిరాజ్యపట్టాభిషేకముఁ జేసి తానడవికిఁబోయె ను. తర్వాత ధ్రువుఁడు చాలకాలము ధర్మనియతితో సుఖ ముగా రాజ్యమేలుచుండెను.

**వ్యాకరణము:**—సర్వనామములకు ఉత్తమ, మధ్యమ, పురుషములందు లింగభేదములేదు. నేను, నీవు అను సర్వనామములు మగవారినిగాని, ఆడువారినిగాని తెలుపును.

ప్రథమపురుషమునందుమాత్రము లింగభేదముకలదు.

| పుంలింగము. | స్త్రీలింగము. | నపుంసకలింగము. |
|---|---|---|
| వాఁడు | ఆమె | అది |

సర్వనామములలో గొన్ని సంఖ్యను దెలియఁజేయును. అన్ని, కొన్ని, పది ఎన్ని.

**పదములు**—: పిండమునకు=కీలికి; దౌర్భాగ్యము—దురదృష్టము; వేసవి=ఎండ; వినయముతో—అడఁకువతో; కాల్చుచున్నది — బాధించుచున్నది; అంతర్హితుఁడు—అగుపడనివాఁడు; రమణీయము—అందము; కారుచిచ్చు—దట్టమైన నిప్పు, గొప్పమంట; సాష్టాంగనమస్కారము—దేహములోని అంగములన్నియు నేలకు తగులునట్లు నమస్కారముచేయుట.

# 27. ఉఱుము, మెఱుపు.

వానకాలమునం దొకొక్కనాఁ డాకాశమంతటిని మేఘములావరించి దిక్కులెల్లను చీకట్లు క్రమ్మిపోవుట మీరు చూచియే యుందురు. అట్టి సమయములందు తళుకు తళుక్కుమని కన్నులు మిఱుమిట్లుగొనఁజేయు మెఱుములును, చెవులను జెవుడు పడఁజేయు నుఱుములును గుండెలావటిల్లఁజేయును. జోరువానలు కురియుచుండ నొక్క ప్రాణియేని వెలుపల నడుగుబెట్టుటకు వీలులేక పక్షులు సహితము తమతమ కులాయములందే కదలక మెదలకఁ బరుండియుండును. భూమియెల్లను జలముచేఁ గప్పఁబడి మిట్టపల్లములు తెలియకుండును. ఉస్సురుస్సురుమని వీచు గాలిశబ్దము తప్ప మఱేదియును వినరాదు. అప్పుడు హఠాత్తుగా ప్రపంచమంతటిని వెలుఁగజేయునంత కాంతియును, దానికి వెనుకనే బ్రహ్మాండము బద్దలగునంత యుఱుమును జూచిన నెవ్వనికి భయము కలుగదు?

ఒకొక్కప్పు డాకాశమం దొక ప్రక్కమాత్రము దూరమున మెఱయుచున్నట్లు కనఁబడును. మిక్కిలి దూరమున నుండుటచే నట్టిమెఱుములు భయంకరములుగాక, చూచుట కెంతయు మనోజ్ఞములుగా నుండును. ఒకొక్కప్పుడు వల

యాకారముగాను, మఱియొకసారి వంకలు వంకలుగాను, ఒకతేప తిన్నగా తీసినట్లును, మఱియొకతడవ శాఖపఱచినట్లును నానావిధములైన స్వర్ణకాంతులచే నభోభాగము ప్రకాశించును. దూరమున నుండి నెమ్మది నెమ్మదిగా వినఁబడు యుఱుములు చెవులకింపుగా నుండును. ఒకతూరి బండ్లు విఱిగినట్లును, ఒకతూరి కొండలు దొర్లినట్లును చెవులకు గోచరించును.

ఈ రీతి సర్వప్రకారముల మఱియు నుఱుములును మెఱుములును విద్యుచ్ఛక్తివలననే. విద్యుచ్ఛక్తియనునదొక శక్తి. ఇది యన్ని వస్తువులలో లీనమై మెలగుచుండునుగాని, కొన్ని కొన్ని వస్తువుల సంఘర్షణముచేతనే ప్రకాశమగును. మనమొక రోజనపుకడ్డీని తీసికొని దానిని బిల్లిచర్మముతో రాచినచో దానియందు విద్యుచ్ఛక్తిపుట్టి ప్రక్కనున్నండు తేలిక కాగితపు ముక్కల నాకర్షించును.

మేఘములనుండి వెలువడు మెఱుము విద్యుచ్ఛక్తియో కాదో తెలియుటకుముందు బెంజమిన్ ప్రాంక్లి నను శాస్త్రజ్ఞుఁ డొకఁడు పెద్దగాలిపటము నొకదానిని జేసి, దానికి పట్టుదారము కట్టి, యెత్తైన కొండమీఁదికిఁబోయి, యాపటమును మేఘముల లోనికి విడిచెను. ఆ దినమున నుఱుములు, మెఱుములు విశేషముగానుండెను. అపుడు మేఘములలోనుండు శక్తి పట్టు బంటి ననుసరించి దిగివచ్చెను. దాని పరీక్షించగా నది విద్యుచ్ఛక్తి యని తెలిసెను.

విద్యుచ్ఛక్తి రెండు విధములుగలది. అవి రెండును కలసి నపుడు శబ్దముతో నొక రవ గలుగును. రెండు గొప్ప మేఘము లందు రెండు విధములనుండినపు డవి సమీపమున నుండుటచే

కలసి మెఱుమును, నుఱుము నేర్పడుచున్నవి. అవి రెండును మేఘమందును భూమియందును లీనమైయుండి కలియుట యునుగలదు. కొన్ని వేళలలో నదిమిక్కిలి హెచ్చుగా మబ్బునం దుండుటచే పెద్ద మెఱుము మెఱసి, యుఱుములతోడ వెలుగు ముద్దవలె భూమిపైఁ బడును. దానినే మనము పిడుగందుము. పిడుగుపడినచోట్ల నేదేనొక వృక్షముండినచో నది కాలిపోవును. దాని సమీపమున నొక మనుష్యుఁడుగాని, జంతువుగాని నిలిచి యుండినచో నల్లే చచ్చి పడిపోవును.

పిడుగు సాధారణముగా నున్నతప్రదేశములందే పడును. అపుడా ప్రదేశములు విఱుగుటయుఁ, బగులుటయుఁగలదు. విశేషముగా నఱుములును, మెఱుములు నున్న దినమందున్నత సౌధములయందు నివసించుట మిక్కిలి యపాయకరము. ఆ యపాయమును వారించుటకే పెద్ద మేడలకును, నెత్తయిన గోపురములకును ప్రక్కన నొక యినుపకడ్డీనిగాని, రాగికడ్డీని గాని, నిలువుగా నాటెదరు. పిడుగుపడగనే యాకడ్డీ దాని నాకర్షించి భూమిలోనికి బంపును. అట్లు చేయుటచే నాకట్టడముల కేలాటి యపాయమును గలుగఁజాలదు.

ఉఱుములును, మెఱుములును నేకకాలముననే పుట్టును గాని, మెఱుము ముందు ప్రకాశించి, తరువాత కొన్ని నిమిష ముల కుఱుము వినఁబడును. దీనికి కారణము తెలియునా? వెలు తురాకసమున శబ్దముకంటె వేగముగా ప్రసరించును. వెలు తురు సెకండునకు 1,80,000 మైళ్ళ చొప్పున పరుగిడును. శబ్ద మన్ననో, సెకండునకు 1,100 అడుగులుమాత్రమే పోవును. అందుచే నివి రెండును ఒకటేసమయమున బుట్టినను, వెవ్వేఱు సమయములందు మనకుఁ దెలియవచ్చును. పెండ్లిండ్లలో దూర

మున నాకాశ సువ్వులు కాల్చినపుడు సహితము ముందది పగులు వెలుతురు గానవచ్చి పిమ్మట నొక నిమిష కాలమునకు పగిలిన ధ్వని వినఁబడును. దీనినిబట్టియే మెఱుము మెఱసినచో ప్రక్కననే యుఱుముఱుమునని మనము ఖండితముగాఁ జెప్పవచ్చును.

**వ్యాకరణము:—** క్రియకు లింగము, వచనము, పురుషము, కర్తననుసరించి యుండును. క్రియ కార్యమును తెలుపును కాఁబట్టి, యా కార్యము జరిగిన కాలమునుబట్టి క్రియకు రూపములుగలవు.

| | |
|---|---|
| జరిగిపోయినకాలము. | భూతకాలము. |
| జరుగుచున్నకాలము. | వర్తమానకాలము. |
| జరుగబోవుకాలము. | భవిష్యత్కాలము. |

పదములు.— ఆవటిల్లు=అదురు; హంగాత్తుగా=ఉన్నటులుండి; బ్రహ్మాండము=లోకము; వలయాకారము=గుండ్రము; సంఘర్షణము=తాకుట: ఉన్నత=ఎత్తయిన.



# 28. ప్రహ్లాదుని చరిత్రము.

ద్విపద. పూర్వకాలమునందు భువనంబులెల్ల
గర్వించి బాధించు ఘనుఁడు హిరణ్య
కశిపుండు గలఁ డహంకారంబుచేత
వశము గావించె ప్రపంచంబునంత
సురలును మునులును శోకంబునొంది
పరమదయాపరు పద్మాక్షుఁజేరి
అసురబాధలఁ జెప్ప నా హరిప్రీతి
అసురబాధలదీర్ప నవతరించెదను
వాఁడు పుత్త్రునిమీఁద వైరంబుపెట్టి
కీడొందఁగలడని కేశవుండనియె

దానవేంద్రునికంతఁ దనయుండుపుట్టె
తనయుండు ప్రహ్లాద తనయుఁడనంగ
బాలచంద్రునిబోలె భాసిల్లుచుండ
బాలుని బడికి తాఁ బంపగా నతఁడు
హరికీర్తి నుడువుచు హరినితాఁదలఁచు
హరియె దైవమటంచు హరిపూజసేయు
గురువు లద్భుతమంది కొట్టి కోపించి
పరిపరివిధముల బాధించిచూచి
దానవేంద్రునిఁజేరి తమచింతఁ దెలుప
నెనలేనికోపంబు నెనగొనవాని
త్రొక్కించె కరిచేతఁ ద్రోయించెనీటఁ
బెక్కువిధంబులఁ జిక్కులఁబెట్టి
పర్వతాగ్రమునుండి పడద్రోయఁజేసి
సర్వవిధంబులఁ సర్పవిషంబు
'హరిహరి' యని త్రాగ నా దైత్యుఁడంత
'హరియేడ' యనికంభ మట్టె గొట్టంగ
హరి నరసింహమై నా దైత్యుఁ జంపి
పరమభక్తుండగు ప్రహ్లాదుఁ గాఁచె
కావునఁ గర్వంబుఁ గలుగంగనీక
దేవునిపై భక్తి దృఢముగా నిల్పి
ఏ విధంబునవైన నెవరైనఁగాని
భావంబులోఁ దల్పఁ బాయుబంధములు
సర్వభూతములందు సదయుఁడైనట్టి
నిర్వికారునకగు నిత్యమంగళము.



# పద్యములు.



1. గీ॥ ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండుఁ
జూడఁజూడరుచుల జాడవేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులువేఱయా
విశ్వదాభిరామ వినుర వేమ.

2. గీ॥ చంపఁదగినయట్టి శత్రుఁడు తనచేతఁ
జిక్కెనేనిగీడు చేయరాదు
పొసఁగమేలుచేసి పొమ్మనుటే చాలు॥ వి॥

3. గీ॥ ఓగునోగు మెచ్చు నొనరంగనజ్ఞాని
భావమిచ్చి మెచ్చుఁ బరమలుబ్ధుఁ
బందిబురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా॥ వి॥

4. గీ॥ అనఁగననఁగ రాగ మతిశయిల్లుచునుండుఁ
దినఁగదినఁగ వేము తియ్యనుండు
సాధనమునఁబనులు సమకూరుధరలోన ॥ వి ॥

5. గీ॥ పరగఱాతిగుండు పగులఁగొట్టఁగవచ్చుఁ
గొండలన్నిపిండి కొట్టవచ్చుఁ
గఠినచిత్తుమనసుఁ గరగింపఁగారాదు ॥ వి ॥

6. గీ॥ ధార్మికునకుఁగాని ధర్మంబుగనరాదు
కష్టజీవికెట్లు గానఁబడును
నీరుచొరకలోఁతు నిజముగాఁ దెలియదు॥ వి ॥

7. క॥ నిఱుపేదల రక్షించెడు
సరసుఁడు నెఱదాతగాక సంపన్నులఁదా
భరియించేవాఁడు దాతయె
మెఱమెచ్చుల దాతయతఁడు మేదినివేమా.

8. క॥ జనులకు నోడఁబాటగు విధ
మున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁ
రిన యొకనికలిమి కులుకక
మనుజులతోఁ బొందిపొసఁగి మనుటొప్పునృపా.

9. క॥ వినఁదగు నెవ్వరుచెప్పిన
వినినంతనె వేగపడక వివరింపవలె౯
గనికల్ల నిజము తెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలోసుమతీ.

10. క॥ ఎప్పుడు సంపదగలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్న౯
దెప్పలుగఁ జెఱువునిండినఁ
గప్పలు పదివేలుచేరుఁ గదరా సుమతీ.

11. క॥ బలవంతుఁడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైనసర్పము
చలిచీమల చేతఁజిక్కి చావదె సుమతీ.

12. క॥ కమలములు నీటఁబాసినఁ
గమలాప్తుని రశ్మిసోఁకి కమలినభంగి౯

దమతమ నెలవులు దప్పినఁ
దమమిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ.

13. క॥ కొఱగాని కొడుకుపుట్టినఁ
గొఱగామియె కాదు తండ్రి గుణములఁ జెఱచున్
జెఱకుతుద వెన్ను పుట్టినఁ
జెఱకునఁ దీపెల్ల జెఱచు సిద్ధము సుమతీ.

14. క॥ సరసము విరసము కొఱకే
పరిపూర్ణసుఖంబు లధిక బాధల కొఱకే
పెరుఁగుట విఱుగుట కొఱకే
ధరఁ దగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమతీ.

15. క॥ ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగ నేర్చు నెయ్యెడలం దా
నెత్తిచ్చి కరఁగిపోసిన
నిత్తడి బంగారమౌనె యిలలో సుమతీ.

16. క॥ మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ.

17. క॥ చేతులకుఁ దొడవు దానము
భూతలనాథులకుఁ దొడవు బొంకమి ధరలో
నీతియె తొడ వెవ్వారికి
నాతికి మానంబె తొడవు నయముగ సుమతీ.

18. క॥ నడువకుమీ తెరువొక్కటఁ
గుడువకుమీ శత్రునింటఁ గూరిమితోడన్
ముడువకుమీ పరధనముల
నడువకుమీ యొరులమనసు నొవ్వఁగ సుమతీ.

19. క॥ దగ్గఱఁ గొండెము చెప్పెడు
ప్రెగ్గడ పలుకులకు రాజు ప్రియుఁడైమఱితా
నెగ్గు ప్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుటసుమతీ.

20. గీ॥ చెల్లియుండియు సైరణ సేయు నతఁడు
పేదవడియును నర్థికిఁ బ్రియముతోడ
దనకుఁగల భంగినిచ్చు నతండు పుణ్య
పురుషులని చెప్పిరార్యులు గురువరేణ్య.

21. గీ॥ విద్యయొసఁగును వినయంబు వినయమునను
బడయుఁ బాత్రత పాత్రత వలనధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబులందునరుఁడు.

22. గీ॥ జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యఁగూర్పఁ దలఁపవలయు
ధర్మమాచరింపఁదగు మృత్యుచేఁదలఁ
బట్టి యీడ్వఁబడినవాఁడు వోలె.

23. క॥ పరులమనమునకు నెప్పుడు
పరుసఁదనముతోఁ జేనట్టి పాటులవిడియొ

ప్రకటించు నడత నడిచెడు
పురుషుం డైహికసుఖంబుఁ బొరయున్నృపాలా.

24 క॥ తనులోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడుమే
లొనరించెఁ గీడొకించుక
యొనరించిన నోఁపనీక యుడుగుచువచ్చున్.

25. క॥ పురుషుండు రెండు తెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ దానెయ్యెడలన్
బరుసములు వలుకకునికిన్
దురితంబులు వొరయుపనులఁ దొలఁగుటవలనన్.

26. క॥ కోపము నుబ్బును గర్వము
నాపోవనియునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునివి
కాపురుష గుణంబులండ్రు కౌరవనాథా.

27. క॥ పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకుఁ బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడున
న్నరుఁడు దెవులులేని వేదనంబడు నధిపా.

28. క॥ మనమునకు హితంబును బ్రియ
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.

29. క॥ అలిగిననలుగక యెగ్గులు
పలికినమఱివిననియట్లు ప్రతివచనంబుల్
వలుకక బన్నము వడియెదఁ
దలఁపకయున్నతఁడెచూవె తత్త్వజ్ఞుఁడిలన్.

30. క॥ ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబు బొసరించును స
జ్జనులైనవారికి డఁకువ
యును వినయము నివియతెచ్చు నుర్వీనాథా



## NATIONAL ANTHEM.

### భారతగీతి.

శహాన రాగము. రూపకతాళము.

ప॥ సదయుఁడైన జార్జి - చక్రవర్తిఁ బ్రోవు దేవ।
అ॥ కొదువలేని దీర్ఘాయువు - గూర్చి ఘనునిఁ గావు మీశ ॥ప॥

1. విజయుఁజేసి రాజ్ఞి సుఖము - వృద్ధిపఱచి చాలకాలము।
ప్రజల నేలఁగాను దేజో - వంతుని నొనరింపు మీశ॥ ప॥

2. వరము లెల్లఁ జేర్చి మా - ప్రభువగు జార్జిపైనఁ।
గురిపింపుము దేవ యతఁడు - చిర కాలము మమ్మేలుత॥ ప॥

3. దేవ రాజుఁ బ్రోవుమని ను - తింతుము మది మాటలచే।
నేవేళను మాచేట్టును . లెల్ల నతఁడు గాపాడఁగ ॥ప॥

4. రాజు గారిఁ బ్రోవుమనుచు - రాజగీతి ప్రతి ధ్వనించి।
యీ జలనిధి దాటి దాటి - యెంతో దవ్వు వ్యాపించును॥ ప॥

5. ఈశ మా గొప్ప రాజ్య - మెపుడు గాపాడుమనుచు।
దేశదేశముల వినుఁ బ్రా - ర్థింతు మొక్క మనసుగలిగి ॥ప ॥



PRINTED AT THE GUARDIAN PRESS BROADWAY MADRAS

ரத்தனத்தாரால் அங்கீகரிக்கப்பட்டது

உ

செந்திலாண்டவன் திருவடி துணை

# ஆஸ்திகமத : : : : உபாக்யானம்

## முதற்பாகம்

[சித்திரப் படங்களுடன் கூடியது]

திரு. அ. சிவாநந்தசாகர யோகீசுவரர்

மருமகரும மாணவருமாகிய

வரகவி. திரு. அ. சுப்ரமண்ய பாரதி

இயற்றியது.



நான்காம் பதிப்பு

பிரசுரகர்த்தர் :

லலிதாவிலாஸ புத்தகசாலையார்

திருவல்லிக்கேணி,

மதராஸ்.

 1927 [விலை அணு 6

செந்திலாண்டவன்

திருவடி துணை

# முகவுரை

(நான்காம் பதிப்பு)

ஆஸ்திகமத உபாக்யானம் என்பதில் ஆஸ்திகமதம் என்பது தெய்வம் உண்டு என்று நம்பி அதனை வழிபடும் மதமாம். உபாக்யானம என்பது சிறு கதை என்று பொருள் தருவது. ஆகவே ஆஸ்திகமத உபாக்யானம் என்பது தெய்வம் உண்டு என்கிற மத சமபந்தமான கதை என்று பொருள் கொடுப்பதாம்.

உலகத்தில் பெரும்பான்மையர் ஆஸ்திகமதத்தினராவர். ஆஸ்திகமதத்தின ரெல்லோரும் தெய்வமுண்டென்றும, அதனை வழிபடுவோர் இகபர சுக மடைவரென்றும, செய்யும் வினைகளுக்குத் தக்கபடி புண்ய பாவங்களுண்டென்றும், புண்யத்திற்கு ஸ்வர்க்கமும் பாபத்திற்கு நரகமும் சித்திக்கும் என்றும் கூறுவர்.

இதனாலே அவர்கள் நீதி மார்க்கத்தினின்றும் எவ்வகையினும் தவறுவதற்கில்லை. தவறினால் பாவசம்பந்தமடைந்து, தெய்வகோபத்திற்காளாய், நரக துன்பத்தை அநுபவிகக வேண்டுமன்றோ ?

இந்தியாவில ஆஸ்திக மதத்தினர் பல ஜாதியினராய் நடை யுடை பாவனைகளிலும ஆசார விவகாரங்களிலும் வேறுபட்டவரா யிருககின்றனர். ஆனால் நீதிமார்ககத்தில்

எல்லோரும் ஒருபடித்தான நிலைமையிலேதா னிருப்பர். அதிலே வழுவுவதற்கில்லை.

நீதி என்பது பேரறிவினின்று தோன்றிய சட்டமாகும். அது தெய்வீக உண்மைகளை அறியும் அறிவைக் கொடுக்கும; தெய்வத்தன்மையை அடையும்படி செய்யும். ஆகையினாலே நீதிமானே தேவ ஸந்நிதியில் இடம பெறுவான். நீதிநெறியே தெய்வமறையாகும்.

ஆகவே ஆஸ்திகமதத்தின ரெல்லோரும நீதிமார்க்கத்தில் வேறுபட்டவரல்லர். இது தமிழ்நூலாதலால் நாம் நமது தமிழ் நாட்டிலுள்ள ஆஸ்திகரையே கவனிப்போம். இந்தியர், கிறிஸ்தவர், மகமதியர் முதலிய இன்னோரே, இங்குள்ள ஆஸ்திகரில பெருமபான்மையராவர். இவர்கள் ஒருவர்கொருவர் பழகியே பொதுக் காரியங்களிலே உழைக்க வேண்டியவராகின்றனர். அதனாலேதான் இவர்களுள் ஒற்றுமை நிலைகக வேண்டு மென்று பலர் பாடுபடுகின்றனர்.

கடவுள எநத மதததிலும நீதிமாாககததின சாாயாகவே இருககிறார் என்பதைச் சிறுவர் உணர்வாராயின் அவர்கள் மத வெறுப்பற்றுத் தத்தம மதக் கொள்கைகளிலே விலகாமல் நின்று, பொது விஷயங்களிலே ஒன்றுபட்டுப் பெருமை பெறுவது கூடுமென்கிற நம்பிக்கையுடன் இந்த நூல் எழுதியதாகும்.

ஆகவே தெய்வமகிமை, பெற்றோர் பெருமை, குருவின் பெருமை, பதிவிரதைகளின் மகிமை இவை முதலிய முககியமான விஷயங்களை எடுத்துககொண்டு, இந்தப் பாகத்தில் தெய்வமகிமை பெற்றோர் பெருமை இரண்டையும் ஆஸ்திகமத நூலகளிலே பெறப்படும கதைகளின மூலமாகவே விளகக முன்வந்தோம்.

இந்தியருள் சைவம் வைஷ்ணவம் என்கிற உள்மத வெறுப்பொழியச் சைவ வைஷ்ணவமத நூல்களிலிருந்து விஷயத்திற்குத் தக்கபடி கதைகளை எடுத்துச் சம்பந்தப் படுத்திக் காட்டியிருக்கிறது. கிறிஸ்துவ மகம்மதிய மதங் களில் நாம் தலையிடவில்லை.

இந்த நூல் பிள்ளைகளுக் கென்றே எழுதியதாதலால் வாக்கியங்களை எழுதுவதில் எவ்வளவு கவனம் செலுத்துவது அவசியமோ அவ்வளவு தூரம் கவனம் செலுத்திச் சந்திகளும் கடின பதங்களும் எளிதிலே பொருள் விளங்காத மேற் கோள்களும் நீக்கி மிக எளியநடையில் எழுதியிருக்கிறோம்.

இந்த நூல் கவர்ன்மெண்டாருடைய அங்கீகாரம் பெற்று முதல் மூன்று பதிப்புகளில் ஆயிரக்கணக்கான புத்த கங்கள் செலவழிந்தன. இப்போது ஆண்டவன் கிருபை யினால் நான்காவது பதிப்பு வெளிவந்துள்ளன. இதனை யும் உபாத்தியாயர்கள் கவனித்துத் தத்தம் பள்ளிக்கூடங் களில் பிள்ளைகளுக்குப் பாடபுத்தகமாக உபயோகப்படுத் திப் பிள்ளைகள் நற்பயனையடையும்படி செய்வதுடன் பதிப் பித்த எமக்கும் இதுபோன்ற முயற்சியில் ஊக்கமளிப்பார்க ளென நம்புகிறோம்.

இந்த நூல் முட்டின்றி முடிய அடியார்க் கிரங்கி அருள்மழைபொழியும் ஆறுமுகப் பெருமானுடைய திரு வருளும் எமது குருநாதனின் ஆசீர்வாதமும் முன்னின்ற படியால், அவர்களுடைய திருவடிமலர் முடிசூடி அவர்களை வணங்குவோம்.

பெரியோர் இதிலுள்ள பிழை பொறுத்தருள்வர்.

குமாரவிலாசம், குமாரபுரம்
ராயப்பேட்டை, சென்னை.
21—3—27.

இங்ஙனம்,
திரு. அ. சுப்ரமண்ய பாரதி.

## 2. பெற்ருேர் பெருமை

அல்லது

## புத்திரர்களின் கடமை

உ

செந்திலாண்டவன் திருவடி துணை

# ஆஸ்திகமத உபாக்யானம்

## தெய்வமகிமை

### கடவுள் - அன்பர்க்கிரங்கும் அருளுடையவர்

(பக்தர்க் கிரங்கும் பரமதயாநிதி)

### 1. மார்க்கண்டேயர்

மார்க்கண்டேயர் மிருகண்டு என்னும் ஒரு மகரிஷியினுடைய பிள்ளை. மிருகண்டு முனிவர் காசிக்குப் பக்கத்தில் கடகம் என்கிற ஊரில் இருந்தார். அவர்க்கு நெடுநாளாகப் பிள்ளை இல்லாமல் இருந்தது. அந்தக் குறை நீங்க அவர் சிவபெருமானை நோக்கித் தவம் செய்தார். சிவபெருமான் அவர் முன்வந்து, "உனக்கு நூறு வயது வாழ்ந்திருக்கக்கூடிய பிள்ளை வேண்டுமா? பதினாறு வயது வாழ்ந்திருக்கக்கூடிய பிள்ளை வேண்டுமா?—நூறு வயதுடைய பிள்ளை பொல்லாதவனாய் இருப்பான். பதினாறு வயதுடையவன் நல்லவனாய் இருப்பான். எந்தப் பிள்ளை உனக்கு வேண்டும்?" என்று கேட்டார்.

2. மிருகண்டு "என் ஐயனே, எனக்குப் பொல்லாத பிள்ளை வேண்டாம். அதைவிடப் பிள்ளை இல்லாமலிருப்பதே நல்லது. பதினாறுவயது பிள்ளையாயிருந்தாலும் நல்ல பிள்ளையே வேண்டும்" என்று கேட்டார். சிவபெருமான் "உனக்கு உன் விருப்பப்படி நல்ல பிள்ளையே பிறப்பான்" என்று வரம் கொடுத்து மறைந்து விட்டார். ஈசுவரன் கொடுத்த வரத்தின் படியே மிருகண்டுவுக்கு ஒருபிள்ளை பிறந்

தான். அவனுக்கு அந்த மகரிஷி மார்க்கண்டேயர் என்று பெயரிட்டு அருமையாய் வளர்த்து வந்தார்.

3. மார்க்கண்டேயரை ஐந்தாவது வயதில் முனிவர் படிக்க வைத்தார்; ஏழாவது வயதில் அவருக்கு உபநயனம் செய்வித்தார். மார்க்கண்டேயர் படிப்பில் சுறு சுறுப்புடையவரா யிருந்தார்; ஆகையினால் வெகு சீக்கிரத்தில் படிக்க வேண்டிய நூல்களை யெல்லாம் படித்தார்; தாய் தந்தையர் இருவரையும தெய்வமாக எண்ணி அவர்களிடம பணிவாய் நடந்து வந்தார்.

4. மார்க்கண்டேயரிடம் அவருடைய தாய் தந்தையர் ஸந்தோஷ மடைந்தனர்; ஜகதீசனாகிய சிவபெருமானைத் தொழவும் பூஜிக்கவும் அவருக்குச் சொல்லி வைத்தனர். மார்ககண்டேயர் தினந்தோறும் புஷ்பமெடுத்து வநது சிவ பெருமானைப் பூஜிப்பார்; ஸ்தோத்திரங்களைப் பாடித் துதிப்பார்; பிறகு வேத அத்யயனம் செய்வார்.

5. மார்க்கண்டேயர் மகா புத்திசாலி; மகா சிவபகத சிரோமணி—என்று எலலோரும அவரைப் புகழ்வார்கள். அப்படியிருக்கையில் அவர்க்கு வயது பதினைந்தாயிற்று. இந்தக் காலத்தில் மிருகண்டுவும் அவா மனைவியும அடிககடி துக்க மடைந்து கண் கலங்கினர். அதைக கவனித்த மார்க்கண்டேயர் "நீங்களேன் துக்கப்படுகிறீர்கள்?" என்று கேட்டார். மிருகண்டு "அப்பா, உனக்குச் சிவபெருமான பதினாறுவயது தான் கொடுத்திருககிறார். இப்போது உனக்குப் பதினாறுவது வயது பிறந்துவிட்டதல்லவா? இனி உனக்கு மரணம் வருமே என்று எண்ணித் துக்கப்படுகிறோம்" என்றார்.

6. மார்க்கண்டேயர், "இதற்காக நீங்களேன் துக்கப் படுகிறீர்கள்? சிவபெருமான் தம்மிடம் அன்புடையவர்க்கு விரும்பியவையெல்லாம கொடுப்பவரல்லவா? அவரையே நம்

பியவர்களல்லவா நாம்? அவரை நான் இடைவிடாமல் பூஜை செய்து மரணம் வாரமலிருக்கும் வழியைத் தேடுகிறேன். பிள்ளையினால் தாய் தந்தையர் ஸந்தோஷப்படுவதா? துக்கப் படுவதா? இன்று முதற்கொண்டே நான் ஈசனை நோக்கித் தவம் செய்கிறேன். தவத்தினால் ஆகாததும உண்டோ? நீங்கள் என்னை அடைந்தது தவத்தினாலேதானே?"-என்றார்.

7. மார்க்கண்டேயரை இப்போது அவருடைய தாய் தந்தையர் இருவரும் தழுவிக்கொண்டு முத்தமிட்டனர். "அப்பா, அந்த ஜகதீசன் தந்த பாகயந்தான் நீ. அவரு டைய திருவருளைப் பெற்றவர்கருக் குறைவுண்டாவது ஏது? 'கடவுளை நம்பினோர் கைவிடப்படார்'—என்று சொல்வார் களே, நீ கேட்டதில்லையா?" என்றனர்.

8. மார்க்கண்டேயர் அந்த நிமிஷமே தாய் தந்தையரை வலம் வந்து வந்தனம செய்தார்; "அம்மா விடை கொடுங் கள்! ஐயா விடைகொடுங்கள்!" என்று தவஞ்செய்ய விடை கொண்டு மணிகர்ணிகை என்னும கோவிலுக்குப் போனார்; கோவிலை வலம் வந்து, சிவபெருமானைத் தொழுதார்; தமது எண்ணத்தை முடித்துத் தரவேண்டுமென்று பகவானை வேண்டிககொண்டார்; அப்பால் அந்தக் கோவிலுக்குத் தென்புறத்தில் ஒரு லிங்கத்தை ஸ்தாபித்து வேறு நினைப் பில்லாமல் பூஜை செய்து வந்தார்.

9. மார்க்கண்டேயருடைய பூஜையில் சிவபெருமான் ஸந்தோஷமடைந்து அவர்க்குக் காட்சி தந்தார்; "அப் பனே, உன் எண்ணம் அறிந்தேன், உன்னை மரணத்துக்கு அகப்படாமல் காப்பாற்றுகிறேன்" என்று வாக்குக் கொடுத்து மறைந்து போனார். பிறகு மார்க்கண்டேயர் சிவ பெருமானை ஸந்தோஷத்துடன் துதித்துக்கொண்டே வீட் டிற்குப் போனார்.

10. மார்க்கண்டேயரைக் கண்டதும் அவருடைய தாய் தந்தையர் இளங்கன்றைக் கண்ட பசுவைப்போல் ஓடி வந்து, "அப்பா வாடா! என்னய்யா வாடா!" என்று தழுவிக்கொண்டனர். மார்க்கண்டேயர் அவர்களை வணங்கி, "சிவபெருமான் காட்சி தந்தார்; நான் அவரைக் கண்களாரத் தரிசித்தேன். 'மரணத்துக்கு அகப்படாமல் உன்னைக் காப்பாற்றுகிறேன்' என்று வாக்களித்தார். இனிக் கவலை வேண்டாம்" என்று சொல்லி அவர்கள் துக்கத்தை மாற்றினார்.

11. மார்க்கண்டேயருக்கு வீட்டிலிருக்க மனம் வரவில்லை. உடனே அவர் ஸ்தலயாத்திரை புறப்பட்டார்; பல சிவஸ்தலங்களுக்குப் போய்ச் சிவபெருமானைத் தரிசித்தார். கடைசியில் சோழதேசம் போய்த் திருக்கடையூர் என்னும் திவ்ய க்ஷேத்திரம் போனார்.

12. மார்க்கண்டேயர் அந்த ஸ்தலத்தில் சில நாள் தங்கிச் சிவபெருமானைப் பூஜை செய்துகொண்டிருந்தார். அப்பொழுது அவருக்குப் பதினாறுவது வயது முடிந்தது. அந்தக் கணக்குப்படி மார்க்கண்டேயரின் உயிரைக் கொண்டு போக யமன் வந்தான். மார்க்கண்டேயர் அப்பொழுது சிவபெருமானைப் பூஜித்துக்கொண்டிருந்தார். அதைக் கண்ட யமன் மார்க்கண்டேயருடைய பக்கத்திலே போக மலைத்தான்; தூரத்திலிருந்தே மார்க்கண்டேயரை அழைத்தான்.

13. மார்க்கண்டேயர் அவன் பக்கம் திரும்பினார். யமன் பாசக்கயிறுடன் நின்றுகொண்டிருப்பது அவருக்கு நன்றாய்த் தெரிந்தது. உடனே அவர் சிவலிங்கத்தைக் கட்டிக்கொண்டு "யமன் வந்துவிட்டான், சம்போ, சங்கரா, மகாதேவா! என்னைக் காப்பாற்ற வேண்டும்" என்று துதித்தார். அவருயிரைக் கொண்டுபோகத் தருணம் வந்து விட்டபடியால் தூரத்திலிருந்தபடியே யமன் பாசத்தை வீசினான்.

14. மார்க்கண்டேயர், 'ஆ! ஜகதீசா! மகாதேவா!' என்றார். என்ற அளவில் சிவபெருமான் சிவலிங்கத்திலிருந்து தோன்றி யமனை உதைத்துத் தள்ளினார்; "மார்க்கண்டேயா! பயப்படாதே! நீ என்றும் பதினாறு வயதாய் இருக்கக் கடவாய்" என்று வரம் தந்து மறைந்தார்.

15. மார்க்கண்டேயர் இப்படிச் சிவபெருமான் திருவருளால் சிரஞ்சீவியானார். இதை அவருடைய தாய் தந்தையர் அறிந்து கவலை நீங்கி அவர்களும தவம் செய்யச் சென்றனர்.

16. அப்பால் சிவபெருமான் யமனை எழுப்பினார்; "நீ இனிமேல் என்னுடைய அன்பரிடம் செல்லாதே!" என்று புத்தி சொல்லி அவனை அனுப்பினார். யமன், "அப்படியே நடக்கிறேன்" என்று சொல்லிச் சிவபெருமானைத் தொழுது தன் உலகம் சென்றான். (ஸ்காந்தம்.)

---

கடவுள் - அன்பர்க்கிரங்கும் அருளுடையவர்

## 2. துருவன்

துருவன் உத்தானபாதன் என்னும் ஓர் அரசனுடைய புத்திரன். அந்த அரசனுக்கு இரண்டு மனைவிகள். மூத்தவளின் பெயர் ஸுநீதி; இளையவளின் பெயர் ஸுருசி. இவளுக்கு ஒரு பிள்ளை. அவளுக்கு ஒரு பிள்ளை. துருவன் ஸுநீதியின் பிள்ளை. ஸுருசியின் பிள்ளைக்கு உத்தமன் என்று பெயர். அரசனுக்கு இளையாளிடம் அதிகப் பிரியம். ஆகையினால் அரசன் அவளைத் தன் அரண்மனையிலேயே வைத்துக்கொண்டிருந்தான்; ஸுநீதியை வேறு அரண்மனையில் வைத்திருந்தான்.

2. துருவனுடைய தாய் பரமசாது; கட்டின பசுவைப் போலிருப்பாள்; பகவானிடம் அன்புடையவள். ஆகை



సీతయొక్క కష్టము.



కౌశికుని తపస్సు వ్యర్థమైనది.

జూచి అంగిరసులను ఋషులు యాగముచేయుచున్నారు, నీవు అక్కడకుఁ బోయి వారిపాపములు పోవునట్లు మంత్రములను జపించిన యెడల ఆయజ్ఞములో మిగిలిన ద్రవ్యమును నీకిత్తురు. అందుమూలమున నీకు జీవనము జరుగఁగలదు" అని చెప్పెను. తండ్రిమాటచొప్పున వాఁడట్లుచేయ నాఋషులు యజ్ఞశేష ద్రవ్యమును వాని కిచ్చిరి. వాఁడు దానిని పుచ్చుకొనునంతలో ఈశాన్యదిక్కుననుండి యొక నల్లనిపురుషుఁడు(రుద్రుఁడు)వచ్చి "ఇది నాది; నీవు తాకఁగూడద"ని యడ్డగింప నతఁడు తనకు వారు దానమిచ్చినది గావున పుచ్చుకొని వచ్చుచున్నాఁడ"నని చెప్పి, వేగముగ తండ్రిదగ్గఱకు వచ్చి యీ సమాచారమును చెప్పెను. ఇంతలో నా నల్లనిపురుషుఁడు వచ్చి "నా సొత్తు నీ కుమారుఁడు తెచ్చినాఁడు, విచారించి యిప్పింపు"మని చెప్పఁగా నాభాగుఁడు కొంచెమయినను పక్షపాతములేక, "శ్రౌతసంప్రదాయ ప్రకారము యాగశేషమంతయు రుద్రునకే చెందవలెను; కావున నీవు తెచ్చిన పదార్థములనంతయు నతని కిమ్మ"ని తీర్మానించి తన సుతునిచే నిప్పించెను. అతని నిష్పక్షపాతబుద్ధికి మెచ్చి రుద్రుఁడు ప్రత్యక్షమయి, తాను పుచ్చుకొనిన వస్తువులన్నియు నాభాగునకే మరలనిచ్చి, యతనికి బ్రహ్మజ్ఞానమును గూడ కలుగఁజేసి యంతర్ధానమొందెను.

న్యాయము చెప్పువారు మధ్యస్థులై యుందురు.

— భాగవతము, 9-వ స్కంధము.

---

## 24. ఓర్పు. (1)

శిబి యనువాఁడు యయాతిమహారాజు మనుమఁడు. ఒకనాఁడు శిబిచెంతకొక బ్రాహ్మణుఁడువచ్చి యన్నమడిగెను. శిబి యతనికి నమస్కరించి చేయవలసిన యుపచారముల నన్నిటినిఁజేసి "మీ కేమికావలసిన నడుగుఁడు; ఇచ్చుటకు సిద్ధముగ నున్నాఁడ" ననెను. ఆబ్రాహ్మణుఁడు "నీకొడుకునుజంపి, వాని మాంసముతో కూరవండి నాకు భోజనము పెట్టు" మని కోరెను. శిబి కొడుకును జంపుటకుఁ గొంచెమైనను దుఃఖింపక, యతఁడు కోరినట్లు సిద్ధముచేయించి చూడఁగా నతిథి కనఁబడక పోయెను. అతిథి లేనందునకు మిగుల నగచ్చి శిబి భోజనపదార్థములతో నాతని వెదకుటకు బయలు వెడలెను. ఇట్లతనిని వెదకుచుండఁగా నాబ్రాహ్మణుఁడు నగరులో వెలగల బట్టలన్నియుఁ గాల్చివేయుచున్నాఁడని భటుఁ డొకఁడువచ్చి చెప్పెను. వెంటనే రాజచ్చటికిఁ బోయి మిక్కిలి వినయముతో భోజనము సిద్ధముగానున్నది; భుజింపుఁడని యతనిని ప్రార్థించెను. అంత నా యతిథి రాజుతో ఆయన్నమును నీవే భుజింపుము. అలాగైన నాకుఁ దృప్తికలుగునని చెప్పెను. ఆబ్రాహ్మణు నాజ్ఞప్రకారము శిబి ఆ యాహారమును తననోటఁ బెట్టుకొనఁబోగా నా యతిథి శిబి చేతులను పట్టుకొని తన నిజరూపమగు బ్రహ్మరూపమును జూపెను. తరువాత బ్రహ్మ శిబియొక్క యన్నదానమునకును ఓర్పునకును జాల సంతసించి యతనిని మిగులఁ బొగడి "నీవు

భూలోకమునఁ జాలకాలము సౌఖ్య మనుభవించి పిమ్మటఁ బరమ పదమును పొందఁగల"వని వరమిచ్చి యంతర్ధాన మొందెను.

ఓర్పు గొప్పపదవి నిచ్చును.

— మహాభారతము, ఆరణ్యపర్వము.

---

## 25. ఓర్పు. (2)

క్షత్రియవంశజుఁ డగు విశ్వామిత్రునకు కుశికుఁ డను ముత్తాత యొకఁడుండెను. ఇతఁడు క్షత్రియకులమునఁ బుట్టినను, ఇతని వంశము కొంతకాలములో బ్రాహ్మణవంశముగా మాఱునవియు, దానికి తనవంశజులే కారణమనియు, దానికి బదులుగా బ్రాహ్మణు లగు తనవంశమువారు క్షత్రియు లగుదురనియు, చ్యవనుఁ డను నొక ముని దివ్యజ్ఞానముచే నెఱింగెను. చ్యవనుఁ డు కుశికుని తన కపకారిగా చేసి యందువలన వానివంశము బ్రాహ్మణవంశముగా మార్పనెంచి, యొకనాఁ డతని యొద్దకుఁ బోయి, తా నొకయాగముఁ జేయఁబోవుచున్నాననియు, దానికతఁడు (కుశికుఁడు) భార్యాసహితముగాఁ దనకు సదా సేవచేయవలయుననియుఁ జెప్పి, కుశికు నందులకొప్పించెను. తరువాత చ్యవనుఁ డొకరాజభవనమున సెజ్జపై శయనించి తనకు రాజును రాణియును సదా పాదము లొత్తుచుండవలయునని చెప్పి యిరువదియొక్క దినముదాఁక కన్నులు మూసికొని పండుకొనియుండెను. రాజదంపతు లతని కిరువదియొక్క దినమువఱకు నుపవాసముతో సదా కాళ్లు పట్టుచుండిరి. పిమ్మట నాఋషి లేచి యేమియు మాటాడక తిరుగ

సాగెను. ఆ ఋషిని రాజదంపతులు కూడ వెంబడింప నతఁడు మాయమైపోయెను. తమవలన లోప మేమైనినుండుటచేతనే ముని కోపించి పోయెనేమో యని దిగులుపడి, యారాజ దంపతు లతనిని వెదకుచుఁబోఁగా నాఋషి మునుపటి పఱుపు మీఁదనే మఱియొక ప్రక్కను పండుకొని యుండెను. వారు మరల నతని పాదము లొత్తనారంభించిరి. అప్పు డా ఋషి లేచి "మంచిభోజనము కావలయు"ననెను. వా రట్లే భోజనమును సిద్ధముచేసి తెచ్చునప్పటి కాఋషి నగరులోని యమూల్యవస్త్రములన్నిటిని మూటకట్టి దానికి నిప్పంటించుచుండెను. పిమ్మట నాఋషి తన్ను రథముమీఁద నెక్కించి యా రథమును లాగుచు గ్రామప్రదక్షిణము చేయింపుఁడని యాజ్ఞాపించెను. ఉపవాసశ్రమతో వారారీతిగానే తేరిని లాగుచుండ, నతఁ డందఱకు దుఃఖమగునట్లు వారిని కొరడాతోఁ గొట్టుచుండెను. ఋషి యంతటితో నైనఁ దృప్తినొందక రాజగృహములో బొక్కసమునం దున్న ధనమంతయుఁ దోఁచుకొని గంగానదికిఁ బోయెను. ఇట్టి కష్టములు పెట్టుచుండినను రాజదంపతులు మనమునందు కొంచెమైనను వ్యాకులపడక యతని ననుసరించి వచ్చుచునేయుండిరి. అప్పటికి ఋషికి వారిపైఁ గరుణగలిగి సంతోషముతో వారి శరీరములను తడవి "యింటికిఁబోయి పారణచేసి రేపురండ"ని వారి కానతిచ్చెను. ముని చెప్పిన ప్రకారము వా రా మరునాఁ డచ్చోటునకు వచ్చి చూడ నచ్చట నొక గొప్పపట్టణమును, కోటయు నగపడెను. వారా యద్భుతమును జూచుచుండఁగాఁ దటాలున నది మాయమయ్యెను. పిమ్మట నాఋషిమాత్రమే కనఁబడి, వారినిఁ జూచి

"మిమ్ము శపింపవలెనని తలంచుచుండిన నాకు మీయోర్మిని జూచి శపింప మనసు రాకున్నది. ఇట్టియోర్మి మీయందుండు టచే శీఘ్రకాలముననే మీవంశము శ్రేష్ఠమగు బ్రాహ్మణ వంశము కాఁగలదు" అని యనుగ్రహించి యంతర్ధాన మొం దెను.

ఈలాగుననే మున్నొకప్పుడు రుక్మిణీకృష్ణులు,దుర్వాసుఁ డను మహర్షిని మిక్కిలి యోర్పుతో నారాధించి యతని కొఱకు సిద్ధము చేసిన పాయసమును, అతని యాజ్ఞానుసార ముగాఁ దమదేహములకుఁ బూసికొని మిక్కిలి పరిశుద్ధు లయిరి.

ఓర్పుగలవారు ఘనతను సంపదలను పొందుదురు.

— మహాభారతము, అనుశాసనిక పర్వము.

---

## 26. దీర్ఘాలోచన.

ఒక యాశ్రమమునం దొకమహాముని కలఁడు. అతని కొకపుత్త్రుఁడుండెను. ఆమునిపుత్త్రుఁ డేకార్యమునైన జక్కఁగా నాలోచించి చేయుచుండెను. అందుచే నతనికి "చిరకారి" యని పేరుకలిగెను. ఒకనాఁ డితనితండ్రి, తనభార్య చేసిన తప్పునకుఁ గోపావేశపరవశుఁడై యితనిఁ జూచి ,"నీతల్లినిఁ జంపుము" అని యాజ్ఞాపించి, యచ్చటనుండ నిష్టములేక, యొటకో వెడలి పోయెను. చిరకారి "ఆహా! తల్లి నెట్లు చంపఁగలను? అటు లని తండ్రియాజ్ఞను మీఱవచ్చునా? ఏమిచేయుదును? 'ఇటు చూచినఁ గోయియు నటుచూచిన నూయియు' నన్నట్లున్న దే"

అని యీమొదలగు దీర్ఘాలోచనలతోఁ బ్రొద్దుపుచ్చుచుండెను. ఇంతలోఁ దండ్రికిఁ గోపము తగ్గి, తన యానతి ప్రకారము కొడుకు, భార్యను చంపెనేమో యని వ్యాకులపడి, తొందరగా నచ్చటికివచ్చి, సుతునడుగఁగా నతఁడు తన దీర్ఘాలోచనా వృత్తాంతమును జెప్పెను. తండ్రి దానికి సంతోషించి "నీ దీర్ఘాలోచన చేతనే గదా! నాకపకీర్తియుఁ బాపమును రాకుండఁ జేసితివి. నీకు 'చిరకారి' యనుపేరు తగియేయున్నది. నీకార్యాలోచనము మెచ్చఁదగినది. దీర్ఘాలోచన మనుష్యుని గొప్ప యాపదనుండి తొలఁగించి రక్షించును" అని సుతుని మెచ్చుకొనెను.

ఏకార్యమును జక్కఁగా నాలోచించి చేయవలయును.

— మహాభారతము, అనుశాసనికపర్వము.

---

## 27. కష్టమునుజూచి యోర్వకుండుట.

సూర్యవంశపురాజగు దశరథుఁ డొకనాఁడు వేఁటకై యడవికిఁ బోయెను. అతఁడు అప్పుడు రాత్రియగుటచే ఒక గుంటగట్టునఁ బొంచియుండి విల్లునందు శబ్దవేధి యనుబాణమును సంధించెను. "రాత్రులయందు జలాశయములలో నీరు త్రాగు జంతువులచప్పుడునుబట్టి యీబాణమును బ్రయోగించిన నది యాశబ్దము వచ్చుతావుననుండు జంతువును జంపును; గాన దానికి "శబ్దవేధి" యను పేరువచ్చెను. ఈబాణమును దశరథుఁ డంతకుముం దెప్పుడును బ్రయోగింపక పోవుటచేత, జలాశయము సమీపమునుండి "బుడ బుడ" యను ధ్వనిఁ

కలుగఁగానే, దశరథుఁడు ముందువెనుక లాలోచింపక యాబా ణమును వదలెను. అంతఁ గొంతసేపటికి మనుష్యుని యేడుపు వినవచ్చెను. "అయ్యో! మృగమని తలఁచి మనుష్యుని గొట్టితినే" యని, దశరథుఁడు భయపడుచు నాయేడుపు జాడనుబట్టి యాం తావునకుఁబోయి యచట బాణము తగిలి బాధపడుచున్న మునికుమారుని, నతనిచెంత నీటిచేనిండిన కుండను గాంచెను. వెంటనే యతఁడు భయముచే వడ వడ వడంకుచు, "నేను తెలి యక చేసిన నేరమును క్షమింపవలయు"నని యా ముని కుమా రునిఁ బ్రార్థించెను. అంగాల కతఁడు, నేను నాతల్లిదండ్రుల కొక్కఁడ పుత్రుఁడననియు, వారు గ్రుడ్డివారనియు, వారు మిగుల దప్పిగొని నన్ను నీళ్లు తెచ్చి యిమ్మనుటచే నేనిచ్చటికివచ్చి యీ యాపదకు పాలైతిననియు, నాకర్మముచే నిట్టి కీడుమూడెను గాని, నితప్పేమియు లేదు. అయినను, నాతలిదండ్రులు దాహ ముచే బాధపడుచు దుఃఖించుచుందురుగాన, నన్ను ఈనీటికుండ తో వారి యొద్దకుఁ దీసికొనిపోయి వారిని ప్రార్థింపుమనియు పల్కి ప్రాణములను వదలెను. తరువాత దశరథుఁ డాఋషి పుత్రుఁడు చెప్పినట్లావృద్ధదంపతుల కడకుఁబోయి వారి పాద ములు పట్టుకొని జరిగినదంతయుఁజెప్పి తన్ను మన్నింపుఁడని వేఁడుకొనెను. వారు "మాపుత్రుఁడు వానికర్మముచేత మృతి నొందెను. పుత్రశోకము మాకు దుర్భరముగా నున్నద"ని శోకిం చుచు, "నీకును పుత్రవియోగమువలననే మరణము గలుఁగును. గాక" యని దశరథుని శపించి ప్రాణములు విడిచిరి. ఆశాపము

వలన దశరథునకు, రాముఁ డరణ్యవాసమునకుఁ బోయినపిదప, మరణము సంభవించెను.

పశ్చాత్తాపము పాపమును తొలఁగించును..............

— రామాయణము, అయోధ్యాకాండము.

---

## 28. కష్టముచూచి యోర్వకుండుట.

లంకాపట్టణమునకు రావణుఁ డనురాక్షసుఁడు రాజుగా నుండెను. అతఁడు తనచెల్లెలగు శూర్పణఖయను దుష్టరాక్షసి దుర్బోధనచేత, సీతారామలక్ష్మణు లరణ్యవాసము చేయునపుడు, మోసముచేత సీతనెత్తికొనిపోయి లంకలోని యశోకవనమునం దుంచెను. అంతట రామలక్ష్మణులు సీతను వెదకుచు వచ్చి సుగ్రీవునితో స్నేహముచేసి, వాలినిజంపి, వానరులచే సీతను వెదకించి, హనుమంతునివలన సీత లంకలోనున్నదని తెలిసికొని, కోఁతులదండును తీసికొనిపోయి సముద్రమునకు వంతెనకట్టి, లంకకుఁ జని రావణునితో యుద్ధము చేయుచుండిరి. రాముఁడు రావణుని ధనుర్బాణము లన్నియు ఘోరయుద్ధమున నాశనము చేయఁగా వాఁడు బహుదుఃఖముతో నిలిచి యుండెను. అట్లు నిరాయుధుఁడై నిలిచియున్న రావణుని, రాముఁడు దయతోఁ జూచి "వీఁడు గొప్పశూరుఁడు. శూరధర్మము ననుసరించి మిక్కిలి యద్భుతముగాను, ఘోరముగాను పోరాడి నేఁడు కాలవ్యత్యాసముచే నిట్లు నిరాయుధుఁడై నిలిచి యున్నాఁడు. వీనికి జ్ఞానము గలుగునట్లును, సీతను నాకుఁ దెచ్చి యిచ్చునట్లును నీతి నుపదేశించెదను" అని తలఁచి, వా

నింజూచి, "ఓరి రావణా! నీవు మిక్కిలి శూరుఁడవు; క్షత్రియ ధర్మము ననుసరించి మిగుల నాశ్చర్యముగా నాతో గొప్ప యుద్ధముచేసి, నీబాణములన్నిటిని బోగొట్టుకొని నిరాయుధుఁడవై నిలిచితివి. నీయందు నాకుఁ గరుణకలిగినది. నీవు చేసినది దుష్కార్యమైనను ఈదినము నిన్ను వదలిపెట్టెదను. కాఁబట్టి యీదినమంతయు నీవు చక్కగా నాలోచించి రేపు నాభార్యను నాకుఁ దెచ్చియిమ్ము" అని చెప్పఁగా వాఁ డప్పుడు మనస్సులో నావిధముననే చేసెద ననుకొని లంకకుఁబోయి, దానిని మఱచి మఱుచటిదినమున మరల యుద్ధమునకు వచ్చి రాముని బాణములచేతఁ జచ్చెను.

ప్రేమతోఁ జెప్పిననీతి విననివానిని ఆ నీతియే యగ్నివలెఁ గాల్చును.

— రామాయణము, యుద్ధకాండము.

---

## 29. భూతదయ.

పూర్వకాలమున శిబి యనురాజు న్యాయ్యముగా రాజ్యమును బాలించుచుండెను. అతఁ డొకనాఁ డుద్యానవనములో నానందముగా విహరించుచుండ, డేగ తఱుముకొనివచ్చిన పావురమొకటి యతనిని శరణుచొచ్చెను. రాజు దాని కభయమిచ్చి చేరఁదీయఁగా, దానిని తఱుముకొనివచ్చిన డేగవచ్చి దానిని పట్టుకొనఁబోయెను. రాజు ఆడేగ నడ్డగింప, నది, "రాజా! శ్యేనాఃకపోతాన్ ఖాదంతి" అను వాక్యమును నీవు వినలేదా? నాయాహార మగు పావురమును నేను తినఁబోఁగా నన్నాటంక

పెట్టుట నీకు న్యాయమా?" అని యడిగెను అందులకు రాజు "ఈ కపోతము నన్ను శరణుచొచ్చినది. కావున నీకు వేఱు మాంసమిచ్చెదను" అనఁగా, నాడేగ "అట్లయిన నీపావురమంత యెత్తుమాంసమును నీదేహమునుండి కోసియిమ్ము" అనెను. రాజు వెంటనే త్రాసును తెప్పించి యొకప్రక్క పావురమునుంచి, రెండవప్రక్క తనదేహమునుండి మాంసమును గోసిపెట్టెను. అంతట మాంసముండు తక్కెడ పైకిలేచెను. రాజు మరలఁ దన శరీరమునుండి మఱికొంత మాంసపుముక్కను గోసిపెట్టెను. అప్పటికినది సరితూఁగనందున, రాజంతయు దుఃఖింపక తన శరీరమంతయును ముక్కలు ముక్కలుగాఁగోసి యందుఁ బెట్టుచుండెను గాని యాకపోతముతో సమముగాకుండెను. శిబి కొంతసేపాలోచించి యపారమైన భూతదయతోఁ దానే యా తక్కెడలోఁ గూర్చుండెను. ఇంద్రాగ్నులగు నాడేగయును పావురమును శిబికి భూతదయయందుఁగల పట్టుదలకు మిగుల సంతసించి యతనికిఁ దమ నిజరూపములను జూపి, యతని కెప్పటివలె దేహమును, దీర్ఘాయువును, మిగుల సంపదయు నొసంగి యంతర్ధానమొందిరి.

భూతదయగల బుద్ధిమంతులు తమప్రాణమునైన నిత్తురు.

— మహాభారతము, ఆరణ్యపర్వము.

---

## 30. వదలని పట్టుదల. (1)

సూర్యకులమందు సగరుఁ డను నొక రాజుండెను. అతఁ డశ్వమేధయాగమును జేయఁదలఁచి మంచిలక్షణములు గల

రొక గుఱ్ఱమును దెచ్చి, దానికి శాస్త్రవిధి ననుసరించి పూజాదు లొనర్చి, రొక యేఁడు భూప్రదక్షిణము చేయుటకుఁ దగిన సేనతో దానిని వదలెను. ఇంద్రుఁడా యశ్వమును బట్టుకొనిపోయి పాతాళలోకములోఁ దపస్సు చేయుచుండిన కపిలమహాముని ముందర కట్టివేసెను. గుఱ్ఱము కనఁబడని సంగతివిని, సగరచక్రవర్తి దానితో రక్షణార్థముపోయిన తన యఱువదివేల పుత్రులను కోపించి, దానిని వెదకి తెండని పంపెను. వారు భూలోకమంతయు వెదకి యశ్వమును గానక పాతాళమునకేగి యచ్చట గుఱ్ఱమును, దానిచెంతఁ దపముచేయుచున్న కపిలమహామునిని గాంచిరి. వారా ఋషియే దొంగయనితలఁచి, యతనినికొట్టియుఁ దిట్టియు నతని తపోభంగ మొనరింపసాగిరి. ఆముని వారిపై నాగ్రహించి తన తపోగ్నిచే వారిని భస్మముచేసెను. తరువాతఁ గొంత కాలమునకు, వారివంశమునం దుద్భవించిన తరమువాఁడగు భగీరథుఁడీసమాచారమునువిని, తనముత్తాతలకు నరకమును దప్పించుటకై బ్రహ్మనుగూర్చి చాలకాలము తపస్సుచేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై, గంగను దెచ్చి వారిభస్మరాసులమీఁదఁ బ్రవహింపఁజేసినయెడల వారికి స్వర్గము కలుగునని చెప్పెను. పిదప, భగీరథుఁడు గంగనుగూర్చియు శివుని గుఱించియుఁ దపముచేయఁగా శివుఁడు ప్రత్యక్షమయి తన జటాజూటములోని గంగయందలి యొకబిందువును వదలెను. అప్పుడు గంగ ప్రవాహరూపమున వచ్చుచుండ నడుమ నడుమ ననేకవిఘ్నములు కలిగినవి. అయినను, భగీరథుఁడు వదలక మిగులపట్టుదలతో నుండుటను దేవతలుజూచి 'వీఁడు తనప్రయత్నమును వదలువాఁడుకాఁడు' అని యెంచి త్రిమూర్తులతోఁగూడఁ బ్రత్యక్షమయి గంగాజలమును

వారి భస్మరాసులమీఁద పాఱునట్లు చేసిరి. అప్పుడా సాగరులు స్వర్గమునకుఁబోయి, యక్కడ సుఖముల ననుభవించుచుండిరి. గంగ భగీరథునిచేఁ దేఁబడినందున దానికి భాగీరథి యనుపేరు కలిగెను. ఇప్పటికిని ఎవఁడేని ఏకార్యమునైన చాల పూనికతోఁ జేయుచుండిన యెడల జనులు వానిని "వాఁడు భగీరథ ప్రయత్నము చేయుచున్నాఁడు" అని చెప్పుచున్నారు.

వదలక ప్రయత్నించినఁ దప్పక ఫలము కలుగును.

— రామాయణము, బాలకాండము.

---

## 31. వదలని ప్రయత్నము. (2)

పూర్వకాలమం దుత్తానపాదుఁడని యొకరాజుండెను. అతనికి సునీతియనియు సురుచి యనియు నిద్దఱు భార్యలుండిరి. వారిలో, సునీతి యను నామెకు ధ్రువుఁ డను పుత్రుఁడును, సురుచి యనునామెకు నుత్తముఁ డను కుమారుఁడును కలిగిరి. ఒకనాఁ డుత్తానపాదుఁడు రెండవభార్య సురుచి యంతఃపురములో నామెకుమారుని దొడపై గూర్చుండఁబెట్టుకొని యుండఁగా, రాజు ప్రేమింపని పెద్ద భార్యయగు సునీతి కుమారుఁడు ధ్రువుఁడును, తండ్రితొడ నెక్కుటకు మిగుల నాశతోవచ్చెను. అపుడు సురుచి ధ్రువునిచూచి మిగులఁగోపముతో, "ఓధ్రువా! నా కుమారుఁడే తండ్రితొడ నెక్కుటకును, సింహాసనము నెక్కుటకును నర్హుఁడు ; వానివలె నీవును గోరితివేని నాకడుపునఁ బుట్టుటకుఁ దపస్సుచేయుము" అని చెప్పుచు, వానిని మెడపట్టి గెంటెను. ఆబాలుఁ డాయవమానమునకు మిగుల దుఃఖ

పడి తల్లిదగ్గఱకుఁబోయి జరిగినదంతయు నామెతోఁజెప్పెను. సునీతి యావృత్తాంతమంతయు విని యాపరానిదుఃఖముతో, "కుమారా! నిర్భాగ్యురాలనగు నాకడుపునఁ బుట్టిన నీ వట్టిపద విని కోరఁదగదు. కోరితివేని నీసవతి తల్లి చెప్పినట్లు భగవంతుని గూర్చి తపస్సుచేసి యాతని యనుగ్రహమువలన నామె కడుపునఁ బుట్టినఁ గలుగునే కాని లేకుండిన కలుగజాలదు" అని చెప్పెను. అప్పుడా ధ్రువుఁడు తల్లికి నమస్కరించి యామె యొద్ద సెలవుపుచ్చుకొని తపముచేయ నడవికిఁ బోయెను. అడవిలో వానికి నారదమహాముని కనఁబడి "ఓధ్రువా! పసివాఁడవగు నీవెక్కడ? క్రూరమృగములుండు నీయడవి యెక్కడ? నివిక్కడ నుండఁదగదు, ఇంటికిఁ బొమ్ము" అని యెన్ని విధముల జెప్పినను వినక, వాఁడు పట్టుదలతో నుండుటనుఁజూచి, యమ్ముని వానికి దపస్సుచేయు క్రమమును దత్త్వమార్గమును ఉపదేశించిపోయెను. అంతట ధ్రువుఁడొక యాశ్రమమును గావించుకొని, నారదుఁ డుపదేశించిన రీతిగా భగవంతుని గూర్చి, యెన్ని విఘ్నములు సంభవించినను లక్ష్యపెట్టక నిశ్చలభక్తితో నాఱు నెలలు ఘోరతపస్సుచేసెను. వీని పట్టుదలను జూచి, విష్ణుదేవుఁడు శంఖచక్రగదాధారియై ప్రత్యక్షమై యతఁడు కోరిన దానికంటె నెక్కువగా వరములనిచ్చి, కొంతకాలము రాజ్యసుఖముల ననుభవించునట్లును, పిదపఁ దనలోకమందు (అనగా మేరుపర్వతశిఖరమందు) ఉండునట్లును, సూర్యచంద్రాది నవగ్రహములును, అశ్విన్యాది యిరువదియేడు నక్షత్రములును,

సప్తమహర్షులును, వానికిఁ బ్రదక్షిణము చేయుచుండునట్లును, అనుగ్రహించి యంతర్ధాన మొందెను.

విడువని ప్రయత్నము వ్యర్థముకాక సత్ఫలము నిచ్చును.

— భాగవతము 4-వ స్కంధము.

---

## 32. విడువని ప్రయత్నము. (3)

సూర్యవంశమున గాధి యని యొకరాజుండెను. అతనికిఁ గౌశికుఁ డని యొకకుమారుఁడు పుట్టెను. ఇతనికే విశ్వామిత్రుఁ డని నామాంతరము గలదు. విశ్వామిత్రుఁడు తన తండ్రి యనంతరము రాజ్యమేలుచు నొకనాఁడు వేఁటకై యడవికిఁ బోయి, యచ్చట నాశ్రమములోనున్న వసిష్ఠమహామునితో నొకవిషయమున వివాదము కలుగఁ జేసికొనెను. ఆవివాదమునఁ గౌశికుఁడు తనశక్తినంతయుఁ జూపి వసిష్ఠుని గెలువఁజూచెను; గాని వసిష్ఠుని తపోబలము ముందర నితనిబలము ప్రయోజనము కాక పోయెను. అప్పుడు కౌశికుఁ డపజయమునొంది, "క్షత్రియబలము నింద్యమైనది. బ్రహ్మతేజోబలమే బలము," అని యాశ్చర్యపడి, యక్కడనుండి రాజ్యమునకైనఁ బోక యావనమ్మందే, బ్రహ్మర్షిత్వమును సంపాదింపఁగోరి, గొప్పతపము చేయఁజూచెను. అతని తపమున కనేకవిఘ్నములు కలిగినవి. అతఁడు వాని నెంతయు లక్ష్యముచేయక బహుకాలము తపస్సుచేయఁగా బ్రహ్మ వానికి రాజర్షి యను పదవి నొసఁగెను. విశ్వామిత్రుఁడు తనకోరిక యింకను నెఱవేఱనందున, మిక్కిలి నియమముతో మరల తపస్సుచేయ నారంభించెను. ఇట్లుండఁగా త్రిశంకు వనురాజు తన కులాచార్యుఁ డగువసిష్ఠ

మహామునిని ఒక యాగము చేయింపవలెనని ప్రార్థింపఁగా, నతఁ డంతకుముందే మఱియొకనికి యాగము చేయింపఁబూనుకొనినందున నాయాగమైన పిదప వచ్చెదనని చెప్పిపంపెను. త్రిశంకుఁ డీసంగతిని కౌశికునకుఁజెప్ప, నతనికి కౌశికుఁడు యజ్ఞముచేయించి యతనిని శరీరముతోనే స్వర్గమునకుఁ బంపెను. అందువలనఁ గౌశికునకుఁ గొంతతపస్సు వ్యర్థమాయెను. ఇట్లు తపస్సు వ్యర్థమగుటచేఁ గౌశికుఁడు, తపమున కాచోటు అనుకూలముగా లేదని పడమటి దిక్కునకుఁ బోయి తపమున కారంభించెను. అప్పు డక్కడకుఁ దనమేనల్లుఁడగు శునశ్శేఫుఁడు యజ్ఞపశువుగాఁ దేఁబడ వానిని రక్షించుటకై విశ్వామిత్రుఁడు తనతపస్సులోఁ గొంతయుపయోగింపవలసివచ్చెను. అందువలనఁగూడ నతని తపస్సు కొంత వ్యర్థమాయెను. తరువాత నతని తపోభంగమునకై యింద్రునిచే నచటికిఁ బంపఁబడిన మేనక యను నప్సరసవలన నతనికి శకుంతల యను కూఁతురు పుట్టెను. ఇందువలనను కొంతతపస్సు నష్టమాయెను. ఈవిధముగాఁ దనతపస్సు నష్టమగుచుండుటనుజూచి కౌశికుఁడాదిక్కు వదలి, యుత్తరపుదిక్కునకుఁబోయి చాలకాలమక్కడ ఘోరతపస్సుచేయుఁగా, బ్రహ్మ ప్రత్యక్షమయి, "నీకింకను ఇంద్రియజయము చాలదు, బ్రహ్మర్షిత్వము కోరితివేని ఇంకను నీకు జితేంద్రియత్వము కావలెను" అని చెప్పెను. అంత కౌశికుఁడు నిశ్చలభక్తితో ఘోరమయిన తపముచేయుఁగా మరల నింద్రుఁడు వాని తపోభంగమునకై రంభను పంపెను. ఆరంభను జూచి కౌశికుఁడు మిగులఁ గోపముతో, "నీవు శిలవై పోదువుగాక" యని శాపమిచ్చెను. దానివలనను అతని తపస్సు

కొంత తగ్గిపోయెను. ఇట్లతని తపస్సు పలుమాఱు వ్యర్థము కాఁగా నచ్చటనుండి కౌశికుఁడు పూర్వదిక్కునకుఁ బోయి మిక్కిలి శాంతముతో చిరకాలము జితేంద్రియుఁడై తపస్సు చేసెను. అంతట బ్రహ్మ ప్రత్యక్షమయి "నీవిప్పుడు బ్రహ్మర్షి వయితివ"ని చెప్పెను. అప్పుడు కౌశికుఁడు బ్రహ్మనుజూచి "నే నీ రీతిని పట్టుదలతోఁ దపము చేయుటకు వసిష్ఠమహాముని యే కారణము. అందుచే నతఁడు వచ్చి నన్ను 'బ్రహ్మర్షి' యని పిలిచినఁగాని నాపూనిక విడువఁజాలన"ని చెప్పెను. అప్పుడు బ్రహ్మ, కౌశికుని వసిష్ఠునిచేత 'బ్రహ్మర్షి' యని పిలుచునట్లు కావించెను. అప్పటి నుండియు విశ్వామిత్రునకును వసిష్ఠునకును గల పూర్వ విరోధ మంతయు మానెను.

విడువని ప్రయత్నమువలన నన్నియు సిద్ధించును.
— రామాయణము, బాలకాండము.

## 33. చెడని విశ్వాసము.

ఇంద్రునికుమారుఁడు వాలియును, సూర్యుని కుమారుఁడు సుగ్రీవుఁడును నొక తల్లిబిడ్డలు. ఆ యన్నదమ్ము లిద్దఱును కిష్కింధాపట్టణమును పాలించుచుండిరి. వారి కొకప్పుడేదో యొకకారణమున పోరాటము కలిగినందున వారిలో మిగుల బలిష్ఠుఁడైనవాలి, సుగ్రీవునిఁ బట్టణమునుండి వెడలఁగొట్టెను. అప్పుడు వాయుదేవుని కుమారుఁ డగు నాంజనేయుఁడు సుగ్రీవునితోఁగూడ బోయి తానును సమస్తకష్టముల ననుభవించు చుండెను. సుగ్రీవుఁడును, హనుమంతుఁడును



సావిత్రి యముని సంధించుట.




నలుఁడు దమయంతిని అడవియందు వదలుట.

పురము విడిచి, ఋషిశాపమువలన వాలివచ్చుట కనుకూలిం పని ఋశ్యమూకపర్వతమున నుండఁగాఁ; గొంతకాలమునకు రావణుఁ డెత్తుకొనిపోయిన సీతను వెదకుచు రామలక్ష్మణు లామార్గముగ వచ్చిరి. అపుడు సుగ్రీవుఁడు వారినిఁజూచి వీరు వాలిపంపఁగా వచ్చినవారేమో యని భయపడెను. హను మంతుఁడు వారిచెంతకుఁబోయి వృత్తాంతము నెఱింగి, వారి తో సుగ్రీవుని సంగతిచెప్పి వారికిని సుగ్రీవునకును సఖ్యము చేసెను. తరువాత రాముఁడు వాలినిఁ జంపి సుగ్రీవునకు కిష్కింధారాజ్యము పట్టాభిషేకము చేసెను. అది మొదలు హను మంతుఁడు రామభక్తుఁడై రామునియందు చాల భక్తికలిగి యుండెను. అయినను హనుమంతుఁడు, సుగ్రీవుని ఆపదల యందును, సంపదలయందును గూడ నొక్కరీతినే కొల్చుచు నుండెను.

ఆపదయం దాదుకొనువాఁడే యాప్తుఁడు.

— రామాయణము, కిష్కింధాకాండము.

## 34. మేలునెఱుంగుట (కృతజ్ఞత)

కుంతీదేవికి సూర్యుని యనుగ్రహమునఁ గర్ణుఁ డను నొక సుతుఁడు కలిగెను. అతఁడు కుంతీదేవికి మొదటి కుమా రుఁడు. కుంతి, కన్యకగానుండినప్పు డితఁడు, దుర్వాసుఁ డుప దేశించిన మంత్రప్రభావమువలనఁ గలిగినందున ; కుంతి యా బిడ్డని వెంటనే యొకపెట్టెలోపెట్టి సముద్రములో విడిచెను. ఆపెట్టె సంతానహీనుఁ డగుసూతుఁ డనువానికి దొరకినది. వాఁ

డాపెట్టను తెలిచి, మహాతేజస్వియగు నాబిడ్డని తనభార్యకుఁ బెంప నిచ్చెను. ఆబిడ్డఁ డచ్చటఁ బెరిగి పెద్దవాఁడయి, కౌరవజ్యేష్ఠుఁడగు దుర్యోధనునితో స్నేహముచేసి యతెని కాంతరంగికుఁ డయ్యెను. పిమ్మట, కురుపాండవ యుద్ధసమయమున కుంతి తన శక్తికొలఁది కర్ణుని పాండవపక్షమునఁ జేరుమని యిట్లు వేఁడుకొనెను. "తండ్రీ! నీవు పాండవులలో నుండిన నీకుఁ గౌరవ రాజ్యము కలుగును; నీకుఁ బాండవులు సేవచేయుదురు." అనఁగా కర్ణుఁడు తాను దుర్యోధనునిసొమ్ము తినుచున్నాననియుఁ, దన్నె యతఁడు నమ్మియున్నాఁడనియు నందువలన వానిని వదలి రాఁ జాలననియు, మిత్రద్రోహము చేయుటకంటెఁ బ్రాణము నైన విడుచుట మేలనియుఁ, గావున నేను బ్రాణములనైన విడుతునేగాని వానిని విడువననియు దృఢముగాఁ జెప్పి కుంతిదేవిని పంపెను. తరువాత నతఁడు కౌరవులపక్షమున నే యుండి వారికొఱకై పాండవులవలనఁ బ్రాణములను గోల్పోయెను. ఇట్లు కర్ణుఁడు వీరస్వర్గము చూఱగొనెను.

స్వామిభక్తి సర్వశ్రేయము.

— మహాభారతము ఉద్యోగపర్వము.

---

## 35. నిజమైన నడత.

శ్రీకృష్ణుఁడు సాందీపుఁ డనుఋషియొద్ద విద్యాభ్యాసము చేయుచుండినకాలమున, నతనితో సుదామ్నుఁ డను నొకబ్రాహ్మణబాలుఁడును విద్య నేర్చుకొనుచుండెను. అందువలన వీరిద్దఱకును మిగుల స్నేహ మయ్యెను. పిమ్మటఁ గొన్నా

ళ్లకుఁ గృష్ణుఁడు చతుష్షష్టికళలు నేర్చికొని గురుదక్షిణ సమర్పించి ద్వారకాపట్టణమును జేరెను. సుదాముఁడును విద్య పూర్తికాఁగానే యథాశక్తి గురుదక్షిణ సమర్పించి, తనయూరిఁ జేరి వివాహమై గృహస్థుఁడై యుండెను. పిదప నతఁడు దరిద్రుఁడై సంసారమున మిగులఁ గష్టపడుచుండెను. ఇట్టి కష్టదశలో నతని కిరువదియేడుగురు బిడ్డలు కలిగిరి. కట్టుబట్టలు లేక చినిఁగిన వస్త్రములు కట్టుకొనుటచే నతనికి కుచేలుఁ డను నామాంతరముకూడఁ గలిగెను. అన్నవస్త్రములు లేక యతని భార్యాపుత్రులు పడునట్టికష్టములకు మేరయే లేదు. ఇట్టి కష్టముల నతఁడు సరకుచేయక సదా భగవధ్యానపరాయణుఁడై యుండి, యెప్పుడైన నొక సమయమున వడపికెఁబోయి, క్రింద రాలిన నివ్వరిధాన్యమును దెచ్చి గాని, అడుగకుండ నెవరైనఁ దమంతట నిచ్చిన దానములనఁగాని, తనకుటుంబమును సంరక్షణ మొనరించుకొనుచుండెను. అతనిభార్య మహాపతివ్రతగాన, నతఁడు తెచ్చిన పిడికెఁడు నివ్వరివడ్లను దంచి, బాగుచేసి, గంజగాఁ గాచి, దానిలో సగ మతిథులకు వేయుచు, తక్కిన సగమును భర్తకును బిడ్డలకును బెట్టి, తనకేమియు మిగులకుండుటచే నాకుండ కడిగిన నీళ్లను ద్రాగుచు, నదియు లేనినాఁ డుపవాసముండియు సంసారము గడపుచుండెను. ఇట్టికష్టముల ననుభవించుచు నొకనాఁ డామె భగవధ్యానము చేయుచున్న భర్తయొద్దకుఁ బోయి "మీ రెప్పుడును ఆనందముతో నుందురు. నేనిదారిద్ర్య బాధపడలేక బిడ్డలతోఁ గష్టములపాలగుచున్నాను. ఎన్ని దినములీ బిడ్డలను పస్తుపెట్టి నే నుపవాస ముండఁగలను. ఇఁకనైన మీరు మాయందనుగ్రహించి మీకు బాల్యస్నేహితుఁ డగు

శ్రీకృష్ణుని దర్శించి, యీదారిద్ర్యవృత్తాంత మతనికిఁ జెప్పి మమ్ము రక్షింపుఁడు" అని ప్రార్థింపఁగా, నతఁడు "భగవంతుని యొద్దకుఁ బోవునపుడు రిక్తహస్తములతోఁ బోరాదు; గాన నతనికిఁ గానుక యేమిచ్చెదవు" అని భార్యనడిగెను. అంత నామె, తనమగఁ డేరి తెచ్చిన నీవారధాన్యములోఁ గొంచెము కొంచెముగా మిగుల్చుచుఁ గొన్నాళ్ళకు వానిని యడుకులుగొట్టి, పెక్కుచిరుఁగులుగల తనమగని వస్త్రమున నాయడుకులుగట్టి, యతనిచేతికిచ్చి పంపెను. కుచేలుఁ డాయడుకులతోఁ, భగవద్ధ్యానము చేయుచు సముద్రపు టొడ్డుచేరి యోడనడపువారిని బ్రతిమాలి సముద్రము దాఁటి, ద్వారక చేరెను. ఆపట్టణమున భగవంతునిఁ గూర్చి స్తోత్రము చేయువారిని భజనలుసలుపువారిని పాటలు పాడువారిని జూచుచుఁ గుచేలుఁడు మెల్లమెల్లగాఁ బోయి, భగవంతుని యంతఃపుర ద్వారమునొద్దనున్న ద్వారపాలకులను బ్రతిమాలి లోనఁ బ్రవేశించి లోపలిసౌధములో హంసతూలికాతల్పమున రుక్మిణితో విలాసముగానున్న శ్రీకృష్ణునిఁ గాంచెను. అంతఁ గృష్ణుఁ డతనిఁజూచి, దిగ్గునఁ దల్పముడిగ్గి, యెదురువచ్చి, యతని నాలింగనము చేసికొని, స్వాగతమడిగి, తోడుకొనిపోయి, తనతల్పమునఁ గూర్చుండఁబెట్టుకొని, యర్ఘ్యపాద్యాదివిధులచేఁ బూజించెను. పిమ్మటఁ గృష్ణుఁ డతనితోఁ జిన్ననాఁడు తాము గురువునొద్దఁ జదువుకొను నప్పటిచర్యలు ముచ్చటించుచు "నాకేమి తెచ్చితివి?" అని యడుగఁగాఁ గుచేలుఁడు తాఁ దెచ్చిన యడుకు లిచ్చుటకు సిగ్గుపడుచు నూరకుండెను. కృష్ణుఁ డది గ్రహించి యా మూటను దానివిప్పి యొకపిడికెఁ డడుకులు నోటఁ బోసికొని, "ఇంద్రాదులకన్న

నెక్కుడైశ్వర్యమితనికిఁ గలుగుఁగాక"యని తలఁచెను. వెంటనే కుచేలుని యిల్లు సమస్తైశ్వర్యములతో నిండియుండెను. పిమ్మట కృష్ణుఁడు కుచేలునకుఁ దనయింట షడ్రసోపేతముగా భోజనము పెట్టించి, తృప్తిపఱచి పంపెను. అంతటఁ గుచేలుఁడు కృష్ణుని యొద్ద సెలవుగైకొని యింటికివచ్చిచూడ నది మునుపటివలెఁ గాక, నవరత్నఖచితముగాను, సువర్ణమయముగాను, ఉండుట చేత, దానిని గుర్తింపలేక సందేహించుచుండ, నతనిభార్య యెదురుగావచ్చి, కాళ్లుకడిగి, లోనికిఁ దోడ్కొనిపోయి సమస్తోపచారములచే నతనిని సంతృప్తిపఱుచుచుండెను. ఇట్టి సంపద గలిగినందున గర్వించి భగవంతుని మఱవక, కుచేలుఁడు మునుపటికంటె నెక్కుడుగ దైవధ్యానము చేయుచుండెను.

సంపదకలిగినను సత్పురుషులు సత్పథమును మానరు.

— భాగవతము 10-వ స్కంధము.

---

## 36. సత్సంగఫలము.

నారదుఁడు, తనపూర్వజన్మమందు చతుశ్శాస్త్రములు చదివిన పండితుని యింటిపనికత్తెకుఁ బుట్టెను. అప్పుడాపండితునియింటికిఁ గొందఱు భాగవతులువచ్చి కొంతకాల మచ్చట నుండిరి. ఆపండితుఁడు వారి కుపచారములు చేయుటకై తన పనికత్తె కొడుకును నియమించెను. ఆపిల్లవాఁడు వారికి మిక్కిలి శ్రద్ధతో సేవచేయుచు భగవంతుని వారు ధ్యానించుటయును పూజించుటయును మిక్కిలియు నాసక్తితోఁ జూచుచు వారు భోజనముచేసినపిదప భుక్తశేషమును (అనఁగా) వారు

భోజనముచేయఁగా మిగిలిన పదార్థములను మిక్కిలి ప్రీతితో భుజించుచునుండెను. ఇట్లు కొంతకాలము గడచినపిదప, వారా బాలుని భక్తిశ్రద్ధలకు మిగుల సంతసించి, వానికి భగవధ్ధ్యాన క్రమమును, పూజ మొదలగునవి చేయుక్రమమును ఉపదేశించి యాభాగవతులు దివ్యక్షేత్రములును, పుణ్యతీర్థములును దర్శింపఁబోయిరి. పిమ్మట నొకనాఁడాపిల్లవానితల్లి పాముకఱచి చచ్చుటచే నతఁడు దుఃఖించుచు నంతట, మున్ను భాగవతులు తనకుపదేశించిన విషయములు జ్ఞప్తికిరాఁగా విరక్తిచెంది హిమాలయమునకుఁ దపస్సుచేయుటకుఁ బోయెను. అతఁ డట్లరుగుచు నొకసరస్సుచెంత బలహీనముచే సొమ్మసిల్లియు, మరలఁ గొంతసేపటికిఁ దెప్పిరిలి లేచి యాకొంటలో స్నానముచేసి నీరు త్రాగి, బడలికతీర్చికొని యచ్చట నొకచెట్టుక్రింద, భాగవతులుపదేశించిన ప్రకారము భగవధ్ధ్యానము చేయుచుండెను. అంతఁ గొంతసేపటికి వాని హృదయమున భగవద్రూపమొకటి తోఁచి వెంటనే యదృశ్యమయ్యెను. తరువాత వాఁడు దానిని చక్కగాఁ గాంచలేనందులకు వగచుచు మరల ధ్యానింపఁ బ్రయత్నించుచుండ నాకాశవాణి "నీకీజన్మములో నింత మాత్రమే భగవద్దర్శనము లభించును; ఇఁక నెంతప్రయాసపడినను లాభము లేదు. వదలక భక్తితోనుందువేని నీకుఁ రాఁబోవు జన్మములో భగవద్దర్శనము సాక్షాత్తుగాఁ గలుగును." అని చెప్పెను. అంతట నాబాలుఁ డక్కడనుండిలేచి మిక్కిలి భక్తితోఁ దనకెప్పుడు చావుగలిగి మరుజన్మము కలుగునో యని యెదురుచూచుచు దేశసంచారము చేయసాగెను. ఇట్లతఁడు దేశసంచారముచేయుచుఁ గడపట నొక దివ్యక్షేత్రమున భగవ

ద్భజన చేయుచుండఁగా నతనికి ననాయాసమరణము సిద్ధించెను. అతఁడే యీజన్మములో మహాభక్తశిరోమణియు బ్రహ్మమానసపుత్రుఁడు నైన నారదుఁడుగాఁ బుట్టెను.

"సాధుసంగంబు సకలార్థసాధనంబు."
—భాగవతము ప్రథమస్కంధము.

---

## III. అధర్మవిషయము.

### 37. అధర్మమునవలని నష్టము.

విశ్రవసుఁ డనుమహర్షిని, ఒక రాక్షసకన్య యసురసంధ్యవేళవచ్చి, తనకు మిక్కిలి బలపరాక్రమశాలులయిన కొడుకులు కలుగవలయునని ప్రార్థించెను. ఆ ఋషి యామె వచ్చినవేళ మంచిది కాదనియు నందుచే కోరినకోరిక నెఱవేఱదనియును చెప్పెను. అయినను ఆమె వినకుండున నతఁడామెయడిగిన ట్లనుగ్రహించెను. పిమ్మటఁ గొంతకాలమున కామెకు రావణాదులుపుట్టిరి. వారిలో బెద్దవాఁ డగురావణుఁడు, బ్రహ్మను గుఱించి తపముచేసి, యాతనిచేత నుత్తమ వరములనుపొంది, గొప్పబలవంతుఁడయి, దానిచే గర్వించి యధర్మమునఁ బ్రవర్తింపసాగెను. మొట్టమొదట నా రావణుఁడు తనతండ్రియగు విశ్రవసుని యాజ్ఞనుమీఱి, తన యన్నయును లంకాధిపతియు నగు కుబేరునితో యుద్ధముచేసి, వాని పుష్పకవిమానమును దీసికొని, లంకాపురినుండి వానిని తఱిమివైచి తా నాలంకకు రాజయ్యెను. అదిమొదలు వాఁడుచేసిన యక్రమములను లెక్కింపనలవికాదు. స్త్రీలను చెఱపట్టుట,

ఋషుల తపస్సులను భంగపఱిచి వారిని హింసించుట, అనుసీ మొదలగు దుష్కార్యములను జేయుచు, ఒక్కొక్క దిక్కునకుఁబోయి యచ్చటి రాజులతో యుద్ధముచేసి వారి నపజయమునొందించి, బాధ పెట్టుచుండెను. వాఁడు బ్రహ్మవరబలముచేత ఏదిక్కునకు యుద్ధమునకుఁ బోయినప్పటికిని తప్పక జయమే కలుగుచుండెను. అందుచేత వానికి అధర్మకార్యముల యందే మిక్కిలి యుత్సాహముకలిగి, వానినే చేయుచుండెను. అప్పుడు వాని బాధకోర్వలేని కొందఱు మహాత్ములు వానికి శాపము లియ్యసాగిరి. వాని క్రూరకార్యములు హెచ్చుకొలఁదిని శాపములును ఎక్కువ కాఁ దొడంగెను. ఇట్లు శాపము లెక్కువగుచుండినందున వానికిఁ దెలియకయే వానిబలమును తగ్గుచు నుండెను. అధర్మమువలననే తన కెక్కడను జయముకలుగుచున్నదనెడి దురభిప్రాయముచే రావణుఁడు మిగుల గర్వించి భగవదవతారమయిన రాముని భార్యయగు సీత నపహరించి, లంకలో చెఱయందుంచి, భగవంతునియెడల నపరాధ మొనర్చి యాయనకోపమునకుఁ బాత్రుఁడయ్యెను. అంత రావణునకుఁ బూర్వపు శాపములన్నియుఁ "జెట్టుముట్టగా ప్రాఁతదొంగ పట్టుపడకపోఁడు" అనునట్లు రామునిచేఁ జిక్కి, తనకుటుంబముతోఁ గూడ నశించెను.

అధర్మ మారంభించునపు డింపుగానుండి దాని ఫలమనుభవించునపుడు కష్టముగా నుండును.

— రామాయణము, ఉత్తరకాండము.

---



రాముడు. భరతుని సంధించుట.

## 38. కోపమువలని కీడు.

సూర్యవంశమునందు అంబరీషుఁ డను రాజేంద్రుఁ డొకఁ డుండెను. అతఁడు న్యాయముగా రాజ్యపాలనము చేయుచు, భూలోకవిషయము లన్నియు అనిత్యములనియెంచి సదా భగవంతుని ధ్యానము చేయుచుండెను. అతఁడు విష్ణుభక్తుఁడై నందున, ఏకాదశినాఁ డుపవాసముండి, ద్వాదశినాఁడు భగవత్పూజాదులొనర్చి, బ్రాహ్మణ భోజనమయినపిమ్మట ద్వాదశి కాలము మించకమునుపే, తాను పారణ చేయుచుండెను. ఇట్లుండ నొక ద్వాదశీదినమున అంబరీషుఁడు పారణచేయఁ బోవుసమయమునకు దుర్వాసుఁ డనుముని వచ్చెను. అంబరీషుఁ డతనిని అర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి తనయింట భుజింప రమ్మని ప్రార్థించెను. దుర్వాసుఁ డందులకు సమ్మతించి, యమునానదికి స్నానము చేయుటకుఁబోయి చాలసేపువఱకు రాకుండినందున నంబరీషుఁడు, "ద్వాదశిగడియలు దాఁటినతరువాత పారణచేసిన లాభములేదు ; ఇతఁ డింకను రాలేదు ; అతిథిని రమ్మని ముందుభుజించినఁ బాపము వచ్చును" అని విచారించి యేమిచేయుటకును దోఁచక, ధర్మవేత్త లగుబ్రాహ్మణులవలన "భగవదభిషేకతీర్థమును బుచ్చుకొనినపక్షమున ద్వాదశికాలమునకుఁ బారణచేసిన ఫలముదక్కుననియును, అతిథి రాకమున్ను భుజించుదోషమును జెందకుండుననియును" జెప్పినందున, అంబరీషరాజు ఆవిధముగా నొనరించెను.

ఈసంగతి యమునానదిలో మునుఁగుచున్న దుర్వాసముని తనదివ్యదృష్టివలనఁ దెలిసికొని మిగులఁ గోపముతో

నొక జడను పెరికి, దానియందొక శక్తిని మంత్రప్రభావముచేఁ బుట్టించి, అంబరీషుని ప్రాణములు తీయుటకై యాశక్తిని బంపెను. అంబరీషుఁడు భయంకరాకారముతోఁ దన్ను మ్రింగుటకు వచ్చుచున్న యాశక్తినిఁ జూచి భయపడి విష్ణుమూర్తిని ప్రార్థింప భగవంతుఁడు తనభక్తుని రక్షించుటకై తన యాయుధమగు సుదర్శనమును బంపెను. ఆచక్రమాకాశమార్గమున దిగివచ్చి దుర్వాసుఁడంపిన శక్తిని భస్మముచేసి యా ఋషిపైకి రాఁగా నతఁడు భీతిచేఁ బరుగెత్తి బ్రహ్మాది దేవతల దగ్గఱకుఁ బోయి వారిని శరణుచొచ్చెను. వారు విష్ణుదేవుని చక్రాయుధము నుండి యాతనిని గాపాడుటకు దమకు శక్తి లేదనిరి. అంత నా ఋషి వైకుంఠమునకేగి శ్రీమన్నారాయణుని పదాబ్జములపై వ్రాలి శరణుచొచ్చెను. వైకుంఠవాసుఁడతనిఁ జూచి "నేను నా భక్తులకు లోఁబడియుందును, ఈచక్రము నాభక్తుని గాపాడఁ దొలఁగింప వచ్చినది. నిన్నుఁ గాపాడ నంబరీషునికిఁ దప్ప మఱి యెవ్వరికిని శక్తి లేదు. నీవతనినే శరణము వేఁడుము" అని చెప్పి పంపెను. అంత దుర్వాసఋషి, చక్రము బాధ పడలేక యంబరీషు నొద్దకుఁబోయి యతనినే శరణుచొచ్చెను. అంబరీషుఁ డాతని కర్ఘ్యపాద్యాదులిచ్చి, చక్రమును మునిబాధ తొలఁగింపుమని ప్రార్థించెను. అంత నా చక్రాయుధము మరలి విష్ణుదేవుని దగ్గఱకుఁ బోయెను. పిదప దుర్వాసుఁ డంబరీషుని మిగులఁ బొగడి చాలసంతోషముతో వెడలి పోయెను.

కోపము గొప్పకీడు కలిగించును.

— భాగవతము, 9-వ స్కంధము.

---

## 39. గర్వమువలనఁ గలుగుకీడు.

లంకాపురికి రాజైన రావణుఁడు, బ్రహ్మవరములచేతఁ దన కెందును జయమే కలుగుచున్నదనియు, యుద్ధమునఁ దన్నెదిరించువారే లేరనియు మిగుల గర్వించియుండెను. మఱియును వాఁడు తనకు సమానుఁడగు బలవంతుఁడు ప్రపంచసృష్టిలోనే లేఁడనితలఁచుచు నొకనాఁడా రావణుఁడు, దిగ్విజయముచేసి మిగుల గర్వాంధుఁడై. కైలాసగిరిమీఁదుగాఁ దనపురికిఁబోవుచుండెను. అప్పుడు వాని పుష్పకవిమానము కదలక నిలిచిపోయెను. అది చూచి రావణుఁడు మిగులఁ గోపముతో "నీపర్వతము వలననే నావిమాన మాఁగిపోయినది; కావున దీనిం బెఱికిపాఱవేసి నావిమానమును బోనిచ్చెదను" అని మదోన్మత్తతచేతఁ దలఁచెనేగాని; యగ్గిరికి నాథుఁడగు మహేశ్వరుని సేవించి యతని యనుగ్రహమునుఁబొంది యాకొండకుఁ బ్రదక్షిణముచేసి పోవుట కుద్దేశించినవాఁడుకాఁడు; కావున, వాఁడు వెంటనే విమానమునుండిదిగి యానగమును పెకలింపఁ బ్రయత్నించి దనశక్తినంతయు వినియోగించెను. ఈసంగతి సర్వజ్ఞుండగు పరమేశ్వరునకుఁ దెలియ, నతఁడు తనకాలి బొటనవ్రేలితో నా పర్వతము నదిమెను. అప్పుడు రావణుని చేతులాకొండక్రిందఁ జిక్కుకొనెను. "ఉడుముపోయినఁ బోనిమ్ము చేయిచిక్కినఁజాలు" నన్నట్లు రావణుఁడు తనచేతులను విడిపించుకొన నెన్నివిధములనో యాలోచించి ప్రయత్నించిచూచెను; కాని లాభము లేక పోయెను. ఇట్లు వాఁడు చాలకాలము కష్టపడి, కడకుఁ దెలివి తెచ్చుకొని, యీశ్వరుని సామగానముచే స్తుతించి, యతనిని సంతోషపఱిచి యతని యనుగ్రహమునఁ

జేతులు విడిపించుకొని, విమానముతో కైలాసగిరికి బ్రదక్షిణము చేసిపోయెను.

ఈవిధముగాఁ గలిగిన యవమానమును లక్ష్యపెట్టక, రావణుఁడు మఱియొకసారి కార్తవీర్యార్జునునిచేతను, ఇంకొకమాఱు వాలిచేతను జిక్కి యవమానపడెను. వేఱొకప్పుడీ రావణుఁడే శ్వేతద్వీపమునందు స్త్రీలచేతఁ జిక్కఁగా వారతనిఁ బెండువలెనాడి గజిబిజిచేసి విడిచిపెట్టిరి. అప్పటి కతనికి గర్వభంగమయ్యెను.

లోకములో నొకనిని మించినవాఁడు మఱియొకఁడుండును.

— రామాయణము, ఉత్తరకాండము.

---

## 40. గర్వమువలనఁ గలుగుకీడు.

భరతవంశమున యయాతి యనురాజుండెను. అతఁడు వృద్ధుఁడై, తనరాజ్యమును కడపటి కుమారుఁడగు పూరునకు నిచ్చి తాను తపముచేయ నడవికిఁబోయెను. అతఁ డచ్చటనే కొంతకాలము తపస్సుచేసి మృతినొంది, పిదపఁ దాను రాజ్యపాలనకాలములోఁ జేసిన పుణ్యావిశేషముచేతను, అడవిలో నొనరించిన తపోమహిమచేతను స్వర్గమునకుఁ బోయెను. అతఁ డక్కడఁ జాలకాలము స్వర్గసుఖమనుభవించి యింద్రునికీర్తితో సమానమగు కీర్తిని పొందెను. ఇట్లుండ నొకనాఁ డింద్రసభలోఁ 'ఒక్కొక్కపుణ్యమున కొక్కొక్క స్వర్గ ముండవలయున'ను విషయము, సంభాషణ సమయమున వచ్చెను. దానినిగుఱించి యెవరికిఁ దోఁచినట్లు వారు మాటలాడుచుండిరి. అప్పుడు

యయాతిగూడఁ దనకుఁ దోఁచినది తానును జెప్పుచుండ నింద్రుఁ డతనినిజూచి, "నీ వేవిధమైన పుణ్యముచేసి యీాపదవిని పొందితివి" అని యడిగెను. అంత యయాతి యేదో యొకవిధమున వినయోక్తులతో బదులుచెప్పక, "నేను శ్రేష్ఠములయిన పుణ్యములు చేసితిని. మహర్షులుకూడ నాకు సమానులుకారు." అని మిగుల గర్వముతో నాత్మస్తుతి చేసికొనెను. ఇంద్రుఁ డా మాటలువిని, "నీవుచేసిన పుణ్యమంతయు నీ గర్వపుమాటలచే క్షీణించినది; కావున, నీ విక్కడనుండుట కర్హుఁడవుకావు" అని వీని నిచ్చటనుండి భూలోకములోఁ బడునట్లు త్రోసి వేయుఁడని తన సేవకుల కాజ్ఞాపించెను. వెంటనే యింద్రుని సేవకు లతనిని ద్రోయుచుండ నతఁడింద్రునిఁజూచి "ఈవ్యర్థప్రసంగమువలన నాకీనష్టము కలిగినది. నేను పుణ్యాత్ములగు సజ్జనుల నడుమఁ బడున ట్లనుగ్రహింపవలయును." అని వేఁడుకొనెను. ఇంద్రుఁ డతఁడు కోరినప్రకార మొనరించెను. యయాతి తన పౌత్రులు యజ్ఞముచేయుచుండిన స్థలమునందు పడెను. వారతనికిఁ దమపుణ్యము నిచ్చిరి. ఆపుణ్యబలమున యయాతి మరల స్వర్గమునకుఁ బోయెను.

గర్వముగలవాఁడు గౌరవము నొందఁడు.

— మహాభారతము, ఆదిపర్వము.

---

## 41. గర్వముచేతఁ గలుగుకీడు.

సూర్యవంశమునఁబుట్టిన భగీరథుఁ డనువాఁడు బహుకాలము తపస్సుచేసి గంగను భూలోకమునకు రమ్మని ప్రార్థించెను. గంగాదేవి తాను దేవలోకములో విహరించునది కావున

మిగుల గర్వముగలదయి, యక్కడనుండి గొప్పధ్వనితోను ఆడంబరముతోను భూలోకమును ముంచునట్లు భయంకరముగా దుమికెను. అప్పుడు భగీరథుని తపమునకు మెచ్చి, పరమదయాళుండును, భక్తపరాధీనుండును, సర్వజ్ఞుండు నగుశంకరుండు లోకముల కుపద్రవముకలుగునని గంగ పడెడి చోటునకువచ్చి తన జడల నడ్డముగాం బట్టెను. అంత గంగ పరమేశ్వరునిజడలలోం బడి తాను పడినచోటు తెలియక యణంగి కనంబడ కుండెను. గంగాదేవికి బలమంతయుం బోవుటచే నీశ్వరుని జడలలో నొక వెండ్రుకయం దొకబిందువై యుండెను. పిమ్మట భగీరథుండు శివునిం గూర్చి తపముచేసి గంగను విడువవలయునని ప్రార్థింప నామహేశ్వరుం డతనిభక్తికి మెచ్చి గంగయందలి యొకబిందువును మాత్రమే భూమికి విడిచెను. అంత గంగ భూలోకములోం బ్రవహించెను. గంగ భగీరథునిచేం దేబడినందున "భాగీరథి" యను పేరు కలిగెను.

పిమ్మట నీశ్వరుని జడనుండి పడిన గంగ భూలోకములో భగీరథుండు చూపినమార్గముననే వచ్చుచుండెను. ఇట్లు వచ్చుచున్నగంగ, భగీరథుని ముత్తాతలను ముక్తిని పొందింపం బోవుచున్నానని గర్వించి, దారిలో జహ్నుమహర్షి యాగము చేయుచుండ, నాయాగశాల ప్రక్కనుండి తనకు భగీరథుండు దారి చూపంగా నాదారినిరాక యజ్ఞశాలలోం బ్రవేశించి వచ్చుచుండెను. అంత జహ్నుమహర్షి కోపించి యాగంగను అంజలిచేతిలోం బట్టుకొని యాచమనము చేసెను. అంత ముందుపోవుచున్న భగీరథుండు గంగజాడ కనంబడమిచే వెనుకకుం దిరిగి చూచి యామెను గానక, జహ్నుమహర్షి చెంతకు వచ్చి యత

నితోఁ దాను గంగకొఱకై పడిన ప్రయాసమంతయుఁ జెప్పి ప్రార్థింపఁగా నాజహ్నుమహాముని భగీరథుని భక్తివిధేయతలకు సంతసించి, గంగకు గర్వము తగ్గించి, తన చెవులనుండి విడిచెను. అదిమొదలు గంగకు గర్వభంగము గలిగి "జాహ్నవి", యను పేరుగూడవచ్చెను. పిమ్మట భగీరథుఁడు గంగను తనముత్తాతల భస్మరాసులపైఁ బ్రవహింపఁ జేసి వారిని ముక్తులను గావించెను.

గర్వముగలవారు గౌరవ మొందరు.

— రామాయణము, బాలకాండము.

---

## 42. దురాశ దుఃఖకారణము.

పూర్వము సృంజయుఁడను నొక రాజుండెను. అతఁడు పేరాసకలవాఁడు. అందుచే నతఁడు తనకు, 'విశేషముగా బంగారును సృష్టించు పుత్రుని దయచేయు' మని భగవంతునిగూర్చి గొప్పతప మాచరించెను. అంత భగవంతుఁడు ప్రత్యక్షమయి, వాని కోరికప్రకారమే యొకకుమారుఁడు కలుగున ట్లనుగ్రహించెను. మఱికొన్ని దినములకు సృంజయున కొకకుమారుఁడు కలిగెను. ఆ బాలుని దేహమునుండి వచ్చు చెమటయు, నోటినుండి కారుచొంగయు బంగారుగుచుండుటవలన వాని తండ్రి వానికి "సువర్ణష్ఠీవి" యని పేరుపెట్టెను. ఆరాజు తన కుమారుని వలనఁగలిగిన బంగారుతోనే నగరులను నిర్మించి యా నగళ్లంతయు బంగారుతోనే నింపెను. ఇదిచూచి యారాజ్యములోని ప్రజ లనేకులు సువర్ణష్ఠీవివలనఁ దాముకూడ ధనము గూడఁబెట్టఁదలఁచి యతని స్వాధీనముచేసికొన ప్రయత్నించు

చుండిరి. ఈసంగతి నెఱింగి రాజు తన కుమారునకు జనుల వలన నేమి కీడుమూడునో యని భయపడుచుండెను. పిమ్మట నొకనాఁడు రాజభవనమున దొంగలు దూరబడి, సద్రించుచున్న రాకొమరు నెత్తుకొని యడవికిఁబోయి, యచ్చట వాని దేహము నుండి వచ్చు చెమటయు జొల్లును బంగారమగుట చూచి దాని నపహరించి, దేహమందే యింతబంగారుండఁగా లోపల నెంత బంగారముండునో, యను దురాశచే వాని శరీరమును చీల్చి చూచిరి. అందు రక్తమాంసములు తప్ప మఱేమియు లేకుండెను. అందుచే వా రాశవము నచ్చటపాఱవేసి, తామా బాలుని చెమట చొంగలవలనఁగలిగిన బంగారమును పంచుకొనుటలోఁ బోరాడి యొకరినొకరు గొట్టుకొని యచ్చటనే పడిచచ్చిరి. మఱునాఁడు రాజు తన కుమారునిఁగానక వెదకుచువచ్చి, దొంగల శవములనడుమఁబడియున్న తనకొడుకును జూచి "నా పేరాసచేతనే వీఁడు చచ్చెను; నావలెనే యాశపడి వీరును జచ్చిరి" అని దుఃఖించుచు పుత్త్రశోకముచే నతఁడును ప్రాణములను విడిచెను.

పేరాస పెనుచేటును గలిగించును.

— మహాభారతము, శాంతిపర్వము.

---

### 43. జూదమువలనఁ గలుగుహాని.

పూర్వకాలమున నిషధదేశమునకు నలుఁడు రాజైయుండెను. అతఁడు పుష్కరరాజుతో జూదమాడి, తన యైశ్వర్యమును, రాజ్యమును ఓడిపోయి, తన భార్యయగు దమయంతి



బలిచక్రవర్తి యీమాటను నెరవేర్చుటకు తన తలను చూపుట.



హనుమంతుఁడు సుగ్రీవునికి రామునితో స్నేహము చేయించి
తన విశ్వాసమును చూపుట.

తోఁగూడ నడవికిఁజని యచ్చట సకల కష్టముల ననుభవిం
చుచుఁ దుదకు తన భార్యనుగూడ నీడఁబాసెను. తరువాత
నలుఁడు ఋతుపర్ణ మహారాజుదగ్గఱ వంటవాఁడుగాను అశ్వ
శిక్షకుఁడుగాను రథసారథిగాను నుండి చాలకష్టముల ననుభ
వించుచుండెను. దమయంతియు నడవిలోఁ గొంతకాలము కష్ట
ముల ననుభవించి, పిమ్మట చేదిపతియైన సుబాహునింటిలో
నంతఃపురమున "సైరంధ్రి"గానుండి, యావలఁ దనపుట్టినిల్లు చేరి
తనమగనిరాక కెదురు చూచుచుండెను. ఇట్లు కొంతకాలము
కష్టపడినతర్వాత నలదమయంతు లిద్దఱును గలిసికొని, తమ
రాజ్యమును జయించి మునుపటివలె సుఖ మనుభవించిరి.

పాండవులలో జ్యేష్ఠుఁడగు ధర్మరాజు, దుర్యోధనునితో
జూదమాడ నొప్పుకొని యతనికి బదులుగా నతని మేనమామ
యగు శకునితో నాడి, రాజ్యమంతయు నోడి, తన తమ్ములను
దన్నునుగూడ నోడిపోయెను. తామందఱు దుర్యోధనాదులకు
సేవకులయి, ద్రౌపదికి మిగులఁ గష్టములను గలిగింపఁగా నామె
తనబుద్ధివిశేషమునఁ దనమగలను దాస్యమునుండి విడిపించెను.
మరలఁ గొంతకాలమునకు, దుర్యోధనాదులు ఆలోచించి
ధర్మజుని మోసమున రప్పించి, అతనిని జూదమాడ నొప్పించి,
శకునిచే జూదమాడించి, ఓడించి రాజ్యమంతయుఁ బుచ్చు
కొని, పండ్రెండేండ్లరణ్యవాసమును నొక్కయేఁడజ్ఞాత
వాసమును నడుపునట్లును, అజ్ఞాతవాసకాలములోఁ గలిసికొనిన
యెడల, మరల నిట్లేయరణ్యాజ్ఞాతవాసములు చేయునట్లును
ఏర్పాటుచేసి, పాండవులను వనమునకుఁ బంపిరి. పాండవులీయర
ణ్యాజ్ఞాతవాసములయందు పడిన కష్టములు చెప్ప నలవికాదు.

ఈ జూదములాడునపుడు గొప్పకలహములు కలుగుటయుఁ గలదు. తరువాత ధర్మరాజాదులు విరాటమహారాజు పట్టణములో నజ్ఞాతవాసము చేయునపుడు దుర్యోధన ప్రేరితులయి సుశర్మాదులువచ్చి, విరటునిపట్టణపు దక్షిణపు వైపుననున్న గోవులను పట్టుకొనఁగా, విరటుఁడు, సైన్యముతో వారిమీఁదికి యుద్ధమునకుఁ బోవుచుండునపుడు, అతనితోఁగూడ నూరిలోనివారందఱును యుద్ధమునకు వెళ్లిరి. ఆసమయమున, కౌరవులసేన మఱియొకటివచ్చి, ఉత్తరపుదిక్కునందు గోవులను పట్టుకొనఁగా గోపాలురువచ్చి పట్టణములోఁ జెప్పిరి. అప్పటికే భటులు మొదలగువారందఱు యుద్ధమునకుఁ బోయియుండుటచే విరటునిపుత్రుఁడగు నుత్తరుఁడు, గురువును పేడియునగు నర్జునుని తనకు రథసారథిగాఁ జేసికొనిపోయి, అతనిసాహాయ్యమున కురుసేనలను జయించి, ఆ సంతోషవార్తను రాజునకుఁ దెలియఁజేసెను. విరటుఁ డావార్తనువిని తనకుమారుని పరాక్రమమునకు సంతసించి, "కంకుఁడు" అనుపేరుతో సన్న్యాసి వేషముననున్న ధర్మరాజును జూద మాడరమ్మని పిలిచెను. జూదమువలనిఫలమును దాను స్వయముగ ననుభవించుచుండుటచే ధర్మరాజు, అట్టి సంతోషసమయమున జూదమాడరాదని, రాజునకుఁ బలుమాఱు చెప్పిచూచెను. కాని, రాజు విననందున జూదమునకు మొదలుపెట్టెను. "ఉత్తరుఁడు జయించెను" అని రాజు పాచికలు వేయఁగా, కంకుభట్టు, "బృహన్నల గెలిచెను" అని పాచికలు దొర్లించెను. మిగుల సంతోషములో మునిఁగియున్న యారాజు, "పురుషుఁడుజయించునా? నపుంసకుఁడగువాఁడుజయించునా?" అని యనుచు కంకుభట్టును పాచి

కంతో నెత్తిపైఁ గొట్టెను. ధర్మరాజు ఆగాయమువలన బాధపడు చుండెను.

జూదమువలనఁ దప్పక హానికలుగును.

— మహాభారతము, ఆరణ్యపర్వము.

## 44. మధువుఁ గ్రోలనున్న మతియుఁ బోవు.

శ్రీకృష్ణుఁ డవతరించిన కులమునకు యాదవకులమని పేరు. ఆ కులములో ననేకులు పుట్టిరి. ఆపుట్టినవా రందఱును మిక్కిలి పరాక్రమశాలులై యుండిరి. యాదవవంశమునఁ బుట్టిన వారెవరును ఎదిరింపఁజాలకుండుటచే వారు మిక్కిలి గర్వించి యుండిరి. ఇట్లుండ, "బుద్ధిః కర్మానుసారిణీ" యనునట్లు, ఆ యాదవకులము నాశమందుటకు సమయకాలము సమీపింపఁగా మధుపానమునం దధిక ప్రీతి పుట్టెను. అంత, నొకనాఁడు ద్వారకాపట్టణమునకు సమీపమునందున్న ప్రభాస తీర్థమునకుఁ బోయి, యాతీర్థమునందు స్నానాదికము లొనర్చి, యక్కడనే కొన్ని దినములు వేడుకగా నుండుటకు నిశ్చయించుకొనిరి. అక్కడ నొకనాఁడు వారందఱును గూడి యొడలెఱుఁగకుండ మధుపానము చేసి, యభిముఖులై రెండుపంక్తులుగాఁ గూర్చుండి, వినోదముగా ననేకవిషయములనుగుఱించి మాటలాడఁ దొడఁగిరి. ఆమాటలయందు మహాభారత యుద్ధప్రసంగము రాఁగా నందలి ధర్మాధర్మ విచారమునుబట్టి రెండుపక్షములై, వారిలో వారికి వివాదము కలిగెను. ఆవివాద మంతకంత కతిశయించి యొకరినొకరు నిందించుకొనసాగిరి. పిమ్మట పరస్పరము యుద్ధ మారంభమాయెను. అంతట నాయాదవులు కూర్చుండి

యున్న రెండుపంక్తులవారును లేచి నిలువఁబడి రెండు తెగలుగా నేర్పడి ఘోరముగాఁ బోరాడఁదొడఁగిరి. ఇట్టి యుద్ధమున వారు ప్రభాసతీర్థమునందలి సముద్రములోనున్న జమ్ము అనెడి తుంగను పెఱికి, దానితోఁ గొట్టుకొనసాగిరి. మహాబలవంతులును గొప్పవంశజులును మహాత్ములునగుటచే వారి దెబ్బలు వ్యర్థముకాక వారందఱును మడిసిరి.

మధుపానమువలన యుక్తాయుక్తములు తెలియవు.

— మహాభాగవతము, మౌసలపర్వము.

## 45. దుస్సంగ ఫలము.

పాండవులు వనవాసము చేయుచుండఁగా నొకనాఁడు దుర్యోధనునిసభకు దుర్వాసఋషి వచ్చెను. అంత దుర్యోధనుఁడు ఆఋషి కెదురుగాఁ బోయి, అర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి, అతనిని దోడ్కొనివచ్చి భిక్షచేసి పొమ్మని ప్రార్థించెను. ఋషి యా దిన మక్కడనుండి, అతఁడొనర్చిన యతిథిసత్కారములకు సంతసించి మఱునాఁడు పయనమై దుర్యోధనునిఁజూచి, "నీకుఁగావలసిన వరము నడుగు మిచ్చెదను" అనెను. ఆమాటవిని దుర్యోధనుఁడు, "స్వామీ! తాము మా గృహమునకువచ్చి మమ్మనుగ్రహించినట్లే, వనవాసము చేయుచున్న మాసహోదరులగు పాండవుల దగ్గఱకుఁబోయి వారిని గూడఁ గృతార్థులను జేయవలయును. వారిభక్తిని పరీక్షించుటకు రాత్రి పదిగడియలకుఁబైన నక్కడకుఁ బోవలయును" అని ప్రార్థించెను. ఆఋషి యారీతినే యర్ధరాత్రమునందు, పాండ

వులయొద్దకుఁ బోయి చేరెను. అంతకుమున్నే ద్రౌపదీదేవి, అక్షయపాత్రమును (ఇది సూర్యునివరమువఁ బాండవులకు లభించినది. దీనిని ద్రౌపదీదేవి పరిశుద్ధయై బోరగించిన మాత్రమున దీనిక్రింద నెందఱకైనను భక్ష్యభోజ్యాదులు అక్షయముగుచుండును. ఇది యీపాత్రమహిమ, దీనివలననే దీని కక్షయపాత్రమను పేరువచ్చెను.) బోరగించి, అతిథులకును తనభర్తలగు పాండవులకును భోజనముపెట్టి, తానును భుజించి, ఆపాత్రమును పరిశుద్ధము చేసి దాఁచెను. దుర్వాసుని దుర్యోధనుఁడు పాండవులయొద్దకు రాత్రివేళఁ బంపుటకు హేతు వేమనఁగా, పాండవులు, రాత్రివేళలో ఋషికి ఆతిథ్య మీయఁజాలరనియును దానిచే నాముని వారిని శపించుననియు నతని తలంపైయుండెను. ఋషి శిష్యసహితముగావచ్చిన దుర్వాసుని, పాండవులెదుర్కొని చ[illegible] తోడ్కొనివచ్చి, ఆరాత్రి యచ్చట నాతిథ్యమును గ్రహింపుఁడని ప్రార్థించిరి. అందులకతఁ డంగీకరించి, నదికిఁబోయి సంధ్యావందనాది కృత్యముల నెఱవేర్చికొని వచ్చెదనని చెప్పి నదికిపోయెను. పిమ్మట ద్రౌపది యక్షయపాత్రమునుజూచి, "భగవదనుగ్రహము లేనిది, దీనియందీకాలమున భోజ్యపదార్థములు కలుగవు" అని భగవంతుఁడగు శ్రీకృష్ణునిఁ బ్రార్థించెను. వెంటనే భగవంతుఁడువచ్చి యక్షయపాత్రమును దెమ్మని ద్రౌపదికి కనఁబడకుండ నుండిన యన్నపుమెతుకును కూరబద్దనుతిసి తాను భుజించి, నీళ్లుత్రాగి, "దీనిచేత సర్వలోకములును తృప్తిపొందునుగాక" అని కూర్చుండెను. దీనిచే నదికి సంధ్యావందనాది విధులఁ దీర్ప నేగిన దుర్వాసునకును అతని శిష్యులకును కడుపులునిండి యాఁకలి యణఁ

గెను. కాని చే వారెప్పటికిని రాకుండుటచే ధర్మరాజు, భీముని, బంపి దుర్వాసాదులను తోడ్కొనిరమ్మని పంపెను. అతఁడు వదికిఁ బోయి చూచునప్పటికి వారు తృప్తిగాభుజించినట్లు కడుపులు నిండి, ఆయాసముచే లేవలేక పడియుండినందున భీముఁడు మెల్లగా వారిని ధర్మరాజునొద్దకు తోడ్కొనివచ్చెను. వా రచ్చటనున్న కృష్ణునిఁజూచి నమస్కరించి, "స్వామీ! దుర్యోధనుఁడు చేసినమోసము దెలియాక మే మిచ్చటికివచ్చితిమి. దానిచే మాకీయవస్థ సంభవించినది. నమ్ముఁ గాపాడవలయును" అని ప్రార్థించి, దుర్యోధనునింటికిఁ దాముపోయినది మొదలప్పటి వఱకును జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పి, "మాకు భోజనము చేయకయే భోజనముచేసినట్లు కడుపు లుబ్బియున్నవి. ఈ యుబ్బుతగ్గించి మమ్ముఁ గాపాడవలయును" అని వేఁడుకొనిరి. శ్రీకృష్ణుఁడు వారిప్రార్థనప్రకార మనుగ్రహించి పంపెను.

దుస్సాంగత్యము సర్వానర్థములను గలిగించును.

— మహాభారతము, ఆరణ్యపర్వము.

---

## 46. ఓర్వలేనితనము.

ఖనిత్రుఁడని యొక మునీశ్వరుఁడు గలఁడు. అతఁడు భూత దయయును, దైవభక్తియుఁ గలవాఁడగుటచేత నందఱు వతని యందుఁ బ్రీతికలిగియుండిరి. అతని సహోదరులందఱు దుష్టు లగుటవలన వారినందఱును నిందించుచుండిరి. ఆ ఖనిత్రుని తమ్ము లందఱును ఒక్కవాఁడు తమ్ము జనులందఱును దూషించు టయుఁ దమయన్నను భూషించుటయుఁ జూచి సహింపలేక

యతనిని చంప నిశ్చయించుకొనిరి. అందులకై వారొక యాగముఁ జేసి దానివలన నొక పిశాచమునుబుట్టించి తమయన్నను జంపు మనిపంపిరి. ఆపిశాచము, ఖనిత్రునియొక్క యడఁకువ, దైవ భక్తి, భూతదయ మొదలగు సద్గుణములుచూచి, అతని సమీపింప వెఱచి, దూరముననే నిలిచి, "ఈతనిని ఇతనితమ్ములు చంపుమని నన్నుఁబంపిరి? కారణము తెలియలేదు" అని యాలోచించి, ఖనిత్రునితమ్ములమీఁద కోపించెను. "లోకములో నెవఁడైన నొకపిశాచము నొకనిమీఁద ప్రయోగముచేసిన యెడల అది వానిమీఁదికిఁ బోవుటకు శక్తిలేనిపక్షమున, అది తన్నుఁబంపిన వానిమీఁదికిఁ బోవుట దాని స్వభావము" కాఁబట్టి యా పిశాచము వెంటనే మరలిపోయి, తన్నుఁ బంపిన వారలనందఱను గొట్టిచంపెను.

"చేఱపకురా చెడెదవు."

## 47. అత్రము కూడదు.

యయాతియను మహారాజొకఁడుండెను. అతనికి ననేకులు మనుమలుండిరి. ఆమనుమలలో ప్రతర్దనుఁడనువాఁ డొకఁ డుండెను. ఈతనియింటియందు నారదమహాముని కొంతకాలము వసింపవలసి వచ్చెను. ఆసమయమున ప్రతర్దనుఁడు, నారదు నకుఁ దగిన యుపచారములుచేసి యతని యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను. ఇట్లుండ నొకనాఁడు నారదుఁడు తన్ను నూరేగింపుమని ప్రతర్దనునిగోరఁగా నతఁ డామానిని నాలుగు గుఱ్ఱములుపూన్చిన తన రథముపై నెక్కించి, తాను సారథియై

పట్టణపువీథులలో నుత్సవము చేయుటకు బయలు వెడలెను. అంతట నొక బ్రాహ్మణుఁడు వారి కెదురై, తన కొక్క గుఱ్ఱ మిమ్మని రాజును యాచించెను. రాజు, ఆ బ్రాహ్మణునిఁజూచి మిక్కిలి శాంతముతో, " ఇంటికిఁ బోయినపిమ్మట నిచ్చెదను " అని చెప్పెను. అందుల కా బ్రాహ్మణుఁడు సమ్మతింపక, ''నాకిప్పుడే కావలయును'' అని రాజును నిర్బంధింపఁగా నతఁ డొక గుఱ్ఱమును విప్పి యతని కిచ్చెను. తరువాత రాజు మఱికొంత దూరము పోవునప్పటికి, మఱి ముగ్గురు బ్రాహ్మణులు వచ్చి మొదటివానివలెనే తక్కిన మూఁడుగుఱ్ఱములను యాచించిరి. అంతట రాజు తేరునకుఁగట్టిన తక్కిన గుఱ్ఱములను మూఁటిని విప్పి వారి ముగ్వురకును దానముచేసి, రథమును తానే లాగ నారంభించెను. ఇట్లా బ్రాహ్మణు లొకరి వెనుక నొకరువచ్చి గుఱ్ఱములను గైకొని పోవుటనుజూడఁగా వారింతకుముందే తమలో నాలోచించుకొని వచ్చినట్లు తోఁచుటచేతను, రథమును దానే యీడ్చుకొని పోవలసి వచ్చుటచేతను, రాజునకుఁ గోపమువచ్చి తొందరపడి, " బ్రాహ్మణు లడుగఁదగిన వస్తువులును, వారికి నేనియ్యఁదగిన వస్తువులు నిఁక నాదగ్గఱ నేమియులేవు'' అని పల్కెను. దానివలన నతఁ డెంతపుణ్యము చేసినను కొంచెము పాపముగూడ నతనికి సంభవించెను.

పాలలోఁ గలసినవిషమువలె నాత్రము గొప్పపుణ్య కార్యములను చెఱచును.

— మహాభారతము, ఆరణ్యపర్వము.

---

## 48. జీవహింస.

మాండవ్యుఁడను నొక్క మహాముని, తన బాల్యమున తూనీఁగలు మొదలగు పురుగుల తోఁకలకు ముండ్లుగ్రుచ్చి, యవి బాధపడుచుండుటనుజూచి తాను సంతోషించుచుండెను. బాల్యమున నిట్టిచేష్టలు చేయుచుండి యుక్తవయస్సు రాఁగానే యొకచోట నాశ్రమము గావించుకొని మహామునియై తప మాచరించుచుండెను.

అప్పుడా యాశ్రమ సమీపమునందున్న యొకయూరిలో నొకరియింట దొంగలు ప్రవేశించి యా యింటివారిసొమ్మును దోఁచుకొనిరి. ఆయూరితలవరులు వారినిఁజూచి, పట్టుకొనుటకు వెంబడించుచురాఁగా నాదొంగలు మాండవ్యముని యాశ్రమముఁ జొచ్చి యందొకమూల దాఁగియుండిరి. ఆదొంగలు పరుగెత్తునపుడు, వారు దొంగిలించిననగలలో నొకటిరెండు మాండవ్యుని సమీపమున జారిపడెను. ఆముని సమాధిలో నుండుటచే దొంగలు వచ్చుటయు వారు పోవునపుడు నగ లచ్చటఁ బడుటయు నామునికిఁ దెలియదు.

పిమ్మట, దొంగలను దఱుముకొని వచ్చిన కావలి వాండ్రు ఆశ్రమముఁజొచ్చి మునిచెంతనున్న యాభరణములను జూచి, "దొంగ లీమార్గమున వచ్చిరా" యని యతనిని పెక్కుసారు లడిగిరి; కాని యతఁడు సమాధిలో నుండుటచే బదులేమియుఁ జెప్పలేదు. తరువాత నాదొంగలు ఆయాశ్రమ మంతయుఁ జక్కఁగ వెదకి దొంగలను బట్టుకొని, ఆఋషి, దొంగలకు సాహాయ్యమొనరించి తపస్సుచేయుచున్నట్లు వేష

ము వేసికొనియున్న మఱియొక దొంగయని తలఁచి, యాదొంగ లతోఁగూడ నతనిని దోడ్కొని చని రాజుతో జరిగినదంతయుఁ జెప్పిరి. న్యాయాధికారి, అందఱను కొఱుతవేయున ట్లుత్తరువు చేసెను తలారులు దొంగలనందఱను కొఱుత వేసిరి. కొంతకాల మునకు దొంగలు చనిపోయిరి; గాని మాండవ్యుఁడుమాత్ర మాకొఱ్ఱునందు బాధపడుచు నుండెను. ఇట్లుండ నొకనాఁటి రాత్రి కొందఱు ఋషు లాకాశమార్గమునఁ బోవుచుండ, వారి తో మాండవ్యుఁడు ముచ్చటించెను. అదివిని తలారులు రాజుతోఁ జెప్పిరి. రాజు పరుగెత్తివచ్చి బాగుగాఁ బరిశీలింపక మునినిగూడఁ గొఱుత వేయించినందులకుఁ దలారులను గోపించి, యతని నా బాధనుండి తొలఁగింప నాజ్ఞాపించెను. వారు నట్లుచేయఁ బ్రత్నించిరి కాని వీలుకానందున నాకొఱుతమ్రా నతని దేహము నందున్నంతమట్టునకుంచి తక్కినదాని నీవలనావల నఱికి వేసిరి. అదిమొదల లాఋషిగర్భమునందుఁ గొఱుతమ్రాను గ్రుచ్చుకొని యుండుటచేత "అణిమాండవ్యుఁడ"ను పేరునొందెను. పిమ్మటఁ గొంతకాలమున కతఁడు యమలోకమునకుఁ బోయి యాలోక పాలకుని, "ఏపాప మెఱుఁగని నాకిట్టి కొఱుత వేయించుట న్యాయమా?" అని యడిగెను. అందునకు యముఁడు, "నీవు మిగుల ధర్మాత్ముఁడవే యైనను, బాల్యమున తూనీఁగలుమున్నగు జంతువులను హింసించి, వానిబాధనుజూచి సంతసించుచున్న వాఁడవు. ఆకారణమున నీకుఁ గొఱుత వేయవలసి వచ్చినది" అని బదులు చెప్పెను. ఆమాటకు ముని కోపించి, "బాల్యము నందు అజ్ఞానమువలనఁ జేసినతప్పునకు నన్ను కొఱుత వేయించి తివి; కాన నీవు హీనజాతియందుఁ బుట్టుదువు గాక" అని

యముని శపించెను. దానివలన యముఁడు, విదురుఁడనుపేర శూద్రయోనియందు జన్మించెను.

ప్రాణిహింస చేయువానికిఁ దప్పక బాధకలుగును.

— మహాభారతము, ఆదిపర్వము.

---

## 49. అసత్యపు నడత.

పాంచాలదేశపురాజునకు ద్రుపదుఁ డనుకొడుకొకఁ డుండెను. అతఁడు బాల్యమునందు అగ్నివేశ్యుఁడను ఋషి దగ్గఱ విలువిద్య నభ్యసించుచుండెను. అప్పుడు ద్రోణుఁడును వానితోఁగూడ విలువిద్య నభ్యసించుచుండెను. దానివలన వారిరువురకును మిగల స్నేహముకలిగి, ఆస్నేహము దిన దినాభివృద్ధియగుచుండ నొకనాఁడు ద్రోణునిఁజూచి, "నేను రాజ కుమారుఁడనగుటచే నాకు రాజ్యాధిపత్య మబ్బును. నేను రాజు నైనవెంటనే నీ కర్ధరాజ్య మిచ్చెదను" అని ద్రుపదుఁడు సాభి ప్రాయముగాఁజెప్పెను. పిమ్మట వారు విద్యముగించి, గురుదక్షిణ లిచ్చి వారివారి యూళ్లకుఁబోయిరి. తరువాతఁ గొంతకాల మునకు ద్రుపదుఁడు పాంచాలదేశమునకు రాజాయెను. ద్రోణుఁడును పెండ్లిచేసికొని గృహస్థధర్మము నడుపుచుండఁ గొంత కాలమున కతనికి "అశ్వత్థామ" అనుకుమారుఁ డొకఁడు కలి గెను. ఆబిడ్డఁడు తల్లిపాలు చాలక యేడ్చుచుండుటను దండ్రి చూచి, తనచిన్నప్పుడు తనసహపాఠియగు ద్రుపదుఁడు చేసిన వాగ్దానము జ్ఞప్తికిరాఁగా నతనియొద్దకుఁబోయి,యర్ధరాజ్య మడి గెను. ద్రుపదుఁ డేమియుఁ దెలియనివానివలె, "నీవెవ్వఁడవు" అని

ద్రోణు నడిగెను. అందులకు ద్రోణుఁడు, "నేను నీసతీర్థ్యుఁడను, బాల్యస్నేహితుఁడను, 'ద్రోణుఁ డనువాఁడను" అని బదులు చెప్పెను. అంతట ద్రుపదుఁడు "ఓసభ్యులారా! ఈ బీదబ్రాహ్మణుఁ డెక్కడ? మహారాజనగు నే నెక్కడ? మాకు స్నేహమెట్లుకలుగును? చూడుఁడు" అని పరిహాసముచేసెను. ఆమాటలువిని ద్రోణుఁడు, "నీవు రాజ్యాధికారమునకు వచ్చినయెడల నాకర్ధరాజ్యము నిచ్చెదనంటివి. నాబిడ్డఁడు పాలులేక యేడ్చుచున్నాఁడు. నీయర్ధరాజ్యము నాకక్కఱలేదు; కాని యొకపాఁడియావైన నిప్పింపుము" అని యడుగఁగా ద్రుపదుఁడు కోపముతో, "ఈపాఱుఁడు నాసభకువచ్చి నేను చెప్పనిమాటలను చెప్పినట్లు నొక్కినొక్కి చెప్పుచున్నాఁడు. కావున, నితనిని మెడఁబట్టిగెంటుఁడు" అని తనసేవకులకాజ్ఞచేసి యతని నవలకు గెంటించెను. అపుడు ద్రోణుఁడు, ద్రుపదునిఁజూచి, "నాకు నీవాశచూపి మోసముచేసితివి. కాఁబట్టి నిన్ను నాశిష్యునిచేఁ బట్టి తెప్పించి యవమానముచేసెదను" అని ప్రతిజ్ఞచేసి వెడలిపోయెను. పిమ్మటఁ గొంతకాలమునకుఁ బాండవులు మొదలగు వారు ద్రోణునకు శిష్యులై, అతనియొద్ద విలువిద్య నేర్చుకొని, అతనికి గురుదక్షిణయిచ్చి పోవునపుడు అర్జునుఁడు ద్రోణుని ప్రేరేపణమువలన ద్రుపదుని బట్టితెచ్చి గురునొద్దఁ బెట్టెను. ద్రోణుఁ డీవిధమునఁ దన శపథము నెఱవేర్చికొనెను.

సత్యప్రవర్తనము లేనివానికి సదా హానియు నవమానమును గలుగును.

— మహాభారతము, ఆదిపర్వము.

## 50. కొందరకూడదు.

శ్రీకృష్ణుఁడు ద్వారకలో నివసించియున్నప్పుడు సత్రాజిత్తను రాజుండెను. అతఁడు సూర్యుని నారాధించి యాయనవలన స్యమంతకమణియను నొకరత్నమును బడసెను. ఈమణి ప్రతిదినమును మితిలేని బంగారమును నిచ్చునట్టి శక్తిగలిగి యుండెను. దాని నొకనాఁడు సత్రాజిత్తు కంఠమునధరించి ద్వారకలోనున్న శ్రీకృష్ణుని దర్శింపఁబోయెను. భగవంతుఁ డామణినిఁజూచి దానిని తన కిమ్మని సత్రాజిత్తు నడిగెను. సత్రాజిత్తున కామణియం దపారప్రీతి కలిగియుండుటచే నతండీయనని చెప్పెను పిమ్మట నతఁ డింటికి మరలిపోయెను. అవలఁ గొంత కాలమున కతనితమ్ముఁడు ప్రసేనుఁ డనువాఁ డారత్నమును ధరించుకొని వేటకుఁబోయెను. అక్కడ నొకసింహ మతనిఁ జంపి మాంసమును దీసికొనిపోవుచుండఁగా, భల్లూకరాజగు జాంబవంతుఁ డామణిని జూచి యాసింగమును బట్టిమార్చి యామణిని గైకొనిపోయి తనగుహాలోఁ దనకూతురు ఉయ్యాలకుఁ బైన నలంకారముగాఁ గట్టెను. సత్రాజిత్తునకుఁ దనసహోదరుఁడు రత్నముతో వేటకుఁబోవుట మొదలుగాఁగల వృత్తాంతమేమియుఁ దెలియమిం జేసియు, శ్రీకృష్ణుఁ డామణిని మున్ను కోరియుండుటచేతను ఇప్పు డామణిని కృష్ణుఁడే యపహరించి నాఁడనుటకు సందేహము లేదని కొందరపడి భగవంతునిపై నిందమోపెను.

ఈవృత్తాంతము భగవంతునకుఁ దెలిసి, తనకుఁగలిగిన నిందను పోఁగొట్టుకొనుటకై ప్రసేనుఁ డడవికిఁబోయిన మార్గ

మునందలి జాడలనుబట్టిపోయి, భల్లూకరాజు గుహలోనున్న మణినిజూచి, యాజాంబవంతునితో ఘోరయుద్ధముఁ జేసి వానిని యోడించెను. అంత, జాంబవంతుఁడు తా నిదివఱకెన్నఁడు నెవరికి నోడిపోలేదని చెప్పి, శ్రీకృష్ణుని మహిమ నెఱిఁగి, "శ్రీరామావతారమెత్తిన విష్ణుదేవుఁడే శ్రీకృష్ణుఁడుగా నవతరించియున్నాఁడని తెలిసికొని, ఆస్యమంతకమణిని దెచ్చి కృష్ణభగవానున కర్పించెను. శ్రీకృష్ణుఁ డామణిని దీసికొనిపోయి సత్రాజిత్తున కిచ్చెను. సత్రాజిత్తు, తాను తెలియక భగవంతునిపై నిందమోపినందులకు సిగ్గుపడి. తన యపరాధమునకై తనకూఁతురగు సత్యభామను కృష్ణున కిచ్చి పెండ్లి చేసి, ఆమణి నామెకు స్త్రీధనముగానిచ్చి యల్లుని కూఁతును సంతోషముతో ద్వారకకుఁ బంపెను.

తొందరపడి యొకరిమీఁదగాని నిందమోపరాదు.

— భాగవతము, 10-వ స్కంధము.

---

## 51. ఎవరిమనస్సును నొప్పింపరాదు. (1)

పాండవజ్యేష్ఠుఁడైన ధర్మరాజు రాజసూయయాగమును జేయునపుడు ఆయాగమునకు లోకములోనుండు రాజులందఱును వచ్చిరి. అప్పుడు దుర్యోధనుఁడును పుత్రమిత్రబాంధవసహితుఁడై వచ్చెను. ధర్మరాజాయజ్ఞమునకు వచ్చినరాజులెల్లఱకును వారివారికిఁదగిన మర్యాదలుచేసి రాజసూయ యాగమును సమాప్తి నొందించెను. అంతట యాగమునకువచ్చిన రాజులందఱును తమతమదేశములకుఁ బోయిరి. దుర్యోధనుఁడు

మాత్రము తనవారితో నచ్చటనేయుండెను. మయుఁడు ధర్మరాజుకొఱకు నిర్మించిన సభనుజూచుటకు దుర్యోధనాదులు బయలుదేరిరి. ఆసమయమున, ధర్మరాజు తనతమ్ములతోఁగూడ నాసభలోఁ గొలువుచేసి యుండెను. ఆసభను మయుఁడు తన సామర్థ్యమంతయుఁ జూపి, నీళ్లులేనిచోట మణులకాంతులచేఁ బల్లములో నీళ్లు నిల్చియున్నట్టును; జలాశయమున్నచోట రత్న ప్రభచే జలాశయము లేనట్టును నిర్మించెను. దానివలన దుర్యోధనుఁడు, జలాశయము లేనిచోటు జలాశయమని భ్రమించి కట్టుబట్టలఁ బైకెత్తియును, జలాశయమున్నచోట నదిలేదనిపోయి వస్త్రములఁ దడుపుకొనుచుండుటనుజూచి, భీముఁడు ద్రౌపది మొదలగువారు పకపకనవ్విరి. ఈరీతిగానే రత్నకాంతులచే, గోడలో ద్వారముగల ప్రదేశమును ద్వారములేనట్టును, ద్వారములేని ప్రదేశమును ద్వారమున్నట్టు నుండుటనుగాంచి దుర్యోధనుఁడు ద్వారములేనిచోట ద్వారమనిపోయి గోడపైఁ గొట్టుకొనియుఁ ద్వారముండు ప్రదేశమున గోడయని తలఁచి తడవుకొనుచు నుండఁగా మరల వారు నవ్విరి. దుర్యోధనుఁడు మిగుల నవమాన మొందుటఁజూచి ధర్మరాజు అతని నూరార్చి, భీమాదులఁ గోపించెను. ఇట్టి యవమానమును సహింపఁజాలక దుర్యోధనాదులు కోపముతోఁ దమదేశమునకుఁ బోయిరి. దుర్యోధనాదులు, తమసభలో నవమానపడుటను జూచి భీమాదులు, వారు తమ కంతకుమున్ను చేసిన యపకారములకుబదులు వారికిప్పుడిట్టి పరాభవములు కలుగవలసినదే యని మిగుల నవ్విరే కాని, వారికి తోడ్పడలేదు. దానివలన

దుర్యోధనాదులకు మనసువిఱిగి, పాండవులపై నసూయమోను కొని వారిని మిగులఁ గష్టములపా లొనరించిరి.

ఆ-వె॥ ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱుఁ
గాఁచి యతుకనేర్చుఁ గమ్మరీఁడు
మనసు విఱిగెనేని మఱియంట నేర్చునా!
విశ్వదాభిరామ వినురవేమ॥

— మహాభారతము, సభాపర్వము.

---

## 52. ఎవరిమనసున్ను నొప్పింపరాదు. (2)

కపటద్యూతమునఁ బాండవులనుజయించి యరణ్యమున కంపించి, దుర్యోధనాదులు మిగులనానందముతో రాజ్యమేలు చుండిన కాలమున, వారిసభకు మైత్రేయుఁడను నొకమహా ముని వచ్చెను. ఆముని పాండవులకుఁ గలిగిన కష్టములను విని, దుర్యోధనాదులతో, "మీరు పాండవులను గపటద్యూతమున జయించి యడవులకంపుట న్యాయముకాదు; వారికి మీమీదఁ గలుగు కోపమును సహించుట మీకసాధ్యము. ఇపుడైనను బాండవులతో సమాధానము చేసికొంటిరేని మీకు సుఖము కల్గును" అని చెప్పెను. దుర్యోధనుఁడాముని చెప్పినది న్యాయముకాదని చెప్పి తిరస్కరించుటయేకాక, తన యెడమ తొడను జేతితోఁ దట్టుకొనుచుఁ దన యకార్యముచే నాఋషి నలక్ష్యముచేసెను. అంత మైత్రేయుఁడు, 'గ్రుడ్డివానికి దీపము చూపినట్లు తన యుపదేశమంతయు దుర్యోధనునెడ వ్యర్థమగు టచే మనస్సునొచ్చి యా దుర్యోధనునిఁజూచి, "నాసదుపదేశ



భగవంతుఁడు కుచేలుని కుపచారము చేయుట.



భగిరథునిచేతఁ దేబడిన గంగయొక్క గర్వభంగము.

మాలను విసక నీవు తొడతట్టుకొనుచు నన్ను లక్ష్యముచేసినందున, నీవా తొడయందే భీముని గదాయుధముచేత దెబ్బతిని చత్తువు గాక'' అని శపించెను.

ఇట్లే రావణుడుగూడ సజ్జనుల మనస్సునొప్పించుచు, బ్రహ్మ తనకిచ్చిన వరములబలమువలన దిగ్విజయమునకుఁబోయి రాజులందఱతోను ఘోరముగ యుద్ధమొనర్చి వారి నోడించుచు నొకసారి యయోధ్యకుఁజని దానికి రాజైన అనరణ్యమహా రాజును దనతో యుద్ధమునకుఁ బిలిచెను. అతఁడు తన సేనలను పోగుచేసి రావణునితో ఘోరయుద్ధము చేసెను. గాని రావణునకు వరబల మెక్కుడుగానుండుటచే ననరణ్యమహారాజు క్రిందఁబడి చావ సిద్ధముగా నుండెను. రావణుఁ డప్పటికి నూరకుండక పరిహాసవచనములాడుచు బాణములు వేయఁ దొడఁగెను. దానివలన మహాధర్మాత్ముఁడైన యారాజునకు మనస్సు నొచ్చి, ''ఓరీ రావణా! నేను ప్రాణములను విడుచుటకు సిద్ధముగా నున్నప్పుడుగూడ నీవు నన్ను పరిహాసముచేయుచు బాణములచేఁ గొట్టుచున్నావు, కాఁబట్టి నీవు నావంశమునఁ బుట్టినవానిచేతనే చంపఁబడుదువు గాక'' అని శపించెను. ఆరాజుశాపము వ్యర్థముకాలేదు. అతని వంశమునఁబుట్టిన రామునిచేతనె రావణుఁడు చచ్చెను.

పెద్దలమనస్సును నొప్పించినవారును, పెద్దలు చెప్పిన హితమును వినని వారును గీడు నొందుదురు.

మహాభారతము, ఆరణ్యపర్వము.
— రామాయణము, ఉత్తరకాండము.

---

## 53. గొప్పవారి నవమానింపరాదు.

ద్వారకాపట్టణముదగ్గఱ పిండారక మనుతీర్థ మొకటి కలదు. ఆ తీర్థమునకుఁ గొందఱు ఋషులువచ్చి, స్నానము చేసి, సంధ్యాద్యనుష్ఠానంబులం దీర్చికొని భగవంతుని దర్శింప వలయునను నాశతో నక్కడ నివసించియుండిరి. ఇట్లుండఁ గొంతకాలమున కచ్చటికి యాదవబాలురుపోయి, తమలో సాంబుఁడనువానికి గర్భిణీస్త్రీ వేషము వేయించి, యా ఋషుల ముందఱనిల్పి, "ఓ తపోధనులారా? ఈ గర్భవతియగు స్త్రీ రత్నమున కేశిశువుపుట్టును? మీరు దివ్యదృష్టి కలవారు, కావున, నీవిషయమును జెప్పినఁ జాల సంతోషించెదము" అని యడిగిరి. ఆమునులు జ్ఞానదృష్టివలన విషయమంతయుఁ దెలిసి కొని, ఈబాలురు తమ్ము పరిహాసింపవచ్చినారని యెఱింగి కోపించి, "మీకులమును నిర్మూలించు నొక ముసలము (రోకలి) పుట్టును" అని శాప మిచ్చిరి. అంత నాయాదవ బాలురు భయపడి, సాంబుని వేషమును దీసిచూడ నతని కడుపునఁ బెట్టిన వేషపువస్త్రము లోక యినుపరోఁకలియై యుండెను. వెంటనే వారు దానిని తీసికొని ద్వారకాపురికి వచ్చి తమ పెద్దలకందఱకును జూపి ఋషులశాపమును జెప్పిరి. యాదవ వృద్ధు లావృత్తాంతమును విని చాల భయపడి, యారోఁకలిని రాత్రిమీఁదఁ బెట్టి రాచి యాపొడిని సముద్రములోఁ గలిపివేయ నిశ్చయించుకొని సముద్రమునకుఁ బోయి యట్లుచేసిరి. అలాగునఁ జేసినను, మునులశాపము వ్యర్థముగానందున నా ముసలపుఁ బొడియంతయు సముద్రపునీటిచే గట్టునకుఁ గొట్టుకొని వచ్చి, తుంగలై మొలచెను. తరువాత యాదవులలోఁ గలహ

మారంభమైనప్పు డీతుంగయే వారి శాయుధములుగా నేర్ప డెను. దానివలన మునుల శాప్రకారము వారందఱును ఆతుంగతోనే కొట్టుకొని చచ్చిరి.

గొప్పవారికోపము గొప్పకీడును బుట్టించును.

— మహాభారతము, మౌసలపర్వము.

---

## 54. అబద్ధమువలని హాని.

మహాభారతమందలి పదునేనవనాఁటి యుద్ధములోఁ బాండవసేనలు ద్రోణుని బాఱి కాగలేక చెల్లాచెదరై పరువిడ సాగెను. ఆయుద్ధములోఁ బాండవులు మిగులఁ గష్టపడుచుండుటను జూచి భగవంతుఁడగు శ్రీకృష్ణుఁ డర్జునునితో, "ద్రోణాచార్యునిచేతియం దాయుధము లున్నంతకాల మెవరు నతనిని జయింపఁజాలరు. అతఁడు తనకుమారుఁడగు 'నశ్వత్థామ చచ్చెన' నుమాట వినునంతదాఁక యాయుధములనువిడువఁడు గాన, 'అశ్వత్థామ చచ్చెను' అనుమాట యతని చెవినిఁ బడునట్లుచేసి యతనిని యుద్ధముచేయుక మాన్పించుకవలయును" అని చెప్పెను. అర్జునుఁ డందుల కొప్పుకొనలేదు. ఈసంగతి వినినతోడనే భీమసేనుఁడు, మాళవదేశాధిపతియగు ఇంద్రవర్మయనువాని "అశ్వత్థామ" యను పేరుగలయేనుఁగును జంపి ద్రోణునిఁజేరి "అశ్వత్థామ చచ్చెను" అని చెప్పెను. దానిని ద్రోణుఁడు విని నమ్మక, "సత్యసంధుఁ డగుధర్మసూనుఁడు చెప్పిన నది సత్యమనుకొనవచ్చును" అని ధర్మరాజును వెదకిం

చెను, అప్పుడు శ్రీకృష్ణుఁడు ధర్మరాజునొద్దకుఁబోయి, ద్రోణుని వలనఁ దమసేనలు పడుపాట్లు తెలిపి, "ద్రోణుఁడు, 'అశ్వత్థామ చచ్చెనా?' అని నిన్నడుగునప్పుడు 'అశ్వత్థామ చచ్చెను' అని చెప్పి మమ్ము రక్షింపుము. అనేకప్రాణులను గాపాడుటకై చెప్పెడి యసత్యమువలనఁ బాపముసంభవింపదు" అని యతనికిబోధించెను. అప్పుడు భీముఁడు, "నేను అశ్వత్థామ యను పేరుగల మాళవదేశపురాజు నేనుఁగునుఁ జంపియున్నాఁడను కావున, మీరు 'అశ్వత్థామ చచ్చెన'నుట యబద్ధము కాఁజాలదు. అంతియకాక మమ్మందఱను రక్షించిన పుణ్యఫలము మీకుఁ దక్కును." అని చెప్పి ధర్మరాజును బ్రార్థించెను. ఈమాటలు వినినంతనే ధర్మరాజునకు మిగులఁ గోపము వచ్చెను; గాని దానిని నతఁడణఁచుకొని, "వీరు చెప్పిన చొప్పునఁ జెప్పనిచో గొప్పముప్పు దప్పకవాటిల్లును; అటులఁ జెప్పినయెడల నసత్యదోషము గలుగును" అని యాలోచించుకొనుచు, తుదకు ద్రోణుఁడడుగునపుడు, "చచ్చె నశ్వత్థామయను గజరాజు" అని చెప్పఁదలచెను. ఇంతలో ద్రోణుఁడు ధర్మరాజునుఁజూచి యాసమాచార మడుగ నతఁడు, "చచ్చె నశ్వత్థామ" అనుమాట బిగ్గరగాను, "అనుగజరాజు" అను మాట ద్రోణునకు వినఁబడకుండ మెల్లగాను చెప్పుచుండ వాద్యములు ఘోషించెను. ద్రోణుఁడు మొదటధర్మరాజు గట్టిగాఁజెప్పినమాటనుమాత్రము విని పుత్రశోకముచే నస్త్రములను త్యజించి యుద్ధమును మానివేసెను. దానిచేఁ బాండవులు జయమొందిరి. ధర్మరాజు బుద్ధిపూర్వకముగాఁ జెప్పిన యబద్ధమువలన, అతనిమాహాత్మ్యము కొఱవడి యావఱకు

భూమికి నాలుగు వ్రేళ్లుమీఁదుగాఁ బోవుచుండిన యతనిరథమది మొదలు భూమినంటి పోవుచుండెను. ఈ పాపమువలనఁ ధర్మరాజు స్వర్గమునకుఁబోవునపుడు, నరకమును గూడఁ జూచి పోవలసి వచ్చెను.

మనసార నబద్ధమాడినఫలము [illegible] దెలియ వచ్చును.

— మహాభారతము, ద్రోణపర్వము.

మొదటిభాగము ముగిసెను.



# 'వీర విలాసిని'

చరిత్రాత్మకమగు నీనవల మైలాపూరు పి. యస్. హైస్కూలునందాంధ్ర ప్రధానోపాధ్యాయులగు, బ్ర॥శ్రీ॥ గరిమెళ్ల సత్యగోదావరి శర్మగారిచే నతిమనోహర మగుశైలిని వ్రాయఁబడియె. ఇందలి కథాకల్పనాదు లత్యద్భుతములు. పాతివ్రత్యము, ఏకపత్నీవ్రతము, రాజభక్తి, స్త్రీవిద్య, స్త్రీవివేకము, మంచినడవడికకుఁ గలుగుఫలము, చెడునడవడికి వలన వచ్చుముప్పు, మున్నగు నంశముల నుద్బోధించుచు, నిందలి పాత్రములు బాగుగఁ బోషింపఁబడినవనియు, పుస్తకమును జదివిన వారీయంశము లెంతయు రమణీయములని ప్రశంసింపక మానరనియు మహాశయు లనేకు లీ నవలను గొనియాడిరి.

తపాలా ఖర్చుగాక దీనివెల రు. 1—0—0 మాత్రమే. వలయువారిట్లు వ్రాసినం బడయుగలరు.

వివేకబోధినీ కార్యాలయము,

మైలాపూరు.

మదరాసు.

# శ్రీ భాసమహాకవి

కృత

# నాటక కథాసారము.

తిరుపతి హెచ్. ఇ. యస్. యమ్. హైస్కూల్

ప్రధానోపాధ్యాయులు

కపిస్థలం-కృష్ణమాచార్యులు, బి.ఏ., ఎల్.టి., గారు

వ్రాసినది

C 720 · 26 · Telugu
(C)

మాక్మిలన్ అండు కంపెనీ, లిమిటెడ్
చెన్నపట్టణము, బొంబాయి, కలకత్తా, లండన్
1919

# శుద్ధాశుద్ధ పత్రిక.



| పుటము | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|---|
| iv | 11 | [illegible] | రాయణ |
| 3 | 8 | కొన్ని | కొందఱు |
| 4, 54, 65. | 18, 15, 8 | యగచు | కెందుచు |
| 5 | 11 | కంపించు | కంపింపించు |
| 7, 9, 27, 28, 40, 25, 45, 49, 50, 50, 51, 60. | 17, 5, 15, 5, 4, 14, 6, 12, 2, 7, 2, 23 | 'అగు,' 'అయిన' అనువాని పైని సరళములకు మాఱుగా పరుషముల జను వుడు | |
| 9 | 13 | యుష్వసలయు | యూపలయు |
| 12 | 3 | వ్యర్థమాట | వ్యర్థపుమాట |
| 16 | 3 | యాదిశించెను | యాదేశించెను |
| 20 | 8 | మహీపాలులు | మహీపాలురు |
| ,, | 9 | నేష్టులయి | విష్టులయి |
| 21 | 14 | కేనేని | కేని |
| 24, 45. | 20, 10 | చెప్పిన | చెప్పిన |
| 29 | 2 | దింపుచు | దించుచు |
| ,, | 6 | పక్షమున | పక్షముల |
| 31, 47, 51. | 2, 18, 21. | ఐగయుచు | ఐగచుచు |
| 31 | 11 | రుయేడ్వ | రేడ్వ |
| 32 | 5 | నిర్దయముగ | నిర్దయులై |
| 33 | 7 | ద్లుయరణ్య | ద్లరణ్య |
| 36 | 20 | కౌసల్యసుమిత్రల | కౌసల్యాసుమిత్రల |
| 37 | 15 | మునివృత్తిరయై | మునివృత్తిరై |

# పీఠిక.

## భాసమహాకవి.

ఇటీవలఁ గొన్ని సంవత్సరములనుండి తిరువాన్కూరుమహారాజాగారి ప్రోత్సాహమువలనఁ దిరువనంతపుర ముద్రణాలయమూలంబుగ ననేకములగు నపరూప సంస్కృతగ్రంథములు వెలువడుచుండుట యీ భాషాధ్యేతల సుకృత పరిపాకంబని యెంచఁదగియున్నది. ఇట్లు వెలువడినవాని నన్నింటను భాస మహాకవినాటకములు ఎల్లరకు నుపాదేయతమములు. "మాళవికాగ్నిమిత్ర" ప్రస్తావనలోఁ గాళిదాసుఁడు "భాససౌమిల్లకవిపుత్రాది" మహాకవుల నాటకములుండ, నవీనగ్రంథమగు తన నాటకము సభ్యులకు రుచించునాయని శంకించుచు నా శంకను,

"పురాణమిత్యేవ నసాధుసర్వం
నచాపికావ్యం నవమిత్యవద్యం"

అని నివారించియున్నాఁడు. ఇట్లప్పటప్పట భాసమహాకవినిగురించి కొండఱు ప్రస్తావించియుండుటచే నితని పేరుమాత్రము మనకు తెలిసియుండె నదికాని యీతని గ్రంథములెవ్వియో తెలియకుండెను. మన యదృష్టవశముచే నిప్పుడీ మహాకవి నాటకములు పదుమూడు వెలువడినవి. ఇతఁడు సుమారిరువది నాటకములు రచించియుండునట్లు తెలియవచ్చుచున్నది. పదుమూఁడు మాత్రము లభ్యమై మిగతవి లభ్యములుకామి విచారకరము. అలభ్యములగువానిలోఁ "గిరణావళి" యనునదియొకటి. ఇవి మన దేశమున నెచ్చోటనైననుఁ దాళపత్రములలో నుండుననియే మా నమ్మకము. అటులుండునేని త్వరలో వెలువడును గాక!

ఈ మహాకవి కాలమునుగుఱించి విచారించుచు విమర్శకులీతఁడు క్రీస్తుశకమునకుముందు సుమారు నాలుగైదునందల యేండ్లక్రిందట నుండియుండవలయునని యభిప్రాయపడుచున్నారు. ఈతని గ్రంథములలోఁ బాణినీయవిరుద్ధములగు ననేక ప్రయోగములుండుటచే నీతఁడు పాణినిమహర్షికి సమకాలికుఁడుగనో లేక యాతని వ్యాకరణమునకుఁ బ్రాబల్యముగలిగిన కాలమునకు ముందుగనో యుండవలయునని వారి యభిప్రాయము. ఇతని నాటకములఁ

జదివిన నీ యభిప్రాయమే స్థిరపడునట్లున్నది. ఆధునిక నాటకసూత్రముల నీతని నాటకము లనుసరించినట్లు కానము. సూత్రధారప్రవేశానంతరమే మంగళాచరణము స్థాపనలోఁ గవి ప్రశంసయనునది లేదు ఇటులుండుటచే నొకవేళఁ బాణినిగ్రంథములచేఁ దెలియనగు కృశాశ్వశిలాలీత్యాది ప్రాచీననటసూత్రకారులమతము ననుసరించియే తన నాటకముల నితఁడు వ్రాసియుండవచ్చునని చెప్పఁదగియున్నది.

ఇతనివాక్కు సరళగంభీరము. క్లిష్టములగు నలంకారము లిచ్చట కానము. స్వభావోక్తులు మెండు. ఈతని నాటకములలో భాగవతము ననుసరించి "బాలచరిత" మనునదియు, రామాయణము ననుసరించి "అభిషేకనాటకము" "ప్రతిమానాటకము" అనునవియును, వత్సరాజకథ ననుసరించి "స్వప్నవాసవదత్త" "ప్రతిజ్ఞాయౌగంధరాయణము" అనునవియును, భారతముననుసరించి "పంచరాత్రము," "మధ్యమవ్యాయోగము" "దూతవాక్యము" "దూతఘటోత్కచము" "కర్ణభారము," "ఊరుభంగము," అనునవియును గలవు. ఇవికాక "అవిమారకము" "చారుదత్తము" అనునవి స్వకపోలకల్పితకథాంశములని తోచుచున్నది. భారతకథ ననుసరించినవానిలోఁ గొన్ని భారతకథాపురుషుల నధికరించియున్నను కథాసందర్భమున మాత్రము భారతకథాభిన్నములై యున్నవి ఇట్లు "ప్రతిమానాటకము"న గూడ రామాయణకథాభిన్నములగు ననేక కథాంశములు కలవు. రామాయణకథ ననుసరించిన నాటకము లయోధ్యాకాండము మొదలు యుద్ధకాండపర్యంతము కథను జెప్పుటచే, బాలకాండకథాభాగము నొక "బాలచరిత"మున నితఁడు వ్రాసియుండవచ్చునని శంకింపఁదగియున్నది

ఇతని యేకాంకనాటకములలో "ఊరుభంగము"ను, ఇతరములలో "అవిమారక" "ప్రతిమా" నాటకములును ప్రశస్యతమములని మా యభిప్రాయము "ఊరుభంగము"లోని దుర్యోధనునిపాత్రము గాంభీర్యనిధి. వ్యాసమహర్షి దుర్యోధనుని దౌరాత్మ్యనిధియని నిందాపాత్రునిఁ జేసెను. భాసమహర్షి యాతనినే గాంభీర్యనిధియని శ్లాఘాపాత్రునిఁ జేసియున్నాఁడు. "ప్రతిమా" నాటకములోని సీతాపాత్రము సహృదయహృదయాహ్లాదకరమని ప్రత్యేకముగఁ జెప్పనక్కఱలేదు.

కాళిదాసాదు లనేకస్థలముల నితని పద్ధతి నవలంబించియుండునట్లు వీరి నాటకముల విమర్శించినఁ దెలియనగును. ఇతని "చారుదత్త"మును మూలాధారముగనుంచియే, శూద్రకుఁడు మృచ్ఛకటికను జేసియుండునట్లనేక శ్లోకము

లును గథాసందర్భములును సూచించుచున్నవి. మహాకవులిట్లు భాసనాటకముల గొంత యనుసరించియుండుటచే వారల ప్రతిభావిషయమై మనము సంశయించుట పురోభాగికృత్యము. వారి గ్రంథములలోఁ బరకీయాంశములుండినను వానిని దమ ప్రతిభాబలముచే వారెంతయో వృద్ధిపఱచియున్నవారు కనుకనే కాఁబోలు వీరి గ్రంథములముందు భాసమహాకవి గ్రంథములు ప్రచారవిహీనములై యడఁగియుండినవి.

ఈ నాటక కథాంశముల నాంధ్రవచనమునఁ బరివర్తనము చేయుటకు నాకిప్పుడవకాశము లభించెనని యెంతయు సంతసించుచున్నాఁడను. కొన్ని కథాంశములు రెండు మూఁడు నాటకములనుండి కైకొనవలసియుండినందున, కథాంశముల ననుసరించి నూతననామంబులిడవలసివచ్చెను. అయిన నాయా కథాంశములయందుఁ వానికి సంబంధించిన నాటకములుకూడఁ బేర్కొనఁబడినవి. ఈ కథాభాగములు పౌరాణికైతిహాసికకల్పితక్రమంబునఁ గూర్పఁబడియున్నవి. ఇవి చదువరులను సంస్కృతనాటకములఁ బఠింపఁ బ్రోత్సాహపఱుపఁగలిగెనేని కృతార్థమ్మన్యుఁడనగుదును. ఇందు దోషముల నిరాకరించి గుణములెవ్వియైన నుండిన వానిని చదువరులామోదింతురని నమ్ముచున్నాఁడను.

'గుణాన్ సా • ధోగృష్ణాన్
ఇంగుత్స్వా విశేశ్వరః ।
శిరసా శ్లాఘతేపూర్వం
పరంపంకే నియచ్ఛతి" ॥

తిరుపతి
1—1—1919

కే. కృ.

# విషయానుక్రమణిక.

# శ్రీ భాసమహాకవి

కృత

# నాటక కథాసారము.

---

## వాసుదేవుని బాలలీలలు

మధురాపురమున నుగ్రసేనుఁడనురాజు పాలించుచుండెను. అతనికి కంసుఁడను పుత్త్రుఁడును, దేవకియను పుత్త్రికయు నుండిరి. దేవకి నాతఁడు వృష్ణికులప్రసూతుఁడగు వసుదేవునకిచ్చి పెండ్లిచేసెను. దుష్టస్వభావుఁడైన కంసునకు ధర్మభీరుఁడైన యుగ్రసేనుని రాజ్యపాలనము రుచింపదాయెను. కావున నాతఁడు తండ్రిని రాజ్యభ్రష్టుఁ జేసి, చెఱయందుంచి, తానే సింహాసనము నాక్రమించెను. ఒకప్పుడతఁడు మధూకమహర్షి విషయమున నపరాధపడి సోదరిగర్భమున జనించు శిశువుచే మృతినొందవలయునని శాపముఁ బడసెను. శాపభీతుఁడై యతఁడు దేవకీవసుదేవుల చెఱసాలలో బంధించి వారి శిశువుల జాతమాత్రమున వధించుచువచ్చెను. తుదకు దేవకీగర్భమున లోకసంరక్షణార్థము నారాయణుఁ డవతరించెను. ఆతని సహాయార్థము సుదర్శన పాంచజన్యాదులు గోపకులమున నవతరించిరి.

తనయుఁ డవతరించినమాత్రమున దేవకి యాతని నెత్తికొని ముద్దిడుచు వసుదేవునకు జూపించెను. బాలుఁ డప్రమేయస్వభావుఁడని వసుదేవుఁడు కనుగొని యాతని నెట్టులైన గంసునుండి రక్షింప నర్ధరాత్రములో మధురాపురమునకు వెలుపలఁ గొనిపోయి, నందగోకులమున దాచిపెట్ట నుద్యమించెను. మార్గమధ్యమున యమునానది యా బాలుని ప్రభావముచే విగత

ప్రవాహమై దారివిడిచెను. యమునను దాటి యతఁడు నంద గోకుల శ్మశానము నొద్ద నొక వృక్షము క్రింద శిశువును బెట్టికొని కూర్చుండెను. రాత్రి వేళ గోకులము ప్రవేశించిన జనులు సంశయింతురనియుఁ దెల్లవాఱఁ బ్రవేశింపవలయుననియు నాతఁడు యోజించుచుండ, నెద్దియో దీనధ్వని చెవులఁబడెను. దానిని విమర్శింప నాతఁడు సావధానుఁడైయుండ, నది తన మిత్రమగు నందగోపుని విలాపస్వరమని తెలియవచ్చెను. కారణమేమో తెలియఁగోరి యచ్చోటికిఁబోవ, నందగోపుఁడు మృతమగు స్త్రీప్రజను ముందఱబెట్టికొని యేడ్చుచుండుట నాతఁడు చూచెను. అతని భార్యయగు యశోద యీ పుత్రికను ప్రసవించెననియు, జనించినది పుత్రుఁడో పుత్రికయో తెలియక ప్రసవశ్రమముచే యశోద మైమఱచి నిద్రించుచుండెననియు, ఉదయమున గోకులమున నొక యుత్సవము జరుగబోవుటచే నా శిశువు నుత్సవభంగభీతిచే నితర గోపాలకులకు దెలియక ఖననముఁజేయ నచ్చోటికా యర్ధరాత్రములోనె యాతఁడు తీసికొనివచ్చెననియు వసుదేవుఁ డాతనినుండి తెలిసికొనెను. పుత్రికా మరణమునకు నాతనితో దుఃఖించుచు వసుదేవుఁడు తన పుత్రు నాతని పుత్రునిగాఁ జూచుకొని యీ దుఃఖమును మఱచిపొమ్మని శిశువు నాతనికిచ్చెను. మొదటఁ గంసభయముచే నందగోపుఁడు తీసికొనుటకు శంకించెనుగాని, వసుదేవుఁ డాతనికి తాను జేసిన యుపకారమునకు బ్రత్యుపకారసమయ మిదియయని జ్ఞప్తిపఱచినందున, తన శిరమువోయినను బ్రత్యుపకారము చేయవలయునని దృఢాభిసంధితో నా శిశువును గైకొని యాతఁడు వ్రజముఁ జేరెను. వసుదేవుఁడును మరలివచ్చుచుండ నొక శిశువుయొక్క పరిదేవనస్వరముపలె వినవచ్చెను. [illegible]ఁ గంస

భీతిచే నందగోపుఁడు శిశువునెత్తికొని వచ్చుచున్నాఁడోయని యచ్చోటికిఁబోఁ, మృతియని యచ్చోట విడువఁబడిన కన్నియ సజీవయై యేడ్చుచుండుట నాతఁడు కనెను. సంతోషముతో నా శిశువునెత్తుకొని యదియ దేవకీగర్భమునఁ జనించెనని దానిని కంసునకియ్య నిశ్చయించి యథాగతముగ నాతఁడు గృహముఁ జేరెను.

దామోదరుఁ డుద్భవించిన రాత్రి కంసునకు నిద్దురపట్టి దయ్యెను. కొన్ని చండాలాంగనలు తన గృహమునఁ బ్రవేశించి నట్లును, తమ్ముఁ గౌఁగిలించుకొనుఁడుమని వారెంతయుఁ దన్ను నిర్బంధించినట్లును, తానెంత వారలఁ గోపించినను వారు తన యింటిని విడిచిపోనట్లును నాతనికి స్వప్నమాయెను. వారివెనుక మధూక మహాష్ఠి శాఖలు సహితము యుక్తితో బాడఁ దన రాజ్యలక్ష్మిని వెలిపుచ్చి తన యింట వేఁచినట్లును వాఁడు దుస్స్వప్నముఁ జూచెను. ఇదియుఁగాక. ఉదయమున నుల్కాపాతభూకంప వాతోద్భ్రమాద్యనిష్టములు సంభవించెను. అది చూచి కంసుఁడు శంకితుఁడై జ్యోతిష్కులఁబిలిచి యడుగ, "నభస్స్థల నివాసియగు భూమియొక్క కార్యాంతరమున నరలోకమున నుద్భవించియున్నది. దాని యనాకారమును సూచించుచు నీ వికారములు కలుగుచున్నవి" అని వారు విన్నవించిరి.

అంత వసుదేవునిఁ బిలిపించి దేవకీగర్భప్రసూతమగు శిశువును దెమ్మని కంసుఁడానతిచ్చెను. ఆనతిప్రకారము దాది బాలికను దీసికొని వచ్చెను. వసుదేవాదులద్దానిపైఁ గరుణింపుమని వేడుచుండినను వారి ప్రార్థనల నాలకింపక, దాది హస్తముల నుండి యా బాలికను గైకొని యాతఁడు దానిని వధింప భూమి

పైఁ బడవైచెను. తక్షణమే శూలాదులఁ గరములఁ బట్టికొని యుగ్రవేషమైన కాత్యాయనిరూపమున నా శిశువు ప్రత్యక్షమాయెను. తాను కంసక్షయమునకై వసుదేవకులమున జన్మించెనని చెప్పుచు, నామె తన పరివారములగు కుష్మాండోదర, శూల, నీల, మనోజవాదులతో, భగవంతుని బాలలీల ననుభవింప గోపాలకులమున నుద్భవింపవలయునని చెప్పుచు నంతర్హితయయ్యెను.

దామోదరుఁడు గోకులమును ప్రవేశించినది మొదలు, గోపాలకులకు సర్వసమృద్ధి కలుగుచుండెను. కంసుఁడు దివివిని యాతఁడే తన్ను శిక్షింప నవతరించిన దేవతావిశేషమని నిర్ణయించి, యాతనిని బాల్యమునందే వధింప ననేక రాక్షసుల నియమించెను. పూతనయను రాక్షసి యశోదగోపవధూరూపము నవలంబించి విషదిగ్ధస్తనమై యాతనికిఁ బాలుగుడిపింప, నాతఁడు ప్రాణములతోఁగూడ నాయమ స్తన్యము పీల్చెను. బాలుఁడు మాసమాత్రుఁడైయుండ, శకటాకృతిమై యొక దానవుఁడు పరుగిడుచు నాతనిపైఁ బడఁ బ్రయత్నించెనుగాని యాతని పాదాహతుఁడై పరలోకముఁ జెందెను. క్రమక్రమముగ వృద్ధియగుచు దామోదరుఁడు నందగోకులమున సంచరించుచు, నొక్కొకయింటఁ బ్రవేశించి యింటివారలకు దెలియక దధిక్షీరాదుల భుజింప నారంభించెను. అంత గోపాంగనలు యశోదకాసంగతుల దెలియఁజేయ నామె యాతని నొక్కనాఁడు రోటికిఁ గట్టెను. బాలుఁడేడ్చుచు నా రోటినీడ్చుకొని వృక్షరూపులై యుండిన యమళార్జునులను దానవులమధ్యఁ గొనిపోయి వారలఁ బడవైచెను. కొన్ని నెలలకుఁ బిదప ప్రలంబుఁడను రాక్షసుఁడు నందగోపవేషము ధరించి సంకర్షణుని భుజమునఁ బెట్టికొని పారి

పోన నుద్యమింప, సంకర్షణుఁ డాతని సంహరించెను. ఒకప్పుడు తోడిబాలురతోఁ గూడ దామోదరుఁడు తాళఫలముల భుజింపఁ దాళవనమునకు వెళ్లెను అచ్చోట ధేనుకుఁడను రాక్షసుఁడు గర్దభవేషము నవలంబించి వారల హింసింపఁ దొడఁగెను. అతఁడును దామోదరునిచే జంపఁబడెను. తురంగమరూపము ధరించి కేశియను దానవుఁడును దామోదరుని వధింపఁజూచెనుగాని యాతఁడును విఫలప్రయత్నుఁడాయెను

హల్లీసకమను నృత్యమాడ దామోదరుఁడొకనాఁడు గోపకన్యలతోఁ గూడ రంగస్థలికిఁ బోయెను. అచ్చోట వారి యాటపాటలకు విఘ్నముఁ గలుగఁజేయ నరిష్టుఁడను దానవుఁడు వృషభరూపమై ఖురపుటాహతముచే భూమిని కంపించుచు, గోపాంగనలకు భయము పుట్టించుచు వచ్చెను. భయకంపితలగు గోపకన్యకల దూరమున నొకచోఁ గూర్చుండఁబెట్టి, దామోదరుఁడాతని నెదుర్కొని పోరాడి వాని శృంగమునఁ బర్వతమువోలె నాతనిని భూతలమునఁ బడవైచెను.

ఆ సమయమున యమునాజలమున కాళియమను దుష్టనాగమునుజూచి సకృష్ణుఁ డచ్చోటికి జనెననియు, వానిని నివారింపుమనియు, సంభ్రాన్తలై గోపికలు దామోదరుని వేడ్క, నతఁడు పరుగెత్తుచని యా మడువులో మునిగెను. కొన్ని నిమిషములలో నాతఁడు నాగరాజముఁ జేతఁబట్టికొని నీటనుండి వెలువడి యద్దాని శిరమున నృత్యమాడఁ దొడఁగెను. అంత "భూమండలమును లోకాలోక మహీధరము చుట్టినట్లును, మందరగిరిని వాసుకి చుట్టినట్లును, నిన్ను నా యొడలితోఁ జుట్టి యమలోకమున కంపించెద"నని కాళియమాతని బంధించెను. దామోదరుఁడు దానిని లక్ష్యపెట్టక పరిహాసించుచు వేయివిధ

ముల నృత్యమాడుచు తటవృక్షములనుండి పుష్పాపచయము చేయుచుండ నా నాగము తన విషాగ్నిచే నాతని దహింప నారంభించెను. తన వీర్యమంతయు నుపయోగించిన నాతని భుజమున నేకాంశముగూడ నది దహింపదయ్యెను. విఫలశ్రమమై యాతని మహిమఁ గనుఁగొని తుదకు కాళియమాతని స్తుతించెను. దామోదరుఁడు ప్రసన్నుఁడై తన పాదముచే నద్దాని శిరమున చిహ్నముఁ గల్పించి గరుత్మంతునుండి యభయ మిచ్చెను. మిగుల సంతోషముతోఁ గృతజ్ఞతాపూర్వకముగఁ గాళియమా హ్రదమునుండి తన విషము నాకర్షించి పరివారముగా నచ్చోట విడిచిపోయెను

యమునాజలము నిట్లు గోబ్రాహ్మణాదుల పానార్హముఁ జేసి, దామోదరుఁడు తాను గోసిన పుష్పముల గోపాంగనల కిచ్చుచు వారలతో గృహాభిముఖముగ నరుగుచుండ, మధురాపురిలో ధనుర్మహమను మహోత్సవమునకై కంసుఁడు సంకర్షణునితోఁగూడఁ దన్ను బిలిచెనని యాతనితో నొక భటుఁడు విన్నవించెను. అది విని దేవరహస్యమునకు కాలము వచ్చెనని చెప్పుచు గోపాంగనలను నందగోకులమును విడిచి సంకర్షణునితోఁ గూడఁ గొందఱఁ గోపబాలురఁ బిలిచికొని యాతఁడు మధురాపురిఁ జేరెను.

పురముఁ బ్రవేశించుచు నాతఁ డచ్చోటి రజకులనుండి వస్త్రముల నపహరించి తన పరివారములోని గోపజనులకిచ్చి తానును ధరించెను; పిదప తన పైఁబడ వచ్చుచుండిన యుత్పలాపీడమను మత్తగజమును దంతమునఁబట్టి సంహరించెను; రాజవీధిఁ జని రాజకులద్వారమున గంధమునుఁ జేతఁబెట్టి నిలిచి యుండిన మదనికయను కుబ్జికను జూచి పిలిచి యా గంధమును

తీసి తన యొడలిపైఁ బూసికొన్ని యామె దేహమును దడవి కుబ్జత్వమును బోఁగొట్టెను; పువ్వులంగడిలోఁ బ్రవేశించి పుష్పమాలికలచేఁ దన్నలంకరించుకొనెను; ధనుశ్శాలలోఁ జని ధనుస్సుల విఱుగఁగొట్టెను.

ఈ యనర్థముల విని కంసుఁడు వేగముతో చాణూరముష్టికులను మల్లవర్యుల నాతనితోఁ బోరాడ నాజ్ఞాపించెను. దామోదర సంకర్షణులు చెరియొక మల్లునితోఁ బోరాడి వారిల వధించిరి. తఱువాత కంససైనికుల నచ్చోట రానియ్యకుండుమని సంకర్షణునకు నియమించి, దామోదరుఁడు మాత్రము సౌధాగ్రమునఁ జని కంసుని సింహాసనమునుండి పడఁద్రోసి వానిని లోకాంతరమునకంపెను. ఇంతలో పురమంతయు పల్లకల్లోలమాయెను.

అంత వసుదేవుఁ డచ్చోటవచ్చి దామోదర సంకర్షణులు తన పుత్త్రులేయని యెల్లరకుఁ దెలియఁబఱచి యా యల్లకల్లోలముల నాపెను. ఉగ్రసేన మహారాజును కారాగృహమునుండి విడిపించి దామోదరాజ్ఞచే నాతనిఁ రాజ్యాభిషేకము చేయించెను. దుష్టుఁడగు కంసుని వధించి యుగ్రసేనునకు రాజ్యమిచ్చినందున మథురాపురజనులు దామోదరునెంతయుఁ బొగడుచుండిరి.

(బాలచరిత్రమునుండి.)



## పాండవ వనవాసము

ద్యూతమున రాజ్యమును గోల్పోయి పాండవులు మునివృత్తులై యరణ్యవాసముఁ జేయుచుండినకాలమున నొకప్పుడు ధౌమ్యమహర్షి శతకుంభమను యజ్ఞము నారంభించెను. ఆ

యజ్ఞము ననుభవించుటకుఁ బాండవులాహూతులైరి. భీమసేనునిఁ దమ యాశ్రమరక్షణార్థము నియమించి మిగిలినవారందఱు నచ్చోటికి వెళ్లిరి. దినదినము వ్యాయామార్థము భీమసేనుఁ డాశ్రమమునకుఁ గొంతదూరమున నుండు నొక్క బయలునకుఁబోవుట వాడుక. ఒకనాఁడట్లు చని యాతఁడు వ్యాయామము చేయుచుండఁగ పూర్వము కేశవదాసుఁడను నొక దరిద్ర బ్రాహ్మణుఁడు తన మిత్రునియింట నుపనయనమహోత్సవమనుభవింప సకుటుంబముగ నాహూతుఁడై యా యరణ్యమార్గముగఁ జనుచుండెను. ఉపవాసనిసర్గార్థమొక్క మనుజునిఁ గైకొనిరమ్మని జననిచే నాజ్ఞప్తుఁడై ఘటోత్కచుఁడు నా యరణ్యమున నే చాలాకాలము దిరిగి తుదకీ బ్రాహ్మణకుటుంబమునుఁ జూచెను. తల్లి యనుజ్ఞను నెరవేర్చుటకు సమయము దొరకెనని సంతోషించుచు నా బ్రాహ్మణుల నాతఁడు వెంబడింపసాగెను. భార్యాపుత్రులతోఁగూడిన తన్ను వెంబడించుచుండు నా ఘటోత్కచునిఁజూచి, యా విప్రుఁడు సద్యఃప్రసూతియగు ధేనువుతోఁగూడ వ్యాఘ్రానుసృతమగు వృషభముఁబోలె భయాకులుఁడయ్యెను. తల్లియాజ్ఞచే నా ఘోరకృత్యమునకుఁ బూనిన యా ఘటోత్కచుఁడు నిష్ఠురహృదయుఁడై యా బ్రాహ్మణుజూచి "మీలో నొక్కరి నంపితివేని, యవశిష్టులు సుఖముగఁ బోవచ్చును, లేనియెడలఁ గుటుంబమునకే నాశమువచ్చును" అని చెప్పెను. కుటుంబనాశనముకంటె నొక్కరిఁ గోల్పోవుట లాభకరమయ్యును, నా బ్రాహ్మణుఁ డొక్కరిఁగూడ విడువఁడయ్యెను. ఘటోత్కచుఁడు పట్టుదలతో నుండుటఁజూచి యా బ్రాహ్మణునిభార్య భయాకులయైయుండ నచ్చోటి కనతిదూరం

మునఁ బాండవాశ్రమముండుటచే నేలాటి భయముఁ గలుగ నేరదని వృద్ధుఁడు ధైర్యము చెప్పుచుండెను.

"అయ్యో! పాండవులు ధౌమ్యాశ్రమమునకుఁ బోయిరని యొక వటువు చెప్పెనే" యని యాతని ప్రథమపుత్త్రుఁడు గద్గద స్వరముతోఁ బలికెను. లోకైకవీరులగు పాండవులచ్చోట లేనిది తెలియుటకుఁ జింతించుచు నా బ్రాహ్మణుఁడు తుదకుఁ దన వృద్ధప్రాణమున్నే యాహుతియిచ్చుట మంచిదని తీర్మానించెను.

"పతివ్రతాయశః ప్రాప్తిమాత్రప్రార్థిని, కాన ననుభూతఫలమగు నా శరీరముచేఁ గులమును రక్షింపనున్న దానను" అని బ్రాహ్మణి యాతని నివారించెను.

"నా ప్రాణములచే గురుప్రాణముల రక్షింప నిశ్చయించుచున్నవాఁడను. కులరక్షణకార్యము నా కనుజ్ఞ యియ్యవలయు"నని ప్రథమపుత్త్రుఁ డడఁకని వేడుకొనెను.

"కులమున శ్రేష్ఠుఁడను గరిష్ఠుఁడను గాన, కులమునుఁ గాపాడ నా ప్రాణముల నర్పించెదను" అని ద్వితీయుఁడు సన్నద్ధుఁ డయ్యెను.

"జ్యేష్ఠభ్రాతా పితృసముఁడని బ్రహ్మవాదులు చెప్పుదురు; నా గురువులగు జ్యేష్ఠుల గాపాడుట నా భారము" అని తృతీయుఁడు చెప్పెను.

"జనకునకు నాపదవచ్చిన జ్యేష్ఠుఁడు కాపాడవలయుఁగాన నేనేపోయెదనని జ్యేష్ఠుఁడు చెప్ప," నే జ్యేష్ఠుని వదలఁజాలనని వృద్ధుఁడాతనిఁ గౌగిలించుకొనెను.

కనిష్ఠుఁడు నా కిష్టతముఁడు కాన నేనాతని వియోగముఁ దాళలేనని బ్రాహ్మణి తృతీయు నాలింగించుకొనెను.

మాతాపితృలకు ననిష్టుఁడ నేనెవ్వఁడ కిష్టుఁడని ద్వితీయుఁ డడుగ "నాకిష్టుఁడ"వని ఘటోత్కచుఁడు పలికెను.

అంత మధ్యముఁడు ఘటోత్కచుని వెంబడింప నిశ్చయించుకొని గురువుల నమస్కరించి వారి యాశీషములఁ బడసెను. పిదప పిపాసనుదీర్చుకొన ఘటోత్కచుని యనుజ్ఞఁబొంది యాతఁడనతిదూరమున నొక జలాశయమునకుఁ బోయెను. జననికి భోజనకాల మతిక్రమించుచుండ, ఘటోత్కచుఁడా బ్రాహ్మణుఁ డెంతకాలమునకు రాకుండుట "ఓ మధ్యమా" యని బిగ్గఱ బిలిచెను. వ్యాయామము చేయుచున్న భీముఁడీ స్వరమును విని "నన్నెవ్వఁడీ కాననమునఁ బిలుచునాతఁడు?" అని శంకించుచు "నిదిగో వచ్చుచున్నవాఁడనని" యచ్చోటవచ్చెను.

"నే మధ్యమునిఁ బిల్వ నితఁడెవ్వఁడో వచ్చెనే; ఇతఁడు బ్రాహ్మణుఁడు కాఁడు" అని ఘటోత్కచుఁడు తిరుగ "ఓ మధ్యమా" యని పిలిచెను.

"ఇదిగో మధ్యముఁడు నే వచ్చియున్నాఁడ"నని భీముఁడు చెప్ప "నీవును మధ్యముఁడవా?" యని ఘటోత్కచుఁ డడిగెను.

"అంధ్యులలో మధ్యముఁడను, ఉత్పిక్షులలో మధ్యముఁడను, భ్రాతలలో మధ్యముఁడను, పంచభూతములలో మధ్యముఁడను, పార్థివులలో మధ్యముఁడను, సర్వకార్యములలో మధ్యముఁడను" అని భీముఁడు బదులుచెప్పెను.

అది విని యా వృద్ధుఁడు "మధ్యముఁడని చెప్పుచున్న యీతఁడు పాండవులలో మధ్యముఁడగు భీమసేనుఁడుగ నుండ నలయు; మనల నితఁడు మృత్యువునుండి కాపాడవచ్చియున్న వాఁడని" మనమున నిశ్చయించికొనెను.

ఇంతలో బ్రాహ్మణమధ్యముఁడు పిపాసను దీర్చికొని

యచ్చోటవచ్చెను. ఘటోత్కచుఁడాతనిఁ బిలిచికొనిపోవ నారంభింప నా వృద్ధుఁడు తన కుటుంబమును రక్షింపుమని భీమసేనుని శరణుజొచ్చెను. శరణాగతునకభయమిచ్చి వాని భయహేతువును భీముఁ డడిగి తెలిసికొనియెను. పిదప నా బ్రాహ్మణుని విడువుమని యాతఁడు ఘటోత్కచునడుగ నాతఁడు విడువడయ్యెను. తన భ్రాతృగుణముగలిగియున్న యా గంభీరస్వభావుఁ డెవ్వఁడో యని భీమునకు సందియము వొడమెను. తానెంతఁ జెప్పినను పట్టుదలతోనుండిన నాతని మాటలవలన, నాతఁడు తన ప్రియురాలగు హిడింబి తనయుఁడనియు, మాతృాజ్ఞచే నా తపస్వి మా యాహారమునకుఁ గొనిపోవువాఁడనియుఁ దెలిసికొనెను.

తానెవ్వఁడో యాతనికిఁ దెలియ జేయక భీముఁడాతనిని బరీక్షింపనుద్దేశించి, తాను క్షత్రియుఁడనియు, బ్రాహ్మణుఁడవధ్యుఁడుకావునఁ దానే హిడింబకు నాహారముగ వచ్చుననియుఁ జెప్పి, యా బ్రాహ్మణుని నివర్తింపఁజేసెను. క్షత్రియలాభమునకు ఘటోత్కచుఁడు మిగుల సంతసించి యాతనిఁ దన్ను వెంబడింప నడిగెను.

"అతివీర్యబలుని నే వెంబడింపను, నీకు శక్తియుండెనేని నన్నుఁ దీసికొనిపొమ్ము" అని భీముఁడుపలుక "నన్ను ముందెఱిఁగినవానివలెఁ బలుకుచున్నావేమి?" యని ఘటోత్కచుఁడు ప్రశ్నించెను.

"నా పుత్త్రుఁడని నేనట్లు పలుకుచున్నా"నని భీముఁడన, "ఏమీ! నేనీ పుత్త్రుఁడనా?" యని ఘటోత్కచుఁడు కోపముతో నడిగెను.

"ప్రజలందఱు క్షత్రియులకుఁ బుత్రులు; కావున నీవు నా పుత్రుఁడవే" యని భీముఁడు పలికెను.

"వ్యర్థమాటలేల? నీవు నన్ననుసరించి రానియెడల నీకు భయము నుపదేశించి లాగుకొనిపోయెదను; కాపాడుటకు శక్తి యుండెనేని యాయుధముఁ గైకొను"మని ఘటోత్కచుఁడు యుద్ధసన్నద్ధుఁడయ్యెను.

"నా దక్షిణబాహువేనా కాయుధము" అని భీముఁడు చెప్ప "అరె, యీ మాటలు నా తండ్రికే తగునుగాని మరి యెవ్వరికిఁదగదు" అని ఘటోత్కచుఁడు రోషావిష్టుఁడై యుద్ఘోషించెను.

"ఎవరయా నీ తండ్రి? విశ్వకర్ముఁడైన శివుఁడా? కృష్ణుఁడా? శక్రుఁడా? శక్తిధరుఁడైన యముఁడా? నీరిలో నెవ్వరికైన సముఁడా?" యని పరిహాసించువానివలె భీముఁడుపలుక, జాజ్వల్యమానమగుఁ గోపానలోద్దీప్తనేత్రుఁడై "వీరందఱకు సముఁడు" అని ఘటోత్కచుఁడు గర్జించుచు భీమునితో నాయోధమునకుఁ బూనెను.

ఎన్నియోవిధముల నాతని జయింప ప్రయత్నించియుఁ దుదకు విఫలారంభుఁడై ఘటోత్కచుఁడు మాతృవరలబ్ధమగుఁ బాశముచే నాతని బంధింప, నా పాశము ప్రతిమంత్రబలముచే వీడిపోయెను. తన శక్తియంతయు నాతని యందకార్యకారి యని యెంచి ప్రథమసమయమును స్మరించి తన్ను వెంబడింపు మని యాతని నడిగెను. భీముఁడు సమయానుసారంబుగ నాతని వెంబడించెను. గృహద్వారమున నాతని నిలిపి, ఘటోత్కచుఁడు లోపలఁజని, జననికొక్క మనుష్యు నాహారార్థము తాను పట్టికొనివచ్చినట్లు విన్నవించెను. ఆ మనుజుఁడెవ్వఁడో చూడ

వలయునని హిడింబి బయటవచ్చి "నాయనా! ఈ మనుష్యునా తెచ్చితివి? ఇతఁడు నీకును నాకును దైవమే; నీ తండ్రియగు భీమసేనుఁడే" యని బహుమానోక్తుల బలికెను. ఘటోత్కచుఁడు క్షణమాత్రము దిగ్భ్రమజెంది "తండ్రి! నా యపరాధముల మన్నింపుమని" యాతని పాదములకు నమస్కరించి వేడుకొనెను.

మన్నించుట కపరాధము లేవియుఁగానక భీమసేనుఁడు తనయునిఁ గౌగిలించి శిరము నాఘ్రాణించెను; పార్శ్వమున నున్న వృద్ధబ్రాహ్మణు నమస్కరింపఁ దనయున కానతిచ్చి యాతని యాశీర్వాదములఁ బడయఁజేసెను.

బ్రాహ్మణుఁడును సకుటుంబముగఁ బాండవాశ్రమమునఁ గొంతవిశ్రమించి, యాశ్రమపదద్వారమునందు భీమసేనాదులచే ననుసృతుఁడై విడిదస్థానముఁ జేరెను.

(మధ్యమవ్యాయోగములోనిది.)



## పాండవాజ్ఞాతవాసము.

ద్వాదశవర్షములఁ బాండవు లరణ్యములో గడిపి త్రయోదశతమ వత్సరమును విరాటనగరములో నజ్ఞాతముగ గడుపుచుండినకాలమున దుర్యోధనుఁడు మహాయజ్ఞము నొకటి నారంభించెను. నానా దేశములనుండి యనేకరాజులా యజ్ఞము నామోదించుటకు వచ్చియుండిరి. శ్రీకృష్ణుని ప్రతినిధిగ నభిమన్యుఁడుకూడ వచ్చెను. మహా వైభవముతో యజ్ఞము జరిగెను. ఎచటఁజూచిన ఘుమఘుమాయమానమగు హవిర్ధూమగంధము వ్యాపించెను; బ్రాహ్మణోచ్ఛిష్టమగు నన్నము కాశ

కుసుమముంబోలె నలుదిక్కులం గానవచ్చెను; దేవతలకును మనుజులకునువలె పశుపక్ష్యాదులకుం గూడ తృప్తికలిగెను. దుర్యోధనమహారాజగుణములు దేవలోకమునం బ్రఖ్యాతిం గాంచెను. యజ్ఞాంతమున దుర్యోధనుం డభ్యాగతులం దానే గౌరవింపం దొడంగెను. భీష్మద్రోణాదులు నానారాజుల నొక్కొక్కరిగ దుర్యోధనునకుం జూపించుచు వారివారి కనుగుణముగ సన్మానములం జేయించుచుండిరి నిర్విఘ్నముగ యజ్ఞము సమాప్తిం జెందినందుకు నందఱు దుర్యోధనునిం బొగడుచుండిరి. అనుగ్రహింపవలయుననుచు హాస్యముఖుండై దుర్యోధనుం డాచార్య వందన మొనరించుటకు ద్రోణుని సమీపింప నాతండు భీష్మునె ప్రథమము నమస్కరింపవలయుననెను. ఆతండుం దాను క్షత్రియుండగుటచే సర్వవిధముల ద్రోణుండే పూజ్యతముండని శాత్రునకుం జెప్పి యాతనినే ప్రథమము నమస్కరింపం జేసెను. క్రమప్రకారముగ గురువులం బిదప నమస్కరించి దుర్యోధనుండు వారి యాశీర్వాదములం బడసెను.

రాజులందఱు విచ్చేసియు విరాటుండుమాత్రము యజ్ఞమునకు రానందున దుర్యోధనునకుం గొంత యసంతుష్టి కలిగెను, కాని యాతండా యసంతుష్టిని బయలువెట్టక కార్యవ్యగ్రుండై యుండెను.

సర్వవిధముల నాచార్యుండైన ద్రోణునకు గురుదక్షిణ నియ్యందలచి దుర్యోధనుండాతని నెద్దియైన ప్రతిగ్రహింపుమని ప్రార్థించెను. పాండవులకు సహాయముచేయుట కిదియ సమయమని తలచి ద్రోణుండు కొంచెము యోజించుచుండెను. ఆచార్యునకుం దనయందు పూర్వముండిన యవిశ్వాసమింక నున్నదేమోయని శంకించుచు దుర్యోధనుండు తా నాతం డెద్దియడి

గిన నిచ్చుటకు సిద్ధముగానున్నవాఁడని ప్రతిజ్ఞచేసెను. అందుపై "నరణ్యమున మృగములవలె దురవస్థఁజెందుచుండు పాండవులకు నీ రాజ్యములోఁ గొంతభాగమిచ్చిన నదియె నా భిక్షయు దక్షిణయునగు"నని ద్రోణుఁడు చెప్పెను.

ఆ మాటల విని శకుని కోపముతో "నిది శిష్యవంచన" యని చెప్పుచు నా సమయమున విఘ్నకారియయ్యెను.

అచ్చోటనుండిన దుర్యోధనుని మిత్రులలో నొక్కొక్కరు నొక్కొక్కవిధముగ నాడినందున నాచార్యశిష్యులకుఁ బరస్పరము వాక్కలహము సంభవించునటులుండెను. అంత భీష్ముఁడు మధ్యవర్తియై పౌత్రునకుఁ బ్రతిజ్ఞాతార్థమును నిర్వర్తింపుమని యుపదేశించెను. మాతులాదులతోఁ గొంతసేపు యోజించి కథంకథముగ వారల యనుజ్ఞఁబడసి దుర్యోధనుఁడు తనకు ప్రతిజ్ఞను బూర్తిచేయ నిశ్చయించుకొనెను. అంత శకుని "పంచరాత్రములోఁ బాండవులవృత్తిఁ గనుఁగొనెదరేని, మీ యాజ్ఞప్రకారము వారికి దుర్యోధనుఁడు రాజ్యభాగము నిచ్చు"నని ద్రోణునకుఁ జెప్పెను.

అత్తరుణమున విరాటనగరమునుండి దూతుఁడు వచ్చి "కీచకాదులకు నేదో యొక యదృశ్యయక్షహస్తమున నకాలమరణము సంభవించినందున విరాటమహారాజు దుఃఖాక్రాంతుఁడై యజ్ఞమునకు రాకుండె"నని విన్నవించెను. అది విని భీష్మద్రోణులు పాండవులచ్చోట నజ్ఞాతవాసము చేయుచుండవలయునని యూహించిరి. గణనముసేయ నింక పంచరాత్రములో వత్సరాంతము కలుగుచున్నదని ద్రోణుఁడు తెలిసికొని దుర్యోధనుని ప్రతిజ్ఞకు "తథాస్తు" అని బదులుచెప్పెను.

విరాటుఁడు యజ్ఞమునకు రాక కురువంశ్యులను ధిక్కరించె నని భీష్ముఁడు దుర్యోధనునకుఁ గోపమువచ్చునటుల బోధించి యాతని గోగ్రహణముఁ జేయవలయునని యాదిశించెను. యజ్ఞార్థముగ వచ్చియుండిన రాజులందఱు దుర్యోధనునకు సహాయులైరి. అంతి కౌరవసైన్యము విరాటపురిని ముట్టడించెను. విరాటునకు జన్మదినముగాన నా రోజున బ్రాహ్మణదాన నిమిత్తము గోవులన్నిటిని మందలుగానిలుప గోపాలకు లనుజ్ఞఁ బొందియుండినందున బ్రకీర్ణములగు గోవులన్నియు నొకచోట గుమికూడునట్లు సంభవించెను. అందుచేఁ గౌరవులకు గోగ్రహణము సులభమాయెను. గోవులఁ గోల్పోయి గోపాలకులు రాజద్వారమునకుఁబోయి మొఱ్ఱవెట్టిరి. కోపావిష్టుఁడై విరాటుఁడు కౌరవులను శిక్షింప నిశ్చయించి రథమునుఁ దెమ్మని భటున కాజ్ఞాపించెను. రథమునుఁ గొని యుత్తరుఁడు బృహన్నలతో రణరంగమున బోయెనని యెఱిఁగి, మఱియొక రథమున నైనఁ దాను బోవలయునని యెంచి యశ్వముల సజ్జీకరింప నానతిచ్చెను. ఇంతలో రణరంగమునుండి భటుఁడువచ్చి రణవృత్తాంతముల వర్ణింపఁదొడగెను. భీష్మద్రోణకర్ణాదులుకూడ నిలచి యుత్తరునితోఁ బోరాడఁజాలకుండిరనియు, కౌరవసైన్యము పరాహతమై పరుగిడుచుండెననియు, నభిమన్యుఁడుమాత్రము బాల్యముచే భయమెఱుఁగక శత్రుపక్షమునఁ బోరాడుచుండెననియు, నా భటుఁడు చెప్పెను. అప్పుడు విరటునితో మాటలాడుచుండిన కంకభట్టుఁడదివిని "అభిమన్యునియెదుట బృహన్నలసారథ్యము నిరుపయోగము. మఱియొక సారథినంపుట మేలు" అని పలికెను.

"యోధాగ్రేసరులగు భీష్మాదులఁగూడ విముఖులుగ జేసి నాతఁడు సౌభద్రుని జయింపలేఁడా?" యని విరాటుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

మఱల యుద్ధరంగ వృత్తాంతముఁ దెలిసిరమ్మని యాతఁడు భటునంప, గోవులనంతయు వదలి, ధార్తరాష్ట్రులు పారిపోయిరనియు, శస్త్రతాడితులయిన రణధీరులకు యథార్హము సన్మానించుటకై, వారివారి నామంబుల నుత్తరకుమారుఁడు పుస్తకములలో వ్రాయుచున్నాఁడనియు, ప్రియనివేదనార్థము బృహన్నల యంతఃపురముఁ జనెననియుఁ దెలియవచ్చెను. రణరంగవృత్తాంతమును సాక్షాత్కరించినవారి ముఖముగఁ దెలియగోరి విరాటుఁడు బృహన్నలకుఁ జెప్పిపంపెను. బృహన్నల యుద్ధవృత్తాంతమును జెప్ప నారంభింప, నభిమన్యుఁడు పట్టువడెనని పరుగిడుచువచ్చి యొక భటుఁడు విన్నవించెను. అజేయుఁడని ప్రసిద్ధిగాంచిన రణవీరుఁడిట్లు పట్టువడుట వాని జనకుల దౌర్భాగ్యమే యని బృహన్నల చింతించుచుండ, "విరాటాధిపుని మహానసమున నియుక్తుఁడయినవానిచే నతఁడు పట్టుకొనఁబడియె"నని తెలియవచ్చెను. "ఆర్యభీమునిచేఁ గుమారుఁడు పరిష్వక్తుఁడయ్యెనుకాని శత్రువులచేఁ బట్టువడినవాఁడు కాఁడ"ని బృహన్నల సంతుష్టిఁజెందెను.

అభిమన్యునకుఁ దగుమయిన సత్కారముసలుప నుద్యుక్తుఁడై విరాటుఁడాతని బిలిచికొనిరమ్మని బృహన్నలనంపెను. బృహన్నలాభీమసేనులాతనిఁ బిలిచికొని యాతనికి రోషము పుట్టించునటుల మాటలాడుచు నాతని క్షేపోక్తుల కానందించుచు

వచ్చిరి. భీమసేనుఁడు విరాటమహారాజును నమస్కరించి, తా నభిమన్యుని తన బాహువులచేఁ బట్టుకొనెననెను.

"నిరాయుధపాణికి నన్నితఁడు సమీపింప నే నీతనిచేఁ జిక్కితిని. ఇతఁ డాయుధపాణియై యుండెనేని నేనీతని సంహరించియుందున"ని యభిమన్యుఁడు వానిని సవరించెను.

భీమసేనుఁ డదివిని "నా స్వాభావికమైన యస్త్రములగు బాహువులుండ, నేనితరమైన యాయుధముల గ్రహింపను; దుర్బలులే ధనుస్సుల గ్రహించువారు" అని నుడివెను.

"ఈ మాటలు నా మధ్యమజనకునికే తగునుకాని యితరులకుఁ దగదు" అని యభిమన్యుఁడు గంభీరోక్తినిఁ బలికెను.

ఇటులీ వివాదములు జరుగుచుండ నుత్తరకుమారుఁడు సభామంటపమునకు వచ్చెను. "పూజనీయులగు యోధులకు సన్మానము యథార్థము జరిగెనా?" యని విరాటుఁడడుగ, పూజనీయతములగు నీ పాండవులకు సన్మానము జరిగిన వెనుక నితరులకు జరుగవలయునని ధర్మార్జునభీముల జూపెను. అంత విరాటుఁ డాసనముననుండి సంభ్రమమున లేచి వారికి నమస్కరించి వారి వాసముచేఁ దన గృహము పావనమయ్యెనని వేనోళ్ల వారినిఁ బొగడసాగెను. వారి యజ్ఞాతవాసమున నింక యవశిష్ట ముండునేమోయని శంకించి యాతఁడు బృహన్నల నంతఃపురములోనఁ బొమ్మని యడుగ, యవశిష్టమేమియు లేదని ధర్మజుఁడు చెప్పెను.

అభిమన్యుఁడు జనకులఁజూచి "వీరిందుచేతనేకదా నేనెంతఁ దిరస్కరించినను నవ్వుచునేయుండిర"ని మనమున విస్మయించుచుండెను. తన యపరాధముల క్షమింపుఁడని యాతఁడు వారలఁ బ్రార్థింప, వారపరాధముల నెవ్వియుఁ గానరైరి.

పరమానందభరితుఁడై విరాటుఁడు పాండవులతో సంబంధము నపేక్షించి తన కుమార్తెయగు నుత్తరను పరిగ్రహింపుమని యర్జును నడుగ నాతఁడు తన పుత్రునికై పరిగ్రహించెద ననెను. ఉభయులుఁ గలసి వివాహముహూర్తము నేర్పరచిరి. ఈ శుభవృత్తాంతమును దెలుపుటకై కౌరవశిబిరమునకు విరాటుఁ డుత్తరకుమారునంపెను.

కౌరవసైనికులు హతశేషులను గణించుచుండ, నభిమన్యుడు పట్టువడెనని వారికిఁ దెలిసెను. యోధాగ్రేసరు లసంఖ్యాయులుండ, నభిమన్యుఁడిట్లు పట్టువడుట యవమానకరమని భీష్మకర్ణాదులు పరితపించుచుండిరి. "అతివేగమున నొక్క పదాతి వచ్చి యాతనిఁ బట్టుకొనె"నని సూతుఁడుచెప్ప, నా పదాతి భీముఁడనియే భీష్ముఁడు నిర్ణయించెను. పాండవులకు రాజ్యమియ్యఁదలచి తమ్ము వంచనసేయుటకై యిట్లు పాండవపక్షపాతులు చెప్పుచున్నారని దుర్యోధనాదులు దానిని నమ్మరైరి. ఆ సమయమున భటుఁడొకఁడు బాణమునొక్కటిఁ జేతబట్టికొని "ఇందు ఎవ్వరిదో నామాంకితములగు నక్షరములున్నవి"ని చెప్పుచు దానిని భీష్మునిచేత నిచ్చెను. "నేను జరాశిథిలితాక్షుఁడను. నీవు చదువుము"ని భీష్ముఁడు దానిని శకునిచేతనియ్య, నాతఁడు "అర్జునునది" యని చదివెను. అంత నర్జునభీములే వారితోఁ బోరాడినదియని యనేకులు నమ్మినను శకునిమాత్రము "అర్జునుఁడను యోధుడుండవచ్చు"నని చెప్పుచుండెను. యుధిష్ఠిరుని సాక్షాత్కరించినగాని పాండవులకు తాను రాజ్యమియ్యఁజాలఁడని దుర్యోధనుఁడు పలికెను. అప్పుడే యుత్తరుఁడు శిబిరమును ప్రవేశించి శుభవార్తను దెలిపెను. ద్రోణాచార్యుల యనుజ్ఞచే దుర్యోధనుఁడు రాజ్యభాగమును పాండవులకిచ్చి

సత్యమున నిలిచెను. అభిమన్యుని వివాహార్థమాహూతులై యందఱును విరాటనగరమునకుఁబోయి యా మహోత్సవము ననుభవించి యామోదితులైరి.

(పంచరాత్రములోనిది.)



## కురుక్షేత్రయుద్ధము

యుద్ధసన్నద్ధులై కౌరవపాండవులు కురుక్షేత్రముఁ జేరిరి. తత్తత్పక్షావలంబులగు మహీపాలులు మంత్రశాలలో సమావేశులయి యుద్ధనిర్వహణార్థమాలోచింపఁ దొడగిరి. దుర్యోధనుఁడు మాతులాదుల యభిప్రాయము ననుసరించి గాంగేయుని సేనానిగ నియమించెను. ధర్మజుఁడు నిరర్థకముగ బంధువులతోఁ బోరాడుటకంటె నెట్లైన సంధిఁజేయుట మేలని యెంచి వాసుదేవుని దౌత్యమున నియమించెను. పాండవులకు దౌత్యము వహించి వాసుదేవుఁడు వచ్చియున్నవాఁడని కౌరవమంత్రశాలలో భటుఁడు విన్నవింప, దుర్యోధనుఁ డదివిని యాతని నవమానింపఁదలచి యాతనికిఁ బ్రత్యుత్థానముచేయకుండుడని స్వపక్షభూపతుల నాజ్ఞాపించెను; తాను నొక కార్యవ్యగ్రునివలె "ద్రౌపదీమానహరణ" చిత్రపటమునుఁ దెమ్మని దాని నవలోకించుచుండెను.

వాసుదేవుఁడు శిబిరముఁ బ్రవేశింప, నాయా భూపతులు మైమఱచి ప్రత్యుత్థానముఁ జేయదొడగిరి; కేశవుని ప్రభావముచే దుర్యోధనుఁడుకూడ నాసనమునుండి చలితుఁడయ్యెను. చిత్రపటముఁజూచి కేశవుఁడు "బాలిశత్వముచే సుయోధనుఁడు స్వజనావమానమును పరాక్రమముగఁ జూచుచున్నాఁడే" యని

యాతని ననుశోచించుచు నాసీనుఁడయ్యెను. పరస్పరకుశల ప్రశ్నానంతరము వాసుదేవుఁడు పాండవుల సందేశముఁ దెలిపి వారికి యర్ధరాజ్యమిమ్మని దుర్యోధను నడిగెను. పరాత్మజులైన ధర్మజాదులకుఁ బాండుసుతత్వము కలిగనేరదనియు నందుచే వారలు తనకు సపిండులు కాజాలరనియు దుర్యోధనుఁడు చెప్ప, విచిత్రవీర్యుని మరణానంతరి మంబికయందు వ్యాసునకుఁబుట్టిన ధృతరాష్ట్రునకు రాజ్యమునచ్చుట యన్యాయ్యమనియు, నీవు పరస్పరవిరోధవర్ధనమునఁ గురుకులము నశించుననియు, యుధిష్ఠిరాదులు ప్రణయమునఁ జెప్పిపంపినవార్తల నామోదింపవలయు ననియు వాసుదేవుఁడు వాక్రుచ్చెను.

అది విని దుర్యోధనుఁడు "రాజ్యమన నృపాత్మజులు రిపువుల జయించి యనుభవించునది; దానిని యాచించినవారును, దీనులకు దానిని దానముచేసినవారును లోకమునలేరు; నృపతిత్వముఁబొందుటకు వారలపేక్షించిరేనేని సాహసముఁ జేయవలయు; లేనియెడల శాంతిమతులకు శరణ్యమగు నాశ్రమమునుఁ బ్రవేశింపవలయు"నని రాజ్యవ్యవహారతత్వమును దూతుఁడగు కేశవునకు బోధించెను. కోపమెంతవచ్చినను, దాని నణచికొని బంధువులయెడ నింత పరుషోక్తులాడఁగూడదనియు సుహృద్బంధువులను వంచింపఁదలచినవారు విఫలశ్రములగుదు రనియు వాసుదేవుఁడు పలుక, సుయోధనుఁడు కంసవధ వృత్తాంతమునుఁ బ్రస్తావించి యాతనిఁ బరిహాసింపసాగెను.

సామవాక్యములచేఁ గార్యము చేకూరదని తలచి వాసుదేవుఁడు పరుషోక్తులనైన నాతని వశీకరింప, నర్జునాదుల పరాక్రమము నాతనియెదుటఁ బొగడసాగెను. పాశుపతాస్త్రమును సంపాదింపఁబూని యర్జునుఁడు కిరాతరూపియైన పశుపతిని తృప్తి

పరచినదియు, ఖాండవమును దహించుచుండిన యగ్నిదేవుని వర్షపాతమునుండి యతఁడు రక్షించినదియు, దేవేంద్రార్తికరులగు నివాతకవచుల నాతఁడు క్షయముచేసినదియు, విరాట నగరమున భీష్మాదుల 'నాతఁ డసహాయుఁడై జయించినదియు, జెప్పి దుర్యోధనునకు స్వానుభవమైన చిత్రసేనుని వృత్తాంతమునుగూడ జ్ఞప్తిపఱచి, వారడిగినప్రకార మర్ధరాజ్యమియ్యని యెడల రాజ్యమంతయు వారు హరించెదరని తర్జించెను. దుర్యోధనుఁ డిసుమంతయు భీతిల్లక, మారుతుఁడే భీమరూపియై యుద్ధమునఁ దన్ను బ్రహరించినను, శక్రుఁడే యర్జునరూపియై తన్ను దండించినను, పితృభుక్తమును, తన వీర్యగుప్తమునగు రాజ్యమునఁ దృణముగూడ నియ్య సాధ్యముకాదనెను

వాసుదేవ సుయోధనులకిట్లు పరుషోక్తులు వృద్ధియయ్యెను. దౌత్యము విఫలమయ్యెనని వాసుదేవుఁ డచ్చోటనుండిన రాజుల యనుజ్ఞఁబడసి బయలువెడలెను. సుయోధనుఁడాతని బంధింప గోరి దుశ్శాసనాదులను నియమించెను. వాసుదేవుని తేజోబలముచే వారు ధర్షితులై భూమిపైఁబడ, తానే యాతని బంధింప నుద్యమించెను. కేశవుఁడు నాతని జాలిపెట్టఁదలచి యొకప్పుడు హ్రస్వుఁడుగను, నొకప్పుడు దీర్ఘుఁడుగను, నొకప్పుడు దృశ్యుఁడుగను, నొకప్పు డదృశ్యుఁడుగను నానారూపములఁ దాల్చెను. విఫలప్రయత్నుఁడై సుయోధనుఁడాతని వధింపఁ గోరి శరాసనమును గొనివచ్చుటకు నిష్క్రమించెను.

పాండవుల కృత్యమును దానే సలుప నుద్యమించి కేశవుఁడు కోపావిష్టుఁడై తన యాయుధవర్యమగు సుదర్శనము నాహ్వానించెను. ఆ యాయుధరత్నము "కర్మకాలము ప్రాప్తమైనట్లున్నది. మేరుమందరకులమును పరివర్తనముచేయుదునా?

సకలమగు మకరాలయమును సంక్షోభింతునా? అఖిలక్షత్ర వంశమును భువిని బడవైతునా? అనుజ్ఞనిమ్ము"నుచు వాసుదేవుని సమీపించెను. సుయోధనవధార్థము, వాసుదేవుఁడు తన్నుఁ బిలిచెనని కనుగొని సుదర్శనము తనచే నీ కార్యము సిద్ధించె నేని, భూభారముదీర్చ నాతని యవతారము విఫలమగునని యాతని కణకువతోఁ దెలియజేయ, ప్రశాంతకోపుఁడై యా తఁడు "రోషముచే సముదాచారముఁ జూడనైతిని; నీ యాల యమునకు నీవు పోవచ్చును" అని యా సుదర్శనమున కాజ్ఞఁ జేసెను. భగవంతుని యానతిమీఁద సుదర్శనము మఱలుచుఁ ద్రోవలో శార్ఙ, కౌమోదకీ, పాంచజన్య, నందకములు పరు గిడుచు వచ్చుచుండుటఁజూచి, వాసుదేవుని కోపము శాంత మయ్యెననియు, నవి తమతమ చోటులఁ జేరవచ్చుననియు వానికిఁ దెలిపెను. అవియన్నియుఁ దిరిగి చనుచుండ, ప్రళయ వాత మొకటి వెలువడెను. ఏదో యనర్థము కలుగబోవుచున్న దని సుదర్శనము శంకించుచుండ, వైనతేయుఁడు కడువేగమున వచ్చుచుండెను. సుదర్శనమాతని నెదుర్కొని దేవదేవుని కోపము ప్రశాంతమయ్యెనని యాతనికి దెలియపఱచి యాతనిని మఱ లించెను. వాసుదేవుఁడును బాండవశిబిరమునకుఁ బోవ నుద్య మింప, ధృతరాష్ట్రుఁ డభిముఖుఁడై పుత్త్రుని యపరాధమున కాతని నమస్కరించెను. అనుగృహీతుఁడై యాతఁడాతని కర్ఘ్యపాద్యముల నర్పించెను. వానిని బ్రతిగ్రహించుటచే వాసు దేవుఁ డాతని బహూకరించి, తానును తృప్తుఁడయ్యెను.

(దూతవాక్యములోనిది.)



భీష్మవధానంతరము కౌరవులు కోపావిష్టులై పద్మవ్యూహమున నేకాకియై పోరుచుండిన యభిమన్యు ననేకులుచేరి పడవైచిరి. అభిమన్యువధమును ప్రియమని యొక్క భటుఁడు ధృతరాష్ట్రునకుఁ దెలుప "ఛీ యప్రియమును బ్రియమని నాకుఁ దెలియఁజేయు నాతఁడెవ్వఁడు? శిశువధపాతకాంకితులగు మాయొక్క వంశక్షయము నిట్లు ఘోషించువాఁడెవ్వఁడు?" అని యాతఁడు చింతించుచుండెను. పుత్త్రవధముచే నుద్దీపితప్రకోపుఁడై యర్జునుఁడు లోకముల నశింపఁజేయునని యాతఁడు గాంధారితోఁ జెప్పుచుండ, తన జామాతయు దుశ్శలాప్రియుఁడునగు జయద్రథుఁడు దానికి నిమిత్తభూతుఁడని తెలియవచ్చెను. అప్పుడే దుశ్శలకు వైధవ్యము సంభవించెనని ధృతరాష్ట్రుఁడు దుఃఖితుఁడయ్యెను. దుశ్శాసన శకున్యాదులతో నభిమన్యుని నిధనమునకు సంతసించుచు దుర్యోధనుఁడు జనకుని సమీపించి యభివాదన మొనర్ప నాతఁ డాశీర్వదింపఁడయ్యెను. ఆశీర్వాదమేల చేయలేదని శకుని ధృతరాష్ట్రునడుగ "జీవితమున నిరపేక్షులై యిట్లు సౌభద్రుని వధింపఁబూనినవారల కాశీర్వాదమొనరించుటెట్లు"ని యాతఁడు విషణ్ణుఁడై ప్రతివచనమిచ్చెను. దుర్యోధన దుశ్శాసనాదులు తమ జనకుఁడు పాండవపక్షపాతియని యెంచి తమ కృత్యము నాతనియెదుట సమర్థింపఁబూనిరి. వారెంతఁజెప్పిన నాతనికి వారి పలుకులయందు విశ్వాసజ్ఞానము వొడమదయ్యెను. ద్రోణోపదేశమున నభేద్యరూపమగు వ్యూహము నేర్పఱచి యందు జయద్రథుని గోపనముజేసిన, నర్జునుఁడేమియుఁ జేయఁజాలఁడని తన కుమారులు సంతసించుచుండ, ధృతరాష్ట్రుఁడు వారి కర్జునకృత్యముల నొక్కొకటి జ్ఞప్తిపఱచి "భూమిలోఁ ప్రవేశించినను, నభస్థలము నారోహించినను, నర్జున

బాణము లెల్లెడలను సంచరించుచునే వచ్చున"ని చెప్పు చుండెను.

అత్తరుణమున ఘటోత్కచుఁడు చక్రాయుధునిచే దౌత్య మున నియుక్తుఁడై పాండవశిబిరమునుండి యచ్చోటికివచ్చెను; ధృతరాష్ట్రుని సమీపించి యుధిష్ఠిరాదుల యభివాదనముల నాతనికిఁ దెలియపఱచి పిదప తన యభివాదన మొనరించెను. మహారాజును సందేశమును తెలియజేయుమని యాతనిఁ బ్రా ర్థింప, "ఏకపుత్రవినాశమున నర్జునుఁడు పరితపించుచున్నవాఁడు; అనేక పుత్రవినాశమున మహారాజున కెట్లుండునో? కావున పుత్రశోకాగ్నిలో బ్రాణము నాహుతిఁజేయకుండునట్లు మహా రాజు యత్నింపవలయునని వాసుదేవుని సందేశము" అని యాతఁడు విన్నవించెను. అదివిని దుర్యోధన దుశ్శాసనులు సందేశము పరిహాస్యముగనున్నదని చెప్ప, "పార్థివపార్థివుఁడగుఁ జక్రాయుధుఁడు మీకుఁ బరిహాస్యుఁడా? సాక్షాన్నారాయణుఁ డగు మా ప్రభువుచే క్షత్రియులకు వినాశము కలుగబోవుచు న్నది; భూభారమిట్లు నశించునని మీకుఁ దెలియదు కాబోలు" అని ఘటోత్కచుఁడు బెదరించుచు నుడివెను.

వాక్యమాత్రమున వసుంధరను జయింప నశక్యమని శకుని పలుక, "అరే, పాచికల విడువుము; ఇది రణరంగము; ఇచ్చట దారహరణమును రాజ్యతంత్రమును లేవు; ప్రాణముపణము; ఉగ్రఫలములగు బాణముల ననుభవింపవలయు"నని గంభీరోక్తిని నాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఇమ్మిట్లు హేయముగ బలుకు చుండిన నాతనిఁజూచి దుశ్శాసనుఁడు తాము‌ను రాక్షసోగ్ర స్వభావులుకాన తమయెదుట నిట్లు పలుకరాదని తర్జించెను. రాక్షసులకంటె వారుగ్రతరస్వభావులని తెలియపఱచుచు,

"జతుగృహమున నిద్రితులైన భ్రాతలను నిశాచరులు దహింపరు; భ్రాతృపత్నిని నిశాచరులట్లు శిరమున గ్రహింపరు; యుద్ధమున జరిగిన సుతవధమును నిశాచరులు సంతోషముతో స్మరింపరు; వికృతశరీరులుగను, నుగ్రాచారులుగనుండినను, నిశాచరులు దయావిహీనులుకారు" అని సమయోచితముగ ఘటోత్కచుఁడు పలికెను.

వ్యర్థముగ నిట్లు కలహించుచుండుట నిరుపయోగమని దుర్యోధనుఁడు రణరంగమున సాయకములచేఁ దాను ప్రత్యుత్తరమియ్యఁదలచినాఁడని వాసుదేవునకు సందేశమునంపి ఘటోత్కచుని విసర్జించెను.

(దూత ఘటోత్కచము సమాప్తము.)



సంగ్రామము భీషణముల మైయుండ దుర్యోధనాజ్ఞచే నొక్క భటుఁడు కర్ణుని వెదకిచూచి యాతనికి ధనంజయాగమనమునుఁ దెలియపఱచెను కర్ణుఁడదివిని రణభూమిని గౌరవులకుఁ బ్రియముఁ జేయఁదలచి యా ధనంజయుఁడుండుచోట రథమును చోదింపుమని శల్యున కానతిచ్చెను శల్యుఁడట్లు రథమును నడుపుచుండ, బూర్వము జామదగ్ని శాపముచే నాతనియొద్ద నేర్చిన యస్త్రములన్నియుఁ గాలవిఫలమగునని కర్ణుఁడు చింతిలుచుండెను. చింతాహేతువును శల్యుఁడడుగఁ, దాను జామదగ్నితో బ్రాహ్మణుఁడని యసత్యమాడి యస్త్రము నుపదేశించికొనినదియు, నొకప్పుడు తన యూరువున నాచార్యుఁడు నిదిరించుచుండ వజ్రముఖమను క్రిమిచే నా యూరువు నికృత్తమైనను, ఆచార్య నిద్రాభంగభీతిచే దానావేదనను సహించికొనినదియు, నది చూచి యాచార్యుఁడు తన్ను క్షత్రియుఁడుగ నుండవలయునని

యూహించి శపించినదియు సవిస్తారముగఁ జెప్పెను. ముని శాపముచే వస్త్రములు నిర్వీర్యమగుట ననుసరించి రథాశ్వములు కూడ స్థలత్పదములై దైన్యముచేఁ గన్నులమూసెను. శల్యుఁడది కనుగొని పరితపింప, "యుద్ధమున హతునకు స్వర్గము; విజేతకు యశస్సు; ఉభయవిధముల రణమున నిష్ఫలత్వము కలుగనేర ద"ని యాతనికి ధైర్యముపుట్టించి, యర్జునాభిముఖముగ రథముఁ గొనిపొమ్మని కర్ణుఁ డాజ్ఞఁజేసెను. వీరిట్లు చనుచుండ నెద్దియో యాచకుని శబ్దమువలె వినవచ్చెను ఆ శబ్దమువిని రథాశ్వములు స్తబ్ధకర్ణములై చిత్రార్పితములుపోలె నచలాంగయష్టులై యుండ, నా యాచకుఁడెవ్వఁడో మహానుభావుఁడని యూహించి కర్ణుఁడాతని బిలువనంపెను. యాచకబ్రాహ్మణుఁడు సమీపింప నాతనికి వందనమొనర్చెను. "ఆశీర్వదించిన దీర్ఘాయువగును; అది ప్రస్తుతకార్యమునకు విఘ్నము; ఆశీర్వదింపక యుండిన నన్ను మూర్ఖుఁడని తలచును. ఏమిచేయుదు"నని బహువిధములఁ జింతించుచు తుదకు "ఆచంద్రార్కస్థాయియగు గీర్తిమంతుఁడు కమ్ము" అని కాలోచితముగ నా బ్రాహ్మణుఁ డాశీర్వదించెను. దీర్ఘాయుష్కుఁడు కమ్మనిచెప్పక యాతఁడిట్లు వచించి నందుకుఁ గొంత శంకించి, యదియె శ్లాఘ్యతరము కావచ్చునని కర్ణుఁడు సంతసించుచు నాతని యాగమనకార్యముఁ దెలుపఁ బ్రార్థించెను. "మహత్తరభిక్షనడిగెద"నని యాతఁడు నుడువ, "గోసహస్రమిత్తునా? తురగసహస్రమిత్తునా? కరిసహస్రమిత్తునా? భూమండలము జయించియిత్తునా? అగ్నిష్టోమఫలము నిత్తునా? నా శిరస్సునిత్తునా?" యని కర్ణుఁడు పలువిధముల నడిగెను. యాచకుఁడు వానిలో నెద్దానినైన గ్రహింపఁడయ్యెను.

అతని నెల్లినను తృప్తిపఱుపఁదలఁచి తన దేహరక్షణార్థమంగము లతోఁగూడ జన్మించినవియు, దేవాసురులచే నభేద్యమగునవియు నైన కవచకుండలములనైన గ్రహింపుమని యడుగ నాతఁడు కడు సంతసిల్లి "కైకొనియెద గైకొనియెద" నని సత్వరముగ బలికెను. అదివిని కపటబుద్ధియైన కృష్ణుని యుపాయమే యదియని నిస్సంశయముగ దెలిసియు, గర్ణుఁడు మనమున సంతుష్టుఁడై, శల్యుఁడు నివారించుచుండ వానిని శరీరమునుండి ఛేదించి యాచకున కిచ్చెను. అపరిమితసంతోషముతో నద్దానిని బ్రతిగ్రహించి యాచకుఁ డంతర్హితుఁడయ్యెను.

శక్రునిచే తానిట్లు వంచితుఁడయ్యెనని శల్యుఁడు నుడువ ననేక యజ్ఞాహుతితర్పితుఁడును, అర్జునజనకుఁడును, దానవ సంఘమర్దనుఁడును, సురద్విపాస్ఫాలనకర్కశాంగుళియునగు పాకశాసనుఁడు తనచేఁ గృతార్థుఁడయ్యెనని కర్ణుఁడెంతయు సంతసించెనుకాని, యనుతపింపఁడయ్యెను.

తానిట్లు కర్ణుని వంచించినందుకు శక్రుఁడు పశ్చాత్తప్తుఁడై పాండవులలో నొక్క పురుషుని నధార్థమమోఘమగు నస్త్ర మొకటి నాతనికియ్య దేవదూతనంపెను. దత్తమునకుఁ బ్రతిగ్రహణముచేయనని కర్ణుఁడు దానిని దిరస్కరింప, బ్రాహ్మణ వాక్కు నామోదించి ప్రతిగ్రహింపవలయునని దూతుఁడు విన్నవించెను. "అనుగృహీతోస్మి" యనుచు నద్దాని గైకొని కర్ణుఁడు రథారూఢుఁడై యర్జును నెదుర్కొని పోరాడఁ జనెను.

(కర్ణభారములోనిది.)



రణరంగము భీకరమైయుండెను. విపన్నులైన రథికులను సృగాలములు రథములనుండి దింపుచుండెను. శిరోవిహీనము లైన కబంధములు పూర్వవాసనచే పరుగిడుచుండెను. పిశితార్ద్ర ముఖములైన విహంగములు పరస్పరము హతజీవితులగు రాజుల శరీరములనుండి యాభరణముల విడదీయుచుండెను. శూన్య రథముల నశ్వములీడ్చుచుండెను. ఉభయపక్షమున నించుమించుగ నందఱు నిహతులైరి. ధృతరాష్ట్రపక్షము దుర్యోధనమాత్రావశిష్టముగను యుధిష్ఠిరపక్షము పాండవజనార్దనమాత్రావశిష్టముగనుండెను. అంతమున భీమదుర్యోధనులకు గదాయుద్ధము ప్రవృత్తమాయెను. మేఘనాదమువోలె సింహనాదములు విజృంభించెను. అన్యోన్యగదాభిఘాతమున వారి శరీరములు రుధిరప్రవాహమున మునిగియుండెను. పెదవులగొఱుకుచు దుర్యోధనుఁ డతిరోషమున గదనుద్రిప్ప నది వేగమున భీముని యురమునఁ బడెను. భీముఁడా దెబ్బను దాళక భూమిపైఁ బడెను. అదిచూచి వ్యాసుఁడు విస్మితుఁడై నిలచియుండెను; యుధిష్ఠిరుఁడు దైన్యమువహించెను; విదురుఁడు కన్నీరువిడిచెను; అర్జునుఁడుగాండివమునఁ జేయివైచెను; కృష్ణుఁడాకాశముఁ జూచుచుండెను; శిష్యప్రీతిచే బలరాముఁడు హలాయుధముఁ ద్రిప్పుచుండెను.

"వీరుఁడు దీనుని యుద్ధమునఁ జంపడు; భయపడకుము" అని దుర్యోధనుఁడు భీముని బరిహసింపఁ గృష్ణుఁడది సహింపక తన తొడనుదట్టి భీమునకు సైగఁజేసెను. భావముఁ గనుఁగొని భీముఁడు ముఖమున స్వేదబిందువుల నొకవ్రేలితో దుడిచివైచి,

గదను బాహువులచే నెత్తికొని, పుత్రప్రీతిచేఁ దండ్రియగు వాయుదేవునుండి బలమువొందినవానివలె గర్జించుచు లేచి యా గదను మహావేగమునఁ ద్రిప్పి దుర్యోధనుని యూరువులపై బ్రయోగించెను. విశీర్ణోరుఁడై దుర్యోధనుఁడు ధరపైఁబడెను. హలాయుధుఁడు కోపముచేఁ గన్నులఁదెఱచెను. పాండవులు తొట్రుపడుచుఁ గృష్ణుని సాహాయ్యమున భీముని వలఁ గొని పోయిరి.

"బాణాసురపుర ప్రాకారమును పడగొట్టినదియు, యమునాజలమునకు బుద్ధిచెప్పినదియు, రిపువుల ప్రాణబలిచే నర్చితమగునదియు నాహలముచే భీముని యురమున సారెలదీర్చెదను" అని బలరాముఁడు గర్జించుచుండ, ప్రశాంతకోపుఁడై దుర్యోధనుఁడు "మేమందఱము నశించితిమి; మావైర మంతి మయ్యెను; కురువంశమునకు జలాంజలినర్పింప నా పాండవులైన బ్రతికియుండని"యని పలువిధముల నాతని బతిమాలుకొనెను. కృష్ణుఁడాతనిని వంచించెనని తెలిసినయైన నాతని కోపము వృద్ధి పొందుటఁజూచి బలభద్రుఁడా వృత్తాంతమును జెప్పెను. మహావీర్యశాలియును, హిడింబాదుల ప్రాణహారియునగు భీముఁడిట్లు తన్ను వంచించి పడగొట్టినందున, దాను యుద్ధమున నపరాజితుఁడని దుర్యోధనుఁడెంతయు సంతసించెనుగాని యా కపటమున కిసుమంతయు గోపముజెందడయ్యెను. పుత్రుఁడిట్లు వంచితుఁడై యుద్ధరంగమునబడెనని తెలియుటకు మిగుల దుఃఖితుఁడై ధృతరాష్ట్రుఁడంతఃపురజనులతో నచ్చోటికి వచ్చెను. వ్యసనమున మునుఁగులఁ దీసివచ్చుచుండు నవరోధవధూమణులఁ జూచినతోడనే, దుర్యోధనునకుఁ బూర్వము దెలియని గదాభిఘాతబాధ యధికమయ్యెను. తలిదండ్రుల నమస్కరింప నుత్థా

నము జేయఁ బ్రయత్నించి యశక్తిచేఁ బునఃపతితుఁడై సాష్టాంగ ముగ వారలకు నమస్కరింపలేమికి దుర్యోధనుఁడు వగచుచుం డెను.

"నాయనా!" యని తన ముద్దుకొమరుఁడగు దుర్జయుఁడు తొడపై గూర్చుండ నద్దానిసహింపక "ఇదివఱకు నీకు బరిచిత మగు నాసనమును విడిచి యెచ్చోటనైనఁ గూరుచుండుము; ఇది మొదలు నీవనుభవించిన యాసనము నీకుఁ గలుగనేరదు" అని యాతని నతిదుఃఖముతో నివారించెను.

అశ్రుపూరితాక్షులగు తన ప్రియలఁజూచి "మీ భర్త యుద్ధమున నపరాఙ్ముఖుఁడై పడెను. క్షత్రియాంగనలగు మీరు యేడ్వఁదగదు" అని వారల నూరడించెను.

అంత్యమునఁ బుత్రుని దగ్గఱబిలిచి "తండ్రీ! నన్నువలెఁ బాండవుల శుశ్రూషించుము; నీ పితామహియగుఁ గుంతీ దేవినిఁ బూజించుము; ద్రౌపదీసుభద్రల నీ జననివలె బహూకరించుము; మానధనుఁడగు జనకుఁడు యుద్ధమునఁ దుల్యబలునిచే హతుఁడని శోకమును వదలుము; క్షేమాపసవ్యమగు యుధిష్ఠిరుని భుజమును స్పృశించుచుఁ బాండవులతోఁగూడ నీవును నాకు జలాంజలి విడువు"మని యాతని కుపదేశించెను.

వైరమిట్లు పశ్చాత్తాపముగఁ బరిణమించెనని బలదేవుఁడు విస్మయించుచుండ,

"వంచనాదళితోరుఁడగు దుర్యోధనుఁడెనుకాను;

కాలవిఫలాస్త్రుఁడగు కర్ణుఁడనుకాను; ఉద్యతాస్త్రుఁడనై యసహాయుఁడుగ ద్రోణపుత్త్రుఁడ నిట వచ్చుచున్నాఁడ"నని యశ్వత్థామ వీరవాదముఁజేయుచు నచ్చోటవచ్చి దుర్యోధను నకు నాగ్రహముబుట్టింప పలువిధంబులఁ బ్రయత్నించెనుకాని

తుదకు విఫలారంభుఁడయ్యెను. పాండుపుత్త్రుఁడుగదా యుద్ధమున నాతని యూరుద్వయముతో దర్పమునుగూడ నపహరించె నని యశ్వత్థామపలుక, దుర్యోధనుఁడు "అక్కాలమున ద్యూతమునందు ద్రౌపదిని కేశము కచమున నాకర్షించినదియు, బాలుఁడును పుత్త్రుఁడునగు నభిమన్యుని రణమున నిర్దయముగ వధించినదియు, అక్షవ్యాజమున యుధిష్ఠిరాదుల జయించి యరణ్యమృగములవలె వనమునకుఁ దరిమినదియు, జూడ, బాండవులు నాకిప్పుడుచేసిన దర్పాహరణము మిగుల స్వల్పము" అని తన పశ్చాత్తాపము వెలిపుచ్చుచు నాతని శాంతపఱుపఁ జూచెను. ఎంతఁజెప్పినఁ గృతప్రతిజ్ఞుఁడై యశ్వత్థామ సౌప్తికవధమునకై యాయుధమును గ్రహించి నిశాసమయము నెదురుచూచుచుండెను. దుర్యోధనుఁడును శంతను ప్రభృతి పితృపితామహుల స్మరించుచు స్వర్గతుఁడయ్యెను.

(ఊరుభంగములోనిది.)



## రామరాజ్యవియోగము.

రాజ్యభారక్షిన్నుఁడై దశరథుఁడు రామునకుఁ బట్టముగట్టి వానప్రస్థము నవలంబించి యరణ్యమున వార్ధకము గడుప నిశ్చయించెను; పురోహితునిఁబిలిచి యభిషేకమునకు మంచి ముహూర్తము నేర్పఱుప నానతిచ్చెను. అభిషేకవార్త విని పురజనులు తమతమ గృహముల నలంకరింపఁదొడగిరి. రాముఁడు మంగళస్నానమాచరించి పవిత్రుఁడై యాసనమునఁ గూరుచుండి జానకి నెదురుచూచుచుండెను. లక్ష్మణశత్రుఘ్ను లభిషేకఘటమును బెట్టికొనియుండిరి. కన్నీరువిడుచుచు మహారాజును స్వయముపే ఛత్త్రమును చేబట్టియుండెను. మంత్రపూతవదనులై పురోహి

తులు ముహూర్తమును నిరీక్షించుచుండిరి. అత్తరుణముస సంభ్రాన్తయై మంథర దశరథునిచెవి నెద్దియో రహస్యముగఁ బలికెను. దీనవదనుఁడై యచ్చోటువిడిచి మహారాజు లోపల జనెను. అభిషేకమునకు విఘ్నమాయెను.

కేకయరాజ పుత్రిచేఁ బిలువఁబడి దశరథుఁ డామెయంతః పురమున కేగెను. భరతునకుఁ బట్టము గట్టవలయుననియు, రాముని పదునాలుగేండ్లు యరణ్యవాసముఁజేయ నంపవలయు ననియుఁ గైకేయి యాతని నిర్బంధించెను. ఆమె మాటలదాట నశక్తుఁడై దశరథుఁడు పుత్రవియోగభీతిని మూర్ఛిల్లెను.

ఈ వృత్తాంతములను సీతకుఁదెలుప రాముఁ డామెయంతః పురమున కేగెను. అచ్చోట జానకి తన చెలియగు నవదాతికచే పరిహాసార్థ ముద్యానవనమునుండి గైకొనబడిన వల్కలమును గరించి యది తనకెట్లున్నదోయని యద్దమునఁ బ్రతిబింబమును జూచుచుఁ దన ప్రియుని పట్టాభిషేకవిషయమై యామెతో మాట్లాడుచుండెను. విశేష వస్త్రాభరణముల ధరింపక తన మగఁడు వచ్చియుండుటఁజూచి యభిషేకవార్త యసత్యమేమో యని యామె శంకించుచుండెను. భూషణములఁదీసి, వల్కలము మాత్రము ధరించియుండిన యామెను జూచి రాముఁడు కారణ మడుగ, నది పరిహాసార్థమని యామె చెప్పెను. తిరుగ నామెను భూషణముల ధరింపుమని యానతిచ్చి, యామె యంగముల నలంకరించుచుండ, రాముఁడు తానే దర్పణముఁ జూపుచుం డెను. అభిషేకవిఘ్నమును దెలియపఱచి తానరణ్యమునకుఁ బోవలయునని రాముఁడా వల్కలమును యాచించెను. రాజ్య వియోగమున కెంతయు వగయక భర్తయుండుచోటే తనకు

రాజ్యమనుచు నామె యాతని వెంబడింపఁ దొడగెను. ఇంతలో నారోపితధనుష్కుఁడై ప్రపంచమున స్త్రీజాతిని దొలగించెదనని ప్రతిజ్ఞఁజేయుచు లక్ష్మణుఁడచ్చోటికి వచ్చెను. రాముఁడాతని కోపమును శాంతపఱచి జానకిని మంచిమాటలతో నరణ్యాగమ నమునుండి నివారింపుమని యాతని నడుగ నాతఁడు "రాహు దోషమునను జంద్రుని తార యనుసరించుచున్నది; వనవృక్షము కూలిన నద్దాని నాశ్రయించి నలతయుఁ గూలును; బురదలో జిక్కికొనిన గజేంద్రమునుఁ గరేణువు విడిచి చనదు; రాజ్యము గోల్పోయి మీ రరణ్యవాసులైన, జానకియు మిమ్మనుసరించి యుండవలయు"నని యామెపక్షముననే మాటలాడెను. అంత సీతయు రాముఁడును వనగమనమునకు యత్నించుచుండ, లక్ష్మణుఁడును వారిని వెంబడించెను. సుమంత్రుని రథముఁ దెమ్మని ముగ్గురును దానిలో గూర్చుండి, పురజనులు కన్నీరుధారల విడిచి యేడ్చుచుండ, నయోధ్యనుండి వెలువడిరి.

పుత్రవియోగమున మహారాజు పరితపించుచుండెను. కౌసల్యయు సుమిత్రయు నాతని నూరడించుచుండిరి. "సూర్యుని వలె రాముఁ డరిగెను; సూర్యుననుసరించి దినమువలె రాము ననుసరించి లక్ష్మణుఁడు చనెను; సూర్యదివసావసానమున ఛాయవలె సీత యదృశ్యయయ్యెను" అని పలువిధంబుల కలవ రించుచు దశరథుఁడు రేయుంబగల్లు నున్మత్తునివలె నుండెను. సుమంత్రుఁడు రామలక్ష్మణాదుల నరణ్యమునవిడిచి మరలి వచ్చెను. శూన్యరథముతో నాతఁడు వచ్చెనని తెలియ, దశర థుఁడు మూర్ఛిల్లెను. మహాప్రయాసమునఁ దిరుగ నాశ్వాసము వొంది, యరణ్యమునఁ దన యనుగుబిడ్డల వృత్తాంతముఁ దెలి యఁగోరి వారేమి సందేశమునంపిరో చెప్పుమని యాతఁడు

సుమంత్రు నడిగెను. "పలుకవలయునని యధరములు చలించు చుండ వారెద్దియో మనమున నునిచి బాష్పస్తంభితకంఠులై యేదియుఁ జెప్పక యరణ్యమున కేగి"రని యాతఁడు విన్నవింప మహారాజు ద్విగుణముగ మూర్ఛితుఁడయ్యెను. ఆతని మూర్ఛకుఁ బ్రతీకారమేమియు లేకపోయెను. అమాత్యులందరును బ్రక్కనఁజేరి యోజించుచుండిరి. తన పూర్వీకులగు దిలీపాదులు మహారాజున కెదుట నిలిచియుండినట్లు కనఁబడిరి. "ఇదిగో వచ్చుచున్నాఁడ"నని చెప్పుచు నాతఁడు స్వర్గతుఁడాయెను.

మాతామహుని గృహమునకుఁ బోయియుండిన భరతునకు దశరథవృత్తాంతముఁ బూర్తిగఁ దెలియఁజేయక యాతని బిలిచికొనివచ్చుటకై మంత్రులు రథమునతో దూతలనంపిరి. రాజవంశ్యులు పూజించునటుల నూరిబయట ప్రతిమాలయము నొకటి నిర్మించి యందు దిలీప, రఘు, అజ, దశరథమహారాజుల ప్రతిమలను స్థాపించిరి.

మార్గమున నపశకునములఁ జూచి శంకించుచు భరతుఁడు విషణ్ణహృదయుఁడై జనకునకు శరీరస్థితి యెటులున్నదోయని విచారపడుచు వచ్చెను. కృత్తికానక్షత్రమున నూరిలో బ్రవేశింపరాదనియు నొక్క గడియ వేచియుండిన రోహిణి వచ్చుననియు బురోధసులు చెప్పిపంప, భరతుఁడు రథమును దూరమునఁ గొనిపొమ్మని సూతున కాజ్ఞాపించి తానును దేవాలయభ్రాంతిచే ప్రతిమాగృహమున కేగెను. ఆ ప్రతిమల సౌష్టవమున కాశ్చర్యమందుచు దేవతాభ్రాంతిచే నాతఁడు వానిని నమస్కరింపబూనెను. అంత కావలివాఁడు తత్తఱపడుచుఁ బరుగెత్తివచ్చి "వీరు క్షత్రియులు; బ్రాహ్మణులు వీరల నమస్కరింపరాదు" అని బ్రాహ్మణుఁడను శంకచే నాతని నివారించెను. ప్రణామ

భంగమున భరతుఁడు తిరిగిచూచి వారెవ్వరని యడిగెను. తనకు బూజ్యతములైన గురువులని యాతని పలుకులచే కను గొని "బ్రతికియున్నవారలకుఁగూడఁ బ్రతిమల స్థాపించుట వాడుకయా?" అని దశరథప్రతిమను జూచుచు నా కావలి వానిని మఱల ప్రశ్నించెను. ఉత్క్రమించినవారలకే ప్రతిమల స్థాపించుటయని యాతఁడు విన్నవింప, దన తండ్రి పరలోకగతుఁ డాయెనని తెలిసికొని మూర్ఛితుఁడాయెను. కొంతసేపునకు సమాశ్వాసమువొంది జనకుని మరణహేతువును సాకల్యముగఁ దెలిసికొనెను. ఆర్యుఁడగు రామచంద్రుఁడు లక్ష్మణునితోఁగూడ సీతను వెంటఁబెట్టుకొని తనకుగాను రాజ్యమును విడిచి యరణ్యమునకేగెనని యా దైవకులికునిమూలముగ మఱలఁ దెలియ మిగుల ఖిన్నుఁడై వజ్రపాతహతపర్వతముఁబోలె నాతఁడు నేలపైఁ గూలెను.

తమ వంశ్యులగు గురువులకు దైనికపూజల సలుప నంతః పురజనులు సుమంత్రుని ముందుబెట్టికొని యా ప్రతిమాలయ మునకు వచ్చిరి. అచ్చోట మూర్ఛితుఁడై పడియుండు నాతనిఁ జూచి యెవ్వఁడోయని వారు శంకించుచుండ నాతఁడు భరతుఁ డని దైవకులికుఁడు వారికి దెలియఁజేసెను. అంత నందరు విష ణ్ణులై సర్వప్రయత్నముల నాతని సమాశ్వసించిరి. మూర్ఛతీరి లబ్ధసంజ్ఞుఁడై భరతుఁడు కౌసల్యాసుమిత్రలకు వందనమొనరించి వారి దుఃఖమున మఱల దుఃఖితుఁడాయెను. ఇన్నికష్టములకు కైకేయి కారణమాయెనని యామెను నిందించెను.

జనకుని యౌర్ధ్వదేహికక్రియల నాతఁడు యథాశాస్త్రముగ నిర్వర్తించెను. పిదప మంత్రులతోఁగూడ వసిష్ఠవామదేవాది మహర్షు లభిషేకక్షణమున కెదురుచూచుచున్నారని సుమంత్రుఁడు

చెప్ప విని, తనకభిషేక మనావశ్యకమనియు, రాముఁడుండు చోటికి తాను చనవలయుననియు, జెప్పి యాతఁడు వారినే ముందుబెట్టికొని యరణ్యమునకు బయలుదేరెను.

జనులనందరిని దూరమున నిలిపి సుమంత్రసమేతుఁడై యాతఁడు చిత్రకూటమున శ్రీరాముని యాశ్రమమున్కరిగెను. సీతాదేవి వారలకు స్వాగతమిచ్చి వారి రాకను రామునకు దెలియఁజేయ నాతఁడు పరుగిడుచువచ్చి భరతునిఁ గౌగిలించి యానందాశ్రువుల నాతని కభిషేకముజేసెను. లక్ష్మణునితో గూడ తాను నరణ్యమున భ్రాతృశుశ్రూషఁ జేయవలయునని నిశ్చయించుకొనిన భరతునను నయపఱచి పిత్రాజ్ఞను బరిపాలింప నాతఁ డయోధ్యకేగవలయునని రాముఁడు బలాత్కారము జేసెను. పిత్రాజ్ఞతో భ్రాత్రాజ్ఞకూడ జేరెనని యనన్యగతికుఁడై భరతుఁడు రాముని వనవాసము పూర్తియగువరకు నాతని పాదుకల కభిషేకమొనరించి, తాను యౌవరాజ్యభారము వహించి, నందిగ్రామమున మునివృత్తియై కాలముగడుపుచుండఁ దలచె నని విన్నవించి యాతని పాదుకల బ్రార్థించి యచ్చోట వాని కభిషేకముజేసెను. మంత్రులతోఁగూడ మఱలి యయోధ్య కేగి రామునియాజ్ఞప్రకారము యెల్లఱకుఁ దృప్తికలుగ రాజ్యము చేయుచుండెను.

రాముఁడు నచ్చోటివిడిచి ఋష్యాశ్రమములఁ జూచుచు కాలక్రమమునఁ బంచవటిఁ జేరెను. అచ్చోట గంగాతీరమున నొక పర్ణశాల నేర్పఱచికొనెను. పర్ణశాలచుట్టును జానకి యనేక వృక్షములనాటి వానికి తన చేతితో నీరుబోయుచు వాని దిన దినాభివృద్ధికి యానందించుచు పుత్రవాత్సల్యముతో వానిని బెంచుచుండెను. గురువులకు శుశ్రూషఁజేయుచు లక్ష్మణుఁడును

రాముడుండుచోటు నయోధ్యగా జూచుచుండెను. ఇట్లుండ నొకనాడు దశరథుని ప్రత్యాబ్దిక శ్రాద్ధము సమీపించెను. దర్భాదుల సేకరింప లక్ష్మణుం డాశ్రమము విడిచిపోయెను. రాముఁడును శ్రాద్ధవిషయమై యేమిచేయవలయునని సీతతో యోజింపఁదలచి యాశ్రమములోనఁ బ్రవేశించెను. అచ్చోట సీతను గానక యాశ్రమ వృక్షవాటికలో నామె యుండునని యెంచి యచ్చోటఁబోవ వృక్షములకప్పుడే నీళ్లుపోసియుండునట్లు కానవచ్చెను. పాదులలో నీటినుడి నురుగులతో చుట్టుచుండెను; దప్పితీర్చుకొనుటకు పక్షులు పాదులపై వ్రాలి మురికియంతయు నడుగున దిగవలయునని వేచియుండెను; బిలములు జలముతో నిండ, వానిలోని పురుగులు తడియుచు స్థలభాగమున కిరుగుచుండెను; వృక్షములకడుగున జలము క్షీణించుచుండ, వలయరేఖ లేర్పడుచుండెను. కావున సీత సమీపముననే యుండవలయునని యెంచి రాముఁ డామెనుబిలువ నామె "యిదిగో వచ్చుచున్నా"నని యాతనిఁ గలసికొనెను. శ్రాద్ధవిషయమై వారిరువురు మాటలాడుచు తమ శక్తిననుసరించి వన్యఫలములచే నిర్వర్తింపవలయునని యొకవిధముగ తీర్మానించుచుండ, రావణుఁడు సన్యాసివేషముఁ దాల్చి యచ్చోటవచ్చెను. అతిథియని భ్రాంతితో నాతనికి వారు సత్కారమొనరించిరి. శ్రాద్ధకల్పమున నాతని కనుభవముకలదని యెద్దియో ప్రస్తావమున నాతఁడు తెలియజేయ, రాముఁడు దశరథుని శ్రాద్ధమునుగురించి యాతని నడిగెను. హిమవత్ప్రాంతమున నొకవిధమగు హిరణ్యహారిణములున్న వనియు, నవి శ్రాద్ధకర్మములకు శ్లాఘ్యతమములనియు నాతఁడు చెప్పెను. అచ్చోటికి జని శ్రాద్ధము సలుప

వలయునని యెంచి రాముఁడు సీతతో తన ముద్దుమృగముల కును లతలకును జెప్పి ప్రయాణమునకై సిద్ధపడుమని పలుకు చుండెను. అంత దైవప్రేరితమువోలె నొక హిరణ్యహరిణము కానవచ్చెను. రాముఁడదిచూచి తన భాగ్యమును పొగడుచు నాతిథేయసత్కారమున సీతను నియమించి ధనుష్పాణియై యద్దాని వెంబడించెను. ఇదియ సమయమని రావణుఁడు తన స్వరూపమును సీతకుఁ దెలియపఱచెను. "అమ్మో" యనుచు నామె మూర్ఛిల్లెను. విళంబించినఁ గార్యభంగమని యామెను రథమున నెత్తికొని యాతఁడు గగనమార్గమున బ్రయాణ మయ్యెను. జానకియొక్క దీనస్వరమును విని జటాయువామెను రక్షింప రావణునితో బోరాడెనుకాని విఫలప్రయత్నుఁ డాయెను. ఆమెను గొనిపోయి రావణుఁ డశోకవనికలో రాక్షస స్త్రీల స్వాధీనముచేసెను

మృగానుసారియై రాముఁ డెం తదూరము చని యా మృగమును జంపి యాశ్రమమునకుఁ దీసికొనివచ్చెను. దర్భా హరణమునకుఁ బోయియుండిన లక్ష్మణుఁడు నప్పుడేవచ్చెను. పర్ణశాలలో జానకి లేనందున విచారపడుచు జటాయువునుండి యామె వృత్తాంతము కనుగొని శోకపరవశులై యరణ్యముదిరు గుచు రామలక్ష్మణులు ఋశ్యమూకముఁ జేరి, తుల్యదుఃఖుఁడైన సుగ్రీవుని స్నేహముబడసి, హనుమంతునిచే నాశ్వాసితులై, కాలము వేచియుండిరి. రాముఁడు సుగ్రీవునకు సాహాయ్యము చేయ నిశ్చయించి, యాతనికి ద్రోహముచేసిన వాలిని వధిం చుటకై యొక్కసమయ మేర్పఱచెను. వాలి సుగ్రీవులు ద్వంద్వ యుద్ధముఁ జేయుచుండ, నాతఁడు వృక్షాంతర్హితుఁడై యొక బాణము వాలిపైఁ బ్రయోగించెను. హా! యని క్రిందపడుచు

తన్నిట్లు వంచనచేసి వధించినందులకు వాలి రాముని నిగ్రహించెను. వైరము మరణాంతముగాన, సుగ్రీవునిపైఁ గోపమును వదలి, తన భార్యాపుత్త్రుల దయఁజూచుకొమ్మని వానిచేత నప్పగించి, దేవప్రసాదలబ్ధమగుఁ గాంచనమాలను కంఠమునుండి తీసి యాతనికంఠమున వైచి, వాలి స్వర్గతుఁడాయెను.

అంగదునిచే వాలి కుత్తరక్రియలఁ జేయించి, రాముఁడు సుగ్రీవుని రాజ్యాభిషిక్తుఁ జేసెను. సీతాన్వేషణార్థము సుగ్రీవుఁడు వానరసైన్యముల నలుదిక్కులఁ బంపెను. దక్షిణముఖమై చనినవారిలో హనుమంతుఁడు సముద్రమునుదాటి, లంక నంతయు వెదకి తుదకు నశోకవనికలో సీతను జూచెను. రాముని వృత్తాంతమామె కెఱుఁగఁజేసి, తిరిగివచ్చుటకామె యనుజ్ఞఁబడసి, తన రాకను రావణునకు దెలియఁజేయఁదలచి యా వనమునంతయు నాతఁడు పాడుజేసెను. ఈ వృత్తాంతమెఱిగి, రావణుఁడు కోపావిష్టుఁడై యా వానరమును బట్టిరమ్మని యక్షకుమారుని సైన్యముతోనంపెను. హనుమంతుఁడు వారినందఱిని జంపెనని విని రావణుడు మఱల నింద్రజిత్తునంపెను. రాక్షసేంద్రునిఁ జూడఁదలచి హనుమంతుఁడు పట్టువడినట్లుండెను. అంత రాక్షసులు వానిని రావణుని సభకుఁ గొనిపోయిరి. సుఖాసీనుఁడై, మారుతి తన వృత్తాంత మెఱుఁగఁజేసి, రాముని సందేశమును రావణునకు జెప్పెను. రావణుఁ డా సందేశమును ధిక్కరింప, మారుతి యాతనికి రామునిచే కలుగు ననర్థముల వర్ణింపఁదొడగెను. రాక్షసేశ్వరుఁ డదివిని, యా దూతను వధింపుమన్ని తన ప్రక్కనుండువారి నాజ్ఞాపింప, దూతల వధించుట యన్యాయ్యమని విభీషణుఁ డాతని నివారించెను. అట్లైన నా

వానరముయొక్క వాలమున నగ్నిఁబెట్టుడని రావణుఁడు పార్శ్వవర్తులకానతిచ్చెను. హనుమంతుఁడిట్లు మఱలుచుండ, విభీషణుఁడు రావణునకెంతయు బుద్ధిఁజెప్ప యత్నించెనుగాని తుదకు నాతనిచే బహిష్కృతుఁడై లంకను విడిచిపోయెను.

సీతా వృత్తాంతమును కనుగొని, రాముఁడు సుగ్రీవాదులతో గొప్ప సైన్యముఁజేర్చికొని, రావణునితోఁ బోరాడ దక్షిణ సముద్రతీరమునకు వచ్చెను. అప్పుడే విభీషణుఁడు రాముని శరణుఁజొచ్చెను. అతని కభయమిచ్చి రాముఁడు వానరమధ్యమున నాతనిని లంకాధిపతియని యభిషేకముచేసెను. సైన్యములు లంకకుఁబోవునట్లు త్రోవవిడువనందున సముద్రముపై రాముఁడు కోపింప, నా యధిష్ఠానదేవత భయపడి, దేవకార్యమునకై తాను సాహాయ్యముచేయఁదలచి సీమంతరేఖాకృతిగ సముద్రమధ్యమున జలమును పార్శ్వములకుఁదోలి మార్గమొక్కటి గలుగఁజేసెను. అంత మారుతిని పురస్కరించి వానర సైన్యము సముద్రమునుదాటి లంకనుజేరి సువేలపర్వతమున స్కంధావారముల నేర్పఱచికొనెను. రావణమంత్రులగు శుకసారణులు వానరరూపులై రాముని బలమును దెలిసికొన యత్నించి వానరసైన్యముతో కలిసి మెదలుచుండ, వారెవ్వరో క్రొత్తగానున్నవారని శంకించి కొందఱు వానరులు వారిని రామునియెదుటఁ బిలిచికొనిపోయిరి. తాము వానరసైన్యమునకుఁ జేరినవారేయని వారు చెప్పుచుండ, విభీషణుఁడు వారి యాథార్థ్యమును దెలియజేసి వారిని వధింపుడనెను. స్వామికార్యమునందు భృత్యుల వధింపరాదని రాముఁడు వారల విడిపించెను.

పిదప వానరరాక్షసులకు ఘోరయుద్ధము జరిగెను. కుంభకర్ణాదిరాక్షసయోధులు నిహతులైరి. దుఃఖాక్రాంతుఁడై రావణుఁ డింద్రజిత్తును యుద్ధమునకుఁ బంపి, సీత నెట్లైన వశపరచుకొను నుద్దేశించి మాయతో రామలక్ష్మణుల శిరస్సుల నిర్మించి యింద్రజిత్తు వారిని వధించెనని చెప్పుచు నా శిరస్సుల నామెకుఁ జూపెను. వానిని చూచి రామలక్ష్మణులు నిహతులైరని యామె నిశ్చయించి మూర్ఛిల్లెను. కథంకథముగ మూర్ఛ తీఱ, నామె తన్ను పలువిధంబుల నిందించుచు పరితపించుచుండెను. అంత నింద్రజిత్తు లక్ష్మణునిచే నిహతుఁడయ్యెనని వార్త వినవచ్చెను. అదివిని రావణుఁడు దుఃఖాక్రాంతుఁడై సీతను వధింప ఖడ్గము నెత్తికొనెను. స్త్రీహత్య తగదని యాతని నచ్చోటనుండినవారు నివారించిరి. భగ్నమనోరథుఁడై యా కోపమును రామునిపైఁజూప నాతఁడు రణరంగము ప్రవేశించెను. రామరావణులకు ఘోరయుద్ధము ప్రారంభించెను. యుద్ధమధ్యమున దేవేంద్రుఁడు రామునకుఁ దన రథమునంపెను. రాముఁ డద్దాని నారోహించి యనేకదినములు రావణునితోఁ బోరాడి యాతనిని వధించెను. నిర్వృత్తకార్యుఁడై రాముఁడు విభీషణునకు రాజ్యాభిషేకముఁ జేయించెను. పరగృహనివాసశంకను బోఁగొట్టఁదలచి లోకులకు నమ్మకముపుట్టింప రాముఁడు సీతకు నగ్నిప్రవేశము జేయించెను. పిదప నామెతోఁగూడ సుగ్రీవ విభీషణాదులఁ బుష్పకమున నెక్కించికొని పూర్వపరిచితులగు మునులకు వందనమర్పింప నుద్దేశముతో దండకారణ్యమునకు వచ్చెను.

ఇదివరకు భరతుఁ డేమిచేయుచుండెనో చూచెదము. ఎప్పుడు రామునే చింతించుచు నాతని స్థితిగతులఁ గనుగొని

రమ్మని, యాతఁడు సుమంత్రుఁ బంప, నాతఁడు పంచవటిఁ జేరి యచ్చోట వారు లేనందున శోకించుచు, నచ్చోటి ఋషులనడిగి, సీతాహరణ, వాలివధాదివృత్తాంతములఁ దెలిసికొని యయోధ్య జేరెను. రాజ్యభ్రంశము నరణ్యవాసముగాక భార్యానాశము గూడ రామునికి సంభవించెనని మిగుల పరితపించుచు భరతుఁడు తన జననిని నిందింపదొడగెను. అప్పుడామె దశరథునకు గలిగిన ఋషిశాపమును దెలుప నీ యనర్థములంతయు నా శాపసంబద్ధములని తెలిసికొని భరతుఁడామెపై కోపము నిర్హేతుకమని యామెను దన్ను మన్నింప ప్రార్థించెను. పుత్రునిపైఁ గోప మేమియులేదని యామె యాతనిఁ గౌగిలించి ముద్దిడుకొనెను. సీతాహరణమునకై రామునకుఁ దోడ్పడ నుద్దేశించి సైన్యమును జేర్చికొని భరతుఁడు దండకావనమునకుఁ బోయెను. అతఁడు పంచవటిఁ జేరునప్పుడే రాముఁడును పుష్పకవిమానమునుండి దిగెను. పరస్పరమిట్లు కూడుటకు వారెంతయు సంతసించుచుండిరి.

అచ్చోటి ఋషుల ప్రార్థనల నంగీకరించి రామునకుఁ బట్టాభిషేకమును మంత్రులు గోదావరీతీరమున జరిపించిరి. కేకయరాజపుత్రి యనుజ్ఞానుసారంబుగ నందరు నయోధ్యఁ జేరి, స్వజనమధ్యమున మఱల మహావైభవముతో రాముని రాజ్యాభిషిక్తుఁ జేసిరి.

(అభిషేక ప్రతిమానాటకములలోనిది.)



## ఉదయనచరితము.

చంద్రవంశపురాజులలో నొక్క శాఖవారికి కౌశాంబీనగరము రాజధానిగనుండెను. వారలలో శతానీకుఁడను మహీ

పాలుచుండెను. అతనికి రూపశీలాదిసంపన్నుఁడును వీర్యశాలి యునగు నుదయనుఁడను కుమారుఁడుండెను. తనయుని యౌవనారంభకాలమున నాతఁడు పరలోకముఁ జెందెను. జనకున కనంతరము రాజ్యభారము తనపైఁబడ, నుదయనుఁడు యౌగంధరాయణాది మహాతుల సాహాయ్యమునఁ జక్కగ జనులను పాలించుచుండెను. జనులకందఱికి నాతనిపై యతి వాత్సల్యముండుటచే నాతనికి వత్సరాజని ఖ్యాతికలిగెను. అతని పేరు మాత్రము వినిన, శత్రువులు గడగడ వణకుచుందురు. అతనికి సంగీతశాస్త్రమునను హస్తిశిక్షయందును నైపుణ్యముకలదు.

అక్కాలమున నుజ్జయినీనగరమును ప్రద్యోతనుఁడను మహావీరుఁడు పాలించుచుండెను. అతనికి గొప్ప సైన్యముండుటచే మహాసేనుఁడని బిరుదుకలిగెను. అతనికి రూపలావణ్యవతియగు వాసవదత్తయను కూతురును, గోపాలకుఁడనియు ననుపాలకుఁడనియు నిద్దరు సుతులును కలిగిరి. వాసవదత్త వివాహార్హవయస్సున నుండుటచే ననేకరాజులామెనుఁ జేబట్ట నిచ్ఛించి మహాసేనునకు దూతలనంపుచుండిరి. మహాసేనునకుమాత్రము వారలలో నెవ్వఁడును తన కూతునకు దగిన వరుఁడుకాఁడని తోఁచి నందున వారలకెవ్వరికి నాతఁడు నిశ్చయముఁ జెప్పకుండెను. ఉదయనుని ఖ్యాతి వినియున్నందున నాతనికి దన కూతునియ్యఁ దలచెనుకాని యాతఁడుమాత్రము తన్ను లక్ష్యపెట్టకయుండి నందునఁ దానే యాతని బ్రార్థింపఁడయ్యెను. ఉదయనుఁ డొక్కనాడు మృగయావిహారార్థ మరణ్యముఁజొచ్చెనని వినియాతఁడెట్లులైన నాతని వంచించి తన స్వాధీనముఁ జేసికొనఁదలచెను. అతనికి గజములపైఁ బెక్కు యాశయని యెఱిగి నఖదంతవర్జము కువలయశ్యామమగు నొక్క కృతకహస్తిని యరణ్యముఁ

నునిచి యందుఁ గొందఱు సైనికులను దాగియుండుమని యాజ్ఞాపించెను.

ఉదయనుఁడు మృగయావినోదమున దన రాజ్యసీమదాటి ప్రద్యోతనుని రాజ్యమునఁ బ్రవేశించెను. సైనికులనందఱిని వెనుక నిలిపి కొందఱు భటులతో చాలదూరము పోయెను. అప్పుడొకఁడు పరుగిడుచువచ్చి హస్తిశాస్త్రప్రసిద్ధమగు కువలయశ్యామగజమొక్కటి కానవచ్చెనని యుదయనునితోఁ జెప్పెను. అదివిని మిగుల సంతోషించి యుదయనుఁ డద్దానిని దన వీణావాద్యముచే స్వాధీనపఱచికొన నుద్యమించెను. తన యమాత్యుఁడగు రుమణ్వంతాదు లెంతఁజెప్పినను వినక, వారలను శపథముచే దూరమునఁ బొమ్మనిచెప్పి, ఖడ్గమాత్రసహాయుఁడై ఘోషవతి యను ప్రసిద్ధిగాంచిన తన వీణను జేబట్టి యాతఁడా గజమువంక పోయి, వాయింపనారంభించెను. అప్పుడా కృతకహస్తినుండి సైనికులు వెలువడి యాతనిని జుట్టికొనిరి. అది ప్రద్యోతనుని మాయయని మహాక్రోధముతో నుదయనుఁడు వారలపైబడి యనేకులను వధించెను; కాని వారనేకులగుటచే వారిచే బట్టువడెను. అంత వారాతనిని లతాగుల్మములచే బంధించి యుజ్జయినికిం గొంపోవ నారంభించిరి. ఆ సమయమున శాలంకాయనుఁడను ప్రద్యోతమంత్రి సమీపించి యా బంధముల విడదీసి యాతని గాయములమాన్ప వైద్యుల నియమించి యాతనిని వాహనమునారోపించి యుజ్జయినికిఁ బిలిచికొనిపోయి బంధనాగారమున నునిచెను.

ప్రద్యోతనుఁడు శాలంకాయనుని రాక నెదురుచూచుచుండ నుదయనుఁడు పట్టువడెనని తెలియవచ్చెను. ఈ వార్త విని ప్రద్యోతనుఁడు తన భార్యయగు నంగారవతితో నానం

దించుచుండెను. వారిరువురును వాసవదత్త వివాహార్థ మాలోచించుచు, నుదయనుఁడుమాత్రము తమ్ము లక్ష్యపెట్టి కన్యకనడుగకయుండినందునకు విచారపడుచుండు సమయమున నీ వార్త వచ్చినందున, వివాహ వార్తను నిలిపివైచిరి. అప్పుడు భరతవంశధనమై యుదయనుని కభిమానపాత్రమగు ఘోషవతియను వీణారత్నమును శాలంకాయనుఁడు మహాసేనునకు జయమంగళార్థము సమర్పించెను. రాజు దానిని పరమప్రీతితో బరిగ్రహించి తన కూతురికి బహుమతిగా నిమ్మని యంగారవతి కప్పగించెను.

ఉదయనుఁడిట్లు పట్టువడిన సంగతి హంసకుఁడను చారపురుషునిమూలమున యౌగంధరాయణునకు దెలియవచ్చెను. అంత నా యమాత్యవర్యుఁ డెట్లైనఁ దన స్వామిని విమోచింపఁ బ్రతిజ్ఞఁజేసి ప్రద్యోతనుని రాజ్యమంతయుఁ దన గూఢపురుషులచే నిండించెను. ఉన్మత్తవేషముధరించి తానును, శ్రమణకవేషము ధరించి రుమణ్వంతుఁడును, వత్సరాజునకుఁ బ్రియవయస్యుఁడగు వసంతకునితో నుజ్జయినిఁజేరి స్వామికార్యవ్యగ్రులై కాలము నిరీక్షించుచుండిరి.

అంత నొకనాడు వసంతకుఁ డుదయనుని వృత్తాంతమును గనుఁగొన బ్రయత్నించి బంధనాగారమువైపునఁ బోయెను. ఆ సమయమున వాసవదత్త దేవకార్యముసలుప ధాత్రితోఁగూడ పల్లకినెక్కి యా బంధనాగారసమీపమున యక్షిణీదేవాలయమునకు వచ్చెను. కావలివాని యనుజ్ఞఁబడసి యుదయనుఁడు నప్పుడు బంధనాగారద్వారమున నిలిచి యాయమను జూచెను. వాసవదత్తయు నాతనిని ప్రేమపూర్వకముగ కటాక్షించి తన

యనురాగమును వెలిపుచ్చెను. పిదప వారిరువురకును గొన్ని దినములలో సమాగమాదులు సంభవించెను. ఈ వృత్తాంతమును యౌగంధరాయణునకుఁ దెలియఁజేయ నిశ్చయించి వసంతుకుఁ డొకనాఁడు సూర్యోదయమునకుముందు నూరిబయట జీర్ణమైన దేవాలయ సమీపమునకుఁబోయి, యాతని రాకకై యెదురుచూచుచుండెను. సంకేతము ననుసరించి యౌగంధరాయణుఁడు నున్మత్తవేషముతో నచ్చోటవచ్చి యెద్దియో కలవరించువానివలె నర్థాంతరగుంభితముగునట్లు పిచ్చిమాటలాడుచు నాతనితో నొక మోదకవిషయమై జగడముచేయుచుండెను, ఆ జగడమువిని రుమణ్వంతుఁడును శ్రమణకవేషముతో నా జగడము మాన్పువానివలె వచ్చిచేరెను. అంత నా ముగ్వురు లోపలఁ జనిరి. వసంతుకుఁడు తాను స్వామినిఁజూచినట్లు దెలుప, యౌగంధరాయణుఁడు స్వామివిమోచనమునకై యన్నియు సిద్ధముగనున్నదని స్వామికిఁ దెలియజేయుమని యాతనితోఁ జెప్పెను. వాసవదత్తపై స్వామి యనురక్తుఁడుకాన నామెతోఁ గూడ నాతఁడు పారిపోవునట్లేర్పాటుచేయనియెడల కార్యమునకు విఘ్నమగునని వసంతకుఁడుచెప్ప, యౌగంధరాయణుఁడు స్వామియొక్క నిరపత్రపత్వమునకు నగయుచు నెట్లైన వాసవదత్తతోఁగూడ నాతని విమోచించెదనని ప్రతిజ్ఞఁజేసి భటులనందఱిని జాగ్రత్తతోనుండునట్లు వారికానతిచ్చెను. అంత నా ముగ్వురు వేర్వేరుమార్గమున వెడలిపోయిరి.

వాసవదత్తయొద్ద భద్రవతియను కరేణువు కలదు. ఆమె యాకరేణువు సాహాయ్యముననే జలవిహారముసలుపుట వాడుక. ఆ కరేణువునకు హాస్తిపకుఁడు గాత్రసేవకుఁడనువాఁడు. అతఁడు

యౌగంధరాయణుని మనుష్యుఁడు. స్వామివిమోచనసమయము తటస్థింప నాతఁడు కరేణువును బంధనాగారమునొద్ద నునిచెను. అద్దాని నారోహించి వత్సరాజు వాసవదత్తను బిలిచికొని తన ఘోషవతితోఁ దప్పించికొని యుజ్జయినీరాజ్యసీమను దాటి పోయెను. వాసవదత్తకు జలవిహారార్థము భద్రవతిని వెదకుచు భటుఁడొకఁడు గాత్రసేవకుఁడు యౌగంధరాయణునివాఁడనియు, నుదయనుఁడా హస్తిని నెక్కి పారిపోయెననియు కనుఁగొని, మహాసేనునకుఁ దెలియఁజేసెను. అంత మహాసేనుని సైనికులు వత్సరాజును వెంబడింప, యౌగంధరాయణాదులు వారలతోఁ బోరాడి వారల కాటంకపఱచిరి. ఒక్కఁడే శత్రుసైన్యముతో చాలకాలము పోరాడి తుదకు యౌగంధరాయణుఁడు వారిచే జిక్కువడెనుకాని, వత్సరాజుమాత్రము తప్పించుకొనిపోయెను. మహాసేనుఁడును వాసవదత్తకనురూపభర్త లభించెనని కొంత సంతోషించి చిత్రపటమునవైన వధూవరులకు శాస్త్రోక్తముగ వివాహముజేయఁ దలచెను. యౌగంధరాయణుని స్వామిభక్తికాతనిఁ బొగడుచు నాతని విమోచించి సర్వజనసమక్షమున జిత్రార్పితులగు వధూవరులకు మహావైభవముతో పరిణయముగావించి యాతఁడు సన్మానపురస్సరముగ వత్సరాజమనుష్యులను కౌశాంబికి నంపించెను.

(ప్రతిజ్ఞాయౌగంధరాయణము.)



వాసవదత్త నిట్లపహరించుకొని వత్సరాజు కౌశాంబినిఁజేరి యచ్చోట నామెను శాస్త్రోక్తముగ వివాహమాడెను. యౌగంధరాయణాది సాహాయ్యమున కొంతకాలములో నాతఁడు

రాజ్యము వృద్ధిపఱచి, సామంతరాజుల జయించి, వారినుండి కప్పము పుచ్చుకొనుచుండెను; కాని యా రాజులుమాత్రము తమ యవమానముల మఱువక కాలమున నాతనిపై దాడివెడల నిశ్చయించి భస్మావృతవహ్నివలె విలీనతేజస్కులై యుండిరి. ఇట్లుండ నొకప్పు డుదయనుఁ డజాగ్రత్తతో నుండుసమయమున వారాతని రాజ్యముపై దాడివెడలి దానినంతయు నాక్రమించుకొనిరి. రాజ్యభ్రష్టుఁడై భార్యతోఁగూడ నుదయనుఁడు లావాణకమను గ్రామమున కాలముగడుపుచుండెను. ఆతని యమాత్యులు, యౌగంధరాయణుఁడును, రుమణ్వంతుఁడును శత్రువుల జయించి రాజ్యమును మఱల వశపఱచుకొనుటకు సర్వవిధముల యత్నించుచుండిరి. ఉదయనుఁడు మగధరాజపుత్రి యగుఁ బద్మావతినిఁ బెండ్లియాడెనేని యాతనికి మఱల రాజ్యప్రాప్తియగునని యశరీరవాణి విని వారిరువురును సమయమును నిరీక్షించుచుండిరి.

ఒక్కనాడు మృగయార్థ ముదయనుఁ డరణ్యమునకుఁ బోయెను. అప్పుడు లావాణకమెద్దియో కారణమున వహ్నిదగ్ధమాయెను. ఇదియ సమయమని యౌగంధరాయణుఁడు, వాసవదత్త యనుజ్ఞఁబడసి, బ్రాహ్మణవేషము వేసికొని, యామెను దన చెల్లెలిగా నటింపుమని, యామెతో లావాణకమువిడిచి బయలువెడలుచు, రుమణ్వంతునితో వాసవదత్త వహ్నిదగ్ధయాయెననియు నామెను రక్షింప నుద్యమించి యౌగంధరాయణుఁడు నా వహ్నిలో మృతుడయ్యెననియు వార్తబుట్టింపుమని చెప్పి పోయెను. లోకులకుఁదెలియక యిట్టు లామెతోఁగూడ మగధరాజ్యమునకువెళ్లి యొక ఋష్యాశ్రమముఁ జేరెను. అచ్చోట

వానప్రస్థాశ్రమము నవలంబించి వార్ధకము గడుపుచుండిన జననీ జనకులకు వందనమాచరింప నా రాజతనయయగుఁ బద్మావతి యుఁ దన పరివారముతో వచ్చెను. గురుజనవందనానంతర మంతఃపురమునకు మరలుచుఁ దన యాగమమును సఫలీకరింప మునిజనులకు దానమియ్యఁదలచి, యామె యర్థులెవ్వరైన నుందురాయని యడిగెను. అప్పుడు యౌగంధరాయణుఁడు సమీపించి ప్రోషితభర్తృకయగు, దన యనుజను తాను తీర్థ యాత్ర సలిపివచ్చునంతవఱకు న్యాసముగ నా యమచేత నర్పించి పోవదలచెనని విన్నవించెను. ఎట్లైన మగనికి రాజ్యప్రాప్తికావల యునని వాసవదత్త యెంచియున్నందున నెన్నికష్టములుండినను బద్మావతియొద్ద న్యాసముగనుండ నొప్పికొనెను. పద్మావతియు నామెను ప్రీతితోడఁ గొనిపోయెను. వారిరువురికిఁ గొన్నిదినము లలోఁ బరస్పరమనురాగము వృద్ధియయ్యెను. ఆవంతికయను పేర వాసవదత్త పద్మావతికి సర్వసఖి యాయెను. వారెన్నియో రహస్యముల మాటలాడదొడగిరి. మహాసేనుని కొమరునకుఁ బద్మావతి నడుగుచున్నారని వార్త తెలిసి తనకు పద్మావతి సమీప బంధువగునని వాసవదత్త సంతసించుచుండెను; పద్మావతికిమాత్ర ముదయనుని గుణములు కర్ణపథావతీర్ణములై యుండినందున నాతనిఁ బెండ్లియాడవలయునను నాశవొడమెను. అది చూడ వాసవదత్తకు కొంచెము మనఃఖేదము కలిగినను, భర్తయొక్క రాజ్యప్రాప్తిఁ దలచుచు నా ఖేదము నామె పాటింపకుండెను.

రాజ్యభ్రంశమేకాక తనకు భార్యానాశమును నమాత్య నాశముగూడ సంభవించెనని, యుదయనుఁడు చింతించుచు, లావాణకము విడిచి విదేశగమనమునకైన కాలము పుచ్చవలయు

నని మగధదేశమునకు వచ్చెను. మగధరాజును దన యనుజ యగుఁ బద్మావతిని పాణిగ్రహణముచేసి పూర్వకష్టముల మరువుమని యాతనిఁ బ్రార్థించెను. అందునకాతఁడు సమ్మతింప సుముహూర్తమున వైవాహికమహోత్సవము సంరంభముతో జరిగెను. ఆ వివాహమున మంగళార్థము వాసవదత్తయే పద్మావతికి ధరింప బుష్పమాలిక గ్రుచ్చునట్లు తిటస్థించెను.

వివాహానంతరము వాసవదత్త పద్మావతితో సర్వాలాపములఁ జేయుచు మగనికామెయం దనురాగమున్నదాయని యామె నడుగ నాతనికిఁ బూర్వపత్నిపై గాఢానురాగమున్నట్లును, తనపైనున్నదో లేదోయని తెలియకున్నను, దానుమాత్రము క్షణకాలముకూడ నాతని వియోగము సహింపకున్నదనియు నామె బదులుచెప్పెను. అదివిని యా వియోగదశయందుఁ దనకు కొంచెమైన నానందహేతువున్నదని వాసవదత్త మనమున సంతసిల్లుచుండెను.

ఉద్యానవనమున నొకప్పుడు తాను పద్మావతితో సల్లాపము చేయుచుండ, నచ్చోట వత్సరాజును వసంతకుఁడును దాముండునది తెలియక వారి పూర్వానుభవములఁ జింతించుచుండుటఁ జూచియు వాసవదత్తకు వియోగదుఃఖము కొంచెము సహ్యమయ్యెను. ఒక్కనాడు పద్మావతికి శిరోవేదనయని తెలిసి తన భర్తకు మనోల్లాసకారిణియగు నాయమకుఁ దన దౌర్భాగ్యముచేతనే శరీర మస్వస్థమైయుండునని వగయుచు శయనాగారమున నామె నోదార్పఁదలచి వాసవదత్త యచ్చోటికిఁ జనెను. ఆమె యచ్చోటికిఁ బోవుటకుమునుపే వత్సరాజు నా సంగతివిని పద్మావతినిఁ జూడగోరి వసంతకునితో నా శయనాగారమునకే పోయియుండెను. పద్మావతివచ్చుటకు కొంచెము విళంబమైనఁ

దున నాతఁడాశయనమున నిద్రించెను. చలియగుటచే దుప్పటిఁ గైకొనివత్తునని వసంతకుఁడు వెడలెను. వాసవదత్త యేకాకియై నిదురించుచుండిన తన భర్తను బద్మావతియని భ్రమించి యాతని ప్రక్కనఁ బరుండెను. అంత స్వప్నమున "హా వాసవదత్తే" అని తన్నే యాతఁడు కలవరించుచుండ, నాతఁడు తన మగఁడని తత్తఱపడుచు లేచి యామె యౌగంధరాయణుని కార్యమునకు విఘ్నమాయెనేమోయని భయపడి యాతని కలవరింపులకు పరితపించుచు యచ్చోటు విడిచిపోయెను. నిద్రాభంగమున వత్సరాజు తటాలున లేచి "హా వాసవదత్తే; రమ్ము రమ్ము" అని బిగ్గఱఁబిలువ, వసంతుకుఁడేతెంచి మృతయగు వాసవదత్త యింక నెక్కడయని యాతని నూరార్చుచుండెను. అంతలో పద్మావతి యు నచ్చోట వచ్చెను.

మహాసేనుని సందేశమును గైకొని యొక బ్రాహ్మణుఁడును, అంగారవతి సందేశమును గైకొని వాసవదత్త ధాత్రియగు వసుంధరయుఁ దన్నుఁ జూడవచ్చియున్నవారని తెలిసి యుదయనుఁడు వారలలోనఁ బిలిచికొనిరమ్మని భటున కానతిచ్చెను. శత్రువులు నిహతులై రాజ్యము మఱల లభించినందుకు మహాసేనుని సంతోషమును బ్రాహ్మణుఁడు తెలియఁజేసెను. వాసవదత్త చనిపోయినందునఁ బూర్వము శాస్త్రోక్తవివాహము ననుభవించిన చిత్రపటముల నైనఁ జూచుచు మఱల రాజ్యప్రాప్తి నానందింపుమని యంగారవతిసందేశమును వసుంధర చెప్పుచు నా పటముల నాతనిచేతికిచ్చెను. వానిలో వాసవదత్త ప్రతిమను జూచి పద్మావతి తన సఖులలో నొక్కతే యారూప సదృశ రూపవతిగానున్నదనిచెప్ప, నుదయనుఁడామెను బిలిచికొని రమ్మని యానతిచ్చెను. ఆవంతికను బిలువ పద్మావతి యటుబోవ

నుద్యమింప బ్రాహ్మణవేషధారిణియై యౌగంధరాయణుఁడు న్యాసమునియ్య నామె నడుగుచు నచ్చోటికి వచ్చెను. న్యాస మును సాక్షులయెదుట నియ్యవలయునని యుదయనుఁడనగా నావంతికను బిలిచిరమ్మని పద్మావతి చెలియలనంపెను. ఆవంతిక వచ్చినతోడనే, వసుంధర "యీమె మహాసేనుని ముద్దుకూతు రగు వాసవదత్తయే" యని గద్గదకంఠయై యానందాశ్రువులం విడుచుచు బలికెను. అంత పద్మావతి తనచేటిసమానముగ నామెను జూచినందునఁ దన యపరాధమును క్షమింపుమని వాసవదత్తను వేడికొనెను. భగినీవాత్సల్యమున వాసవదత్తయు నామెను కౌగిలించి యపరాధమేమియు గానమని బదులు చెప్పెను. పునరుజ్జీవితయని తన వాసవదత్తను జూచి చూచి యుదయనుఁ డానందపరవశుఁడాయెను. పోగొట్టిపోయిన ఘోష వతియు నొక బీదగాయకునిచేఁజిక్కి తుదకు నుదయనునే చేరెను. ఈ శుభవృత్తాంతములఁ దామే మహాసేనాదులకుఁ దెలుప గోరి యందఱు నుజ్జయినిఁజేరి, యమందానందమున బంధువర్గ ములఁ దేలించి కౌశాంబీనగరమునకుఁ బోయిరి.

(స్వప్న వాసవదత్తములోనిది)



## అవిమారకచరితము.

వైరన్త్యనగరమును నొకప్పుడు కుంతిభోజుఁడను రాజు పాలించుచుండెను. అతనికి సుచేతనాసుదర్శనలను సోదరీమణు లుండిరి. అందు సుదర్శన కగ్నిదేవతాకమైన మంత్రసిద్ధికలదు. సూర్యదేవతాకమంత్రబలముచే నొకప్పుడు కుంతీదేవియందు సూర్యుఁడు కర్ణునిఁబుట్టించిన విధమున నగ్ని దేవుఁడును సుదర్శన

యందుఁ దేజోవంతుఁడగు నొక తనయునిఁ బుట్టించెను. ఆ సమయమున సుచేతనయు పూర్ణగర్భముదాల్చి యొక శిశువును బ్రసవించెను. జాతమాత్రమున నా శిశువు మృతినొందెను. ఇదియ సమయమని తన రహస్యమునుఁ గాపాడుటకై సుదర్శన తన తనయుని సుచేతనాశయనమున నునిచి మృతమగు శిశువు నవిజ్ఞాతముగ దూరమునకుఁ గొనిపోయి వదలిపెట్టెను. అగ్నిసంభవుఁడును నాటనుండియు సుచేతన సుతుఁడనియె ప్రసిద్ధిఁగాంచెను.

ఇట్లు లోకాపవాదమునుండి తప్పించుకొని సుదర్శనయుఁ గాలక్రమమునఁ గాశీరాజును వివాహమాడి జయత్సేనను తన యునిఁ బడసి సుఖముగఁ గాలముగడుపుచుండెను.

సుచేతనయుఁ బ్రసవానంతరము మాతృగృహమునఁ గొన్ని నెలలగడిపి ముద్దుకొమరునితో భర్తయగు సౌవీరరాజుని నగర మును జేరెను. జననీజనకులకు నానందము కలిగించుచుఁ గ్రమ క్రమముగ నా బాలుఁడును విష్ణుసేనుఁడను పేర వృద్ధియగుచుం డెను. తోడిబాలురతో నొకప్పుడు విష్ణుసేనుఁ డాటలాడుచు నుండ నవియను నామాంతరముగల ధూమకేతుఁడను నసురుఁడు లోకములను హింసచేయఁబూని సౌవీరమండలమును బాధింపఁ జొచ్చెను. బాలురతోఁగూడఁ దన యభిముఖముగ వచ్చుచుండు విష్ణుసేనునిజూచి మంచి యాహారము లభించెనని యా యసు రుఁడు నాలుకలో నీరూర నిరీక్షించుచుండుతఱి విష్ణుసేనుఁ డతి మానుషబలముచే నాతనితో ఘోరముగఁ బోరాడి యాతనిఁ బ్రాణవియుక్తుఁజేసెను. అప్పటినుండి నా బాలుఁ డవిమారకుఁ డను బిరుదువహించెను.

అవిమారకుఁడు బాల్యదశనుదాటి యౌవనారంభమున నుండుసమయమున నొకనాఁడు సౌవీరరాజు మృగయార్థమై యరణ్యమున చాలకాలము సంచరించి విశ్రమార్థమొక వృక్షచ్ఛాయలోఁ గూరుచుండెను. అచ్చోటఁ గోపస్వరూపుఁడైనఁ జండభార్గవుఁడను మహర్షియొక్క శిష్యుని ఘోరమైన వ్యాఘ్రమొకటి చంపివైచెను. ఆ మండలమున కధిపతియగు సౌవీరరాజునుఁ జూచినతోడనే చండభార్గవుఁడు రోషావిష్టుఁడై నిందింపసాగెను. మహర్షి కోపమునకుఁ గారణము తెలియమిచే రాజు వినమ్రుఁడై "కోపమునకు గారణమేమో సెలవిండు" అని భయముతోఁ జండభార్గవునిఁ బ్రార్థించెను. ఎంత ప్రార్థించినను బ్రత్యుత్తరమియ్యక నిందించుచున్న మహర్షిని "నీవు బ్రాహ్మణజాతిలో జనించినను శ్వపాకుఁడవే" యని రాజు తిరస్కరించెను. తోడనే ప్రళయాగ్నినిఁబోలె నుద్ధృతజ్వాలలచేఁ గోపాగ్ని వెలయఁ గన్నులఁ దెఱచి "ఓఃపాపిక! మహర్షిని నన్నిట్లు నిందించిన నీవు శ్వపాకుఁడవుకమ్మా" యని శపించెను. శాపభీతిచే గడగడవణకుచు సౌవీరేంద్రుఁడు అపరాధక్షాపణ మొనరింపుమని మహర్షినిఁ బ్రార్థింప నాతఁడు దయార్ద్రహృదయుఁడై "యొక సంవత్సర మజ్ఞాతవాసమొనర్చితివేని శాపవిముక్తుఁడగుదువ"ని వాక్రుచ్చి శిష్యునిఁ బునరుజ్జీవితుఁజేసి యాతనితోఁ దన యాశ్రమమున కరిగెను. రాజును శ్వపాకత్వ మవలంబించి భార్యాపుత్రులతో నజ్ఞాతవాసమును సలుపఁ దగుమైనదేశమును వెదకుచుఁ దుదకుఁ గుంతిభోజపురమునేచేరి యచ్చోట రహస్యముగఁ గాలము గడుపుచుండెను.

ఇట్లుండ కుంతిభోజుని పుత్రికయగు కురంగి యొక్కనాఁడు

విహారోద్యానమునకుఁ జనుచుండ మత్తమాతంగమొకటి శృంఖలములఁ దెంపికొని రాజమార్గమునఁ బరుగిడుచు నామెనుబట్టి కొనెను. తత్క్షణమే పట్టణమంతయు నల్లకల్లోలమగుచు నా మాతంగము వెనుకఁ బరుగిడసాగెను. దైవప్రేరితునివలె నవి మారకుఁ డాచోటవచ్చి తటాలున నా హస్తినిఁబట్టి వధిరచి యా రాచకన్నియనుఁ గాపాడెను. మోహాంధకారము క్రమక్రమముగ వదలుచుండఁ దనకుఁ బ్రాణదాతయగు నా మహానీయునిఁ గురంగి కన్నులార వీక్షించెను. ఆతఁడు నా కన్నియనుఁజూచి యారూపసంపత్తిని మనమునఁ బొగడుచుఁ దన యావాసమున కరిగెను. అమ్మహానీయుని నామాదులఁ గనుగొను నుద్దేశముతోఁ గుంతిభోజుని యమాత్యులలో నన్యతముఁడగు భూతికుఁ డాతని వెంబడించెను. వెంబడించి యమ్మహానీయుఁ డేదోయొక కారణమునఁ దన నామవంశాదుల గోపనముజేయుచున్నాఁడనియు, వస్తుతత్వము నశ్వపాకజాతిలోఁ జేరినవాఁడు కాఁడనియు మాత్రము కనుగొనెను.

కురంగికి యుక్తవయస్సు వచ్చియుండుటచేఁ గుంతిభోజుఁ డామె వివాహార్థమై భార్యతో యోజింప నాయమ తన భ్రాతయుఁ దన మగని సోదరీభర్తయునగు సౌవీరరాజుతో సంబంధము శ్రేష్ఠతమమని యభిప్రాయపడెను. సౌవీరమండలమునకు దూతలనంప నచ్చోట భూపాలుఁడు రాజ్యభారమును మంత్రులకప్పగించి యెచ్చోటనో భార్యాపుత్రులతోఁ జనెనని మాత్రము వృత్తాంతము కుంతిభోజునకుఁ దెలియవచ్చెను. ఇట్లు తన సోదరీ వృత్తాంతమునకుఁ జింతించుచుఁ గుంతిభోజుఁడు మఱియొక సోదరియగు సుదర్శనతోనైన సంబంధమును సలుపవలయునని తీర్మానించి, యా దేశముననుండి వివాహవిషయమై

మాటలాడవచ్చియుండిన దూతుని సన్మానించి సంబంధుల నాహ్వానింప నాతనితోఁ గూడ భూతికునంపెను.

కురంగి యవిమారకులు పరస్పరమనురాగవశంవదులై పరితపించుచుండిరి. కురంగి దాది (ధాత్రి)యగు జయదయు నామె పరిజనములలో నొక్కతెయగు నళినికయు నామె యవస్థలఁ జూడనోపక యెవ్విధముననైన నామెను వల్లభునితోఁ జేర్ప ప్రయత్నించి యొకనాఁ డవిమారకుని గృహమునకుఁ జనిరి. అవిమారకుఁడు నున్మత్తునిఁబోలె ప్రలపించుచు పలువిధంబుల నామెనుఁ జింతించుచుండెను. కన్యకాంతఃపురరక్షణాధికారి యగు భూతికుఁడు కాశీరాజదూతునితో వెళ్లినందున, నంతఃపుర ప్రవేశము సులభమనియు, ప్రవేశించినపిదప సుఖముగ నచ్చోట సంవత్సరములకొలఁది అనన్యవిజ్ఞేయముగ నుండవచ్చుననియు, ధాత్రినళినిక లవిమారకునితోఁ జెప్పిరి. మనస్సు చలించుచుండినను ప్రథమమున నవిమారకుఁడు చోరునివలె నకృత్యము సలుప నిచ్ఛింపఁడయ్యెను. ప్రాణభిక్షనడిగినఁ బ్రాణదానము చేయవలయునని వారు నిర్బంధించినందున నవిమారకుఁడు తానర్ధరాత్రమున రాజమందిరమునకు వచ్చుననియు, గవాటముల ననుద్ఘాటితముగ నుంపుడనియు వారలకుఁ జెప్పి వారి నంపెను.

సూర్యుఁ డస్తమించినతోడనే కాలకృత్యముల నిర్వర్తించి యర్ధరాత్రమెప్పుడువచ్చునోయని నిరీక్షించుచు నవిమారకుఁడు తలిదండ్రులకుఁ దెలియక తన మిత్రమగు సంతుష్టునితో నొకగృహమునఁ గాలము వేచియుండెను. నిరీక్షించిన సమయము సమీపింప నాతఁడు ఖడ్గసహాయుఁడై వెడలి త్రాటినిచ్చెనతో ప్రాకారముదాటి యంతఃపురముఁ జేరెను; చేరి ధాత్రినళినికల

సాహాయ్యముచే నచ్చోట నిర్భయముగ నొక్కసంవత్సరకాల మును గురంగితో గడిపెను.

ఒక్కనాడు కుంతిభోజునకు నీ సంగతి తెలిసెనోయని భీతిల్లి కురంగితోఁగూడఁ జెప్పక బయలువెడలి ప్రాణహత్యఁజేయ నిశ్చయించికొని యవిమారకుఁడు ఘోరాటవినిఁ బ్రవేశించెను. జలమునఁ బ్రాణమువిడున నిచ్ఛింపక దావాగ్ని నెదుర్కొనెను. తన పుత్రుఁడగుటచే నాతని నగ్ని దహింపఁడయ్యెను. ఇట్లు వహ్ని చందన శీతలుఁడైనందునఁ దన భాగ్యమును నిందించుచు నతఁడు భృగుపతనముఁ జేయనిశ్చయించి యొక శైలాగ్రమున కెక్కెను. పతనోన్ముఖుఁడై యాతఁడు నిమేషముల నెంచుచుండు నప్పు డాకాశమార్గమునుండి విద్యాధరదంపతులు విమాన ముతో నా శైలాగ్రముననే యవతీర్ణులైరి. భృగుపతనోద్యతుఁ డైన నాతనిఁ జూచి "యలోకసామాన్యరూపుఁడగు నీతఁ డెవ్వఁడో కనుగొనవలయు"నని యా విద్యాధరుఁ డాతని చెంతఁ జేరి యాతని వృత్తాంతమడిగి సర్వముఁ దెలిసికొనెను. అతని కష్టములకై పరితపించుచు నాతనికి ప్రయోపగమనమార్గముల బోధించి యొక యంగుళీయకమునిచ్చెను. ఆ యంగుళీయక మును దక్షిణాంగుళిలో వేసికొని నాతఁడును, నాతనిచే స్పృష్టుఁ డును, నా స్పృష్టునిచే స్పృష్టుఁడు నంతర్హితులగుదురు. పరమ శ్రేయోలాభమున కతిసంతుష్టుఁడై యవిమారకుఁడు కృత జ్ఞతాపూర్వకముగ నా విద్యాధరదంపతులకు వందనములొన రించి కన్యకాంతఃపురమార్గమున బయలుదేరెను. మార్గమధ్య మున ఛాయార్థమై యొక వృక్షముచెంతఁజేర, నచ్చోట విశ్రాం తుఁడై పరుండియుండిన తన మిత్రమగు సంతుష్టునిఁజూచి భాగ్య ములో భాగ్యమని పరమానందభరితుఁడయ్యెను; తన్ను వెద

కుచు దేశదేశముల సంచరించుచు తుదకు నెచ్చోటికో పోవఁ దలచి మార్గమున విశ్రాంతికై యచ్చోట నతఁడు పరుండిన విషయమును తెలిసికొనెను.

వారిరువురు నిట్లు దివ్యాంగుళీయవశమున నదృశ్యులై పట్టపగటివేళ రాజమందిరమును బ్రవేశించిరి. అచ్చోటఁ బ్రాణత్యాగమునకుఁ బ్రయత్నించుచుండిన కురంగినిఁ గాపాడుటకు మంచిసమయమునఁ జేరిరి.

ఇది యిట్లుండ, శాపాక్రాంతుఁడై తన భగినీపతియగు సౌవీరరాజు తన రాజ్యముననే యజ్ఞాతవాసముజేయుచున్నాఁడని సౌవీరచారపురుషులచేఁ గనుగొని కుంతిభోజుఁడాతని వాసస్థలమునుఁ దెలిసికొనఁ బ్రయత్నించి తుదకు వాని శాపాంతమున భార్యతోఁగూడ నాతనిని గనిపెట్టెను. పుత్రశోకమున పరితపించుచున్నవారల నూరడించుచు నాతఁడు వారి పుత్రుని స్థితిగతులఁ దెలిసికొని చారులనంపెదనని వారలకు ధైర్యము చెప్పుచుండుతఱి, కాశీరాజభార్యయగు తన ద్వితీయసోదరి సపుత్రపరివారముగా వివాహార్థము వచ్చెను. కురంగి, నళినిక, ధాత్రులకీ వృత్తాంతమెటులుండునో చదువరులే కనుగొనెదరు. కురంగికన్ననో గాంధర్వరీతిని వివాహము రహస్యముగ నిర్వర్తమయ్యెను. ఆమె జనకుఁడామె యవివాహితయని తలంచి కాశీరాజకుమారుఁడగు జయవర్మకియ్య వలయునని ప్రయత్నించుచుండెను. ఈ ధర్మసంకటములబాప నిశ్చయించి నారదుఁడచ్చోటికే తెంచి సుదర్శనను రహస్యముగఁ బిలిపించెను. ఎద్దియో ప్రస్తావమున నాయమ బాల్యకృత్యము నామెకు జ్ఞప్తి పఱచెను. తనగుట్టు బయలువెడలెనుకదాయని చింతించుచు

నికనైన నది రహస్యముగనుండునాయని తలంపుతో సుదర్శన మహర్షిని సాంజలిబంధముగ వేడుకొనెను. నారదుఁడును నీవిధ ముగ నుపాయము నామెకుఁ జెప్పెను. "జయవర్మునికంటె కురంగి వయోధికురాలైనందున వారిరువురికి వివాహమశాస్త్రీయ మనియు, కురంగిచెల్లెలగు సుమిత్రనే జయవర్ముఁడు పెండ్లియాడ వలయుననియు, కురంగికి నవిమారకునకు దాంపత్యమను రూప మనియు నీవు కుంతిభోజునకుఁ జెప్పి కార్యముల నిర్వర్తించిన యెడల నీ రహస్యముల షట్కర్ణముగ నుండజాలు" ననెను. ఈ యుపాయమునకు మిగుల సంతసించి సుదర్శన యాలాగునఁ జేయించినందున ధర్మసంకటములు నివర్తించి యెల్లరు నానంద భరితులైరి.

(అవిమారకములోనిది.)



చారుదత్తచరితము.

ఉజ్జయినీనగరమున నొకప్పుడు చారుదత్తుఁడను వర్తకుఁ డుండెను. అతనికి నౌకావ్యాపారములచే నపరిమిత సంపత్తి కలిగెను. అత్తైశ్వర్యమునను్నను, ధనమదాంధుఁడుకాక యతఁడు తన ద్రవ్యమంతయు బీదసాదలకుపయోగించి తుదకు దారిద్ర్యదశకు వచ్చెను. యజమానుని దారిద్ర్యమునఁ దదా శ్రితులనేకు లావాసవృక్షనాశమునఁ బక్షులవలె చెదరి పోయిరి. ఆతని పరమమిత్రమగు మైత్రేయుఁడును, బరిచారిక యగు రదనికయుమాత్రము నిలిచిరి. అర్థనాశమున కెంతయుఁ జింతఁజెందక చారుదత్తుఁడు శీలాదులకు దారిద్ర్యమునగల్గుగు ప్రకాశరాహిత్యమునుమాత్రముఁ జింతించుచుండెను. ఇంత దారిద్ర్యమునను, విభవానువశయగు భార్యయు, సమదుఃఖ

సుఖమగు మిత్రమును, అపరిభ్రష్టమగు సత్యమునుండుటచేఁ జారుదత్తునకు సంతాపమంతగ లేకయుండెను. భక్తిచే దేవతలు సంతుష్టులగుదురను దృఢాభిసంధితో దారిద్ర్యమునఁ గూడ నాతఁడు యథాశక్తి గృహదేవతలఁ బూజించుచువచ్చెను.

ఇట్లుండ నొక్కనాడాపురియందు కామదేవాయతనమున మహోత్సవమొకటి జరిగెను వైభవముతో జరుగు నుత్సవావలోకనార్థము జనులనేకులచ్చోట సమ్మిళితులయిరి. ఆభిజాత్యమున గణికయయ్యు గుణములఁ బూజనీయయగు వసంతసేనయను నొక కన్యారత్నమచ్చోటికి వచ్చెను వసంతసేనా చారుదత్తులు పరస్పరమవలోకించునటులఁ దటస్థించెను. చారుదత్తుని మహాపురుషలక్షణములచే వసంతసేనయు, వసంతసేనా రూప యౌవనసంపత్తిచేఁ జారుదత్తుఁడునుఁ బరస్పర మాకృష్టులయిరి. ధనికురాలగు వసంతసేనకు, జారుదత్తుని దారిద్ర్యము తెలిసియు, నామె తన జాతిధర్మమగు ధనహార్యతను నిరాకరించి గుణహార్యయై యమ్మహనీయుని స్నేహపాత్రము కావలయునని నిశ్చయించికొనెను. చారుదత్తుఁడుమాత్రము తన దారిద్ర్యముచే నా రూపవతి తన కలభ్యయని తీర్మానించి కుపురుషకోపముఁబోలె తన మనోరథమును స్వాంగముననేలయించికొనెను.

ఉత్సవానంతరము జనులు దేవాయతనమునుండి యథాగతముగ మరలిరి. వసంతసేనయు గృహాభిముఖముగఁ జలించెను. మార్గమధ్యమున సూర్యుఁడస్తమించెను. నలుప్రక్కల నంధకారము క్రమ్ముకొనెను; అంధకారమంగములఁ బూయునట్లుండెను; నభస్థలమంజనమును వర్షించునట్లుండెను; అసత్పురుష సేవవలె లోకులదృష్టి నిష్ఫలమయ్యెను. ఇట్లుండ గాఢాం

ధకారమునఁ బోవుచుండిన వసంతసేనను రాజస్యాలుఁడగు సంస్థానుఁడును వాని మిత్రమగు నొక విటుఁడును వెంబడించిరి. రాజస్యాలున కామెయం దనురాగముండినందునను, అయ్యను రాగము ప్రతిహతమైనందునను, ఆతఁడు బలాత్కారముగ నామెనుఁ గొంపోవఁ బ్రయత్నించియే యిట్లు వెంబడింపఁ దొడ గెను. పతగేంద్రభయాభిభూతయగు వ్యాళివలె వసంతసేన త్వరి తముగ నడువసాగెను. ఎంత వేగముగనడిచినను వారిరువురు నామెను వెంబడించుచునే వచ్చుచుండిరి. ఆమెకుఁ గర్ణకఠోర ములగు ననునయాలాపములఁగూడఁ జేయుచుండిరి. బుద్ధిమాం ద్యమున రాజస్యాలుఁడు "ఇదిగో అద్దరిద్ర చారుదత్తుని గృహము; ఇందు నొకవేళ నీమె ప్రవేశించి తప్పించుకొనును; జాగ్రత్తతోఁ జూచుచుండుము" అని తన మిత్రునితోఁ జెప్ప, నిద్దియ సమయమని వసంతసేన యగ్గృహద్వారముఁజేరి తప్పించు కొనెను.

ఇంతలో గృహదేవతకు బలిపూజార్థమై చారుదత్తునిచే ననుపఁబడి దీపహస్తయగు రదనికతోఁగూడ మైత్రేయుఁడచ్చోట వచ్చి పక్షద్వారముఁ దెఱచెను. వసంతసేనయుఁ బటాంచల ముచే దీపమునార్పి లోనఁ బ్రవేశించెను. పుంజీభూతమగు మారు తముచే దీపమార్పఁబడెనని యెంచి రదనికను వీధిలోఁ బోవనిచ్చి మైత్రేయుఁడు మఱల దీపము గొనివచ్చుటకై లోపలఁ జనెను.

గృహమునుండి వెలువడిన రదనికను వసంతసేనయని భ్రమించి విటసంస్థానులు కేశమున గ్రహించిరి. "అయ్యో" యని రదనిక యేడ్వ, రంగప్రవేశముచే స్వరాంతరమునఁ బలుకు టకు శిక్షితయైన వసంతసేనయే యిదియని యామెను వారిరు వురు విడువరైరి. మైత్రేయుఁడు దీపముఁ దెచ్చినతోడనే విటుఁడు

తన యచాతుర్యమును గనుగ్గొని శీర్షబద్ధాంజలియై తన్ను మన్నింపుమని యతనిని వేడుకొనెను. తమ మనోరథమిట్లు విఫల మగుటకు నెంతయు విషణ్ణులై విటసంస్థానులచ్చోటనుండి వెలువడిరి.

పక్షద్వారముదాటి వసంతసేన లోపలఁబోవఁ జారుదత్తుఁడామెను నిర్వృత్త బలిపూజయై తిరిగివచ్చిన రదనికయని భ్రమించి "ప్రదోషవాత మధికమగుచున్నది. ఈ ప్రావారముచేఁ గప్పికొనుమ"ని తన యుత్తరీయము నామె చేతికిచ్చెను. పరిజనభ్రాంతిచేఁ దన్నిట్లు చూచుచున్నాఁడని తెలిసియు నాతనియం దనురాగాధిక్యముచే వసంతసేన యా యుత్తరీయమునుఁ గైకొని తన భాగ్యమే భాగ్యమని పొగడుకొనుచుండెను. ద్వారమునువిడిచి లోఁగట్టడముఁ బ్రవేశించుమని చారుదత్తుఁ డెంతచెప్పినను వసంతసేన జంకుచు లోపలఁ బోనకుండెను. అందుపై సంశయించి "రదనిక" అని చారుదత్తుఁడు పిలువ నిదిగో వచ్చుచున్నానని మైత్రేయునితో రదనికయు నచ్చోట వచ్చెను. "ఇది యెవ్వరో తెలియక నా ప్రావారకమునిచ్చి యపరాధపడితినే" యని చారుదత్తుఁడు పరితపింప, "నే వసంతసేనను; శరణాగతనై యిటు వచ్చితిని; నా భూషణార్థము కొందఱు దుర్మార్గులు నన్ను వెంబడించిరి; నన్ను రక్షింపవలయు; నా భూషణముల నిటువెట్టి మీ సాహాయ్యముననే గృహముఁ జేరవలయు"నని యామె చెప్పెను.

కామదేవాయతనోత్సవమునఁ జూచిన వసంతసేనయే యీ యువయని యొకచోట సంతోషమున్నను, తన దారిద్ర్యముచే నామె తనకు దుర్లభయని తలచి చారుదత్తుఁడు తనది యస్థానసంతోషమని నిరాశుఁడై, యా భూషణముల గైకొని

సురక్షితముగ వానినిఁ జూచికొమ్మని మైత్రేయునకియ్య, నాతఁడును వానిని రదనికచేత నప్పగించెను. మైత్రేయుని సాహాయ్యమున వసంతసేనయు గృహముఁ జేరెను.

చారుదత్తుని ప్రావారక స్పర్శసమయమునుండి వసంతసేన మనస్సు పరవశమయ్యెను; ఎల్లప్పుడు నెద్దియో చింతించుచుండెను; జాగ్రద్దశయందును నిద్రావస్థయందునుఁ దన్మయత్వముఁ దాల్చెను; అలంకరణాదులయందు నామెకభిరుచి తగ్గెను; ఆహారము సున్నయయ్యెను. తన గణికాత్వము నామె నిందించుచుండెను. చారుదత్తుని గుణకీర్తనములచేఁ గాలము గడుపుచుండెను.

ఇట్లుండ నొకనాడు ఋణగ్రస్తుఁడైన సంవాహకుఁడొకఁడు తన యుత్తమర్ణుఁడైన ధనికునుండి భీతుఁడై యామెను శరణముజొచ్చెను. ఆ సంవాహకుఁడు చారుదత్తుని యౌన్నత్య సమయమున నాతనికి శుశ్రూషఁజేయుచుండి, యాతని భాగధేయ విపర్యయమున వృత్తిలేక ద్యూతకరవృత్తి నవలంబించెననియు, నందుచే ఋణగ్రస్తుఁడయ్యెననియు, దన్ముఖంబుగఁ గనుగొని తన యాభరణములలో నొక్కటినిచ్చి వసంతసేన యాతని కానృణ్యముఁ గల్పించెను. సంవాహకుఁడును నిర్విణ్ణుఁడై తురీయాశ్రమము గ్రహింప నిశ్చయించికొని బయలుదేఱెను. అతఁడు రాజవీధినిఁబోవుచుండ నాతని నాలానమునుండి తప్పించుకొని పరుగిడుచుండిన మత్తమాతంగమొక్కటి హింసింపఁదొడగెను. "హా! హా" యని జనవాదము సంభవింపఁ గర్ణపూరకుఁడను వసంతసేనయొక్క హాస్తిపకుఁడా మత్తహస్తిని ప్రహరించి యా తపస్విని రక్షించెను. అందఱు నాతని సామర్థ్యముఁ బొగడుచుండ నా సంఘములో నొకఁడు తన ప్రావారకమును గర్ణపూరకునికి బహుమతిగానిచ్చెను. తన యుత్తరీయము సాదు

ర్థ్యమును వసంతసేనకుఁ దెలియపఱుపఁ గర్ణపూరుఁడు పరు గిడుచువచ్చి యా వృత్తాంతములన్నియు దెలుపుచుఁ దనకు లభించిన ప్రావారకము నామెకుఁ జూపెను. ఏ మహానీయుఁడది యిచ్చెనో తెలుపుమనిన, సౌధాగ్రమున నెక్కి యనా వృతో రస్కుఁడై దూరమునఁ జనుచుండిన చారుదత్తు నాతఁడు చూపించెను.

చారుదత్తుని గుణములనిట్లు చూడఁజూడ వసంతసేనకు నాతనిపై ననురాగము వృద్ధియగుచుండెను.

ఇఁకను చారుదత్తుని స్థితియెట్లుండెనో చూచెదము. ఉత్కంఠితునకు వీణయనునది హృదయానుగుణయగు వయస్య. చారుదత్తుని మనోవృత్తి కనుగుణముగ నుజ్జయినిలో శాబలుఁడను నొక సంగీతవిద్వాంసుఁడు తన వీణాగానముఁ బ్రదర్శించెను. మైత్రేయునితోఁగూడఁ జారుదత్తుఁడా సంగీతము ననుభవించి యర్ధరాత్రిని గృహముఁజేరెను. వసంతసేన పెట్టిపోయిన భూషణములను రదనిక మైత్రేయునిచేత నప్పగించి నిద్రించెను. భూషణనాశభీతిచే మైత్రేయునకు నిద్దురపట్టదయ్యెను. సుప్తోత్సుప్తుఁడై యతఁడేద్దియో కలవరించుచుండెను.

ఇంతలో వసంతసేనయొక్క దాసియగు మదనికపై యనురాగముజెంది సజ్జలకుఁడను దరిద్రబ్రాహ్మణుఁడొక్కఁడు ఆమెను నిష్క్రయించుటకు కావలసిన ధనములేనందునఁ జోరకృత్యమైన నలిపి యామెను. నిష్క్రయింప నుద్దేశించి యా రాత్రిని చారుదత్తుని గృహమున సంధిచేసి లోపలఁ జనెను. భూషణభాండమును మైత్రేయుఁ డర్ధనిద్రలోఁ జేతఁబెట్టికొని "యిది తీసికొనుమూ" యని చారుదత్తు నడుగుచుండ సజ్జలకుఁ డా భాండమున

వానికిఁ దెలియక తీసికొని పారిపోయెను. "విక్రీతభాండకుఁడైన వణిజునివలె సుఖముగ నేనింక నిద్రించెద"నని మైత్రేయుఁడు కన్నులుమూసెను.

ప్రాతఃకాలమునఁ జోరుని వృత్తాంతము తెలియగా చారుదత్తుఁ డేమియుఁదోఁపక విన్ననదనుఁడయియుండ, నాతని సతీమణి తన భర్తకు గలిగిన యాపదనుఁ దొలగింప నుద్దేశముతోఁ దన యాభరణములలో నెన్నికైన నియ్యఁదలచి కర్ణమునఁ జేతినుంచెను. "అయ్యో! ఇది తాళీదశమే"యని పరితపించుచుఁ దనకు మాతృగేహమునుండి లబ్ధమౌ ముక్తావలిని జ్ఞప్తిపఱచికొని దానిని రహస్యముగ మైత్రేయునిచే నిచ్చిపంపెను. స్త్రీధనము నిప్పు డైకొనవలసిన గతి తనకు వచ్చెనుకదాయని చింతించుచు చారుదత్తుఁ డా ముక్తావళిని వసంతసేనకిచ్చి రమ్మని మైత్రేయునంపెను. అల్పమూల్యమగు సువర్ణభాండమునకు బహుమూల్యమగు ముక్తావళినిచ్చుటయేమని మైత్రేయుఁడు సంశయింప, "నమూల్యమగు నా విశ్వాసముతో వసంతసేన సువర్ణభాండముఁ బెట్టిచనెనో యా విశ్వాసమునకు మూల్యముగ నీ ముక్తావళి నిమ్మా" యని యాతఁడతనికిఁ జెప్పిపంపెను.

మైత్రేయుఁడు వసంతసేనను జూచుటకుమునుపే సజ్జిలకుఁడు సువర్ణభాండముతో మదనికను నిష్క్రయింపఁదలచి యచ్చోటఁ బోయెను. మదనికా సజ్జిలకులు మాటలాడుచుండు నంశమును దాను వినఁగూడదని వసంతసేన దూరమునఁ జనెను; కాని వారు తన విషయమై మాటలాడుచుండుట విని తానది తెలిసికొనవచ్చునని వారికిఁ దెలియక యా సంగతుల నామె యాకర్ణించుచుండెను. తాను ముచ్చిలించిన సువర్ణభాండము వసంతసేనకుఁ జేరినదియేయని మదనిక చెప్ప, సజ్జిలకుఁ డేమియుఁదోఁపక విష

ష్ణుండై నిలిచియుండెను. అంత "చారుదత్తుఁడే యీ భాండము నీచేతి నిచ్చి వసంతసేనకుఁ జేర్పుమని చెప్పినట్లు నీవే యీ భాండము నామె కిచ్చిన యెడల గష్టములు తీరును" అని మదనిక యుక్తిఁ జెప్ప, నదియు సరియని సజ్జలకుఁడు దానికి సమ్మతించెను.

ఆ సమయమున మైత్రేయుఁడు ముక్తావళిఁ గైకొని వసంతసేన గృహమునకు వచ్చెను. వసంతసేనయు నా సువర్ణభాండమును ద్యూతమునఁ గోల్పోయి యందుకు బదులుగా నా ముక్తావళి నంపెనని చెప్పి దాని నిచ్చెను. ముక్తావళి గైకొనుట కిష్టము లేకయుండెను, తిరస్కరించినఁ జారుదత్తునకేమి మనస్సంకటము కలుగునో యని సంతసిల్లి నామె దాని నంగీకరించి మైత్రేయుని పంపివైచెను.

పిదప, చారుదత్తుని యొద్దనుండి యొకఁడెవ్వఁడో వచ్చియున్నాఁడని మదనిక తెలుప, వానిని లోపల ప్రవేశింప వసంతసేన యానతిచ్చెను. సజ్జలకుఁడు ప్రవేశించి నమస్కారపూర్వకముగ సువర్ణ భాండమును చారుదత్తుఁడంపెనని యామె కర్పించెను; దరహాసితవదనయై యద్దానిఁ గైకొని, "నీకు నే మదనిక నర్పించెద, స్వీకరింపు"మని వానిచేత వసంతసేనయుఁ దన సఖి నర్పించెను. వారిరువురి నామె యొక్క ప్రవహణము నెక్కించి యత్యంత ప్రీతముగ బంపి, తానును దన మనోభీష్టునిఁ గౌఁగిలిఁ జేర్చ నిశ్చయించి, యమూల్య వస్త్రమాల్యాభరణాదులఁ దాల్చి చారుదత్తుని మందిరమునకుఁ జనియెను. అచ్చోట నాయమ సంకల్పకల్పితమగు మనోరథశతము ననుభవించుచు నమందానందవార్ధిని దేలుచుండెను.

(చారుదత్తము సమాప్తము)

శ్రీ భాసమహాకవి కృత నాటక కథాసారము ముగిసెను

PRINTED AT THE S.P.C.K. PRESS, VEPERY, MADRAS—A.8107.